ప్రచురణ 1985
గ్రీష్మ జ్యేష్ఠము.

ప్రతులు : 1000

మూల్యము : రు. 40-00

ప్రతులకు :
“పండితరత్న”
చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రి
ఘంటశాల P. O. - 521 133
కృష్ణా జిల్లా

త్రివేణి పబ్లిషర్సు ప్రైవేట్ లిమిటెడ్
బుట్టాయిపేట
మచిలీపట్నం - 521 001

ఓమ్

వాల్మీకీయ

# జ్ఞాన వాశిష్ఠము

"నమోస్త్వద్వైత విద్యాయై
రామాయచ ముముక్షవే।
ఉపదేష్ట్రే వశిష్ఠాయ
వక్త్రే వాల్మీకయే నమః

— యోగవాశిష్ఠము

ఆంధ్రీకరణము

'పండితరత్న'
విద్వాన్ చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రి
ఘంటశాల



కీ. శే. తుమ్మల గోపాల కృష్ణయ్యచౌదరి



శ్రీమతి తుమ్మల బసవపూర్ణమ్మ

# కీ. శే. తుమ్మల గోపాలకృష్ణయ్యచౌదరిగారికి

## కృతి సమర్పణము

క్రొత్తపల్లి యనెడు కొమరారు గ్రామమ్ము
కలదు ఘంటశాల గ్రామమునకు
కొలది దూరమందుఁ గొంగు బంగారమై
కవుల పాలి కల్పకం బనంగ.

1

శ్రీమత్తుమ్మల వంశవార్ధిశశి,
దాక్షిణ్యైకభావుండు, ల
క్ష్మీ మాధుర్యకటాక్షవీక్షితుడు,
రాశీభూత శౌర్యోన్నతో
ద్దాముం, డాశ్రితకల్పకుండు, సుగు
ణోదారుండు, శ్రీరామ సం
జ్ఞామాత్రుం, డలరారు క్రొత్తపలి
నిచ్చల్ భూరి విఖ్యాతుడై.

2

శ్రీరామప్రభువునకుఁ గు
మారుడు గోపాలనామ మహితుడు వొడమెన్
ద్వారక వసుదేవునకుఁ గు
మారుడు గోపాలుఁ డలరు మాడ్కి ధరిత్రిన్.

ఆ గోపాలవిభుం డను
రాగోన్నతిఁ బెండ్లి యాడె రత్నాంబనుఁ బ్ర
జ్ఞా గంభీరత శంకరుఁ
డా గౌరిన్ బెండ్లియాడి నటు ముదమారన్.

3

రమణీయాకృతి మించి వర్తిలు
కుమారస్వామినిన్ గాంచి పే
ర్మి మమత్వం బెసలార నేలికొను
గౌరీశంకరుల్ వైఖరిన్
గోమరుం బ్రాయమునంది దైవకృప
చే గోపాల రత్నాంబలున్
గోమరుం గాంచిరి శేముషీ మహితు
నిన్ గోపాలకృష్ణాఖ్యునిన్.

4

గోనముల్ బ్రోవన నొప్పి క్రోధలవ
మే కోశంబునన్ గానిపిం
చని శాంతాకృతి పూరుషుండయి మ
హిన్ జన్మించెనా! యన్నటుల్
గొనియాడంబడు శేముషీ మహితు
డీ గోపాలకృష్ణాఖ్యు డో
య్యన బెండ్లాడె గుణాన్వితన్ బసవ
పూర్ణాంబన్ మహాసాధ్వినిన్.

5

ఇద్ద గుణుడైన గోపాలకృష్ణ విభుఁడె
కాంతుడై యొప్పె మతకృతికాంత, కౌర!
కన్నతండ్రికి భార మికటతన దీరె!
ధన్యతము డయ్యె; కన్యాప్రదాత యిపుడు.

కవితాకన్యల నేలికొందు ననుచున్
గాంతించి సత్కావ్యముల్
కవు లందీయ గ్రహించుచున్ రసిక
తన్ గావ్య ప్రియాలాపముల్
చెవులారన్ విని సంతసిల్లు కవితా
సీమంతినీకాంతుడై
దానము భోగమున్ గలిగి
తాలిమి శ్రీరఘురామచంద్రుపై.

6

ధ్యాన మెలర్ప; సత్కృతుల
యం దనురాగముతోడి మాన్య సం
తానము గల్గి; వైభవమునన్
గృతి భర్తృగృహమ్ము నిత్య క
ల్యాణముఁ బచ్చతోరణము
నై విలసిల్లు నిరంతరం బిలన్.

7

జ్ఞానవాశిష్ఠ మనెడి గ్రన్థంబు నిపుడు
నిచ్చుచుంటిని గోపాలకృష్ణు స్మృతికి
అతని కీర్తి ఆచంద్రతారార్క మిలను
వరలుఁగావుత! శ్రీరామప్రభుపు కరుణ.

ఓం తత్సత్

—కృతికర్త

# ము న్నుడి

మానవజన్మము జ్ఞాన సముపార్జనార్థమే లభించును. కనుకనే "జ్ఞానేన హీనః పశుభి స్సమానః" అనియు "అపి మానుష్యకం ప్రాప్య భవంతి జ్ఞానినోనయే। పశుతైవ వరాతేషాం ప్రత్యావాయా ప్రవర్త నాత్" అనియు ననిరి. అనగా, "జ్ఞానము లేనివారు పశుప్రాయులనియు, మానవులై జన్మించియు జ్ఞానవంతులు కానిచో పశువులై జన్మించిన మేలుగ నుండెడిది.' పశువునకు జ్ఞానము లేకపోయినను నాక్షేపము లేదు' అను శ్రుతి, పండిత వాక్కులు ధ్రువీకరించుచున్నవి. జ్ఞాన సముపార్జనమునకు భారతీయ సాహిత్య భాండారమున ననర్ఘరత్నముల వంటి గ్రంథము లెన్నియో గలవు. ఈ గ్రంథము లన్నియు నుపనిషత్తులు, సూత్రభాష్యాదులు ప్రతిపాదించిన విషయములనే ప్రబోధించు చున్నవి. అందు బ్రహ్మవిద్యను నిరవశేషముగ బోధింప సమర్థంబైన ఉద్గ్రంథము "యోగవాశిష్ఠము." ఇది ముప్పదిరెండువేల శ్లోక సంఖ్య కలిగి "బృహద్యోగ వాశిష్ఠము" అను పేర ప్రసిద్ధి జెందినది. ఈ గ్రంథము సర్వజన పఠన పాఠన యోగ్యము కాకుండుటచే కాశ్మీరుదేశీయులగు అభినందన పండితులు హృద్య మధుర కథా సంభరితముగ జ్ఞాన సారమగు "జ్ఞానవాశిష్ఠము" అను పేర సంగ్రహ పరచిరి. ఇది ఆరువేల శ్లోక సంఖ్య కల పవిత్రగ్రంథము.

యోగవాశిష్ఠము వాల్మీకి మహర్షి విరచితము. షోడశవర్షముల ప్రాయము నిండని శ్రీరామచంద్రుడు మోహాంధకారమున మునిఁగి దిక్కుగానక స్రుక్కుచుండెను. ఆ సమయమున విశ్వామిత్ర మహర్షి తన యజ్ఞ సంరక్షణార్థమై రామ లక్ష్మణులను గొనిపోవ దలచి దశరథ మహారాజు కడ కేతెంచెను. అయన రామచంద్రుని మోహావస్థ నెరిగి, వశిష్ఠ మహర్షిని జ్ఞానోపదేశ మొనరించి, యతనిని

స్వస్థచిత్తుని జేయుము అని కోరును. ఆవిధముగ వశిష్ఠ మహర్షి శ్రీరామునకు ప్రబోధించినట్లు, ఆదికవి వాల్మీకి భరద్వాజునకు ప్రవచించిన సంవాదాత్మక గ్రంథ మీ యోగవాశిష్ఠము. దాని సంక్షిప్తమే ఈ జ్ఞానవాశిష్ఠము.

జ్ఞానవాశిష్ఠమున ననేక పాఠాంతరములు కలవు. అభినందన పండితులు సమకూర్చిన గ్రంథమునకును, మిగిలిన వాటికిని విశేషాంతరము కలదు. శ్రీకాళహస్తి, శ్రీ శుకబ్రహ్మాశ్రమ స్థాపకులు శ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు తెలుగు తాత్పర్యముతో ప్రకటించిన జ్ఞానవాశిష్ఠము "వశిష్ఠగీత" అను పేరుతో ఎనిమిదివేల శ్లోకసంఖ్య కలది. అందలి ప్రకరణములు భేదింప కున్నను విషయ ప్రతిపాదనమున నెంతయో విభేదము కలదు. ఇట్లే మరికొందరు తెలుగు తాత్పర్యమును మాత్రము ప్రకటించిరి. ఇంతవరకు నీ గ్రంథము రామాయణ, భారతాది గ్రంథములవలె తెలుగుభాష యందు గద్యగ్రంథముగ బహుళప్రచారము నందియుండలేదను భావ మీ గ్రంథ రచనకు కారణమైనది. ప్రాజ్ఞులగు పాఠకలోక మీ గ్రంథము నందలి విషయమునకు ప్రాధాన్య మిచ్చి, గ్రహించి, యాదరించి, యాచరించినచో నా కృషి ఫలించినట్లగును.

ఇట్లు, బుధ విధేయుడు

ఘంటశాల

చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రి

30-6-1983

అనువాదకర్త

## జ్ఞానవాశిష్ఠ పఠన ఫలము

శ్రీరామచంద్రుడు వశిష్ఠ విశ్వామిత్రాది మహర్షులతో పదునెనిమిది దినములు గోష్ఠి జరిపి సంసారమూలమగు నజ్ఞానమును విడచి, నిర్వాత వారిధివలె నిశ్చల తత్త్వజ్ఞానపూర్ణుడై యుండెను. ఆ సమయమున తుష్ట హృష్ట చిత్తులగు దేవతలు ముత్యములవంటి కల్ప వృక్ష ప్రసూన వర్షము గురిపించిరి. శ్రీ మహావిష్ణువు తనంత తాను మనుష్యలోకమున శ్రీరామ నామమును ధరించి, అవతరించి, సంసార జాలమున జిక్కుకొని, దుఃఖితుడై యోగజ్ఞానముచే ప్రభోధితు డయ్యెను. అనంతరము పితృభ్రాతృసముపేతుడై వశిష్ఠమహర్షిని పూజించి, పలుమారు లాయనను ప్రశంసించెను. "మునినాథా! నీ యనుగ్రహమువలన నా మనస్సు సంశయ రహితమై, తాపమును వీడి శీతలము, శాంతము, నిర్వికారము నయ్యెను. నీవు సర్వార్తి హరుడవు. సర్వజ్ఞుడవు. సర్వదేహాశ్రితుడవు. గురుడవు. మోహాంధ కార విధ్వంస సవితృడవు" అని ప్రస్తుతించెను. వశిష్ఠుడు ప్రబో ధించు యోగజ్ఞానమును విన దలచి యేతెంచి, యాకాశవీధిని జేరిన దేవ, యక్ష, గంధర్వ, సిద్ధ, విద్యాధరాదులను తన యంతికమున కాహ్వానించెను. వార లరుదెంచి శ్రీరామచంద్రునకు నమస్కరింప సంతుష్టాంతరంగులైరి. "శ్రీరామచంద్రా! నీ గురువును, విద్వజ్జన వశిష్ఠుడు నగు వశిష్ఠ మహర్షితో జరిగిన సంవాద రూపమగు నీ యోగ జ్ఞాన చర్చను వింటిమి. త్రిలోకముల మోహార్తి తొలగిపోయినది. నీకు నమస్కారము" అని ప్రశంసించి సిద్ధులు ప్రాణికోటి ననుగ్రహింప దలచి ఈ జ్ఞాన శాస్త్రమును కాశ్మీరదేశ మందున్న అయోధ్యా నగరమందు ప్రచురపరచి యంతర్హితులైరి.

అనంతరము తత్త్వజ్ఞాన సంపన్నుడైన శ్రీరామచంద్రుడు నిర్మముడు, నిష్కాముడునై జనకునివలె సర్వకార్యకరణశీలు

డయ్యెను. "భరద్వాజా! తామరపత్రము జల మజ్జనమయ్యు సిక్తము కానట్లు, రాజ్యభోగముల ననుభవించుచున్నను, శ్రీరామచంద్రుని చిత్తము రాగవశము కాలేదు. సర్పముఖ దత్తాంగుళుడైనను బాధ నందని వాని విధమున సంసార భోగము లనుభవించుచున్నను రాముడు బాధ నందలేదు. విరాగులు, సత్సాంగత్యము కలవారు, సత్కర్మాచరణచణులు నగు ధర్మాత్ములకు మాత్రమే ఈ శాస్త్రము నొసగవలెను. సర్వోపకారమునకు సంసిద్ధమగు బుద్ధి కలిగెనేని, మహా ఫలప్రదమగు నీ విద్యాదాన మొనరింపుము. అహంకారగ్రస్తచిత్తులకు, దుర్మార్గులకు, సోమరులకు, శాస్త్ర దూషకులకు పరమ రహస్యమగు నీ శాస్త్రమును ప్రకటింపరాదు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనుగాని, సూర్యభగవానునిగాని యారాధింపనివార లీ యద్భుతమగు శాస్త్రమును పొందలేరు.

పూర్వము పరమేశ్వరుడు పార్వతికిని, మహావిష్ణువు నారదాది మహర్షులకును ఉపదేశించిన యుత్తమ జ్ఞాన మిందు నుపదేశింపబడినది. "మోక్షోపాయము" అను నామాంతరము కల 'బృహద్యోగ వాశిష్ఠ రామాయణ' క్షీరోదధినుండి ఈ 'జ్ఞానవాశిష్ఠము' అను నమృత ముద్ధరింపబడినది. దీనిని సాధారణముగ పఠించినను సమస్త దుష్కృతములు నశించును. విశేష పఠనమువలన పరమ పదము నందుదురు. దీని నొక్కమారు పఠించిన మాత్రమున,సర్వపాప క్షయమై శీఘ్రముగా జ్ఞానము కలుగును. జ్ఞాన రహితుడైనను, భక్తి యుక్తచేతస్కుడై దీనిని పఠించినచో మనస్సు నిర్మలమగు నను టలో సందియము లేదు. మూఢులు, ముముక్షువులు, నియత చిత్తులు, ననియత చిత్తులు నెవ్వరయినను పరమార్థప్రదమగు నీ శాస్త్రమును పఠింపవచ్చును. బ్రహ్మజ్ఞానము దుర్లభమైనదికదా! ఏ మాత్రము సంస్కారము గలవాడైనను, ఈ శాస్త్రమును వినినచో నజ్ఞానము తొలగిపోవును. ఇంతటి మహత్తర శాస్త్ర మింకొకటిలేదు. భుక్తి ముక్తి ప్రదమగు నిది యోగులకు పరమ ప్రియమైనది. కరతల

మందలి చిద్రూపమువలె నియ్యది పూర్వపుణ్యవశమున లభించును. సర్వశాస్త్రార్థవిదులలో వరిష్ఠుడగు వశిష్ఠుడు మోక్షోపాయమున కిది సారభూతమని ప్రశంసించెను. ప్రియవస్తు వియోగమున శోకార్తుడైన దేహికి, సంతస్సంతాప ప్రశాంతిప్రదమగు నీ శాస్త్రమునకంటె మించిన శాస్త్ర మింకొకటి లేదు.

చిదాకాశమునుండి యుద్భవించి, సాంద్రమగు సమ్మృత నిష్యందియై కావ్య, రసోపశోభాస్ఫురత్ప్రకాశమై, మోహాంధకార వినాశకరమగు నీ శాస్త్ర మను చంద్రమండల మానందప్రద మగు చున్నది. "భరద్వాజా! బ్రహ్మవిచారమున క్షణకాలమైన స్థిర చిత్తు డగువాడు సమస్త తీర్థావగాహన మొనరించినవాడును, సమస్తావనీ దాన మొనరించినవాడును, సహస్రయజ్ఞము లొనరించినవాడును, అఖిల దేవతాపూజన మొనరించినవాడునై విరాజిలుచుండును. వాని పితృదేవతలు సంసారమునుండి యుద్ధరింప బడుదురు. ఆతడు త్రిలోక పూజనీయుడగును" అని వాల్మీకి ప్రబోధించెను.

ఇ తి శ మ్.

'తర్కవాదీశ్వర', 'సాహిత్యాచార్య,' 'గౌడమండ
లాలంకార' శ్రీమదభినందన పండితులు

శ్రీ విద్యానందస్వామి
శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు
ఏర్పేడు, చిత్తూరు జిల్లా

ఓం తత్సత్ ఓమ్

# యత్కించిత్పరిచయము

యోగవాశిష్ఠ మహారామాయణము మహర్షి ప్రవరులైన శ్రీ వాల్మీకులవారిచే విరచితమైనది. కథోపకథలతో గూడి వైరాగ్యాది ప్రకరణ షట్కముతో, 32,000 శ్లోకములతో నొప్పుచున్నది. "సంసార సముద్రమున మునిగి దరి గానక తల్లడ పడుచున్న జనులకు నోడ" అని పెద్దలచేత కొనియాడబడినది. గ్రంథ బాహుళ్యముచేత సామాన్య జనులకు దుర్బోధమగుచుండుట వలన, కాశ్మీర దేశీయులగు శ్రీమాన్ అభినందన పండితులవారు ఈ యోగవాశిష్ఠమును "జ్ఞానవాశిష్ఠము" అను నామముతో సార సారముగా 6,000 శ్లోకములతో వెలువరించిరి. దానిని బ్రహ్మశ్రీ నాగలింగశాస్త్రులవారు ప్రత్యేకముగా ఆ ఒక్కొక్క శ్లోకమును, దానికి ఆంధ్ర తాత్పర్యమును రచించి, "జ్ఞానవాశిష్ఠము" అను పేరుతోనే ప్రకటించిరి.

దానినే ప్రస్తుతము బ్రహ్మశ్రీ చింతలపాటి లక్ష్మీనరసింహ శాస్త్రులవారు పాఠకులకు సులభముగా గ్రాహ్యమగునటుల శ్లోకముల విడచి ఆంధ్రవచన రచనతో, "జ్ఞానవాశిష్ఠము" అను పేరుతోనే గ్రంథమును పరిసమాప్తము గావించిరి.

విశేషమేమనగా, శ్రీ శాస్త్రులవారు యీ గ్రంథమును శ్రీమాన్ తుమ్మల గోపాలకృష్ణయ్యగారు, శ్రీమతి బసవ అన్నపూర్ణమ్మగారు అనెడి పుణ్యదంపతుల పేర సమర్పణము గావించి ప్రశస్తిని పొందిరి. ఆ పుణ్యదంపతులు ఆంధ్రదేశమున కృష్ణా జిల్లా, మొవ్వ తాలూకా, కొత్తపల్లె కాపురస్థులు. ఉదార స్వభావులు.

చెరువులు త్రవ్వించిరి. పాఠశాలలు, గ్రంథాలయములు మున్నగు వాటి నెన్నిటినో నిర్మించిరి. అన్నదానములు గావించిరి. పేదలకు పెండ్లిండ్లు చేయించిరి. అజాతశత్రువులైరి. ఆధ్యాత్మిక చింతనా పరులుగానైరి. ఈ కాలమున ఇట్టి ఉత్తమోత్తములకు తమ గ్రంథమును అంకితము గావించిన కవి శ్రీ చింతలపాటి లక్ష్మీ నరసింహశాస్త్రులవారు ప్రశంసనీయులు గాకయుందురా! మరియు వీరి జీవిత విశేషములు ఈ గ్రంథము చివరి భాగమున చూడవచ్చును.

మకాము
క్రొత్తపల్లి
శ్రీ గోపాలకృష్ణ భవనము
ది. 1-6-1985

ఇట్లు,
(సం.) విద్యానందస్వామి
శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు

ఓం తత్సత్

ఓమ్

శ్రీ తుమ్మల వేంకటరత్నం
*మాజీ సర్పంచి, ఘంటశాలపాలెం*

శ్రీ మహద్భ్యో గురుభ్యః

# నివేదనము

ఈ గ్రంథ అనువక్త బ్రహ్మశ్రీ చింతలపాటి లక్ష్మీనరసింహ శాస్త్రి. పూజ్యులు బ్రహ్మశ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారి పుత్రులు. వీరు మా గురుదేవులు. వేదాంతశాస్త్ర పారంగతులు. మహా పండితులు. ఒకప్పుడు కృష్ణా నదికి పశ్చిమ తీరమున గల అనంత వరము నుండి ఒక స్వాములవారు వేద వేదాంగ వేదాంతశాస్త్ర పారీణులు శ్రీకాకుళము వేంచేసినారు. వారు శ్రీ శాస్త్రిగారి వాగ్ధాటి నుద్దేశించి, "వీరు ప్రకాండ పాండితీ సంపన్నులు"గా కొనియాడబడిన మహా మనీషులు. అంతటివారి సన్నిధిని కావ్య పాఠమొనరించిన నేను, వారి పుత్రులయిన శ్రీ లక్ష్మీనరసింహ శాస్త్రిని 'పండితులు' అని శ్లాఘించుటకు సంకోచించుచుండు వాడను. ఈయన సాహితీ రంగములో పరిశ్రమించ వచ్చును, కావ్యాలు రచింప వచ్చును. కవితా గోష్ఠులలో పాల్గొన వచ్చును, అయినను మా గురువర్యుల ప్రజ్ఞలో శతాంశ, సహస్రాంశ ప్రజ్ఞకలవాడా! అను సందేహ ముండెడిది. మా గురుపాదుల పాఠ ప్రవచనం గాని, విషయప్రబోధం గాని అనితరసాధ్యం. ఇంతే కాదు. ఆ నాడు ఆంధ్రరాష్ట్ర ప్రసిద్ధ పండితవరేణ్యులలో ఒకరుగా కొనియాడబడినవారు వీరు.

శ్రీ లక్ష్మీనరసింహాశాస్త్రి కూచిపూడి అగ్రహారంలో మా సహపాఠి బ్రహ్మశ్రీ భాగవతుల రామలింగశాస్త్రిగారి సన్నిధిని కావ్యపాఠం సంప్రదాయసిద్ధంగా చేశారు. వేదాంత శాస్త్రము మహత్తర విజ్ఞాన శాస్త్రమని నా విశ్వాసము. కాని, ఈనాటి వేదాంతులు ప్రబోధించే వేదాంతము వారికే తెలియ నిది, శ్రోతలకు మాత్ర మేమి తెలియును అని నిస్పృహ, నిరాశ చెందుచుండువాడను. కాని, మా గురుపుత్రులు శ్రీ శాస్త్రి జ్ఞానవాశిష్ఠాన్ని సరళము, సుబోధకము, సర్వజన మనోరంజకము, ఆహ్లాదకరము నైన తెలుగు భాషలో, వచనముగా అనువదించి నాకున్న పూర్వాభిప్రాయాన్ని తొలగించారు.

యోగవాశిష్ఠము క్షీరసాగరము కాగా, దానిని తన జ్ఞానమందరముతో మధించి 'సాహిత్యాచార్య', 'తర్క-వాదేశ్వర' శ్రీమదభినవ పండితులు నవనీతాన్ని—అమృతాన్ని వెలికితీసి లోకాని కందించారు ఆ నవనీతాన్ని తెలుగు వచన రచనగా అదను పదను నెరిగి ఘుమ ఘుమ పరిమళించే ఘృతముగా కరగించి, మరగించి మృదుమధురపదజాల భరితంగా మన కందించారు మా గురుపుత్రులు శ్రీ శాస్త్రి.

మా గురు ముఖతః విద్యాధ్యయనాదృష్టానికి నోచుకొనక పోయినా, వారి శిష్యులచే ప్రబోధితులై, ప్రఖ్యాత పండితవంశ ప్రభవులైన అదృష్టంవలన ఈ వేదాంత విజ్ఞానం వీరికి లభించింది. మూలగ్రంథంలోని సౌరభము, సౌకుమార్యము చెడకుండా సంస్కృతభాషా నభిజ్ఞు లయిన ముముక్షు జనులకు అందించారు. ధన్యజీవులైనారు.

గతంలో వీరు కొన్ని గ్రంథాలు రచించి పైతృకమైన ఋణాన్ని తీర్చుకొన్నారు. ఇపు డీ గ్రంథ రచనతో వంశర్షుల ఋణాన్నుండి ముక్తులయినారని భావిస్తున్నాను. మా గురు పుత్రు లింతటి వారయినారని మహదానందాన్ని పొందుతున్నాను. ఈ పలుకులలోని యథార్థాన్ని ఈ గ్రంథ పాఠకులు గ్రహించి ఆనంద వార్ధి నోలలాడగలరని ఆశిస్తున్నాను.

ఈ గ్రంథమునకు పరిచయ వాక్యములు వ్రాయు అదృష్టము కలిగించుటవలన పూర్వస్మృతులు స్మృతిపథంలో మెదలి మహదా నందాన్ని పొందాను మా గురుపుత్రులు ఇక్క ముందుకూడ మహా గ్రంథములను రచించి ధన్యులై తమ కుటుంబ ప్రతిష్ఠ నినుమడింపజేయుదురుగాక ! ఆంధ్రభారతికి అందాలు సమ కూర్తురుగాక ! అని ఆశీర్వదించుచున్నాను."

ఇట్లు,
తుమ్మల వేంకటరత్నం
మాజీ గ్రామ సర్పంచి.

ఘంటశాలపాలెం
1-6-1985

ఓం తత్సత్

**NAMAMA VEDAMATARAM**
**SRI SRI SRI JAGADGURU SANKARACHARYA**
Pushpagiri Maha Samsthanam, Pushpagiri

Office : Bellam Mandi Street
CUDDAPAH

Station : కూచిపూడి
Date : 1-7-1983

శ్రీ విద్యా శంకరః ప్రసనః
నమామ వేదమాతరమ్.

అస్మత్ప్రియ శిష్యులు, శ్రీ చింతలపాటి లక్ష్మీనరసింహ శాస్త్రిగారు తాము తెలుగులో వచనరూపంగా రచించిన "జ్ఞానవాశిష్ఠ" మను గ్రంథమును వారే చదువగా స్థాలీపులాక న్యాయంగా వినుట జరిగింది. ఆధ్యాత్మిక విద్యను సులభంగా, మధురంగా, సున్నితంగా సంస్కృతవాఙ్మయంలో బోధించు జ్ఞానవాశిష్ఠగ్రంథమున కాంధ్రాను వాదము, వేదాంత తత్వమును దర్శింప కోరు సంస్కృతా నభిజ్ఞులకు ఎంతయో ఉపకరిస్తుందనటంలో సందేహము లేదు. గంభీర మైన ఆధ్యాత్మిక తత్త్వమును మృదుమధుర శైలిలో చిన్న చిన్న వాక్యాలతో సరసంగా బోధించుట గ్రంథకర్త యొక్క ప్రతిభా వైదగ్ధ్యాలను సూచిస్తున్నది. గ్రంథము నెంతదూరము పరిశీలించినా ఎక్కడగూడ సిద్ధాంత విరుద్ధ వాక్యాలు లేవనిపించింది. గ్రంథమును ఆది మధ్యాంతములందు పరిశీలించినపుడు గ్రంథమంతా ఒకే శైలితో విరాజిల్లుచున్నదని విశ్వాసము కల్గినది. జ్ఞానవాశిష్ఠమును తెనుగులో అనువదించిన వీరు। జ్ఞానములో వశిష్ఠులై ఇంకా ఇటువంటి ఎన్నో గ్రంథములను రచిస్తారని, శ్రీ శారదా చంద్రమౌళీశ్వరానుగ్రహానికి పాత్రు లగుచు శుభ పరంపరతో వర్ధిల్లుతారని విశ్వశిస్తున్నాను.

శు భం భ వ తు.

ఆంధ్రా యాం జ్ఞానవాశిష్ఠం।
ఆదృతం చ దినే దినే।
ఆంధ్రేషు వర్ధతాం నిత్యం
వాశిష్ఠ జ్ఞానదా, శివా ॥

ఇ తి

నా రా య ణ స్మృ త య ః
(సం) శ్రీ విద్యానృసింహభారతీస్వామినః

మకాం: కూచిపూడి
తే. 1_7_1983

# విషయసూచిక

## వైరాగ్య ప్రకరణము



## ముముక్షు వ్యవహార ప్రకరణము



## ఉత్పత్తి ప్రకరణము

## స్థితి ప్రకరణము



## ఉపశమ ప్రకరణము

శ్రీగురుభ్యోనమః

## కృతజ్ఞతలు

పెద్దల సుద్దులు, మహర్షుల ప్రబోధములు పిలచి పలుకరింపగా తిలకించి, పులకరించి, చెవు లప్పళించి, కనులు దెరచి ఆలించి, చూచి, పరవశించి ఈ గ్రంథ రచనకు పూనుకొన్నాను. ఈ కార్యనిర్వహణములోని ఉచితానుచితములను పాఠక లోకము నిర్ణయించగలదు.

ఈ గ్రంథ ముద్రణమునకు శ్రీమత్తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులు అయిదువేల రూప్యముల ఆర్థిక సహాయ మొనరించినందున ముమ్మొందుగ వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను.

ఈ గ్రంథ రచనకు, ప్రచురణమునకు చేయూత నిచ్చిన ఉదారహృదయులకు నా అభివాదనములు.

ఈ గ్రంథమును అంకితము గైకొమ్మని అర్థించుటతోడనే అంగీకరించి ఆదరించిన ఆధ్యాత్మికసంపద్విలసిత, మాతృశ్రీ శ్రీమతి బసవపూర్ణమ్మగారికి నా వందనములు. ఈమె భర్త కీ. శే. తుమ్మల గోపాలకృష్ణయ్యగారికి నా స్మృత్యంజలులు.

ఈ గ్రంథ వ్రాతప్రతిని స్వయముగ పఠించి అనురాగంతో ఆశీర్వదించిన గురువర్యులు, జగద్గురు శంకరాచార్య పుష్పగిరి మహా సంస్థాన పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ శ్రీ విద్యానృసింహ భారతీ స్వాములకును ; ఆత్మీయతతో ఆదరించి గ్రంథము నాలించి, తమ అమూల్యమగు సమయమును వెచ్చించి, యతిజనోచితపరిచయ ముతో ఆశీర్వదించిన శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ శ్రీ విద్యానందస్వాములకును ; పితృపాదులకు

## నిర్వాణ ప్రకరణము

శ్రీగురుభ్యోనమః

# కృతజ్ఞతలు

పెద్దల సుద్దులు, మహర్షుల ప్రబోధములు పిలచి పలుకరింపగా తిలకించి, పులకరించి, చెవు లప్పళించి, కనులు దెరచి ఆలించి, చూచి, పరవశించి ఈ గ్రంథ రచనకు పూనుకొన్నాను. ఈ కార్యనిర్వహణములోని ఉచితానుచితములను పాఠక లోకము నిర్ణయించగలదు.

ఈ గ్రంథ ముద్రణమునకు శ్రీమత్తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులు అయిదువేల రూప్యముల ఆర్థిక సహాయ మొనరించినందున మున్ముందుగ వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను.

ఈ గ్రంథ రచనకు, ప్రచురణమునకు చేయూత నిచ్చిన ఉదారహృదయులకు నా అభివాదనములు.

ఈ గ్రంథమును అంకితము గైకొమ్మని అర్థించుటతోడనే అంగీకరించి ఆదరించిన ఆధ్యాత్మికసంపద్విలసిత, మాతృశ్రీ శ్రీమతి బసవపూర్ణమ్మగారికి నా వందనములు. ఈమె భర్త కీ. శే. తుమ్మల గోపాలకృష్ణయ్యగారికి నా స్మృత్యంజలులు.

ఈ గ్రంథ వ్రాతప్రతిని స్వయముగ పఠించి అనురాగంతో ఆశీర్వదించిన గురువర్యులు, జగద్గురు శంకరాచార్య పుష్పగిరి మహా సంస్థాన పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీశ్రీ విద్యానృసింహ భారతీ స్వాములకును ; ఆత్మీయతతో ఆదరించి గ్రంథము నాలించి, తమ అమూల్యమగు సమయమును వెచ్చించి, యతికించిత్పరిచయ ముతో ఆశీర్వదించిన శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ శ్రీ విద్యానందస్వాములకును ; పితృపాదులకు

అంతేవాసులై వారి కీర్తి ప్రతిష్ఠలను నలుగడల వెలుగొంద జేయుచున్న సహృదయులు ఘంటశాలపాలెం, మాజీ సర్పంచి శ్రీ తుమ్మల వేంకటరత్నంగారు నివేదనము సమర్పించినందులకును నా మనః పూర్వక అభివాదనము లర్పించుచున్నాను.

ఉదారులు, సరసులు, ఆర్షసంప్రదాయ ప్రచార కార్యధౌరేయులు, మచిలీపట్టణము త్రివేణి పబ్లిషర్స్ ప్రయివేట్ లిమిటెడ్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టరు శ్రీ చింతలపాటి సూర్యనారాయణ రాజుగారు గ్రంథ ముద్రణమునకు అనేకవిధముల సహకరించి సహాయపడిరి. వారికి కృతజ్ఞతా పూర్వక ప్రణామములు.

ముఖపత్రమును భావయుక్తముగ, నయనపర్వముగ రూపొందించి, తమ ముద్రణాలయమున ముద్రింపించి సహాయపడిన శ్రీ పరచూరి కిశోర్ బాబుగారికి నా హృదయ పూర్వక అభివాదములు.

ఇంకను అనేకవిధముల సహాయ, సహకారము లందించిన మహాత్ములకు నా కృతజ్ఞలు.

ఘంటశాల
1-6-1985

ఇట్లు బుధవిధేయుడు
చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రి

ఓం తత్సత్

అస్మద్గురుచరణాభ్యాం నమః

నమామ వేద మాతరమ్

# వాల్మీకీయం

# జ్ఞానవాశిష్ఠము

శ్లో. "వాల్మీకే ర్మని సింహస్య కవితావన చారిణః।
శ్రుణ్వన్రామ కథానాదం కోనయాతి పరాంగతిం॥"

శ్లో. యః కర్ణాంజలి సంపుటై
రహరహస్సమ్యక్పిబత్యాదరాత్
వాల్మీకే ర్వదనారవింద గళితం
రామాయణాఖ్యం మధు
జన్మవ్యాధి జరా విపత్తి మరణై
రత్యంత సోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి
పుమాన్ విష్ణోః పదం శాశ్వతం॥

శ్లో. శ్రీ రాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం
ఆజానుబాహు మరవిందదళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి॥

# వైరాగ్య ప్రకరణము

వైరాగ్యోత్పత్తి: స్వర్గ భూ వ్యోమాకాశము లందును, బహిరంతరములలోను, దృశ్యమాన ప్రపంచరూపుడై భాసించు పరమాత్మకు నమస్కారము. 'నేను సంసారబద్ధుడను. ఈ బంధము నుండి విముక్తుడ నగుదునుగాక' అను నిశ్చయము కలవారును, పూర్తిగా తెలియనివారును, తెలిసినవారుగానివారును ఈ శాస్త్రము జదువుటకు అర్హులు.

ఒకనాడు భరద్వాజుడు గురువు, సర్వజ్ఞుడు నగు వాల్మీకి మహర్షి ఏకాంతమున గూర్చున్న సమయమున నమస్కరించి మృదుమధుర వచనములతో నిట్లనెను :

"భగవానుడా! శ్రీరామచంద్రుడు సంసార సంకటము నుండి ఏవిధమున జీవన్ముక్తు డయ్యెను అను విషయమును నా యందలి కరుణతో వివరింతువుగాక అని ప్రార్థించుచున్నాను" అనగా వాల్మీకి ఇట్లు వచించెను :

"వత్సా! బాగుగా పలికితివి. దీనికి సమాధానము వినుటకు నీవు తగినవాడవు కాన చెప్పుచున్నాను, వినుము. దీని నాకర్ణించుటవలన మోహము దూరమగును. నిరాకారా కాశమున భ్రమ జనిత వర్ణము లేర్పడిన విధముగా నీ జగత్తు భ్రాంతివలన గోచరించుచున్నది. తిరిగి దీనిని స్మరింపకుండుటను 'ఉత్తమ విస్మరణ' మని భావించుచున్నాను. ఈ దృశ్యము లేదు అని మనసు నుండి ఈ దృశ్యమును జ్ఞానవంతుడై తొలగించు కొనినచో మోక్షము ప్రాప్తించును. అట్లుగాక, మీరు శాస్త్ర ములు అను అగాధములో బడి, మాయ నెరుగనివా రగుటవలన, నెన్ని కల్పములకైనను మోక్షమును పొందజాలరు. విషయ వాసనలను సంపూర్ణముగా పరిత్యజించుట శ్రేష్ఠము. ఇది పవిత్రమైన విధానము. ఇదియే మోక్షమని పండితు లందురు.

వాసనలు ద్వివిధములు : 1. శుద్ధవాసనలు 2. మలిన వాసనలు అని. శుద్ధవాసనలు జన్మరాహిత్యము నిచ్చును, మలిన వాసనలు పునర్జన్మ హేతువులు.

అహంకార స్వభావము, దృఢ స్వరూపము, పునర్జన్మ హేతువైనది మలినవాసన యనియు; దేహార్థమై నిలచినది, చెడి పోయిన విత్తనమువలె బీజ శూన్యమైనది, జ్ఞేయవస్తుపరిజ్ఞానము కలది శుద్ధవాసన యనియు పండితు లందురు. శుద్ధవాసనా విభ్రాజితులు తిరిగి జన్మింపరు. వారు జ్ఞేయమును జ్ఞాత మొనరించుకొనిరి. కాన వారిని జీవన్ముక్తు లనిరి.

శ్రీరామచంద్రుడు జీవన్ముక్తి నందిన విధమును జరామరణ శాంతికై వివరించుచున్నాను, వినుము.

రాజీవాక్షుడగు శ్రీరామచంద్రుడు, విద్యాభ్యాసానంతరము స్వగృహమునకు మరలి వచ్చి, అనన్యవిచారమనస్కుడై విలాసముగా దినములు క్షణములవలె గడపుచుండెను. ఒకనా డాతనికి పుణ్యక్షేత్ర, తీర్థ, ఆశ్రమములను దర్శింపవలయునని ప్రబలవాంఛ జనించెను. తండ్రి పాదాంతికమున కేగి నవకమలము లను, మరాళమువలె నఖ కింజల్కములగు పితృపాదపద్మములకు నమస్కరించి తన యభిలాషము నిట్లు వెల్లడించెను :

"జనకా! పుణ్యక్షేత్ర తీర్థాశ్రమములు, దేవాయతనములు, వనములు దర్శింపవలెనను అభిలాష జనించినది. మీచే గౌరవింపబడి వాంఛితముల బడయని యర్థులు లేరు. కాన నా యభిమత మీడేర్చి ధన్యుని జేయుడు" అని అభ్యర్థించెను. దశరథమహారాజు కులగురువగు వశిష్ఠమహర్షిని యాలోచించి ప్రప్రథమముగ తన నర్థించిన శ్రీరామచంద్రుని యభిమతానుసారము తీర్థయాత్రలకు అనుమతి నిచ్చెను. తిథి, వార, నక్షత్ర యోగాదులతో శుభయుక్తమైన దినమున రఘురాముడు అనుజ, అనుచర సమేతుడై తీర్థయాత్రలకు బయలు వెడలెను.

కోసలరాజ్యము మొదలుకొని సమస్త తీర్థములు, క్షేత్రములు, వనములు,మున్యాశ్రమములు, దేవాలయములు,పర్వతప్రాంతములు, వనములు, సముద్రతీరములు, నగరములు దర్శించుచు, స్నాన, దాన, జప, ధ్యానాదుల నాచరించుచు సంచరించెను. అమర కిన్నర గంధర్వ సిద్ధ సాధ్య మానవ సమాదరణీయుడై శ్రీరామ చంద్రుడు, భూమండలము నంతయు సందర్శించి, దిగంతములందు విహరించి శివలోకము జేరిన శివుని చందమున స్వగృహమున కేతెంచెను. నగర నివాసులు లాజ, పుష్పాక్షతాంజలులతో నర్చించుచుండ, జయంతుడు స్వర్గప్రవేశ మొనరించిన విధమున నగరప్రవేశము జేసెను.

ఆనాటినుండి తాను దర్శించిన విశేషములను తనవారి కభివర్ణించి చెప్పుచు సుఖముగ రాజగృహమున నుండెను.

ఉషఃకాలముననే నిదుర మేల్కాంచి యథావిధిగ కాల కృత్యములను ముగించుకొని, స్నానసంధ్యాద్యనుష్ఠానములను నిర్వర్తించుకొని దేవేంద్రునివలె కొలువుదీరియున్న తండ్రిని సందర్శించును. వశిష్ఠాది మహాత్ములతో నచట జ్ఞానగర్భిత చిత్ర విచిత్ర కథా కథనములతో నొక జాముకాలము గడుపును. అనంతరము తండ్రిచే ననుజ్ఞాతుడై, విపుల సేనాపరివారమును గూర్చుకొని, మహిషవరాహాది మృగసంకులారణ్యమునకు మృగయా వినోదార్థ మరుగును. అచటినుండి గృహమునకు మరలివచ్చి, క్రమానుసార స్నానాదికముల నాచరించి, బంధు మిత్రులతో గూడి ఇష్టమృష్టాన్న భోజన మొనరించి సరస సల్లాపములతో రాత్రి కాలమును గడుపును. తీర్థయాత్రాగతుడై, సహోదరసమువేతుడై శ్రీరామచంద్రుడు ఈవిధమగు దినచర్యతో పితృగృహమున నుండెను. రాజకీయవ్యవహారముల యందు మనోహరముగను, సుజనహృదయములకు నవజ్యోత్స్న విధమున, ఘృతామృతపేశల దినచర్య కలిగి యా పుణ్యాత్ముడు కొంతకాలము గడపెను.

షోడశవర్ష ప్రాయము నిండని రఘురాము డేకారణము
వలననో, శరత్కాల పద్మాకరమురీతి దినదినమునకు కృశించిపోవు
చుండెను. విశాలనేత్రాంచిత ముఖకమలము కాలాంతర వికసిత
సితాంబుజము భ్రమరపంక్తి విరాజితమై వన్నె దరిగిన పగిది
పాలిపోవుచుండెను. చెక్కిలిని చేయిజేర్చి, పద్మాసనాసీనుడై,
సకలకార్యకరణ విముఖుడై, యూరక చింతామగ్నమానసుడై
యుండెను. కృశాంగుడు, చింతాపరివృతుడు, ఖేదాత్ముడు,
దుర్మనస్కుడునై చిత్రార్పితునివలె నుండెను. ఎవ్వరితోడను
భాషింపడు. పరిజనులు ప్రార్థింప నతికష్టమున లేచి నిత్యకృత్యములు
నిర్వర్తించును. కుమారుని ఈ విధమగు స్థితిని దెలిసికొని యొకనాడు
దశరథమహారాజు తన యంకతలమున కూర్చుండబెట్టుకొని,
"కుమారా! నీకు విచారమేల?" యని బుజ్జగించి యడుగ,
"తండ్రీ! నాకు విచార మెందులకు?" అని ముక్తసరిగా సమాధాన
మిచ్చెను.

ఒకనాడు విశ్వామిత్రు డని ప్రసిద్ధి వహించిన మహర్షి,
దశరథమహారాజ దర్శనార్థమై అయోధ్యానగరమున కేతెంచెను.
లక్ష్మతేజోవిరాజితుడైన యా మహర్షి రాక నెరిగి ఎదురేగి,
తోడితెచ్చి, సువర్ణపీఠమున ఆసీనుజేసి సంతోషముతో అర్ఘ్య
పాద్యాదులచే సమర్చించి, గోదానము నర్పించెను. అనంతరము
సంతుష్టాంతరంగుడై అంజలి ఘటించి యా మహారాజు ఇట్లు
పలికెను :

"మహానుభావా! సూర్యకిరణ ప్రసారమున అంబుజాకరము
విధమున, తలవనితలంపుగా నరుదెంచిన మీ సందర్శన ప్రకాశ
మున మేము పునీతులుగా ననుగ్రహింపబడితిమి. ఆద్యంతరహితము,
అపాయవిరహితము నగు మహదానందము తమ దర్శనభాగ్యమున
సంప్రాప్తించినది. అమృతము లభించిన రీతి, క్షామ సమయమున
వర్షాగమనము పగిది, అంధునకు దృష్టి ప్రాప్తించిన వడువున

భవదాగమనము ముదావహము. ఆకాశ గమనమున వలన, మృతుడు పునరుజ్జీవితుడైనట్లు తమ రాక మా కమందానంద సంధాయకమైనది. బ్రహ్మస్వరూపా! స్వాగతము. శ్రేష్ఠతరమగు తమ వాంఛితమేమి? నా వలన తమకు కాగల కార్యమేది? పరమ ధార్మిక విప్రశ్రేష్ఠా! తీర్థభూతులై తమ రరుదెంచితిరి. గంగా స్నాన సంజనిత సంతృప్తి మాకు కలిగినది. అంతశ్శీతలత జనించినది. తమరు వీతరాగులు, నిరామయులు, ఇచ్ఛాశూన్యులు, నిర్భయులు, జితక్రోధులు. ఈనాటి మీ యాగమనము మా కత్యాశ్చర్యము కలిగించుచున్నది. మునిపుంగవా! తమరు పరమ పూజ్యులు. కార్యార్థులై యరుదెంచినచో ఆ కార్యమును సిద్ధించిన దానిగనే భావింపుడు. సెలవిండు" అని ఆ రాజశార్దూలుడు అద్భుతావహముగ పలికిన పలుకులు విని, విశ్వామిత్రుడు హర్ష పులకితగాత్రుడై ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను:

"వశిష్ఠవశవర్తుడవు, మహావంశ ప్రభవుండవైన రాజ శార్దూలా! నీ వాక్కులు సముచితములుగా నున్నవి. నేనొక సిద్ధి నర్థించి నియమ మవలంబించితిని. కాని దుర్మార్గులు, భయంకరులు నగు రక్కసులా నియమమునకు విఘ్నమాపాదించుచున్నారు. ఆర్తుడను, శరణాగతుడను. నన్ను నీవే రక్షింపదగినవాడవు. నీ కుమారుడు శ్రీమంతుడు, శ్రీరాముడు శార్దూలసమ విక్రముడు. ప్రతాపమున మహేంద్రసదృశుడు, రక్షోగణభయంకరుడు. రాజ పుంగవా! సత్యపరాక్రముడు, కాకపక్షధరుడు. శూరుడు, అతని, నీ జ్యేష్ఠ కుమారుని, శ్రీరామచంద్రుని నా కర్పింపుము. దివ్యమగు నాత్మతేజోభిరక్షితుడై విఘ్నకారులగు రాక్షసిమూకల శిరః ఖండనముజేయ సమర్థుడతడు. పుత్రసంబంధమైన మమకారమును పరిత్యజింపుము. మహాత్ముల కీయరాని దీ జగత్త్రయమందును లేదుగదా! మహానుభావా! ఆ రక్కసిపిండు, హతమైన దనియే భావింపుము. ఇది నాకు దెలియును. మావంటి ప్రాజ్ఞులు సందిగ్ధ విషయములలో ప్రవర్తింపరు. రాజీవాక్షుడగు శ్రీరామచంద్రుడు

మహామహిమాత్ముడని ఎరుగుదును. ధర్మమహాత్వము, కీర్తి కాంతుల నీ మనస్సునందున్నచో నా యభిమతము ననుసరించి నీ కుమారుని నా కర్పింపుము. ఈతని గుణగణములు, మహత్త్వము నేనేకాదు. దీర్ఘదర్శులైన వశిష్ఠాది మహాతేజస్సంపన్నులు, తదన్యులగు మహానుభావులు గూడ నెరుగుదురు. నా యభీష్టము సఫలమగునని యాశించుచున్నాను " అని ధర్మాత్ముడగు విశ్వామిత్రమహర్షి ధర్మబద్ధముగా పలికెను. రాజశార్దూలుడా తేజశ్శాలి పలికిన పలుకులు విని, ఒక ముహూర్తమాత్రము నిశ్చేష్టితుడై యుండి, తరువాత దీనాతిదీనముగ నిట్లు అర్థించెను :

" బ్రహ్మవేత్తా ! రాజీవలోచనుడగు శ్రీరామునకు ఇంతకూ పదునారు వత్సరములుకూడ నిండలేదు. అట్టివానికి రాక్షసులతో యుద్ధము చేయగల ఓర్పు, నేర్పు లేముండును ? నేను అనేక యుద్ధములందు ఆరితేరినవాడను. అక్షౌహిణీసేనా సముపేతుడను, దీనిని వెంటగొని యా రాక్షసుని కాయమును చీల్చి చెండాడెదను. బాలుడగు రాముడు శత్రుసేనావ్యూహముల నెరుగడు. అంతఃపురమునే తప్ప నింతవరకు రణరంగమును జూడలేదు. మహర్షీ ! నాకు తొమ్మిదివేలవత్సరముల వయసు వచ్చినది. ఎన్నియో కష్టములనంది వ్రతములు, నోములు నోచి కడకు ఈ నలుగురు బిడ్డలను పొందితిని. ఆ నలుగురిలో కమలలోచనుడు శ్రీరామ చంద్రుడు నా బహిఃప్రాణము. అతని వీడి నేనుగాని, నన్నువీడి యాతడు గాని, మిగిలిన ముగ్గురు కుమారులు గాని ఒక్కక్షణము కూడ జీవింపలేము. శ్రీరాముని నీవు గొనిపోవుట యనిన నా ప్రాణములను గొనిపోయినట్లే కాగలదు. ఇంతియగాదు. ఆ రావణాసురుడే నీ యజ్ఞవిఘ్నకారి యగుచో నా దుర్మార్గుని వధించుటకు మావంటివారలే సమర్థులుకారు. ఇక రాముడంతటి కార్యమునకు సమర్థుడగునా ! పరాక్రమసంపదలు, కాలానుసారముగ పరివర్తితము లగుచుండును. అవి ఒక్కప్పు డొకరిని, మరొకప్పు

శింశొకరిని ఆశ్రయించుచుండును. ఒక్కరినే స్థిరముగ నాశ్రయించి యుండవు. ప్రస్తుత కాలము రావణాది రాక్షసగణమున కనుకూలమైనది. ఇది కాలనిర్ణయము. ఇది సజ్జనులను తృణీకరించు కాలము. ప్రస్తుతము శ్రీరాముడు వార్ధక్య జర్జరుని విధమున దైన్య భావముతో నున్నాడు" అని స్నేహపర్యాకులాతురములను ప్రకటించెను. ఆమాటలకు విశ్వామిత్రమహర్షి ఆగ్రహోదగ్రుడై యిట్లనెను :

"రాజా! నీవు నా వాంఛిత మీడేర్తునని వాగ్దానము చేసితివి. ఇపుడు దానిని జవదాట దలచుచున్నావు. ఈవిధమగు వర్తనము మృగరాజత్వమును వీడి, మృగమును వాంఛించుట వంటిది. వాగ్దత్తమును నీవు నెరవేర్పజాలనివాడవైనచో నా దారిని నేను పోయెదను. కకుత్థ్సవంశమండనా! భ్రష్ట ప్రతిజ్ఞుడవై, బంధుమిత్రకళత్రాదులతో కలకాలము సుఖముగా నుండెదవుగాక!" అని విశ్వామిత్రమహర్షి క్రోధఘూర్ణిత మానసుడు కాగా భూమి కంపించినది. దేవతాగణములు భయభ్రాంతములైనవి. జగన్మిత్రుడైన విశ్వామిత్రుని స్థితి నెరిగిన ధైర్యవంతుడు, ధీమంతుడు నగు వశిష్ఠమహర్షి ఈవిధముగ పలికెను :

"మహారాజా! ఇక్ష్వాకువంశమండనుడవు. అన్వర్థ దశరథ నామాంకితుడవు. నీవే ప్రతిజ్ఞాపాలన మొనరింపకున్న నింకొకడు పాలించునను విశ్వాస మేమున్నది? మీవంటివారి ధర్మనిర్ణయమును పశు లెవ్వరు నతిక్రమింపరు. ఇక మీ నిర్ణయములను మీరే యతిక్రమించుట పాడిగాదు. అమృతమును గరుత్మంతుడు గుప్త మొనర్చిన విధమున, పురుషసింహుడగు శ్రీరామచంద్రుని కృతాస్త్రుడైనను, అకృతాస్త్రుడైనను రాక్షసులేమియు చేయజాలరు" అని పలుక దశరథమహారాజు శ్రీరామభృత్యులవైపు జూచి, "రాము డెట్లుండెను! ఎక్కడ నుండెను!" అని ప్రశ్నించెను. అంత నా రామభృత్యులు వినయ వినమితాంగులై యిట్లనిరి :

" రాజీవపత్రాక్షుడగు శ్రీరామచంద్రుడు, తీర్థయాత్రలు సేవించి మరలి వచ్చినది మొదలు బ్రాహ్మణులతో గూడి భాషించుట లేదు. ఆతని మనస్సు స్థిరముగా నుండుట లేదు. మా ప్రార్థనమును మన్నించి నిత్యకృత్యములు సైతమొకప్పుడు ఆచరించును, మరి యొకప్పు డాచరింపడు. ఈ సంపద లాపదలు, ఈ గృహము, వాంఛలు అన్నియు మాయ, అసత్తు అని మానము వహించును, వస్త్రధారణము, జలపానము, అశనభక్షణాదులపట్ల గూడ పరాఙ్ముఖుడై, మహారాజ! పరివ్రాజక ధర్మమవలంబించి యతివలె నున్నాడు. ఆయన అభిమానమును, రాజ్యము నభిలషించుట లేదు. సుఖదుఃఖాది విషయముల యందు సంతోష విచారముల నందుట లేదు. మోక్షప్రాప్తి విరహిత కార్యకలాపములతో వ్యర్థముగా జీవితము గడచుచున్నది గదా యని దీనుడై మాటి మాటికి కాకలీ స్వరమున గానము జేయుచుండెను. ఆపదలకు మూలములగు నీ సంపదల నభిలషింపనేల? వాని నిప్పుడే పరిత్యజించుచున్నాను అని తన సర్వస్వమును అర్థిజనులకు దాన మిచ్చును. మహాబాహూ! ఈవిధమగు చిత్తవృత్తి కలిగి శ్రీరామచంద్రు డేమి చేయవలయునో తెలియక యున్నాడు. మీరలే గదా మాకు దిక్కు గద! ప్రస్తుత లౌకిక వ్యవహారములందు శ్రీరాముని చిత్తము లగ్నమగునట్లు చేయగల సమర్థులు భూతలమున నెవ్వరును లేరా!" అని పరితపించిరి. ఆ మాటలను వినిన విశ్వామిత్రుడు "అట్లయినచో హారిణములు హారిణమునువలె శ్రీరాముని మీర లందరు నిటకు గొనిరండు. రఘుకులతిలకునకు ఈ మోహము ఆపదల మూలమున జనించినదికాదు. అనురాగమువలన సంభవించిన దంత కంటకము కాదు. ఇది వివేక వైరాగ్య సంజనిత బోధము. ఇది మహోదయము. ఇట్టి మోహ మంకురించినపుడు ఉపాయమున మార్జన మొనరించినచో, మావలెనే పరమపదమందు విశ్రాంతి పొందగలడు. మాన్యమతియగు శ్రీరామచంద్రుడు పరిపూర్ణ

మనస్కుడై తన ప్రస్తుత వ్యవహారపరంపరను అఖండితముగ నాచరించును" అని పలుకుచుండగా పితృపాదాభివందనార్థమై కమలలోచనుడగు శ్రీరాము డరుదెంచెను.

శ్రీరామచంద్రుడు మున్ముందుగా తన తండ్రికి పాదాభి వందన మాచరించెను. అనంతరము పూజ్యపాదులగు వశిష్ఠ విశ్వామిత్రులకు, పిమ్మట బంధువులకు, గురువులకు వందన మాచరించెను. అటుతరువాత చూపులతోను, శిరమునను, వాక్కుల మాలమునను, రాజసముదాయము సమర్పించు ప్రణామముల స్వీకరించెను. తన యంకతలమున గూర్చుండుమని తండ్రి సంకేతము జేయ నంగీకరింపక పరిజనులు పరచిన యాస్తీర్ణముపై నుపవిష్టుడయ్యెను. అపుడు దశరథమహారాజు కుమారునితో నిట్లనెను :

"కుమారా! వివేకవంతుడవు. శుభంకరుడవు. జడజీర్ణ బుద్ధివై, కష్టాత్ముడవై దీనుడ వయ్యెద వేల? వృద్ధ, గురు, విప్ర ప్రోక్త ధర్మము లనుష్ఠించుచు మోహమును త్యజించి పరమపద మధిష్ఠింపగలవు. మోహావిష్టు డీ పదవి నందజాలడు. మోహ ప్రసర దూరున కాపదలు దూరముగ నుండును" అని బోధించెను. వశిష్ఠమహర్షి "మహాబాహూ! రాజపుత్రా! విషయ సుఖములు శత్రువులు. అవి దురారంభములు. దుర్భేద్యములు. అయినను వాటిని నీవు జయించితివి. శూరుడవు. బ్రహ్మజ్ఞాన మెరుంగనివాని వలె అజ్ఞానార్ణ్వము, కల్లోలాకరము, మౌఢ్యహేతువునైన మోహ సాగరమం దేల మునుగుచున్నావు" అని ప్రశ్నించెను.

విశ్వామిత్రుడు : నిష్ఠలు, నియమములు అననేవి? అవి ఏల కలుగుచున్నవి? అను మనోవ్యాధులు మూషకములు గృహమునువలె హృదయమును తొలచి వేయుచున్నవి. పాప రహితుడా! నీ యభీష్టమేమిదో వెంటనే తెలియజేయుము. నీ మనోరోగము లిక బాధింపజాలవు అని మతిమంతుడగు విశ్వామిత్ర

మహర్షి యడిగెను. రఘుకులాలంకారుడు యథార్థ ప్రతిభాసితము లగు వారి వాక్యము లాకర్ణించి, అభిమతార్థసిద్ధి సందేహముకల మయూరము, మేఘగర్జారావ సంశ్రవణమున సంశయ విచ్ఛేద మొందిన విధమున దుఃఖమును పరిత్యజించెను.

# ౨. జగద్దోష ప్రకాశనము

అనంతర విషయములను వాల్మీకిమహర్షి భరద్వాజున కీవిధముగ నభివర్ణించెను.

విశ్వామిత్రుడు శ్రీరామచంద్రు ననునయించుచు బలికిన మాటలను విని ప్రత్యుత్తరముగా నాత డిట్లనెను :

" మహానుభావా ! అజ్ఞానుడను. అయినను తమరు ప్రశ్నించిరి. కావున సమస్త విషయములు విన్నవించుచున్నాను. సత్పురుషుల ఆజ్ఞ నెవ్వరును జవదాటరుకదా !" అని పరిపూర్ణార్థబంధుర వాక్యములతో నిట్లు వచించెను :

" పితృగృహమున నేను జన్మించి క్రమముగ పెరిగి పెద్దవాడనైతిని. విద్యల నభ్యసించితిని. మునినాయకా ! సదాచారపరుడనై సముద్రపరీత భూమండల మంతయు తీర్థయాత్రార్థమై విహరించితిని. అనంతరము లౌకిక వ్యవహారములయందుగల ఆసక్తి నంతటిని నశింపజేయుచు నీ విధములగు నాలోచనములు నా మనసున నుత్పత్తిగ వెలువడినవి.

ఈ సంసార స్థితి ఏమి సుఖప్రదము? మరణించుట కొరకే ఈ జీవులు పుట్టుచున్నవి. తిరిగిపుట్టుట కొరకే మరణించుచున్నవికదా ! ఈ చరాచరసృష్టియంతయు నస్థిరము. సంపదలకు నిలయములైన వన్నియు పాపయుక్తములు, ఆపదలకు మూలములు. ఒక దాని నొకటి యెన్నటికి కలుసుకొనలేని ఇనుపశలాకలవంటి భావములు, మనఃకల్పనలచే స్వయంజనితములై యొకదాని వెంట నొకటి పరుగులిడుచునున్నవి. ఈ రాజ్యము, భోగములు మున్నగు విలాసములతో పని యేమి ! నే నెవ్వడను ? ఇక్కడికేల వచ్చితిని ? ఇది యంతయు మిథ్యయగుగాక ! ఆ మిథ్యయెట్టిది ? ఏల వచ్చినది? ఇట్లు విమర్శించుకొనగా, బ్రహ్మస్వరూపా ! సమస్త వస్తుజాలమునందు బాటసారికి ఎండమావులపట్ల విరాగము జనించిన విధమున విరక్తి కలుగు

చున్నది. ఈ దుఃఖ మేతీరున శాంతించును ? అను విచారముతో జీర్ణ వృక్షకోటరములోని భయంకరాగ్ని విధమున తపించు చున్నాను. సంసారదుఃఖ పాషాణనీరంధ్రహృదయుడనై నిజ లోకభయమున, బాష్పములు వెలువడనీయక దురపిల్లుచున్నాను. విచార సంచయ చక్రములవంటి సంపదలు నా కానందప్రదములు కావు. అధిక సంతానవతులగు గృహిణులుకల గృహములు భయంకరాదలవంటివి. లౌకికమైన తుచ్ఛసంపద మోహాతిరేక మునకే గాని సుఖమునకు గాదు. సద్గుణ దుర్గుణ విచార శూన్యముగ దుర్మార్గులు, మూఢులుకల రాజప్రకృతి రీతి, ప్రక్కగా బడిపోవు వాని నాశ్రయించును. క్షీరము సర్పవిషమును సత్వర మభివృద్ధి నొందించునట్లు, ఆ యా కర్మలవలన సంపదలు విశేషాభివృద్ధి నందును. స్వ, పరజనులయెడ ప్రశాంత మృదువ్యవహారము కలిగి మెలగినంత కాలము, లక్ష్మి యాతని నాశ్రయించి యుండును, వాయుపర్యుషితము కానంతవరకే హిమ ముండును. ప్రాజ్ఞులు, శూరులు, కృతజ్ఞులు, మృదుస్వభావులు గూడ నీ లక్ష్మి మూల మున మృత్తికామణి పగిది కఠినచిత్తు లగుచున్నారు. శ్రీమంతుడై జననిందపొందనివాడు, ఆత్మశ్లాఘులేని వీరుడు, సమదృష్టిగల ప్రభువు నను నీ ముగ్గురు లోకమునందు దుర్లభులు.

లక్ష్మి నీచకర్మాచరణము మూలముననే దరికి జేరును. ఇది క్షణభంగురమైనది. సర్పపరివేష్టిత పుష్పలతవలె మనోహరమై, చిత్తవృత్తి నాకర్షించును. చిగురుటాకు కొనయందు నిలిచిన నీటి బిందువు మాదిరి అస్థిరమగు నాయువు ఉన్మత్తుని చందమున, అకాలమందే శరీర పరిత్యాగ మొనరించును. విషయ వాసనా భుజగవేష్టిత చిత్తయుక్తులకు ఆత్మజ్ఞానవిహీను లగుట వలన ఇది ఆయాసహేతువు. మహాముని . పరిమిత విషయములందు, దృఢ నిర్ణయులమగు మాదృశులు సంసార మేఘములోని మెరపుల పగిది ఆయుర్దాయ విషయమున నిర్వృత్తి గలిగి యుందురు. చాప

రీతిని వాయువును చుట్టవచ్చును. ఆకాశమును ఛేదింపవచ్చును. తరంగములను మాలవలె గూర్చగలము. కాని యాయువును మాత్రము పట్టియుంచజాలము. శరత్కాల మేఘముభాతి, చమురలేని దీపము చందమున, చంచలత రంగము వడువున ఫేలవమగు నీ యాయువు గతించుచుండును. చంచలము, శూన్యము నైన యాయువు సుదీర్ఘమై యుండవలయునని మూర్ఖులు నిరంతరము వాంఛించుచుందురు. ప్రాజ్ఞుడై, దుఃఖ భూయిష్ఠమైన సంసారమున మరల ప్రవేశింపక, యుత్తమగతి నందినవాని జీవితమే ధన్యము, అట్లుగాక వృక్షములు, మృగములు, పక్షులు జీవించుటలేదా! మననశీలుడై జీవించువాని జీవితము ఉత్తమమైనది. జన్మించిన జీవులు తిరిగి జన్మింపకుండుటయే జన్మసార్థకత. అట్లుగానిచో వారు ముదిగాడిద లనబడుదురు. వివేకశూన్యునకు శాస్త్రము భార హేతువు. అనురాగవంతునకు జ్ఞానము భార కారణము. శాంతి విహీనునకు మనస్సు భార మూలము. ఆత్మజ్ఞాన రహితునకు శరీరము బరువుచేటు. రూపము, ఆయువు, మనస్సు, బుద్ధి, అహంకారము, స్థిరసంకల్పము–ఇవి యన్నియు దుర్బుద్ధికలవానికి భారహేతువులు, దుఃఖకారణములు.

ఆదరములేని వానినిగా నెరిగి యౌవనము కొలదిదినముల లోనే తనను సజ్జనుడు దుర్జనుని పరిత్యజించినట్లు విడచివేయును. స్థిరసౌఖ్యదముగా భాసించుచు నిస్సారమై, గుణహీనమై, మరణ భాజకమైన ఆయువువంటి వస్తువు లోకమున మరియొకటిలేదు. వ్యర్థముగా మోహముచే జనించి, వ్యర్థముగా ప్రవర్తించుచు, మిథ్యామయమైయున్న దురహంకారమునకు భయపడుచున్నాను. దీనివలన ఆపదలు, మనోవ్యాధులు, సంకల్పములు జనించుచున్నవి దీనికి మించిన శత్రువులేదు. చిరకాల వైరముగల దీని నాశ్రయించి నేను ఆహారమును భుజించుటలేదు. జలము త్రావుటలేదు.

విశ్వామిత్రమహాముని! ఈ స్థితిలో నున్న నేను రాజ్య భోగము లెట్లనుభవింతును! అహంకారమునకు లోనై భుజించినది,

విహారించినది, చేసినది ప్రతిదియు నసత్యమేకదా! అహంకార రహితమైనదే సత్యపదార్థము. బ్రాహ్మణోత్తమా! అహంకార మేఘ విజృంభణమున ఆశాగిరి మల్లికామంజరులు వికసించును. నిరహంకారవృత్తిగలిగియు, మూఢత్వమున దురపిల్లుచున్న నాకు తగిన యుపాయమున ప్రశాంతచిత్తునిజేయు సమర్థులు తమరు. సర్వవిధ అనర్థములకు ఆపదలకు నిలయమై, అశాశ్వతమై, అంత రంగస్థమైన ఆ యహంకారమును పరిత్యజించి మరల ఆశ్రయింప జాలను. మహానుభావా! దుఃఖావృతుడనైన నన్ను శాసింపుము. నేను మాత్రమే మిగిలి యున్నాను. దోషభూయిష్ఠమై అతిచంచల మైన మనస్సు సత్కార్యాచరణము, పూజ్య పాదసేవనము వలన మాతు తాకాత మయూర పింఛము భాతి చలించుచున్నది. ఇటూ అటూ వ్యగ్రచిత్తముతో వ్యర్థముగా బహుదూరము పరుగెత్తు కుక్కవలె మనస్సు అదుపు దప్పి పరుగిడుచున్నది. ధన మధిక ముగా లభించినను తృప్తిజెందదు. వెదురుగొట్టములోని జలము మాదిరి అంతఃపరిపూర్ణత్వము నందుటలేదు. ఆశ అను భార్య ననుగమించు క్రూరచిత్తమున, మూర్ఖత్వమునందిన నేను, శ్వాన భక్షిత శవము రీతిగ భుక్తుడనైతిని. జననాంతరముల నందుటకు, శూన్యమున పరిభ్రమించుటకు, చండమారుతము తృణకణమును వలె నీ మనస్సుచే బహుదూరము గొనిపోబడితిని. పాతాళము నుండి భూమిపైకి, భూమి మీదనుండి పాతాళమునకు బోయెడి కూపకాష్ఠమునకు గట్టిన త్రాడు విధమున, దీనిచే నేను ఆతృతుడ నైతిని. అసత్యమగు విస్తృతరూపముగల భేతాళరూపమునకు, భయపడు బాలుని యట్లు పాపచిత్తమునకు భయపడుచున్నాను. అది ఆలోచనా మాత్రమున నంతర్హితమగును కదా!

బ్రాహ్మణోత్తమా! నిగ్రహము లేని మనస్సు అగ్నికంటె యుష్ణము. పర్వతము కన్న దుర్గమము. వజ్రమును మించి కఠినము. సముద్రపానము, మేరుమహాపర్వతోన్మీలనము అగ్ని భక్షణముల

కంటె మనోనిగ్రహము దుష్కరము. ప్రయోజనముల కన్నిటికి మనస్సె మూలకారణము. ఇది యున్నచో జగత్త్రితయ ముండును. అది నశించిన జగములు నశించును. కాన, ముందుగ దానిని నిగ్రహింపవలెను. సుఖ దుఃఖ పరంపర, పర్వతరాజమున ప్రభవించు మహారణ్యవలె నీ మనస్సునందే ఉద్భవించును. వివేక వశమున దానిని విస్తరించినచో నా సుఖదుఃఖ పరంపర సులభముగా విస్తరించును.

ఆశ యనునది మనస్సునందు వ్యాపించిన యంధకారము వంటిది. అందు దోషములను దివాంధములు విహరించుచుండును. ఎంతో ఆసక్తితో నే నాశ్రయించిన గుణతంతువుల నీ యాశా మూషకము ఛేదించుచున్నది. మోహవశమున నీ జాలమున జిక్కుకొన్న విహంగమునైన నేను ఆత్మసంబంధమైన పదవి నందుకొనుటకు సమర్థమగు బుద్ధి కలవాడనుగాను. తండ్రీ! ఈ యగ్నికి యాహుతినైతిని. అమృతవర్షమునసైత మీ దాహోపశమనము కాదని తలంచుచున్నాను.

ఆశ కృష్ణపక్ష గాఢాంధకారము. ధీరునిగూడ భయభ్రాంతు జేయును. చక్షుష్మంతుని యంధుని జేయును. శాంతచిత్తుని బాధించును. మనస్సును వశ్యమొనరించుకొనలేకపోయినను, వృద్ధ వేశ్య పగిది వాని ననుగమించును. అందువలన నేమియు ప్రయోజనము లేదు. శక్తిసామర్థ్యములు అడుగంటినను వృద్ధనర్తకివలె తాండవ మభినయించును. నిరానందముగ నృత్యము జేయును. అగమ్యమున పాదమూనును. సంతృప్తి నందియు మరల ఫల మాశించును. స్థిరముగ నొకచోటనుండదు. ఇది చపల మర్కటము వంటిది. ఈ క్షణమున పాతాళమునను, మరుక్షణమున నంబరతలమున, నింకొక క్షణమున దిగంతములయందు సంచరించును.

ఆశ సకలసాంసారిక దోషములలో మిగుల దుఃఖ ప్రదమైనది. హృదయ మను పద్మములోని భ్రమరము వంటిది.

సకల సాంసారిక దోషములలో మిక్కిలి దుఃఖప్రదమైనది. అంతఃపురములం దుండువారినైనను అతి సంకటములలో గూల్చును. ఈ లోకమంతయు దుఃఖమయము. చింత విడిచినచో నిదియు విడచును. విషయ చింతా పరిత్యాగమే 'ఆశ' యను విషూచికా రోగమునకు మంత్రమని జెప్పబడుచున్నది. 'రోగబాధ, కాంత, ఆశ' అనునవి గంభీరుడైన మానవునైనను, సూర్యకిరణములు పద్మమునువలె వెంటనే వడలునట్లు చేయును. హృదయ మందున్న ఆశ అనునది మిక్కిలి తీక్ష్ణమైనది. కత్తి పదును, వజ్రాగ్ని, కాల్చిన ఇనుప మంటలు కూడ అంత తీక్ష్ణణమైనవి కావు మేరు సమానధీరుడైనను, పండితుడైనను, శూరుడైనను నిమిష మాత్రములో ఈ ఆశవలన తృణీకరింపబడుచున్నాడు. తడిసిన నరము లను తీగలతో గూడిన యడవి యైనదియు, మార్పుల నొందునదియు, పరితాపములుకల యీ శరీరము సంసారమునందు కేవలము దుఃఖ మనుభవించుటకే ప్రకాశించుచున్నది. స్వల్ప విషయమునకు ఆనంద మందును. స్వల్ప మాత్రమునకు దుఃఖ మనుభవించును. ఇంతటి నీచము, గుణరహితము, శోచనీయము నైన దేహమున కంటె నింకొకటి లేదు. 'అహంకార' మను గృహస్థునకు ఈ కళేబరము మహా భవనము. ఇది యున్నను, నశించినను నా కేమి ప్రయోజనము? ఈ దైహిక గృహము చాల విచిత్రమైనది. దీని ముంగిటి యందు 'ఇంద్రియము'లను పశువులు వరుసగా కట్టబడినవి. 'ఆశ' యను ఇల్లాలు లోపల వసించును. 'మనస్సు' అను సేవకుడు ఆనందము నందించు చుండును. ఈవిధమగు దేహము నా కిష్టమైనది కాదు. 'నాలుక' యను కోతి భయంకరమైన ముఖ ద్వారము నాక్రమించినది దంతములను, ఎముకల ముక్కలను ప్రదర్శించుచున్నది. ఈ సంపదతో గాని, ఈ రాజ్యముతో గాని, ఈ శరీరముతో గాని, ఈ కోరికలతో గాని ప్రయోజన మేమి? కాలము కొలదిదినములలోనే వీటి నన్నిటిని నాశనము చేయును

ఈ శరీరమునకు రమ్యత ఎట్టిది? బాహ్యాభ్యంతరములందు రక్త మాంసములతో గూడి నాశమే ధర్మముగాగలది కదా! వార్ధక్యమున ముసలితనము ననుభవించును. మరణ సమయమున మృతిని అనుభవించును. ధనికుడనిగాని, దరిద్రుడని గాని ప్రత్యేకత నెరుగనిది ఈ శరీరము. మెరుపులయందు, శరత్కాల మేఘము లందు, ఐంద్రజాలిక నగరములందు స్థిరముగా నుండు నను విశ్వాసము కలవాడు మాత్రమే శరీర విషయమున విశ్వాసము కలిగి యుండును.

## బాల్య దూషణము

చంచలమైన ఆకారము. కార్యభార తరంగములు కల సంసారమను సముద్రమున జన్మించిన వానికి బాల్యము దుఃఖము నకే కదా! ఈ బాల్యము నందు 'అసమర్థత, ఆపదలు, ఆశ, మూగతనము, మూఢబుద్ధి, లోభము, చాంచల్యము, దైన్యము' అను లక్షణము లన్నియు ప్రతిష్ఠింపబడినవి. సహజముగా మనస్సు చంచలమైనది. బాల్యమంతకంటెను చంచలమైనది. ఓ తండ్రీ! ఈ రెండును కూడి యుండగా ఈ చెడు చాపలమునకు అంత మెక్కడ! స్త్రీల నేత్రములు, మెరపుల గుంపు, మంటల మాలలు, తరంగముల నుండి శైశవముచే ఆవరింపబడినవాని మనస్సు నుండి చాపలము, చంచలత నేర్చుకొన్నది. స్వల్పమాత్రముతో వశ్యు డగును. స్వల్పముతోనే వికారము చెందును. కుక్కవలె బాలుడు అమేధ్యమందే క్రీడించును. మూర్ఖత్వమున బాలుడు సంతుష్టుడై భువనమునే భుజింప గోరును. ఆకాశము నుండి చంద్రుని తీసుకొని రాదలచును. అది సుఖమున కెట్లగును! బాల్యమున గురువుల వలన భయము; తల్లిదండ్రుల వలన భయము; జనము వలన, తన కన్న పెద్ద బాలుర వలన భయము—ఈవిధముగా బాల్యము భయ నిలయము. మునీంద్రా! సకలవిధ దోషములచే దూషితమై

అవివేక విలాసమందిరమైన ఈ బాల్యము ఏ ఒక్కనికి ఆనంద ప్రదము కాదు.

## యౌవన దూషణము

అనంతరము అభిహతాశయుడగు పురుషుడు బాల్యావస్థను విడచి వెంటనే పతన మగుటకు 'యౌవనము' అను వయోవస్థను పొందుచున్నాడు ఈ అవస్థ యందు తన 'మనస్సు' అను బిలము నందున్న అనేకవిధము లయిన భ్రాంతులను కలుగ జేసెడి 'కామము' అను పిశాచముచే బలవంతముగా వశము చేసుకొనబడి అవమానము పొలగుచున్నాడు. మనస్సు ఎంత విశాలమైన దైనను; సుప్రసన్నము, పవిత్రము నైనదైనను యౌవనమందు వర్షాకాల మందలి నదివలె కలుషిత మగును. 'శరీర' మను మరు ప్రదేశమున తాపము వలన ప్రభవించిన 'యౌవన' మను ఎండమావిని 'మనస్సు' లను మృగములు అనుసరించి పరుగు లిడుచు, 'విషయ సుఖము'లను గోతులలో కూలుచున్నవి. ఈ యౌవన మభివృద్ధి యయిన కొలది కామకులు కామజ్వర పీడితులై కేవలము నాశము కొరకు పరుగు లిడుచున్నారు. ఈ మహాసంకటము నుండి ఎవరు సుఖముగా తరి తురో వారు వంద్యులు, మహాత్ములు. ఈ భూమి యందు వారే పురుషులు. వినయముచే అలంకరింపబడినదియు, సజ్జనులకు నిలయమైనదియు, కరుణతో ఉజ్జ్వలమైనదియు, సద్గుణములతో గూడినదియు నగు శుభప్రదమైన యౌవనము ఆకాశమునందలి యరణ్యమువలె లోకమున దుర్లభము కదా!

## స్త్రీ దూషణము

స్త్రీలు మాంసపు బొమ్మలు. చల యంత్రమునందు వలె శరీర పంజరము కదలుచుండును. వారు నరములు, ఎముకల గ్రంథులు కలవారు. ఏమి శోభ కలవారు? వారి శోభ నేమని వర్ణింతును? చర్మము, రక్తము, మాంసము, నీరు లేని నేత్రము

లను పరిశీలింపుము. వారి యందమేమియో తెలియును. వ్యర్థముగా మోహామగ్ను లయ్యెదరేల? మేరునగశిఖరతటమున ప్రకాశించు గంగాజల ప్రవాహము ననుకరించు ముత్యాలహార పరిభాసిత స్తన మండలశోభ, కాలాంతరమున దిగంత శ్మశానములందు శ్వాన సమూహామువే పలాల కబళము రీతిగ భక్షింపబడుచున్నది. కేశ, కజ్జల ధారిణులై, అస్పృశ్యలై, నేత్రపర్వలైన మదవతులు పాపాగ్ని జ్వాలాసదృశలు. పురుషులను, తృణములను భస్మీపటలము జేయుచున్నారు. దూరమందున్నను సరసలుగా భాసించు నీరసలగు తరుణీలలామ లను నరకాగ్నులకు పురుషపుంగవులు సుందరములగు సమిధ లగుచున్నారు. కామకిరాతుడు మూఢబుద్ధులగు నర విహంగ ములను చేజిక్కించుకొనుటకు పన్నిన మాయాజాలములవంటి వార లీ లలనామణులు.

'జనన' మను కొలనిలోని చేపలుగ మనఃపంకమున సంచరించు పురుషులకు, తరుణీరత్నములు 'దుర్వాసన' యను త్రాడుగల గాలమునకు సంధించిన ఎరవంటివారు. సకలవిధ దోష సముదాయమునకు నిలయములు. దుఃఖ శృంఖలలు నగు నీ వనితల మూలమున ప్రయోజనమేమి? ఇటు మాంసము; నటు రక్తము, ఎముకలు గల యా రూపములు అనతికాలముననే వినాశ మగును. కాంత కలవానికి భోగేచ్ఛ యుండును. కాంతా విహీనునకు భోగానుభవ మెక్కడిది? స్త్రీని విడచిన జగత్తును వీడి నట్లగును. జగత్తును వీడిన సుఖవంతు డగును ఆపాతమాత్ర మధురములై, దుస్తరములగు భోగములు భ్రమర పక్షములవలె చంచలములు. కాన, వాటియందు నాసక్తి లేదు. మరణ, రోగ, జరాది భయ విరహితుడనై పరమ పదము నాశించు చున్నాను.

## జరా దూషణము

బాల్యావస్థ సంపూర్తి కాకుండగనే బలవంతముగ యౌవనము మానవుని పీల్చి పిప్పి చేయుచున్నది. ఈ

యౌవనమును వార్ధక్యము బాధించుచున్నది. వ్యర్థముగ నొక దానిపై నింకొకదానికి గల విద్వేషమును పరికింపుడు.

నిరాయాసముగ బాధించుటకు వార్ధక్యము జనుల నావహించును. అపుడు సవతిచే పరాభూతయైన పతివ్రత రీతి బుద్ధి తొలగిపోవును. కంపితగాత్రుడగు నా వృద్ధుని గాంచి పరిజనులు, పుత్రులు, కళత్రము, బంధువులు, మిత్రులు నందరు పిచ్చివానిగ భావించి పరిహాసింతురు. దర్శనార్హుడు గాక దీనుడై, గుణపరాక్రమ హీనుడై యున్న ఈతనిని ముదిచెట్టు నాశ్రయించిన గ్రద్ద చందమున అత్యాశ ఆశ్రయించును. దీనత్వదోష భూయిష్ఠము, అతిదీర్ఘము, హృదయదాహప్రదము, సకలాపదలకు సహచరి యగు ధనాశ ఈ వార్ధక్యమున నధిక మగును.

పరమున దారుణ కష్టము ననుభవింప వలయును. ఇపుడు నేనేమి చేయుదును అను ప్రతీకార శూన్యమగు భయ మీ వార్ధక్యమున వృద్ధి చెందును. ఆశ జనించునేగాని యానందముగా ననుభవించుటకు శక్తి యుండదు. నిశ్చయముగా నీ శక్తిహీనత హృదయమును దహించివేయు చుండును.

వార్ధక్యమున తల పండి కూష్మాండము రీతి భాసిలుచున్నది. అపుడు పురుషార్థి దేవతయగు కాలుడు మ్రింగుచున్నాడు. మునీంద్రా ! మరణము అను రాజు అరుదెంచుచుండ వెల్ల వింజామరలు ధరించి శారీరక, మానసిక వ్యాధులు పతాకలుగా నీ వార్ధక్యము స్వాగతము పలుకుచున్నది. ఇది వెల్లవేయబడిన యంతఃపురము వంటిది. ఇందు 'అశక్తి, ఆర్తి, ఆపద' యను ముగ్గురు స్త్రీలు ప్రశాంత సౌఖ్యములతో వసించుచున్నారు. దురభిమానము కల ఇట్టి నికృష్ట జీవితమువలన ప్రయోజనమేమి ?

వార్ధక్యము అజేయము. ఈషణములను తిరస్కరింపక, సంసారసుఖ సంబంధమైన భావన కలిగిన మాత్రమున కాలమూషకము

దానిని నరకి వేయు చున్నది. కాలముచే మ్రింగబడని వస్తు వీ జగత్తు లో నేదియు లేదు. బడబాగ్ని సాగరజలము నింకించుట లేదా! అట్లే కాలము విశ్వమును కబళించుచున్నది. అది విశ్వాత్మ. ఎంతటి యధికు లైనను కాలము దీరినంత నొక్క క్షణమైన నిలువ నీయదు. సురూపు లైనను, కురూపులైనను సదాచారు లైనను, దురాచారు లై నను, గౌరవనీయు లైనను, అగౌరవనీయులైనను దాని దృష్టిలో సమానులు. పన్నగములను గరుత్మంతుడు హరించునట్లు అది అందరను హరించును. తృణ పరాగములను గాని; పర్ణ, అర్ణవములను గాని; మహేంద్ర మహా మేరువులను గాని దేనినైనను తన గర్భములో దాచుకొనును. తనవిగా జేసుకొనును.

ఈ కాలమహిమ నెరుగుదురా! 'జీవు'లను దోమల సంగీత ధ్వనులు కలిగి, పతనమగుచున్న 'బ్రహ్మాండ' మను మేడిపండ్ల సముదాయమునకు మహావృక్షము వంటిది. అనిమేషుడై యస్తమించుట యెరుగని సూర్యనయనముతో పవలు జూచి, జగత్తను జీర్ణ వనము నుండి కాలుడు 'లోకపాలకు' లను ఫలములను భక్షించుచున్నాడు. జగజ్జీర్ణ కుటీరములోని గుణవంతులను, అనర్ఘమణులను భయంకర బిలాంచిత మృత్యుపేటికాంతరమున గుప్తపరచుచున్నాడు. జీవులను రత్నమాల 'గుణము'లను దారములతో గ్రుచ్చబడచున్నది. అలంకారార్థమై దానిని ధరించి వెనువెంటనే దానిని ఛేదించుచున్నాడు. ఈ జగ మొక మహారణ్యము. ఇందు మూఢబుద్ధు లగు జీవులు అను మృగసంతతి చెదరిపోయి దీనముగా సంచరించుచున్నది. కాలపురుషుడా సంతతిని నిష్కారణముగా వేటాడుచున్నాడు.

కల్పాంతము కాలపుష్కరుని క్రీడా పుష్కరిణి. ఈ మనోహర పుష్కరిణి యందు రమణీయ కమలము భాతి బడబానలము భాసించు చున్నది. భిన్న భిన్న రుచులుగల భూతగణము వ్యంజన సముదాయముగా; క్షీర, దధ్యాది సాగర విరాజిత జగము శీతోదనముగా కాలపురుషు డారగించుచున్నాడు. సమస్త భగినీగణ పరీతమై

చండిక చతుర సంచారము సల్పుచు, భూత సముదాయమును హరించుచు నీ సంసారారణ్యమున మహావ్యాఘ్రి పగది విహరించుచున్నది.

కమల కువలయాది పుష్ప పరిమళ సురభితమైన భూమి కాలపురుషుని రసాన్విత పాన పాత్ర. దీనిని హస్తమునందు ధరించి వికటాట్టహాసము గావించుచు, బాహువు లప్పళించుచు, వికృతముగా జూలు బలసిన మనోహర నరసింహమును, తన బాహు పంజరమున క్రీడా శకుంతముగ కాలపురుష రాజకుమారుడు వినోదించుచున్నాడు. అలాబువీణాసదృశ మధుర కంఠుడై, శరత్కాల వినీలాకాశసన్నిభ నిర్మలకాంతి శోభితుడగు రుద్ర భృత్యుడు మహాకాలదేవు డీతని లీలా కోకిల యట. ఇతడు నిత్యప్రభాభాసుర స్వరూపుడు. దుఃఖోద్వమన బాణసముదాయ సమన్వితుడు. 'అభావ' మను ఆసన ధనుస్సు నల్లడల కాంతు లీనుచున్నది.

ఇతడు కాళరాత్రి స్వరూపుడై ప్రళయతాండవము జేయుచున్నాడు. దేవలోక సముదాయ మితనికి ప్రత్యంగ భూషాగణము. దుష్కృత సూత్ర బద్ధ రౌరవాది నరకములు, మంజీరతతులు పాతాళ పాదాలంకృతములై కలకలారావము లాలపించుచున్నవి. హిమగిరి యొక కర్ణాభూషము కాగా, మహా మేరువు మరియొక సువర్ణమణి కర్ణిక. సూర్యచంద్రులు గండ భాగములందు జలించు కుండలములు. లోకాలోకపర్వతమాల కటిసూత్రము. కుమారదేవుని నిర్జీవ వాహనములు పృష్ఠభాగ సంబద్ధములై యున్నవి. నేత్రత్రయ బృహద్రంధ్రి భూరి ఝూంకారధ్వనులతో, లంబలోల జటాచంద్రి వికీర్ణహార మూర్ధములతో, ఉచ్చరచ్చారు మందార గౌరీ కబర చామరములతో, ఉత్తాండవ అచలాకార భైరవోదరతుంబికలతో, రణచ్చుత రంధ్రేంద్రి దేహాభిజా కపాలములతో, శుష్క శారీర ఖట్వాంగ భంగములతో పూరితాంబరమై, సర్వసంహారకారిణిగా నా కాళరాత్రి ప్రపంచము నంతను భయపెట్టు చున్నది.

ప్రళయనాట్య సమయమున విశ్వరూపుని శిరస్సము దాయము సుందర కమల మాలికలతో ప్రకాశించు చుండును మహాముని! కాలాదుల స్వరూప స్వభావాదు లిట్లుండ మాబోటి వారలకు సంసారమునం దాసక్తి ఏమి యుండును ?

ఇంద్రియములు శత్రువులు. సత్యస్వరూపమగు ఆత్మ అసత్య మగు చున్నది. మనస్సు మానసిక శత్రువై తనను తానే కొట్టు కొను చున్నది. వస్తువు వస్తు శూన్యముగ దోచుచున్నది. చిత్త మహంకారమున కర్పితమైనది. భావము అభావము లగుచున్నవి. ఆత్మపదార్థము లభించుటలేదు. సాధు హృదయములు వ్యాకులత జెంది తపించుచున్నవి. రాగ రోగము పరివృద్ధ మగుచున్నది. విరాగ జనము క్షీణించుచున్నది. యౌవనము తరిగిపోవు చున్నది. సజ్జన సాంగత్యము దూర మగుచున్నది. ఈ స్థితిలో నేమియు తోచుటలేదు. సత్యస్వరూపజ్ఞాన ముదయించుటలేదు. మనస్సు మోహాతిష్ట మగుచున్నది. సంతోషము నశించు చున్నది. ఉజ్జ్వల కరుణ జనించుటలేదు. సుదూరము నుండి నీచత్వము దరికి జేరుచున్నది. ధీరత్వ మధీరత్వ మందుచున్నది. ఉత్పాతపరుడై జనుడు పతన మగుచున్నాడు. దుర్జన సాంగత్యము సులభము, సజ్జన సాంగత్యము దుర్లభము నగు చున్నది. భావములు వచ్చుచు, పోవుచు నుండును. ఇవి సంసారబంధ హేతువులు. నిరంతరము భూత పరంపర ఎచటికో గొనిపోబడు చున్నది. దానవులు వధింప బడుచున్నారు. ధ్రువుడు అధ్రువ జీవనుడు. అమరులు సైతము మృతు లగుచున్నారు. ఇక నాబోటివాని జీవితమునకు నమ్మక మేమి ?

దిక్కులు కనుపింపవు. దేశము రూపరును. పర్వతములు శీర్ణము లగును. స్వర్గము నామరూప రహితమై నశించును, భువనములు భుజింపబడును. భూమి నశించును. జలనిధు లింకును. తారకలు రాలిపోవును. సిద్ధులు క్షీణింతురు. పరమేశ్వరుడు

వినాశితు డగును. వారి హరించును. భవుడు అభావము నొందును. కాలము లయ మగును. పరవస్తువుచే నియతియు గ్రసింపబడును. అనంతాకాశము నంత మగును. ఇక నావంటివాని జీవితమునకు నమ్మక మేమి ?

అవాఙ్మానసగోచరమైన జ్ఞానమూర్తి, ఏదియో నొక విధమగు భ్రమ జనింపజేసి, భువనముల నన్నిటిని మోసగించుచున్నాడు. ఈనాడు ఇది మహోత్సవము. ఇది ఋతువు. ఇది ఇహలోకయాత్ర. 'వారు బంధువులు, ఇది సుఖము, అది విశేష భోగము' అని ఈవిధములగు సద్వికల్ప సముదాయమును వ్యర్థముగా కల్పించుచు, చంచలు లగు నల్పబుద్ధుల నాందోళన పరచుటవలన వారు నశించుచున్నారు. పవ లంతయు నిటు నటు విహరించి, సాయంతన మైనంతనే గృహమున ప్రవేశించి సజ్జన సాంగత్యము వలన లభించు సచ్చరిత్ర లేనివానికి రాత్రి సమయమున సుఖనిద్ర యెట్లు వచ్చును ?

తండ్రీ! భార్యాపుత్రులు, ధనము నమృతోపమానములని బుద్ధిపూర్వకముగ కల్పింపబడుచున్నవి. కడ కవి యమృతోపమానములు గావని, విషమూర్ఛనచే నట్లు భాసించిన వనియు తెలియును. శత్రు సముదాయమును పారద్రోలగా సంపదలు లభించును. ఆ సంపదల వలన సౌఖ్యము లనుభవించు నంతలో నెచ్చటినుండియో మహోగ్ర రూపమున మృత్యువు దాపురించును.

అక్కడక్కడినుండి వచ్చి యొకచోట చేరినవారి విధముగా సమాన సంకేతములు కల ప్రజలు, యాత్రా సమయములందు కలుసుకొనినవారి విధముగా మిత్ర కళత్ర రూపమున వ్యవహార మాయా సమువేతులై శాశ్వతముగా కలసి యుండరు. కల్పసముదాయ సంఖ్యాగణనమున బ్రహ్మలు సైతము, నాకల్పము అనబడు క్షణకాల జీవను లేకదా ! కాన, 'నిమేషము' లను పూలమాల యగు కాలజాలమున 'నల్పము, నధికము' అను బుద్ధి యబద్ధము. జనుడు కామా

సక్తుడై కుత్సితకళలయందు, కార్యములందు వర్తించుచున్నాడు. ఈ జగత్తున స్వప్నమునందుగూడ సజ్జనుడు లభింపడు.

క్రియ లన్నియు దుఃఖహేతువులు. ఈ సమస్తము నిశ్చయముగా నసత్యము. ఈ జీవిత దశ నేవిధముగా గడుపవలయునో తెలియకున్నది. ఆ దినములు, ఆ మహాత్ములు, ఆ సంపదలు, ఆ క్రియలు గూడ నట్టివే యగును. ఆ విషయ మంతయు స్మృతి పథమునకు వచ్చినవి. మేము పరతత్త్వమును వాంఛించుచున్నాము. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈ సమస్తభూత సంతతి, జలము, బాడబమును వలె వినాశము వైపునకే పరుగు లిడుచున్నారు. ఒక్క క్షణమున ఆపదలు అలముకొని దుఃఖవివశుని జేయును. మరుక్షణమున సంపదలు సంభవించి సంతోషాంతరంగు నొనరించును. వేరొక క్షణమున జననము, నింకొక క్షణమున మరణము కలుగును. మహాముని! ఇక శాశ్వతముగా నుండునదేది?

బలవంతుడు బలహీనుని వధించును. ఒక్కడు అనేకమందిని హతమార్చును. సామాన్యుడు ప్రభు వగును. ప్రభువు సామాన్యుడగును. జగమంతయు మార్పులతో నిండి యున్నది. ఈ స్థితిని దలచుకొన్న నా హృదయమందు దోష దావాగ్ని ప్రజ్వరిల్లి, సరోవరమున మృగమరీచికవలె భోగములు ప్రకాశించుటలేదు. మరణమును దూషింపను. జీవితమును నిందింపను. విచారమును పరిత్యజించి యథాస్థితిగనే యుందును.

మునివరా! స్వచ్ఛబుద్ధితో చికిత్సచేయక, అనంతరము చిత్తచికిత్స చేయుటవలన ప్రయోజనమేమి? యథార్థమునకు విషము ప్రమాదకరము కాదు. విషయ వైషమ్యమే ప్రమాదకరము. విష మొక్కనినే హరించును. ఇది జన్మజన్మాంతరములను హరించును. 'సుఖములు, దుఃఖములు, మిత్రులు, బాంధవులు, జీవితము, మరణము' అనునవి జ్ఞానవంతుని చిత్తమునకు బంధహేతువులు కావు. వాయుహతమైన మేఘమున చలించు జలబిందువు వంటిది ఈ యాయువు.

భోగములు మేఘమధ్యమందలి మెరపుల వంటివి. యౌవనమును లాలించుట ప్రవాహవేగమువలె చంచలమైనది అని ఈ యద్భుతము నాలోచించి, చిరకాల ప్రశాంతికై నా చిత్తమందు దృఢసంకల్పము జేసికొంటిని.

జీవేశ్వరాయత్తమగు బుద్ధి ప్రియుని గేహమం దుండు ప్రియురాలి విధమున స్వాస్థ్యము ననుభవింపక, స్వేచ్ఛను పొందక యున్నది. కాన నీచముకాని, ఆయాసములేని, ఉపాధిగతమగు భ్రమ కలుగని, సందేహ రహితమైన, పరమ పవిత్రమైన స్థితిని ప్రబోధింపుడు.

ధీరోత్తమా! విషయవాసనాకలితుడగువాడు సంసారాగ్నిలో బడియు, నగ్నిలో బడిన పాదరసమువలె దహింపబడ కుండెడి యుపాయము నెరిగింపుడు. లౌకిక కార్యకలాప విరహితుడై యుండిన యట్లు ఉండమందురేని, జలధియందు జలము లేకుండ నుండుట వంటిదికదా! అది యెట్లు పొసగును?

భగవన్! మోహ నివృత్తికై తా మెరిగిన విధమున, సజ్జను లే యుపాయమున దుఃఖరాహిత్యము నందిరో తెలుపుడు, లేదా అట్టి యుపాయము లేకపోయినను, ఉన్నచో నా కెవ్వరు నుపదేశింపకున్నను, స్వయముగ నేను పొందలేకపోయినను అపుడు సర్వసందేహములను, విడచి, అహంకార పరిత్యాగ మొనరించి, అన్నమును భుజింపను. జలము గ్రోలను. వస్త్రధారణము జేయను. స్నాన దానాది వ్యాపారముల నాచరింపను. సంపదలందు, ఆపద లందు, నే కార్యములందు సంబంధములేనివాడనై యుందును. ఇక దేహ పరిత్యాగము దప్ప నింక దేనినీ యభిలషింపను. మమతా మాత్సర్యములను త్యజించి నిస్సంశయముగా చిత్రార్పితుని విధమున మౌనముద్రావలంబుడనై యుందును" అని పూర్ణచంద్రునివలె మనోహరుడైన శ్రీరామచంద్రుడు, మహాత్మ్ర

వివేక వికసిత హృదయకమలుడై మేఘ సందర్శనమున క్రేంకార ధ్వనులు చేసి చేసి బడలిక జెందిన మయూరము విధమున భాషించి యూరకుండెనని వాల్మీకిమహర్షి శిష్యుడగు భరద్వాజున కెరిగించెను.

## మోహ నివృత్తి

అనంతరము వాల్మీకి మహర్షి భరద్వాజున కీవిధముగ వివరించెను :

"రాజీవపత్రాక్షుడగు శ్రీరామచంద్రుడు మహామోహ నివృత్తికరములగు వాక్యములు పలుకగా, నా సభ యందున్న వారందరు హర్ష పులకితగాత్రులైరి. శ్రీరాముడు మౌనము వహించి నంతనే సాధు వాదములతో సిద్ధసంఘ మాకసము నుండి పుష్పవృష్టి గురిపించినది. ఒక్క క్షణములో నా వృష్టి వెలసినది.

అనంతరము కల్పాది నుండి మేమీ సంఘములో సంచరించు చుంటిమి. కాని, ఈవిధములగు కర్ణరసాయనములగు పల్కులు వినియుండ లేదు. ఇవి యపూర్వములు. అమృతోపమానములగు వాక్కులతో నాదర పూర్వకముగ శ్రీరాముడు తన యుపశాంతికై మోక్షమార్గము నభివర్ణించినాడు. మా కిది బ్రహ్మానందము కలిగించినది. మాకు జ్ఞాన బోధమైనది" అని సిద్ధులు ప్రశంసించిరి. అనగా భరద్వాజు డిట్లు ప్రశ్నించెను :

"మహాత్మా! ఈవిధముగా విశ్వామిత్ర మహర్షికి శ్రీరామ చంద్రుడు వివరింప, నా సభయందున్న పండితులు తమ నిశ్చితాభిప్రాయముల నెరిగించిన విధము దెలిసికొన నుత్సహించుచున్నాను" అని అనగా వాల్మీకి ఇట్లు తెలియ జెప్పెను :

"భూలోకమున జరుగుచున్న జ్ఞాన విషయ చర్చలను విన నింకను గుతూహలము కలవారలై, ఆకసమందున్న సిద్ధ, సాధ్య, దేవర్షిగణము దశరథమహారాజ సభలో ప్రవేశించిరి. వారిని జూచి సభ యంతయు గౌరవ పురస్సరముగ లేచి నిలబడినది. విశ్వామిత్ర,

వశిష్ఠ మహర్షులు ఆ గణము నభ్యర్చించిరి. వారును నీ ఋషిద్వయ మును గౌరవించిరి. స్వాగత, కుశల సంభాషణలచే దశరథమహారాజు వారి నర్చించెను. సాష్టాంగదండప్రమాణము లాచరించి పూజ్య భావమున వినమ్రుడై ఎదుట నిలచియున్న శ్రీరామచంద్రుని వారు ఆదరపురస్సరముగా వాక్పుష్పములచే నభినందించిరి. 'ఆహా! ఈ బాలుడు వైరాగ్యరస గర్భితములగు సదుపదేశముల నందించినాడు. అవి కల్యాణగుణావహములు. ఎంత ఆశ్చర్య కరము! బ్రాహ్మణోత్తములారా! భయంకర దుస్స్వభావ సంభ రితమైన, దైవసంకల్ప సంజనితమైన ఈ నిరర్థక సంసారమున సార మత్యంత దుర్లభము అని శ్రీరామచంద్రుని యభిమతము. ఇది సత్యము. సకలలోకచమత్కారకారణ మీశ్లోకము. శ్రీరామునికి అభీష్టసిద్ధి కాకున్న, మునివృత్తి నవలంబించి మనుచున్న మేము హతబుద్ధుల మనుట నిశ్చయము' అని కొందరు మహామహితాత్ములు వచించిరి.

అంతలో వారి మాటల నాలించిన విశ్వామిత్రుడు అను రాగసంభరితాంతరంగుడై ఎదుటనున్న శ్రీరామచంద్రుని జూచి యిట్లనెను: 'జ్ఞానవరిష్ఠా! రామచంద్రా! నీ కిక దెలిసికొనదగిన విషయము లేవియు లేవు. సూక్ష్మబుద్ధితో నీవు సమస్తము నెరిగి తివి. నీ బుద్ధివిశేషము జూడ జ్ఞాన వైరాగ్య సంపన్నుడగు వ్యాస పుత్రుడు శ్రీశుకుని బుద్ధిని దలపించుచున్నది. నీవెరింగిన విషయ పరిజ్ఞానమునకు విశ్రాంతిమాత్ర మవసరమని భావించుచున్నాను' అన, 'మునీంద్రా! వ్యాసభగవానుని పుత్రుడు మొదట నేల ప్రశాంతి నందలేదు? తరువాత నెట్లు ప్రశాంతచిత్తు డయ్యెను? వివరింపుడు' అని ప్రార్థించెను. అపుడు విశ్వామిత్రు డీవిధముగ వివరించెను.

"శ్రీరామా! పరమాత్ముని చరిత్రతో సమానమై, జన్మ రాహిత్యమును గలుగజేయు వ్యాసాత్మజుని కథను జెప్పుచున్నాను.

సావధాన చిత్తుడవై యాలింపుము. శ్రీశుకునకు ఇహలోకయాత్రను గూర్చి ఆలోచించుచుండ నీకువలె వివేకోదయ మయ్యెను. మతిమంతుడయ్యు, తనకు జనించిన వివేకముతో చాల కాలము మననము జేసి, కడకు సత్య పదార్థమును పొందెను. అయినను తాను స్వయముగా పొందిన పరమాత్మ పరిజ్ఞానమునందు మానసిక సంతృప్తి జనింపలేదు. 'ఇది పరమాత్మ' అను విషయమున ఆత్మవిశ్వాసము పొందజాలక పోయెను. నిశ్చలమైన శ్రీశుకుని చిత్తము జలధారా సంతృప్త చాతకము విధమున అత్యంత భంగకరములైన భోగముల వలన సంతృప్తిజెంది ఆత్మ ప్రయిత్న మును విరమించెను.

జితేంద్రియుడగు నా శుకు డొకనాడు మేరుపర్వతమున నేకాంతముగ నున్న తన పితృపాదుని దర్శించి భక్తిపూర్వకముగ వందన మాచరించి, ఇట్లర్థించెను :

" మహామునీ ! ఈ సంసారాడంబరమె ట్లుద్భవించినది ? ఇది యెట్లు లయించుచున్నది ? దీని పరిమాణమెంత ? ఎవని వలన ఎప్పు డుద్భవించినది? తెలియజేయ వేడుచున్నాను. "

తన కుమారుని మాటలను వినిన కృష్ణద్వైపాయనుడు వచింపదగిన ఆత్మతత్త్వ విషయముల నన్నిటిని ఆమూలాగ్రముగ వివరించెను. అప్పుడా శుకుడు, 'ఈ విషయముల నన్నిటిని నే నింతకు పూర్వమే తెలుసుకొని యుంటిని' అని శుభప్రదమైన తన బుద్ధివిశేషము వలన తండ్రి బోధించిన విషయముల నధికముగా భావింపలేదు. త్రికాలజ్ఞాన సంపన్నుడగు వ్యాసభగవానుడు ఆత్మజుని ఆత్మగతాభిప్రాయము నవగతము జేసుకొనినవాడై వెంటనే కుమారునితో, 'వత్సా! తత్త్వమును గూర్చి నే నంతగా పరిజ్ఞానము కలవాడను గాను. జనకుడు అను విదేహ మహీపాలుడు కలడు. ఆయన గొప్ప తత్త్వజ్ఞాన సంపన్నుడు. ఆయన కడ కేగి

అర్థించిన సర్వవిషయములను మృదుమధురముగా ప్రబోధింప గలడు' అని చెప్పెను.

తన తండ్రి యాజ్ఞానుసారము శ్రీశుకుడు మేరుపర్వతము నుండి ధరాతలమునకు దిగివచ్చి జనకమహారాజు పాలించు మిథిలా నగరమున కరిగెను.

"మహారాజా! కృష్ణద్వైపాయనాత్మజుడగు శ్రీశుకుడు ద్వారముకడ వేచి యున్నాడు" అని ద్వారపాలకులు మిథిలాధీశున కెరిగించిరి. ఆయన శుకుని పరీక్షింప దలచి, "అట్లే యుండును గాక!" అని యవమాన పూర్వకముగ పలికి ఏడు దినములవర కూరకుండెను. తరువాత శ్రీశుకుని ప్రాంగణమందు ప్రవేశ పెట్టించెను. అక్కడ నొక సప్త దినములు జ్ఞానాతురుడై యుండెను. పిదప నంతః పుర ప్రవేశము జేయించి మరియొక ఏడు దినముల వరకు మహారాజు దర్శన మీయలేదు. ఆ యంతఃపురమున నవయౌవన విలాసవతులగు యువతులు భోజన, భోగ, భాజనములతో లాలించిరి. కాని ఆ భోగములుగాని దుఃఖములుగాని మందమారుతము మహాపర్వతమును వలె వ్యాసపుత్రుని కించిత్తైన కదలింపలేక పోయెను. నిర్మల మనస్సుతో మౌనవ్రత మవలంబించి ముదితుడై శ్రీశుకుడు పూర్ణచంద్రునివలె స్వచ్ఛుడై యుండెను. అంత నా జనకమహారాజు పరిజ్ఞాతస్వభావుడై శ్రీశుకుని రప్పించి సంతుష్టాంతరంగుడై యున్న యాతని కభివాదన మాచరించెను. "నిశ్శేషిత జగత్కార్య! ప్రాప్తాఖిలమనోరథ! నీ యభీప్సిత మేమి?" అని స్వాగతపూర్వకముగ ప్రశ్నించెను. శుకుడు: "ఈ సంసారాడంబర మెట్లుద్భవించినది? ఇది యెట్లు లయించుచున్నది? దీని పరిమాణ మెంత? ఎవని వలన ఎప్పు డుద్భవించినది? దీని వివరణ మును నా కెరిగింప వలయును" అని యర్థించినంతనే జనకమహారాజు ఇదివరకు వ్యాసమునీంద్రుడు ప్రబోధించిన రీతిగనే వివరించెను. జనకుని పలుకుల నాలకించిన శ్రీ శుకుడు "మహారాజా! ఆత్మవివేకము

వలన పూర్వము నే నెరిగిన విషయము లనే నా తండ్రి ప్రబోధించెను. ఇపుడు తమరుగూడ నా విషయములనే వివరించుచున్నారు మీ వాక్యార్థములు శాస్త్రములందును జూడబడుచున్నవి. ఈ పనికి మాలిన సంసారము తన వికల్పమున జనించి, తన వికల్పమున లయించుటవలన సారరహిత మనుట నిశ్చయము. ఓ మహాబాహూ! నిశ్చయమైన సత్యమును ప్రబోధింపుడు. చిత్తమున భ్రమించు జగము మీమూలమున విశ్రాంతి నందుగాక!" అని అర్థించెను.

ఆ మాటలను విని జనకమహర్షి, "మహామునీ! నీవు సర్వ విషయములను స్వయముగా నవగత మొనరించుకొంటివి. ఆ విషయ ములనే తిరిగి గురువుల వలన వింటివి. ఇంతకుమించిన విషయ మింకొకటి నిశ్చయముగా లేదు. అఖండమైన చిదాత్మస్వరూపుడగు పురుషు డొకడున్నాడు. అతనికి పరమగు వస్తు వేదియు లేదు. తన సంకల్పమాత్రమున బద్ధుడును, సంకల్పరాహిత్యమున ముక్తుడు నగుచున్నాడు. పరమాత్మ సంబంధముగా తెలియదగు జ్ఞానము నంతయు స్పష్టముగా నీవు తెలుసుకొంటివి. సమస్తభోగముల పట్లను, దృశ్య ప్రపంచము యెడలను విరక్తుడవైతివి. పరిపూర్ణచిత్త శాంతుడవై నీవు ప్రాప్తవ్య మంతటిని పొందితివి. బ్రాహ్మ ణోత్తమా! ఈ దృశ్య పదార్థమునకై నీవు యత్నించుట లేదు. నీవు ముక్తసంగుడవు. కాన భ్రాంతిని వీడుము" అని జనకమహారాజుచే శుకమహర్షి ఆజ్ఞప్తుడై, నిశ్చలమగు పర మాత్మవస్తువునందు విశ్రమించెను. శోక భయ ఆయాసములను వీడి, సందేహరహితుడై సమాధి నిమగ్నుడగుటకు మేరుపర్వతాభి ముఖముగా నరిగెను. అచట నిర్వికల్ప సమాధి మగ్నుడై పదివేల సంవత్సరము లుండి చమురులేని దీపమునలె ననంతరము పరమాత్మ యందు లీనమయ్యెను.

సంకల్ప కలంక రహితుడై స్వయముగ పరమపావనమగు పవిత్ర ఆత్మపదార్థమందు, జలకణము సముద్రజలమందువలె

నా మహాత్ముడు అనాది, ఆగత మలరహితమైనదానియందు ప్రపంచవాసనా శూన్యుడై ఐక్య మందెను.

అపుడు విశ్వామిత్రుడు, "రామచంద్రా! ఆ వ్యాసభగవానుని పుత్రరత్నమగు శ్రీశుకునకు మలమాత్రాపమార్జనము చేయుట వంటిదియే నీకును గాని వేరు కాదు. సమగ్రభోగ సముదాయమునందు విరక్తి జనించుట అనునది జ్ఞేయవస్తు పరిజ్ఞానము కల మనస్సునకు విశేష లక్షణము. ఇది నిశ్చయము. భోగ భావన వలన అవస్తుజన్య సంబంధము దృఢమగును. ఆ భోగ భాగ్య వాంఛ నశించుటచే సంసారబంధము సడలి పోవును. విషయవాసనలను పరిత్యజించుటయే 'మోక్ష' మని పండితు లందురు. ఆ విషయవాసనల పట్ల నాశక్తి పెరుగుటను 'బంధ' మనిరి. భోగాశక్తుడు కానివాడు జీవన్ముక్తుడు.

"మహామునులారా! శ్రీరామచంద్రుడు సజ్జనులచే 'పరమాత్మజ్ఞానవిలసితుడవు' అని తెలుపబడినవాడై పరిశాంతిని పొందును. ఇప్పుడీతని చిత్త పరిశాంతికై జ్ఞాన వైరాగ్య సంపద్విరాజితుడగు వశిష్ఠ భగవానుడు ఉపాయము నన్వేషించునుగాక! రఘువంశమునకు సర్వదా ఈయన కులగురువుకదా! ఈయన సర్వజ్ఞుడు, సర్వసాక్షి, త్రికాలవేది.

"మహామతిమంతుడవైన వశిష్ఠమహర్షీ! తమకు స్మృతియందున్నదా! మన ముభయులము వైరభావమున నుండ, దానిని శాంతింపజేయ నెంచి, విరించి భగవానుడు మనకు శ్రేయోభిలాషియై, ముహుర్ముహు రుపదేశించిన జ్ఞానము నిపుడు నీ శిష్యుడగు శ్రీరామచంద్రున కుపదేశింపుము. విరాగముకల ఉత్తమ శిష్యున కుపదేశించినదియే సద్విజ్ఞానము. అదియే యుత్తమ శాస్త్రము. అదియే అఖండ పాండితీ విభవము. విరాగ విహీనుడైన దుష్టశిష్యున కుపదేశించిన

విజ్ఞానము కుక్కతోలుతో నిర్మించిన తిత్తిలోబోసి దాచి యుంచిన ఆవుపాలవలె నపవిత్ర మగును" అని యుక్తియుక్తముగా బలుక, వ్యాస, నారదాది మునీంద్ర బృందము పరమానందసంభరితచేతస్కమై సాధువాదములు పలికి వాని వాక్యార్థములను గౌరవించెను.

అనంతరము దశరథమహారాజునకు పార్శ్వభాగమునందే యున్న మహాతేజస్సంపన్నుడు, బ్రహ్మమానసపుత్రుడు నగు వశిష్ఠ మహర్షి బ్రహ్మ విధముననే ఇట్లనెను: "మహామునీ! నీవు ఆజ్ఞాపించిన కార్యమును నిర్విఘ్నముగ నెరవేర్తును. సమర్థుడైనను సత్పురుషుల యాజ్ఞ నతిక్రమింప నసమర్థుడే కదా! పూర్వము పితామహుడు నిషధ పర్వతమున సంసారభ్రమ నివారణార్థమై యుపదేశించిన అఖండజ్ఞానము నంత నొక్కమాఱు స్మరించుచున్నాను" అని బ్రహ్మర్షి యగు వశిష్ఠ మహర్షి అజ్ఞానము నశించి, పరమ పదవి బోధనార్థమై తగిన సాధన సామగ్రులతో గూడిన వక్తృత్వతేజమును గ్రహించి జ్ఞానప్రబోధ మొనరించెను" అని వాల్మీకి భరద్వాజున కెరిగించెను.

## ముముక్షు వ్యవహార ప్రకరణము

శ్రీ వశిష్ఠ భగవానుడు రఘువంశప్రదీపకుడగు శ్రీరామచంద్రుని జూచి ఇట్లు పలికెను :

"రఘునందనా! సంసారమున సర్వదా సర్వథా పురుషకారమును ప్రయోగించుట వలన సర్వార్థములను సముపార్జింప వచ్చును. ఈ పురుషకారము 'శాస్త్రాతిక్రమణము, శాస్త్రానుసరణము' అని రెండు విధములు. శాస్త్రానుసరణము అను పురుషకారము పరమార్థమును ప్రసాదించును. బాల్యమునుండి అభ్యసించిన శాస్త్రము సజ్జన సాంగత్యాదులతో సరితూగును. సద్గుణ సంపాదితమైన పురుష ప్రయత్నము అభిమతార్థసిద్ధిప్రద మగును. శాస్త్రాతిక్రమణము అను పురుషకారము సర్వానర్థములకు మూలము. దీనిని ప్రాజ్ఞులు నిరసింతురు" అని చెప్ప, శ్రీరామచంద్రుడు, "మునీంద్రా! ప్రాక్తన వాసనా సముదాయము నన్ను నడిపించిన విధమున నడచుచున్నాను. కృపణుడను. నే జేయగల దేమున్నది?" అని విచారము వెలిబుచ్చగా, వశిష్ఠు డీవిధమున నోదార్చెను : "రామా! కావుననే నీవు నీ యత్నమున జేయు పురుషకారము వలన శాశ్వతమగు శ్రేయస్సు నందగలవు. మరియొకదానివలన నిది లభింపదు.

## వాసనాద్వయము

వాసనలు 'శుభము' లనియు, 'అశుభము' లనియు రెండు తెరగులు. ఇవి పూర్వజన్మ సంబంధములు. ప్రతి వ్యక్తిని ఈ రెండుగాని, ఒక్కటిగాని తప్పక ఆశ్రయించి యుండును. శుభవాసన ఆశ్రయించినచో క్రమముగ శాశ్వత బ్రహ్మపదము లభించును. అశుభవాసన ఆశ్రయించినచో కష్టపరంపర ననుభవింపవలసి యుండును. కాన ప్రయత్నపూర్వకముగ అశుభవాసనను జయింప వలయును.

'వాసన' లను మహాప్రవాహము శుభాశుభ మార్గముల వెంట ప్రవహించును. పురుష ప్రయత్నముతో నా ప్రవాహమును శుభ మార్గము వైపు మరలింప వలయును. బలవంతుడా! అశుభముల నాశ్రయించిన మనస్సును బలమైన పురుషార్థముతో శుభములవైపు త్రిప్పవలెను. అశుభములనుండి మరలింపబడిన మనస్సు శుభముల వైపును, శుభములనుండి మరలింపబడిన మనస్సు అశుభముల వైపును, బాలకుని చిత్తము ఒక వస్తువును విడచి మరియొక వస్తువు నాకర్షించిన విధమున మరలుచుండును. మనస్సను బాలకుని సమభావముతోను, ఓదార్పుచేతను మెలమెల్లగా లాలించుట, బుజ్జగించుట మూలమున వెంటనే పురుష ప్రయత్నమున అశుభముల నుండి మరలింప వలయును. పూర్వజన్మ సంస్కార వశమున శుభవాసనోదయమైనచో, అరిమర్దనా! అభ్యాసము సఫలమైనట్లు భావింపుము. శుభాశుభవాసనల రెండిటిలో హెచ్చు తగ్గుల విషయ యమున సంశయము జనించినచో శుభవాసననే యభ్యసింపుము. కుమారా! శుభవాసనాభివృద్ధిలో నే దోషము లేదు.

హృదయ సంస్కారము కలుగనంతవరకు బ్రహ్మ పదార్థము నెరుగజాలవు. అంతవరకు గురువుల మూలమునను, శాస్త్ర ప్రమాణముల వలనను నిర్ణయింపబడిన ధర్మము నాచరింప వలయును. అనంతరము పరిపక్వ కషాయమువంటి జ్ఞానము సిద్ధించును. వివేకోదయమైనంత శుభవాసనను గూడ పరిత్యజింప వలయును.

అత్యంత శుభప్రదమై, ఆర్యసేవితమగు శుభవాసన నాశ్రయించి, మనోహరభావవిలసిత బుద్ధితో నిరంతరము శోకరహితమైన బ్రహ్మపదమును సాధింపుము తరువాత శుభవాసనా పరిత్యాగము చేయుము. నీలోనున్న సంసార భావనను మరల జనించని రీతిగా పరిత్యజించి ఉదార బుద్ధితో, శమ సంతోషములను సంపూర్ణముగా గ్రహించి, పూర్వాపర వాక్యార్థ విచార విషయాసక్తమైన మనస్సును సమరస మొనర్చి, ఆత్మయందు అనుసంధానము చేయవలెను.

రామచంద్రా! సర్వదుఃఖవినాశకరమైన బుద్ధి ఔదార్యు నిచ్చును. పూర్వము బ్రహ్మదేవుడు ప్రబోధించిన బ్రహ్మ జ్ఞానమును సులభముగ నవగాహన మగుటకై చెప్పుచున్నాను, వినుము" అనగా, శ్రీరామచంద్రుడు, "పూర్వము చతురానను డే కారణమున ఈ బ్రహ్మ జ్ఞానమును ప్రబోధించెను? అది తమ కెట్లు లభించినది? ఈ విషయములను నాకు వివరముగా జెప్పవలయును" అన వశిష్ఠు డిట్లు చెప్ప నారంభించెను

## బ్రహ్మజ్ఞాన ప్రబోధము

"అనంత విలాసాత్మకమైన చిదాత్మ కలదు. అది సర్వవ్యాపి. సర్వాశ్రయము. సమస్త వస్తుజాలమునందు దీపించుచుండును. అది వినాశ రహితమైనది. స్పందాస్పంద సమాకారమగు నా చిదాత్మ నుండి విష్ణు వవతరించెను. మనస్సు వికల్ప సముదాయమును కల్పించు విధమున పితామహుడు ఈ సకల ప్రకృతిని సృజించెను. ఈ భారత వర్షమున నానావిధ వ్యసన సముపేతులగు ప్రజలు దుఃఖములలో మునుగుచుండిరి. వారి దురవస్థ జూచి, పుత్ర దుఃఖము లను జూచి దురపిల్లు తండ్రి విధమున ప్రజాపతి దయాంతరంగుడై ఇట్లు లాలోచించెను: 'అల్పాయుష్కులు, హతాశులు నగు వీరికి దుఃఖ విమోచన మెట్లగును తపోదాన జప తీర్థ యాత్రాదులు వీరి దుఃఖముల నంతము జేయ జాలవు. కావున, వీరి దుఃఖోపశమనము నకై బ్రహ్మజ్ఞానము ప్రబోధింతును గాక!' అని యొకక్షణము కమలాసనస్థుడై ఏకాగ్రచిత్తమున నాలోచించి, తన మన స్సంకల్పంతో నన్ను, వశిష్ఠుని సృష్టించెను. కరమున కమండలము, నక్షమాల ధరించి పద్మాసనాసీనుడైన చతురాననునకు, కర కమండలుడనైన నేను అభివాదన మొనరించితిని. మహానుభావుడగు నా భగవానుడు, 'వత్సా! రమ్ము' అని చేర జీరి పద్మాసనమున నుత్తర దళమున నాసీను జేసి ఇట్లు ప్రబోధించెను:

'కుమారా! వానరమువలె చంచలమైన నీ మనస్సు మాలిన్యమును పొందిన దర్పణము విధమున అజ్ఞాన భూయిష్ఠమగు గాక!' అని శపించెను. వెంటనే అప్పటికి నాకుగల జ్ఞానమంతయు నశించినది. దీనుడనై, దుఃఖ శోకాదులచే సంతప్తమానుడగు సామాన్య మానవునివలె జ్ఞాన హీనుడనై బాధపడుచుంటిని. అపుడు, 'బిడ్డా! ఏల దుఃఖించుచుంటివి? దుఃఖ నాశమును గూర్చి నన్ను ప్రశ్నింపుము. తగిన యుపాయమును ప్రబోధింతును. నీవు దానివలన నిత్యము సౌఖ్య మనుభవి తువు' అనెను. కర్ణ రసాయనములగు నా మాటల నాలించి నేను, 'భగవానుడా! దుఃఖ మయమైన ఈ సంసారమెట్లు ఉద్భవించినది? ఇది ఎట్లు నశిం చును?' అని ప్రశ్నించితిని. పితామహుడా సంసార సంబంధమైన జ్ఞాన మెంతయో బోధించెను. దానిని గ్రహించి సుఖ మందితిని. తత్త్వజ్ఞానము నంది సత్యస్థితి యందున్న నన్ను జూచి, ఆ జగత్కర్త సమస్తమునకు మూలకారణములగు నీ మాటల నడిగెను:

'వత్సా! నిన్ను ఆత్మజ్ఞాన విహీనునిగా జేసితిని ఈ సంసారమునకు, సకలజీవ సంతతికి హేతుభూతమైనదానిని గూర్చి ప్రశ్నింప జేసితిని. ఇది యంతయు సకల జీవులకు జ్ఞానసారము విదితమగుటకు జేసితిని. ఇపుడు నీ శాపము తొలగినది. ప్రశాంత చిత్తుడవైతివి. శ్రేష్ఠతరమగు బ్రహ్మజ్ఞానము బడసితివి. ఇపుడు జంబూ ద్వీపమునకు మధ్యభాగమునగల భారత వర్షమునకు లోకాను గ్రహ కాంక్షతో వెడలుము. అచట క్రియా కలాపములందు ఆసక్తి గల మహామహులకు ప్రశాంతచిత్తుడవైన నీవు క్రమాను సారముగ కర్మకాండల నుపదేశింపుము. విరాగ హృదయులు, మహాప్రాజ్ఞులు, పరమాత్మ విచారణ జేయువారు మాత్రమే జ్ఞానముతో నానంద ప్రదాతవగు నీచే బోధింపదగినవారు' అని నా తండ్రి, పద్మసంభవుడు 'ఈ భూమండలమున భూతజాలము వసించునంతవరకు జీవింపుము' అని నాకు వరమొసంగి నియమించెను.

ఈ భూలోకమున నేను జేయదగిన కార్యమేదియు లేదు. కాని, ఇచట నుండ వలయును అని నియమితుడ నగుటవలన నివసించు చున్నాను. నిరంతరము నిదించుచున్న బుద్ధికలవాడనై ప్రశాంత వృత్తితో మెలగుచున్నాను. కాని, నేనుగా నేమియు జేయుటలేదు. జాగ్రదవస్థయందుగూడ సుషుప్తి యందువలె దేనిని జూడక, ద్వంద్వుడనయ్యు నద్వయత్వమును భావించుచు, సమస్త కార్యముల నాచరించుచున్నాను. నిష్క్రియాత్ముడై యుండు వాడు ఆత్మవేత్త అనబడును. కాని, తదితర శబ్దవాచ్యుడు కాడు" అని వశిష్ఠుడు చెప్పి మరియు నిట్లనెను :

"ప్రథమముగా ప్రబోధము జేయువాని జ్ఞాన విషయమును వాని ప్రవర్తనమునుబట్టి నిర్ణయించు కొనవలెను. ప్రశ్నించు వ్యక్తి మహామతిమంతుడు, పూర్వాపరసందర్భముల నెరిగినవాడు, నిర్దిష్టమగు బుద్ధి కలవాడునై యుండవలెను. ఇట్టివాడు ప్రశ్నించి నపుడు వానికి కావలసిన విషయమును బోధకుడు వివరించి చెప్పవలెను. కాని నీచుడు, పశుప్రవృత్తిగలవాడు ప్రశ్నించినచో వానికి జెప్పరాదు.

మోక్షద్వారమున నలుగురు ద్వారపాలకులు గలరు. వారు : 1. ఇంద్రియ నిగ్రహము, 2. బ్రహ్మ విచారము, 3. సంతోషము, 4. సజ్జన సాంగత్యము అనువారు ఈ నలుగురు సర్వ విధముల సేవింపదగినవారు. వీరిలో ముగ్గురనుగాని, ఇరువురను గాని సేవించినను, రాజభవన ద్వారమువలె వీరు మోక్షద్వారమును తెరతురు. ఈ నలుగురలో నే యొక్కనిని, అనగా పై నాలుగు గుణములలో నే యొక్క గుణమునైనను స్వాధీనము జేసుకొనిన మిగిలిన మూడు గుణములు తమంతతామే వశమగును. కాన నెన్నియుపాయముల చేతనైనను, కడ కొకదానిని వశపరచు కొనుటకు యత్నింపవలెను.

ముందుగ సంసార విముక్తికై శాస్త్రములు, సజ్జన సాంగత్యము, నిశ్చల తపోనిష్ఠ, జితేంద్రియత్వము మున్నగువాటిచే ప్రజ్ఞను పెంపొందించుకొనవలెను. రామచంద్రా! సాంసారిక విషవేగ విషూచిక సహింపరానిది. ఇది పవిత్రమైన 'యోగము' అను గారుడ మంత్రమునుచే ప్రశాంతినందును. 'విషయ భోగములు' అను విషపు విషూచికా జాడ్యమునకు అంతములేదు. దీనికి దగిన చికిత్స యొనర్పకుండిన, నిశిత కృపాణములు ధరించి కలువరేకుల తాడనములుగల నరకయాతనలను గలుగజేయును.

నరకములందు అగ్నిదాహనము, హిమసేచనము, అంగార వర్తనము, చందనచర్చ, ఎడతెగక బాణములను గ్రుచ్చుట, వేసవి విడిదియందు శీతల శీకర వర్షము, శిరచ్ఛేదనము, సుఖనిద్ర, మూకీకరణ, మౌనముద్రా బాధిర్యము నుండు యాతన లుండును. ఈ యాతనలను శాస్త్రజ్ఞానముతో వ్యవహరించి తొలగించుకొన వలెను. జ్ఞానావబోధమున కుపకరించు శాస్త్రములను గూర్చి ఆలోచింపవలెను అనంతర మా శాస్త్రపఠనము జేయవలెను. 'స్వానుభవ జ్ఞానము, శాస్త్రజ్ఞానము, గురువువలన లభించిన జ్ఞానము' అను మూడిటికిని సమన్వయమును సమకూర్చుకొనవలయును. అటు తరువాత నిరంతరాభ్యాసమువలన ఆత్మసాక్షాత్కార మగును.

ఎంతమాత్రము సంస్కారముగలవారికైనను, ఈ వేదాంత శాస్త్రము శ్రవణముచేతనే మూర్ఖతను నివారించును. ఇట్టిది మరియొక శాస్త్ర మేదియు నింతవర కవతరింపలేదు. మూర్ఖుడై నికృష్ట జీవితమును గడుపుటకంటె, మూకుడు చేతబూని ముష్టినెత్తుకొని జీవించుట క్షేమము. పరమాత్మ స్వరూపము నెరుగుటకు ధన సంపదలు గాని, బంధుమిత్రులుగాని, హస్తపాద చలనముగాని, దేశాంతర గమనముగాని, శారీరకపరి శ్రమగాని, తీర్థాటనముగాని యుపకరింపవు. కేవలము మనోనిగ్రహము మూలముననే యది తెలియబడును. వెనుక మోక్ష భవనమునకు ద్వారపాలకులుగా పేర్కొనిన వాటి

వివరణమును క్రమముగ నాలింపుము. వీనిలో నే యొకదానిని వశమొనర్చుకొనినను మోక్ష భవనమున ప్రవేశింప వచ్చును.

## శాంతి ప్రశంస

ప్రశాంత చిత్తులయినవారిలో దుఃఖములు, ఆశలు, దుస్సహ దుర్వాసనలు, సూర్యకిరణములలో నంధకారము చొర నేరని విధమున ప్రవేశింప జాలవు. వీరి హృదయములు మాత్ర విశ్వాసమువలె ప్రశాంతములై యుండును. ప్రజా స్వభావములు క్రూరములైనను, మృదులము లయినను వీరికి సంబంధ మేర్పడదు. రసాయనాస్వాదనము వలనను, లక్ష్మీదేవి యుపగూహనము మూలముననను పొందజాలని సౌఖ్యమును ప్రశాంత చిత్తమే వలన జను లనుభవింతురు.

విషాదకరవార్త వినుట వలన, మలిన వస్తు సంస్పర్శ మూలమున, దుస్సహ దృశ్య దర్శనమున, కష్టకాలమునందు దుర్గంధము నాఘ్రాణించుటచేతను సంతోషమును గాని, విషాదమును గాని పొందనివాడు ప్రశాంతచిత్తు డనబడును.

మరణము, సంతోషోత్సవములు యుద్ధ సమయములందు జ్ఞానసుధాకరుని విధమున స్వచ్ఛమైన మనస్సు కలిగి, వ్యాకుల పాటు చెందనివాడు ప్రశాంతుడు.

తాపసోత్తముల యందు, విశేష విజ్ఞానవంతుల యందు యజ్ఞకర్తలలోను, రాజులు, బలవంతులు, గుణవంతులలోను శాంతము కలవాడే ప్రకాశించును. ఈ శాంతము అమృత సమానము. అపహరింప వీలుకానిది. అత్యగుప్తము. ఈ పరమార్థము నెరిగినవారు పరమ పదము నందుకొనిరి. రఘుకుమారా! మహానుభావులు సిద్ధుల నంద దలచి దాని ననుష్ఠించిన విధమున నీవు ననుష్ఠింపుము.

## ఆత్మవిచార ప్రశంస

శాస్త్రముల నెరుగుట వలన నిర్మలమై, పవిత్రమగు బుద్ధికలవా డగును. దాని మూలమున కార్యజ్ఞుడై, నిత్యము నాత్మవిచారము చేయవలెను. ఈ విచారణ వలన బుద్ధి నైశిత్యమును సంపాదించి పరమాత్మను దర్శించును. దీర్ఘ సంసార రోగమునకు ఆత్మవిచారమే ఔషధము. ఆపత్కాలమున గూడ, 'నే నెవరు? ఈ సంసార మెవరిది?' అని బుద్ధిమంతుడు ఆత్మప్రయత్నముతో ప్రతీకార యుక్తముగ నాలోచింపవలెను. అంధకారమునందు నశింపక, అనేక తేజఃపుంజములను వెలిగ్రక్కుచు చూచుచుండగనే ఈ విచార మను సుందర నేత్రము బహుదూర మగును. 'నే నెవరు? ఏదోషము వలన నీ సంసార మేర్పడినది' అని న్యాయదృష్టితో పరామర్శించుకొనుటను పరమాత్మ విచార మందురు.

## సంతోష ప్రశంస

సంతోషము సర్వశ్రేష్ఠమైనది. దీనిని సుఖ మనియు నందురు అరిమర్దన! సంతోషము కలవాడు ప్రశాంతి నందును సంతోషామృతపానపరితృప్త మానసులు ప్రశాంతులై భోగ, సంపదల వట్ల నిరాదరులై యుందురు. ప్రాప్తముకాని వాంఛలను విడచి, ప్రాప్తించినవానిపట్ల సంతృప్తి కలిగి, కష్ట సుఖములకు లోనుగాక సంతుష్టుడై యుండవలెను. ఆశావశుడై, సంతోష వర్జితుడై, తనకు స్వాధీనమునందులేని చిత్తముగలవానికి, మలిన దర్పణమందు ప్రతిబింబము కనుపింపని విధమున జ్ఞానము గోచరింపదు. అప్రాప్యమునకై ప్రాకులాడక, ప్రాప్యమును మాత్రము యథావిధిగ ననుభవించుచు, సౌమ్య సమాచారుడైన వాడు సంతుష్టు డనబడును. గుణవంతుల కభిమతమైన సమ భావము కలిగి పురుషశ్రేష్ఠుడై వెలుగువానిని నరోత్తములగు మునిసత్తములు సైతము నభినందించుచున్నారు.

## సత్సాంగత్య ప్రశంస

మహాబాహూ! సంసార సాగరోత్తరణమునకై మానవానికి సత్సాంగత్యము సర్వవిధముల నుపయోగపడును. శూన్యప్రదేశము జనాకీర్ణముగను, మరణము మహోత్సవముగను, ఆపదలు సంపదలుగను విద్వజ్జన సమాగమము వలన సిద్ధించును. ఇది గంగాస్నానమునకంటె ఉత్కృష్టమైనది. ఈ మహాప్రవాహమున సుస్నాతుడైన వానికి తీర్థ క్షేత్ర దాన తపో యజ్ఞ యాగాదులతో నిమిత్తము లేదు. అహంకార గ్రంథులు సడలిన ఆత్మజ్ఞాన సంపన్నులగు సజ్జనులు సర్వసమాదరణీయులు. వారు సర్వదా సంసేవ్యులు.

ఈ చతుర్విధోపాయములు భవసాగరోత్తరణమునకు ప్రధానము లగు నుపాయములు. నీ విట్టి యఖండగుణసంపద్విలసితుడవు. మనోవ్యామోహహారణమగు నీ చెప్పబోవు వాక్యము నాలింపుము ఇది మోక్షమునకు సంబంధించిన విషయము. దీనియందు దిష్టము లేక బలవంతముగా వినినను పరమాత్మ జ్ఞానము కలుగును లోభ మోహాది బుద్ధి జనిత దోషములను నివారించును. శరత్కాల సరోవరము భాతి, చిత్తము నిర్మల మగును. కవచము ధరించిన వానిని శరజాలములు బాధించని విధముగా, దైన్య దారిద్ర్యాది దోష దృష్టులు బాధింపవు. సంసారోపద్రవములు హృదయమును భేదింపవు. మందరపర్వత మంథనమున సంక్షోభము జెందని క్షీరసాగరము వలె సమబుద్ధి జనించును. సముద్రము వంటి గాంభీర్యము, మేరువు వంటి స్థైర్యము, సుధాంశునివంటి అంతశ్శీతలత ఆత్మవిచారణ చేయువానికి కలుగును. సచ్ఛాస్త్ర విజ్ఞానము వలన పవిత్ర వ్యాపార బుద్ధి జనించును. తద్విజ్ఞానమునకు అవిరోధము లగు కృత్యముల యందును, యథాప్రాప్తము నందును తృప్తి గలిగి యంతఃపుర స్త్రీ విధమున సంతసించును. భేదబుద్ధి సంపూర్ణముగా నశింపగా, క్రమమున జీవన్ముక్తత

సిద్ధించును. జీవన్ముక్తుడు ఇష్టానిష్ట ఫలప్రాప్తియందు హృదయ పరివర్తనము నొందక, యథాప్రాప్తానువృత్తికలవాడై సామాన్యుడుగా నుండును.

జీవన్ముక్తుడు సుఖాసనోపవిష్టుడై, యథా సంభవముగా ప్రాప్త భోగము ననుభవించుచు, సదాచార విరుద్ధ కార్యముల నాచరింపక, దేశకాలానుగుణ్యముగ సుఖమును గూర్చి యాలోచింపుచుండును. ఇది మోక్షమునకు సంబంధించిన కాలానుగుణ్యమగు సత్సాంగత్యము. ఇది మహత్తర జ్ఞానబోధము, సంస్కార ప్రశాంతి ప్రసాదనము. దీనివలన యోని యంత్రపీడన మెన్నటికి నుండదు.

ఇంతగా జరుగుచున్నను పాపభోగాసక్తులై భీతిలేని జనులు, తమ తమ మాత్ర మలసంచార క్రియలు ఆ అధమ వర్తనులు కీర్తనీయులుగారు. 'శాస్త్రము, ఉపశాంతి, సౌజన్యము, ప్రజ్ఞా తజ్ఞుల సమాగమము' అను ధర్మములు గలిగి, మధ్య మధ్య ధర్మార్థముల నార్జించుచు, నాత్మ ప్రశాంతి లభించువరకు నాత్మ విచారము జేయు పండితుడు శాశ్వతమగు 'తురీయ' మను పదమును పొందుచున్నాడు.

తురీయమగు నాత్మ తత్త్వమును పొంది, సంసారార్ణవము నుండి తరించిన మహానుభావుడు జీవించి యున్నను, మరణించినను, గృహస్థుడైనను, యతీశ్వరుడైనను వానికి కృతాకృతములతో గాని, శృతి, స్మృతి, విభ్రమాదులతో గాని ప్రయోజనము లేదు. ఆతడు మందరపర్వతము గల క్షీర సముద్రము వలె సంక్షోభము లేక, యథాపూర్వముగ నుండును. ఇపుడు నేను వివరించు దానిని సావధానుడవై ఆలింపుము.

రాఘవా! ఇది జ్ఞాన సారము గల విస్తారమగు జ్ఞాన శాస్త్రము. ఇది యుక్తియుక్తమైనది. దీనిని బాలుడు వచించినను

సమాదరణీయ మగును. అయుక్తమైన వచనమును పద్మసంభవుడు ప్రవచించినను, తృణ సమానముగ పరిత్యజింప వలయును. కాకుత్థ్సకులతిలకా! నేను బోధించిన దృష్టాంతము లన్నియు సహేతుకములు. కాని, అవి కారణ రహితములుగా మాత్ర ముండును. నీకు ప్రబోధించు బ్రహ్మోపదేశ దృష్టాంత మొక యంశమును మాత్రమే యాశ్రయించి యుండునని గ్రహింతువుగాక! ఇది యిట్లుండ 'నిరాకార బ్రహ్మమునకు సాకార దృష్టాంత మెట్లు కుదురును?' అను వైకల్పికోక్తులు మూర్ఖుని ప్రేరేపించును. కాని, ప్రబుద్ధత్త్వము 'అస్తి, నాస్తి' విచికిత్సలో బడి వినాశము జెందును. అపవిత్రములగు వికల్పములు, అనుభవమును నశింపజేయును. జ్ఞానము వలన శమాది గుణములు కలుగును. ఆ శమాది గుణముల మూలమున జ్ఞానము కలుగును. ఈ రెండును పద్మములవలన సరస్సు, సరస్సు మూలమున పద్మములు పరస్పరము వృద్ధినందు నట్లుండును. జ్ఞానము, సత్పురుష క్రమము ననునవి బాగుగా నభ్యసింపనంతవరకు, ఈ రెండిటిలో నే యొకటియు పురుషునకు మోక్షప్రాప్తి సాధకము కాదు. కాన రెంటిని యభ్యసింప వలయును.

ఈ జ్ఞాన శాస్త్రము కీర్తిని, ఆయువును, మోక్షమును ప్రసాదించును. నిర్మలమగు బుద్ధితో విని, బ్రహ్మవస్తువును పొందెదవు. తత్త్వజ్ఞాని యగు పండితుని మనస్సు పరవశమై పరమ పదమును పొందును. అఖండితమై, అవక్రమై, పరిజ్ఞాతమైన జ్ఞానము వారి హృదయములను వీడి యెచ్చటకును పోజాలదు.

# ఉత్పత్తి ప్రకరణము

## అర్థ దర్శనము

"శ్రీరామచంద్రా! ఇంతవరకు ముముక్షు వ్యవహారమును గురించి వివరించితిని. ఇపుడు జగత్తుకు సంబంధించిన శ్రీమంతమగు ఉత్పత్తిని గూర్చి వివరించుచున్నాను. సావధానముగ నాలకింపుము" అని వశిష్ఠ మహర్షి ఈవిధముగా నారంభించెనని వాల్మీకి భరద్వాజునకు విన్నవించెను.

"విషయము, అవచ్ఛేదము ప్రత్యక్షము అను మూడిటిని 'త్రిపుటి' అందురు. ఈ త్రిపుటి ననుసరించి అనుభూతి యుండును.

త్రిపుటిని ప్రకాశింపజేయు దానిని 'వేదన' మనియు, వ్యాపింపజేయు దానిని 'ప్రతిపత్తి' యనియు నందురు అనుభూతి, వేదనము, ప్రతిపత్తి అను వాని పేరుల ననుసరించి ఇక్కడ ప్రత్యక్షము అని వ్యవహరింపబడును. అదియే మనలోని జీవమని చెప్పబడును. ఇది సంవిత్ అనియు, అహంకారమున ప్రవేశించెనని పురుషుడు పమాత అనబడును. సంవిత్తునుండి పదార్థమావిర్భవించినది అనగా జీవ పదార్థమగు పరమాత్మ 'జ్ఞానము, జ్ఞాత, జ్ఞేయము' అను మూడు విధములగు భేదములను పొందుచున్నది. అది సంకల్ప వికల్పాదుల వలన, అనేకవిధముల భ్రమత మూలమున నానావిధములగు అవస్థాంతరములను పొంది, జలము తరంగాది రూపములు ధరించినట్లు జగత్తుగా ప్రకాశించుచున్నది.

ప్రత్యక్ష శబ్దముచే చెప్పబడిన సాక్షి చైతన్యము. సృష్టికి పూర్వము కారణ రహితముగా నున్నది. సృష్టియందు తానే

స్వయముగ ప్రత్యక్షమై, కారణభూతమై విలాసముగా ప్రకాశించు చున్నది. ఈ జగత్తు రూపాలోక, మనస్కార పదార్థములచే వ్యాకులమైనది. ఇది చైతన్యము నడుమ వాయువు నందలి చలనము వలె చలించుచున్నది. పరిశుద్ధమగు సర్వాత్మ వేదనము, స్వస్వరూపమున నుదయించిన రీతిగా దేశ దిక్కాల బాహ్యాభ్యంతర రూపాత్మకమై ప్రకాశించుచున్నది. ఆ సర్వాత్మ ఎక్కడ, నే రూపమున నుల్లాసమును పొందునో అక్కడ, ఆ రూపమున వెంటనే ప్రకాశించును. ఇందువలన బ్రహ్మ కల్పితమైన ఈ జగత్తు హేతువులేనిదై యున్నది. దీని నిర్మాత బ్రహ్మ యనుటను ప్రత్యక్ష ప్రమాణము దీనిని అనుమానాది ప్రమాణములు ననుసరించు చున్నవి. దృశ్య మగు భావమువలన బంధ మేర్పడినది. దృశ్యా భావమున ఆ బంధన ముండదు. అపుడు దృశ్యము నుండదు కదా! అది ఏవిధముగ వర్తించునో చెప్పుచున్నాను, వినుము.

మనము చూచుచున్న జగము స్థావర జంగమాత్మకమై కల్పాంతమున, నిద్రా సమయ మందలి స్వప్నమువలె నశించు చున్నది. కాన నిది సత్యము కాదు. జగత్తు నశించిన తరువాత స్థిమితముగను, గంభీరముగ నుండి తేజోరూపము గాని, తమో రూపముగాని కాక అనామకమై, అనభివ్యక్తమై, అనిర్వచనీయ మైన సత్తు మాత్రము మిగులును.

ఉత్కృష్టములగు శ్రుతి ప్రమాణముల వలన గమ్యమగునది ఋత మనబడును. ఇక ఆత్మను గురించి వ్యాసభగవానుడు, 'యచ్చాప్నోతి, యదాదత్తే, యచ్చాత్తి, విషయానిహ। యచ్చాస్య సంతతోభావః, తస్మా దాత్మేతి శబ్ద్యతే,' అనగా 'విషయములను పొందుచును, గ్రహించుచును, అనుభవించుచును, సర్వకాలము లందు నుండునది ఆత్మ' అని నిర్వచించెను. ఈ ఋత మను శబ్దమును ఆత్మపరముగ, బ్రహ్మముగ, సత్యముగ, నింక ననేక నామములతో పండితులు వ్యవహారార్థముగా నా

మహాత్మునకు సంజ్ఞ కల్పించిరి. ఆవిధముగ నుండు ఆత్మ వేరుగ ప్రకాశించుచు, భవిష్యత్తులో నీచమగు జీవత్వమును పొందుచున్నది.

సృష్టికి బూర్వము నామరూపాది రహితుడై, పరమాత్మ యొక్కడే యుండెను. సృష్టి ప్రారంభమయిన తరువాత నా పరమాత్మ ప్రపంచ రూపమున మార్పుజెందెను. అనంతరము చిత్ర విచిత్ర రూపములతో, సమష్టి జీవ రూపములతో, అహంకారాది రూపములతో, మనో రూపముతో నా కారములను సంతరించుకొనెను.

అనంతర మా జీవశబ్దార్థము సంకల్ప సంక్షోభము వలన మననమున మాంద్యమయ్యెను. భూతాత్మ మనస్సయ్యెను. మహత్పదార్థమగు పరమాత్మ నుండి మనస్సు సుస్థిరత నుండి అస్థిరమైన సాగర తరంగము వలె జనించెను. ఆ పరమాత్మ నిత్యము ఈ విషయమును మరచి, మనోధర్మములగు సంకల్ప వికల్పములు తనవిగానే భావించుచున్నాడు. అట్టి సంకల్పముల వలన ఇంద్రజాలా విలాసమగు నీ జగత్తు విస్తరించుచున్నది. కడియము అనునది సువర్ణ నిర్మితమైనను శబ్దార్థము భేదించిన విధముగా, జగత్తు అనునది పరమాత్మ స్వరూప వికారమే అయినను శబ్దార్థము భేదించుచున్నది. అసత్యమువలన సత్యము మరుమరీచికయందు తరంగము భాతి, మనస్సునందు 'ఈ జగత్తు' అను ఐంద్రజాలిక శ్రీ విస్తరించుచున్నది. 'అవిద్య' అనగా అజ్ఞానము, 'విద్యచే' ననగా జ్ఞానముచే తొలగును.

సంసృతి అనగా స్వేచ్ఛగా సంచరించునది. భ్రాంతిని కలిగించునది మోహము. స్వేచ్ఛ నరికట్టునది బంధము. ఉన్నది యనిగాని, లేదు అనిగాని నిర్ణయించుటకు వీలుగానిది మాయ పాపములకు హేతువైనది మలము. స్వస్వరూపమును మరుగు పరచునది తమము అని సర్వజ్ఞులైన పండితు లందురు. పూర్ణ చంద్రానన! బంధ స్వరూపమును వివరించుచున్నాను, వినుము. అనంతరము మోక్ష స్వరూపమును ప్రబోధింతును.

"బంధము" అనగా బంధించునది అని అర్థము. ద్రష్ట, దృశ్య
ములకుగల సంబంధము బంధము అనబడును. దృశ్యబలము వలన
ద్రష్ట బద్ధుడగుచున్నాడు. దృశ్యము లేనిచో ముక్తుడగుచున్నాడు.
'జగత్వము, నేను, అను సృష్ట్యాత్మకము దృశ్యము. ఈ భావముండు
నంతవరకు మోక్షము కలుగదు. మిక్కిలి నల్లని రూపము కలిగి,
తామరవిత్తు గర్భమున సంస్కార రూపముతోనున్న విధముగా
ద్రష్టయందు దృశ్యబుద్ధి వసించుచున్నది. బీజాంతరమందలి యంకురము
దేశకాలముల ననుసరించి ప్రకాశవంతమైన యాకారమును
సంతరించుకొన్నట్లు, దృశ్యభావము ద్రష్టయందు కాలానుగుణముగ
విస్తరించును. ద్రవ్యమునకు హృదయమునందు జరుగు చమత్కా
రమే మనగా తామరవిత్తు నాశములేక వస్తుగర్భమునందు వసించు
చున్నది. ఇటులనే చిన్మాత్రము శరీరము కలదియై ఆత్మవస్తు
గర్భమునందున, చిదచిదాత్మక జగత్తుయొక్క స్థితియు నుండును."
అని వశిష్ఠమహర్షి మరియు, నిట్లు వక్కాణించెను. రామచంద్రా!
ఈ విషయము సులభముగా నవగాహనమగుటకు, ఆకాశజోపాఖ్యా
నము నాలింపుము ఇది శ్రవణానందకరము. దీనిచే 'ఉత్పత్తి' అను
విషయము బోధపడును.

## ఆకాశజోపాఖ్యానము

"భూలోకమున పరమధార్మికుడగు, ఆకాశజుడు అను
బ్రాహ్మణశ్రేష్ఠుడు కలడు. అతడెల్లవేళల ప్రజాహితైక
మతియై, ధ్యాననిష్ఠ యందుండును. అతడు జీవించి యున్నంతవరకు
మృత్యువు తనలో నిట్లు తలపోయుచుండెడిది. " నేను క్షయము లేని
దాననై, సకల భూతగణమును భక్షించుచున్నాను. కాని
ఈ ఆకాశజుడను విప్రుని భక్షింప జాలకుంటినేమి? కటిక
రాతియందు పనిచేయని కత్తి పదును పగిది, నీతనిపట్ల నా శక్తి
చాలకున్నది. అని ఆలోచించి ఆ బ్రాహ్మణుని వధించుటకు

ఆతడున్న పట్టణమునకు వెంటనే పయనమయ్యెను. పట్టుదల కల వారు తమ కార్యములు సాధించుట యందు యత్నములను విడువరుకదా !

మృత్యువు బ్రాహ్మణ గృహమున ప్రవేశించుట తోడనే ప్రళయ కాలానలసన్నిభమైన యగ్ని, దానిని దహింప జొచ్చెను. అగ్ని జ్వాలామాలికలను ఛేదించి, బ్రాహ్మణ గృహాభ్యంతర మున మృత్యువు ప్రవేశించినది. ద్విజుని జూచి బలాత్కార ముగ తన చేతితో బట్టుకొనుటకు యత్నించినది. కాని ఎదురుగ కనబడుచున్న వాడైనను, ఆతనిని మహాబలముగల మృత్యువు తన హస్త సహస్రముతో, సంకల్పమాత్రమున హృదయగతుడై భాసించు పురుషపుంగవుని చందమున స్పృశింప జాలదయ్యెను. ఈ సంఘటనమునకు వెరగందినదై, యమలోకమునకు మరలివచ్చి యమధర్మరాజును "ప్రభూ ! ఆకాశజుని నే నేల భక్షింప జాల నైతిని ?" అని తన సంశయ విచ్ఛేదనమునకై ప్రశ్నించెను. "మృత్యువా ! ఆతనిని బలత్కారముగ నీ వొక్కతెవు సంహరింప శక్తురాలవుగావు. కర్తయై, తాను జేయు కర్మలే అతనికి మరణ హేతువులగును. కాన ఆ కర్మలను జాగరూకతతో బరిశీలించు చుండుము. వాటి సహాయమున సులభముగా నతనిని వధింపగలవు." అని యమధర్మరాజు ఉపదేశించెను.

ఆకాశజుని కర్మలను బరిశీలించుట యందు ఆసక్తికలదై మృత్యువు రాష్ట్రములను, రాష్ట్రాంతరములను, దేశములను, దిగంతములు, నదులు మున్నగు పెక్కు తావులను పరిభ్రమించెను. సృష్టి యంతయు పరిభ్రమించినను అతని కర్మలలో మృత్యు కారకములగు వాటిని జూడజాలక పోయెను. మరల సర్వార్థ కోవిదుడైన భూతపతి కడకరుదెంచి ఈ విధముగ విన్నవించెను. "మహానుభావా ! ఆకాశజుని, మృత్యుప్రేరక కర్మ లెక్కడ నున్నవో దయామతివై యెరిగింపుము. మిమ్మనుసరించి జీవించు

వారలకు సంశయము లంకురించినచో తమరే గదా! నివారింప దగినవారు." యమధర్మరాజు కొంత తడవాలోచించి యిట్లనెను: "మృత్యువా! ఆకాశజుని మృత్యువునకు దగిన కర్మ లేవియు గోచరించుట లేదు. ఇతడు ఆకాశము నుండి జనించిన విప్రుడు. కాన ఆకాశజు డనబడినవాడు ఆకాశమువలె నిర్మలుడు. కార్య కారణ సహకారములు లేవు. ఈ విధమున సహకారి కారణములు లేకుండుట వలన నితడు స్వకారణము కంటె భిన్నుడుగా తోచుట లేదు. అనగా జలమునందు ప్రతిబింబించు చంద్రుడు జలము కంటె భిన్నుడును, ముత్యపుచిప్ప యందు ప్రతిభాసించు రజతము ముత్యపుచిప్ప కంటె వేరుకానట్లు, ఆకాశ శబ్దవాచ్య మగు బ్రహ్మ యందు ప్రతిబింబించిన ఆకాశజుడు అను బ్రాహ్మణుడును బ్రహ్మకంటె వేరు కాదు. కాన నీ వాతనిని హత మార్చుటకు యత్నింపకుము" అని వివరింపగా నా మృత్యువా పలుకులను విని యాశ్చర్యము నొంది నిజ మందిరమున కరిగెను. అని వశిష్ఠ మహర్షి వచింపగా శ్రీరామచంద్రు డిట్లనెను: "బ్రహ్మస్వరూపా! తమరు నాకు జెప్పిన కథయందలి బ్రాహ్మణుడు 'స్వయంభూ' అనగా తల్లిదండ్రుల శుక్లశోణితముల వలన జన్మలేనివాడును, సర్వత్ర వ్యాపించినవాడును, బుద్ధిస్వరూపమైనవాడును నగు, ప్రపితామహులిగా, బ్రహ్మగా నా హృదయమునకు దోచుచున్నది." అనగా వశిష్ఠమహర్షి ఇట్లనెను

"మహాబాహూ! నేనును ఆ బ్రహ్మను గురించియే భంగ్యంతరముగా వివరించితిని. బ్రహ్మ విషయమును గూర్చియే మృత్యు వివాదము జేసెను. మన్వంతరమునందు సర్వభక్షణము జేయుమృత్యువు ప్రజల నంహరిని బొట్టుపెట్టుకొనుచు మహాబలమును పొందినదై బ్రహ్మను గూడ గ్రసింప యత్నించెను. అపుడు ధర్మరాజగు యముడు మృత్యువు నీ విధముగా అనుశాసించెను: బ్రహ్మ యనగా పరాకాశ శరీరము గలవాడు. నీ వెట్లాతని గ్రసింతువు? ఆకాశమునందు

ప్రకాశించు ఆకారము గలవాడు. సంకల్పమాత్ర పురుషునివంటి వాడు. పృథివ్యాది పంచభూతాత్మక మైనవాడు. స్వయంభువుడు. చిదాకాశము ఆదిమధ్యాంతరహితమైనది. పరబ్రహ్మ స్వరూపము తనచిత్తము ననుసరించి బ్రహ్మగనే భాసించును. ఆకారము గలవాని విధమున, పురుష రూపమున వెలుగుచున్నాడు. యథార్థమునకు వంధ్యాపుత్రునకువలె నాతనికి శరీరము లేదు. ఈ స్వయంభువునకు సూక్ష్మశరీరము మాత్రము కలదు. శ్రీరామా! ఈయనకు ఆధిభౌతిక దేహములేదు. అనగా శ్రీరామచంద్రుడిట్లనెను: "మహాత్మా! సకల భూతములకు సూక్ష్మశరీరము, స్థూలశరీరము అను రెండు శరీరములు కలవు కదా! బ్రహ్మకు ఒక్క శరీరము మాత్రమే ఏల యుండవలయును?" అన వశిష్ఠుడిట్లు ప్రత్యుత్తర మిచ్చెను:

"కారణాత్మలగు సర్వభూతములకు రెండు శరీరము లుండును. కారణాత్ముడు కాకపోవుటవలన నజునకు సూక్ష్మదేహ మొక్కటి మాత్రమే కలదు. ఇతరములగు భూతముల కన్నిటికి బ్రహ్మ, ప్రతిభాసితమైన జగత్తు కారణముకాగా, అజునకు పరమాత్మ కారణము. అందువలన నీతనికి ఒక్క సూక్ష్మదేహము మాత్రము కలదు. పృథివ్యాది పంచభూతాత్మక రహితమైన ఆకృతిగల బ్రహ్మ, సంకల్ప పురుషుడు. ఈ మూడు లోకముల స్థితికి కేవలము చిత్తమాత్రమైన ఆత్మ కారణము. స్వయంభువుడగు బ్రహ్మ చిత్తము చేతనే విస్తరించుచున్నాడు. కాన, ఈ దృశ్యమాన విశ్వమంతయు మనోమయముగా తోచును" అని చెప్ప శ్రీరాముడు "మహాముని! సమస్త దోషజాలము వృద్ధి నందుటకు ఆధారభూతమైన మనస్సు స్వరూప మెట్టిదో స్పష్టముగా వివరింపుము." అని ప్రార్థించెను.

## మనస్స్వరూపము

"రఘుకులతిలకా! మనస్సునకు రూపమనునది లేదు. శూన్యము, జడాకృతిగల ఆకాశమువలె నామమాత్రము దక్క వేరు

లేదు. బాహ్యమునగాని, హృదయమందుగాని దానికి స్వరూపము లేదు. అయినను ఆకాశము వలె నిది సర్వత్ర వ్యాప్తమైయున్న దానినిగా తెలియును. సాధూ! ప్రత్యక్షముగా నున్న లేక పరోక్షముగా నున్న దాని జ్ఞానమునకు హేతువైనది మనస్సు. నిరాకారమైన దానిని సాకారముగ తెలియజేయునది మనస్సని చెప్పబడును. తద్వ్యతిరిక్తమైనది మనస్సు కానేరదు."

సంకల్పమునే మనస్సని భావింపుము. అది సంకల్పము కంటె భిన్నమైనది కాదు. సంకల్ప మున్నచోట మనస్సుండునని తలంపుము. ఇవి రెండును వేరు వస్తువులుకావు. అవిద్య, సంసృతి, చిత్తము, మనస్సు, బంధము, మలము, తమము అనునవి సంకల్ప జాలములకు పర్యాయ పదములు. సంకల్పజాలము తొలగిపోగా సత్య స్వరూపము మిగులును. దిక్కులు, భూమి, ఆకాశ రూపమునగు సర్వము అసంభవమగుచో ప్రకాశ నైర్మల్యము ప్రకాశ్యమునందున్న రూపము సత్య స్వరూపము. దృశ్యవస్తువునందు 'త్రిజగత్వము, నేను', అనునవి యదృశ్యముకాగా నిర్మలాత్ముడగు ద్రష్ట కేవల మట్టి భావమునే కలిగి యుండును. అనగా తాను మాత్రమే మిగిలి యుండునని భావము. దర్పణమునందు అఖిల శైలాది ప్రతిబింబములు లేకున్నచో కేవలము దర్పణతా రూపమే గోచరించును. అట్లే 'నేను, నీవు, జగత్తు' అను వాటియందు దృశ్యసంభ్రమము ప్రశాంతింపగా అనగా దృశ్యవస్తువు లేకుండుట వలన ద్రష్ట, దృష్టిలేనివాడగును. అప్పుడు కైవల్యము ప్రాప్తించును. మనోదృశ్య మయమగు క్షయాత్మకమైన ఈ దోషము అసత్యమునందు సత్యము వలెను, స్వప్నాంతరమందు స్వప్నము వలెను విస్తరించును. చంచల స్వభావము కలదగుట వలన మనస్సు కదలుచుండును. ఎగురుచుండును. యాచించును. భ్రమించును. మునుగుచుండును. స్వయముగా లయించును. కేవల నీచత్వమును గూడ పొందును." అని చెప్పి మరియు నిట్లు వశిష్ఠ మహర్షి అభివర్ణించెను :

"దృశ్య ప్రపంచము మహాప్రళయ సమయమున తన అస్తిత్వమును కోల్పోవగా, సృష్ట్యాదియందు నెలకొనియున్న ప్రశాంతి చే మిగులును. అజుడు నిరామయుడై, నిరస్తతేజుడైన దేవుడు. సర్వదా సర్వము నాచరించును. సర్వము తానయిన, మహేశ్వరుడగు పరమాత్మ కలడు. అనిర్వచనీయుడు, ముక్తుల కవగమ్యుడు నయిన పరమాత్మకు ఆత్మాది సంజ్ఞలు కల్పితములు కాని స్వతస్సిద్ధములు గావు. సాంఖ్యదృష్టిగల వారికి పురుషుడుగను. వేదాంతవేత్తలకు బ్రహ్మగను, విజ్ఞాన (యోగ) విదులకు విజ్ఞానమాత్రుడుగను, శూన్యవాదులకు శూన్యుడుగను, భాస్కరతేజులకు భాస్వంతుడుగను భాసించుచున్నాడు. మరియు వక్తగ, మననశీలుడుగ, కర్మఫల భోగ్యుడుగ, ద్రష్టగ, స్మర్తగ నతడే యగుచున్నాడు జగత్తు నందుండియు లేనివాడై, దేహముకలవాడై, విదేహుడై దూరముగా నుండి, సూర్యునివలన ప్రకాశము లభించు విధమున చిత్ప్రకాశుడై యుండెను. ప్రకృతిలత యాకాశమున నుద్భవించినది. బ్రహ్మాండములను సత్ఫలముల నందించుచున్నది. చిత్తమను మూలము కలది ఇంద్రియములను పత్రవిలసితమై, పరమాత్మ యను వాయువుచే నాట్యమాడింప బడుచున్నది. శరీరములను, ప్రతి పేటికాంతరము లందును 'చిత్తు' అను మణి ప్రకాశించుచున్నది అది అష్ట పురములను తన యిచ్ఛవచ్చినరీతి నాడించుచున్నది. ఆ అష్ట పురములెవ్వి యన : 1. జ్ఞానేంద్రియములు, 2. కర్మేంద్రియములు, 3 మనోబుద్ధ్యాదులు, 4. ప్రాణపంచకము, 5. సూక్ష్మ పంచ భూతములు, 6. కామము, 7. కర్మ, 8. అవిద్య అను నెనిమిదింటిని వేదాంత పరిభాషలో 'పుర్యష్టక' మందురు.

పవిత్రమగు జ్ఞాన స్వరూపుడగు పరమాత్మ, ఆకాశము గూర్చి ఆలోచింపగా ఆకాశ రూపమును, పదార్థములను గూర్చి ఆలోచించుటవలన, పదార్థ స్వరూపము నయ్యెను. ఆవిర్భావ, తిరోభావాత్మకము లయిన త్రిభువనములను, తరంగములు అతి

విస్తార రూపమున మరుమరీచికలవలె పరమాత్మయందు ప్రకాశించుచున్నని. మహా జగత్తుల ననంతముగా సృష్టించువా డంమరు. కాని యథార్థమునకు వాటి నెన్నడును సృజించుట లేదు. అనంత జ్ఞానస్వరూపమైన, తనయందు నిర్వికల్పసమాధి నిష్ఠుడై సృష్టి, స్థితి, లయాత్మకుడై తా నొకఁడే యుండును. పరమాత్మ సందర్శనము వలన, హృదయగ్రంధి భేదించును. సర్వ సంశయ విచ్ఛేద మగును. అన్యకర్మ లన్నియు నశించును." అనగా శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను: "ఇకఁడ గోచరించు చున్న బ్రహ్మాండమగు జగత్తు యొక్క స్థితికి సూక్ష్మమగు చిమ్రిపను ఆధారమెట్లగు చున్నది? మేరువు ఆవగింజలో నిముడునా? తండ్రీ! నా సంశయమును విచ్ఛేదము జేయుడు" అని యర్థించెను. అంత వశిష్ఠమహర్షి ఇట్లు వివరింప నారంభించెను.

"రామభద్రా! నీవు సజ్జన సాంగత్యము వలనను, సచ్ఛాస్త్ర పఠనము మూలముననను మాసములలో గాదు, కొన్ని దినములలోనే పరమాత్మ జ్ఞాన సంపన్నుడ వగుదువు. ఇతిహాసము లన్నిటియందు, నీ సంసారమును గూర్చి యుదహరింపబడినది. నిర్మలమగు శ్రుతి యందు అవ్యయ మగు జీవన్ముక్తి అభివర్ణిత మైనది. దీనిని అంతరంగమున తనంతటతాను మననము జేయుట వలన, దృశ్యముగానున్న జగత్తు అస్తమించి జ్ఞానోదయ మగును. జ్ఞానైకనిష్ఠులై ఆత్మ విచారము చేయువారికి విదేహ విముక్తియు, జీవన్ముక్తియు సిద్ధించును." అని వివరింప శ్రీరాము డిట్లు ప్రశ్నించెను! "భగవానుడా! విదేహ విముక్తుడు, జీవన్ముక్తుడు అని నుడివితిరి. వారి లక్షణము లేవియో వివరించినచో శాస్త్ర దృష్టి కలిగి ఆ విధముగ నుండుటకు నేనును యత్నింతును" అనెను. అంత వశిష్ఠు డీ రీతి వివరించెను:

"వ్యవహార దృష్టితో నీ జగత్తును యథాస్థితిగా భావించుచు పరమార్థ దృష్టితో శూన్యముగా భావించువాడు జీవన్ముక్తుడు.

సుఖముల యందును కష్టముల యందును ముఖ కాంతిని చెదర నీయక యథాస్థితిగ నుంచుకొనువాడును; జాగ్రదవస్థ యందును, సుషుప్త్యవస్థ ననుభవించువాడును, జాగ్రదవస్థయందు వాసనా రహితుడైనవాడును; రాగద్వేషభయాదులు లేనివాడును, కర్మాచరణశీలుడైనను; కర్తృత్వమును తనపై నారోపించుకొనని వాడును, అహంకార భావవిరహితుడు, హర్షామర్షములకు లోను గానివాడు, సంసార కల్లోలితుడయ్యు ప్రశాంత చిత్తము కలవాడు; చింతామగ్నుడయ్యు నిశ్చింతుడు, సమస్త వ్యవహారము లందుండియు పరితాపములేనివాడు, పదార్థములందు పూర్ణాత్మ కలవాడు జీవన్ముక్తు డనబడును.

"కొంతకాలమునకు జీవన్ముక్త పదవిని విడిచి, తన శరీరము కాలవశమగుచుండగా వాయువు నిశ్చలతను పొందెన విధమున, విదేహ ముక్తిని పొందును. విదేహముక్తుడు పునర్జన్మనొందడు. కాన క్షీణింపడు, అస్తమింపడు, శాంతినిపొందడు. వ్యక్తుడుగాని అవ్యక్తుడు గానికాడు. సమీపస్థుడును, దూరస్థుడునుకాడు నేనుగాని, ఇతరుడు గాని కానివాడు. అనంతర స్థిమిత గంభీరముగాని, తేజోవంతము గాని, తమస్సుగాని, కానటువంటి వాడై, పేరులేక, వ్యక్తముగాక, కేవలము 'సత్తు' యొక్క రూపము గలవాడై యుండును."

'సత్తు' అనునది నిరాకారమును, సాకారమును గాదు. దృశ్యము, నదృశ్యమును గాదు భూతజాలము కాదు. అది అనంత మైనది అనిర్వచనీయమైనది. పరమాత్మ స్వరూపము కంటె పరి పూర్ణమైనది ఇది సదసద్రూపమును, అభావమునుగాదు, రహితమును కాదు. అనంతమైనది. అజమైనది శివమైనది. అనాది మధ్యపర్యంత మైనది ఆధివ్యాధులు లేని చిన్మాత్రము విదేహముక్త రూపము. ద్రష్ట, దర్శన, దృశ్యముల మధ్య దర్శనరూపమై యుండును. అవధానమున తెలియబడును" అని వివరింప శ్రీరామచంద్రుడు సంశయాత్ముడై ఇట్లనెను.—"మునీంద్రా! ఆనంద చిదాకారములు

గల పరమాత్మ స్వరూపమెట్టిది ? ఈ విషయమును నా జ్ఞానాభి వృద్ధికై మరల వివరింపుడు" అనగా వశిష్ఠుడిట్లు వివరింప దొడగెను.

## పరమాత్మ స్వరూప నిర్ణయము

"సర్వకార్య కారణమైన పరమాత్మ, మహాప్రళయము స భవించినను, నిలచియుండును. దాని నిపుడు వర్ణించు చున్నాను. సావధానముగ నాలింపుము.

"సమాధి స్థితియందు మనోవ్యాపారములు క్షయించును. ఆత్మను శాంతింప జేసి అనిర్వచనీయ రూపమును ధరించును. అదియే పర బ్రహ్మ స్వరూపము. జీవస్వభావముకల చిత్తునకు, అచేతోన్ముఖ మైన నిర్మలము, ప్రశాంతమునైన చిన్మాత్రస్వరూపము సిద్ధించి పరమాత్మ రూపమగును. జీవించియున్నను వాతాదులు శరీరమును స్పృశించినను, స్పర్శాద్యనుభవము నొందక, స్వప్నములననుభవింపక, అంతము లేని జడముకాని, చిరనిద్రా స్వరూపమును వేదనకు, ప్రకాశమునకు, దృశ్యమునకు, తమస్సునకు, ఆద్యంతములు లేని వేదనాస్వరూపమును, వ్యవహారపరు డయినను, పాషాణమువలె స్థిరుడైన వాడును, శూన్యముకాని దానియందు శూన్యత్వమును, వేద్య, వేదన, వేత్తృత్వరూపత్రయమగు పురము ఉదయించునది, లయించునది యగురూపము పరమాత్మ స్వరూపము. మనోబుధ్యాది నిర్ముక్తమై, స్థావరములకు బోధమయ రూపమగుచో దానికి పరమగు దానితో నుపమింపబడుచున్నది బ్రహ్మ, రవి, విష్ణుహర, శక్ర, సదాశివాదులు లయింపగా ఒక్క శివమైన పరమే మిగలి యుండును. ఉపాధులన్నియు నశించుటవలన నిర్వికల్ప రూపమైన, విశ్వసంబంధము లేని చైతన్య మాత్రమయమైనది పరమాత్మ స్వరూపము."

# మండపాఖ్యానము

"వెనుకటి విషయములలో ఆకాశజోపాఖ్యానమున చిన్మాత్రస్వరూపుడగు పరమాత్మ, మాయాశక్తి మనస్సుగా మార్పు జెంది జగత్తును సృజించుచున్నది" అని వివరింపబడినది. ఈ సర్గమున 'జగత్తుమాయ' అను భావము ధృఢపడుటకొరకు మాయవలన ననేక దుర్ఘటనములు ఘటిల్లునని చెప్పదలచి ప్రస్తుతం లీలోపాఖ్యాన మభివర్ణింప బడుచున్నది. దీనిని మండపాఖ్యాన మనియు నందురు.

"రఘురామా! శ్రవణ భూషణమనదగు నీ మండపాఖ్యానమును ఆలింపుము. ఇందువలన నిస్సందేహముగా నీ మనస్సునందు ప్రశాంతి కలుగును." అని వశిష్ఠమహర్షి ఈ విధముగా వచింప నారంభించెను.

"పూర్వ మీ మహీపీఠమున కులపద్మ్ముడు అని ఖ్యాతి గడించిన తేజోవంతుడగు 'పద్మ్ముడు' అను మహారాజుగలడు. ఆతడు శ్రీమతుడే కాక వివేకవంతుడు. బహుపుత్రవంతుడునై యుండెను. వర్ణాశ్రమ ధర్మపాలనా విషయమున సముద్రునిగను శత్రుసముదాయమను నంధకారమునకు భాస్కరుని విధమున, గుణవంతులను హంసలకు సరోవరమును వలెను, దోషములను తృణములకు హుతాశనుని పగిది వెలయుచుండెను.

ఆ పద్మమహారాజునకు సౌభాగ్యవతియు, సౌందర్యవతియు సర్వసద్గుణ సమన్వితయునగు లీల కమలాయ అవనియం దవతరించిన విధమున భార్యగా మెలగుచుండెను. ఆమె తన భర్తను ఛాయవలె ననుసరించుచుండును. అతడు సంతాపతప్తుడైన నీమెయు సంతాపము నందును, ఆయన సంతసించిన నీమెయు సంతసించును అతడు వ్యాకుల పడిన నీమెయు వ్యాకులపడును. ఆమె తన పతి దేవునకు ప్రతిబింబమై సంచరించుచుండును. శుభ సంకల్ప శీలయగు లీల యొకనాడు ఈ విధముగ తలపోసెను.

" మహారాజగు నా భర్త, నా ప్రాణముల కంటెను ప్రీతి పాత్రుడు. ఈయన యౌవనోల్లసితుడై జరామరణ వర్జితుడై, శ్రీమంతుడై యుండుటకు నుపాయమేది? ఇట్టి వానితో గూడి యనేక యుగములు, భోగము లనుభవించుట కేదైన ఉపాయ మున్నదా,! ఉండకపోదు. జ్ఞాన వయోవృద్ధులను, తపోవృద్ధులను, విద్యార్థులను, తత్త్వ వృద్ధులునగు బ్రాహ్మణులను రావించి మానవుడు మరణింపకుండ నుండెడి యుపాయ మున్నాదా? అని ప్రశ్నించి నా యభిమత మీడేర్చు కొందును గాక! అనుకొనెను. ఒకనాటి శుభ ముహూర్తమున, పండిత ప్రకాండులను ఆహ్వానించి పూజించి వినయ వినమితగాత్రియై, "బ్రాహ్మణ శ్రేష్ఠులారా! అమరత్వ మెట్లు సిద్ధించును? అని పలుమారు ప్రశ్నించెను. వారు "దేవీ! తప, జపాది నియమముల వలన, సమస్త సిద్ధులు ప్రాప్తించును. కాని, అమరత్వము మాత్రము లభింపదు" అనిరి. ఆ బ్రాహ్మణ పుంగవుల పలుకుల నాలకించి, భర్తృ వియోగము ప్రాప్తించునేమో! యని భావించి, భయభీతయై ఆ లీల వెంటనే స్వప్రజ్ఞతో నిట్లాలోచింప దొడగెను "దైవ యోగమున భర్త కంటె ముందుగ, నాకు మరణము సంభవించినచో ఏ విధమగు దుఃఖమునకు లోనుగాక ఆత్మ సౌఖ్యము నందుదును. అట్లుగాక, వేయి యేండ్ల కయినను, నా కంటె ముందుగ భర్తృ మరణము సంభవించెనేని ఆ జీవాత్మ నా గృహమును వీడి అన్య ప్రదేశమునకు వెడల కుండునట్లు చేయుదును. ఆ విధముగ భర్తృ జీవముగల నా యంతఃపురమున, నిత్యము భర్తచే చూడబడుచున్న దాననై, సుఖముగా నుందును. ఇందు కొరకు ఈనాడే జ్ఞానస్వరూపిణియగు సరస్వతీదేవిని, జపధ్యానోపాసనాది నియమములతో సంతోషాంతరంగ యగునట్లు అర్చించెద గాక!" అని నిశ్చయించి, భర్తకు దెలియకుండగనే ఆ యుత్తముురాలు యథాశాస్త్రముగ నియమమవలంబించి ఘోరముగ తపమాచరించెను.

"మూడు దినములకొక పర్యాయము భోజనమాచరించెను. దేవ బ్రాహ్మణ, పండిత, ప్రాజ్ఞ, గురుజనుల పట్ల భక్తిప్రపత్తులు కలిగి పూజించెను. దాన ధర్మము లాచరించెను. స్నాన, జప తపోధ్యానముల యందు, నిత్యము శరీరమును నియోగించి నియమవంతురాలయ్యెను. ఆస్తిక్య భావముతో సదాచార సంపత్తి కలిగి ఏమాత్రము కష్టము ననుభవించని చిత్తము కలదై యుండెను. ఈ విధముగ మూడు వందల రాత్రులా లీలాబాల నిరంతర కష్ట నిష్ఠలతో తపమాచరించెను."

"ఈ విధముగ సమారాధితయైన భగవతి, సరస్వతి సంతుష్టాంతరంగయై, ప్రసన్నవదనమున ప్రత్యక్షురాలై ఇట్లనెను. "బాలా! భర్తృభక్తితో నతిశయించిన నీ నిరంతర తపోనిష్ఠకు సంతృప్తురాలనైతిని. అభిమతార్థముల నర్థింపుము" అన నా మహారాణి యిట్లు ప్రార్థించెను. "జరా, జన్మములను జ్వాలా దాహదోషమున నడగించు శశిప్రభయైనదానా! నీకు జయమగుగాక! హృదయాంతర్గతాంధకార సముదాయ వినివారణ రవిప్రభా! నీకు జయము!! అంబా! మాతా!! జగన్మాతా!!! ఈ దీనురాలిని రక్షింపుము. నే నర్థించు ని వరద్వయమును ప్రసాదింపుము. మృతుడైన నా భర్తృజీవము, నా యంతఃపురమును వీడకుండుగాక! ఇది మొదటి వరము. ఇక రెండవది, మహాదేవి! నేను స్మరించినంతనే వరప్రదాయినివై, ప్రత్యక్షమగుచుండెదవు గాక!" ఈ మాటలకు జగన్మాత సంతసించి, "అట్లేయగుగాక!" అని వచించి సముద్రమునందు ఉద్భవించిన తరంగము అందే యదృశ్యమైన పగిది యదృశ్యయయ్యెను."

"అనంతర మా రాజమహిషి తన ఆరాధ్యదేవత సంతుష్టాంతరంగయయినదని, అమృతవర్షపాతమున నిండిన మహానది వలె పరమానంద సంబరితురాలయ్యెను."

"క్రమముగ పక్షములు, మాసములు, ఋతువులు, అను నాభివలయములు కలదై, దినములను శలాకలు కలిగి, సంవత్సరములను ఇరుసుతో, క్షణములను నాభికలదై, చలనశీలమైన కాల చక్రము భ్రమించుచుండ లీలాభర్తృ జీవము, శరీరమునుండి యంతర్ధానమయ్యెను. మహారాజు మరణింపగా లీల శోకసంతాప పీడితురాలై, నిర్జలస్థలమందలి తామరపిధమున మిక్కిలి దుఃఖించెను"

"విలపించుచున్నంతలోనే మౌనము వహించి, వియోగ వ్యధిత చక్రవాకాంగనవలె మరణోద్యత యయ్యెను. దుఃఖపారవశ్యమున నీ స్థితిలోనున్న యామెనుజూచి, దయామయియగు సరస్వతి యంబరతలమున నిలచి, కొలను నిర్జలమైనంతనే దురపిల్లు మీనశాబకమును గాంచి కరుణించిన ప్రావృట్కాల పయోదము రీతి నిట్లు పలికెను. "కుమారీ! శవాకారుడైన నీ భర్తను పుష్పరాశియందు భద్రపరపుము. మరల నీ భర్తను బడయగలవు. ఈ పుష్పములు మానములు కావు. నీ భర్తృ శరీరమును చెడదు. అచిరకాలముననే, నీకు మరల భర్తృ ప్రాప్తియగును. నీభర్తృ సంబధమైన జీవము, ఆకాశమువలె విశదమై నీ యంతఃపురమును వీడిపోదు!' అని యంతర్ధానమయ్యెను. దివ్యమైన ఆ భారతీ వాక్యము ననుసరించి లీల, భర్తృ శరీరమును పూలతో గప్పియుంచి, దుఃఖము దుస్సహముకాగా జ్ఞాన స్వరూపిణియగు సరస్వతిని సంస్మరించెను. ఆమె వెంటనే ప్రత్యక్షమై, " బిడ్డా! నన్నేల స్మరించితివి? అత్యంత శోకసంభరితురాలవై యుంటివేల?" అని ప్రశ్నించెను. అంత లీల, "తల్లీ! నా భర్త ఎచటనున్నాడు? ఏమి చేయుచున్నాడు? ఎట్లున్నాడు? నన్నాతని కడకు గొనిపొమ్ము. ఒంటరిదానినై జీవింపజాలను." అని వ్యథనందుచుండ సరస్వతి ఇట్లు ప్రబోధించెను. పుత్రీ! చిత్తాకాశము, చిదాకాశము, ఆకాశమునని పరమాత్మ స్వరూపము ముత్తెరగులుగా నుండును.

అందు ఆకాశము స్వచ్ఛమైన, సూక్ష్మమైన ధర్మములచే నొప్పుచుండును. చిత్తాకాశము వాసనామయమైనది. ఆకాశ, చిత్తాకాశములకు భిన్నమైనది చిదాకాశము. శ్రేష్ఠురాలా! మనస్సు యొక వస్తువునుండి మరియొక వస్తువువైపు మరలునప్పుడు ఆమధ్యలో నుండు తృటికాలమును చిదాకాశమందురు. ఇది సంపూర్ణముగా నశించెడి సంకల్పములుగల స్థితిని పొందగలవేని, సర్వాత్మకము, శాంతమైన పరమ పదమును, నిస్సంశయముగా పొందగలవు. సుందరీ! సంపూర్ణ శూన్యతా భావసంపదచే జగత్తునుండి దీనిని పొందవచ్చును గాని మరియొక విధముగా లభింపదు. నీవు మాత్రము, నా యనుగ్రహ విశేషమున తొందరగనే యా స్థితిని పొందగలవు " అని వశిష్ఠమహర్షి ప్రబోధించి మరల నిట్లనెను.

"ఆ సరస్వతి దివ్యమగు తన స్థానమునకు వెడలిపోయిన యనంతరము లీల విలాసముగా నిర్వికల్ప సమాధిని పొందెను. క్షణమాత్రమున తన దేహమును అంతఃకరణ పంజరము నుండి గూటిని వీడిన పక్షివలె విడిచి ఆకసమున కెగసెను. అచట ననేకమంది రాజులు, కొలువుదీరి యున్నచోట తనభర్తనుగూడ గాంచెను ఆయన సింహాసనారూఢుడై యుండెను. తూర్పుదిక్కున నసంఖ్యాక ముని సముదాయము 'జయమగుగాక! చిరకాలము జీవింతువుగాక!" అని దీవన లిడుచుండెను. పశ్చిమ ద్వారమున ననేకమంది రాజసముదాయ మున్నది. ఉత్తర ద్వారమున ననేక రథములు, నేనుగులు, గుర్రములు నుండెను. దక్షిణ ద్వారమున ననేకమంత్రి లుండిరి. ఆ రాజసభ మహాసంరంభముగా నుండెను."

"ఆ దేశీయులను వారి యాచారములను వ్యవహారములను, బాలబాలికలను, అపూర్వపండితులను, స్నేహితులను దర్శించెను. మహానదులు, పర్వతములు, గ్రామములు, పట్టణములు మున్నగు వాటిని దర్శించినది. తనకు ఇదివరకున్న వృద్ధావస్థను వీడి

పదునారు వత్సరముల వయస్సులోనున్న మహారాజును వీక్షించి, మహైశ్చర్య నిమగ్నమాన మానసయయ్యెను. అచటి నుండి తన యంతఃపురమునకు మరలి వచ్చెను. తిరిగి సరస్వతీదేవిని స్మరించుట తోడనే యామె ప్రత్యక్షమైనది. లీల యామె నొక సింహాసనమున నాసీనజేసి ఇట్లు ప్రశ్నించెను. "తల్లీ ! నా భర్తకు ఈ సృష్టికంటె వేరగు భ్రమాత్మకము రూపరహితమునగు సృష్టి ఎట్లు లభించినదో, నా భ్రాంతి నివృత్తికై వివరింపుము" అని ప్రార్థించెను. "ఈ సృష్టి యంతయు భ్రాంతి మాత్రమై స్మృతికి పూర్వానుదయించిన విధముగా నీ భర్తకు రెండవ సృష్టి అనగా జన్మను సంభవించిన విధము నభివర్ణించు చున్నాను." వినుము అని సరస్వతి ఇట్లు చెప్పదొడగెను.

"పుత్రీ! చిదాకాశమం నందొకచోట ఆకాశమువంటి కాచ (గాజు) దళాచ్ఛాదితమైన, సంసారమను నాకారముగల మంటపము కలదు. అందు మేరుపర్వతమను స్తంభము కలదు దానియందు తమ తమ భార్యలతో గూడిన లోకపాలకులను సాలభంజికలు గలవు. కోణ భాగములందు భూతకోటియను పుట్టలతో గూడిన పర్వతముల వంటి మట్టి తిన్నెలు గలవు. బహు సంతానవంతుడైన బ్రహ్మవంటి బ్రాహ్మణుల కది నిలయము దేవతలు వాయుమార్గమున వెదురు విమానములందు విహరించు కీటకములవలె సంచరింతురు. అంతరిక్షమున వసించు సిద్ధసమూహ యమను దోమలఘుమఘు మధ్యనులు వ్యాపించి యుండును. దేవతలు, రాక్షసులు నను దుష్టబాలకుల ఆటపాటల కలకలధ్వనుల వ్యాకులముతో నా సంసార మంటపము నిండి యుండును."

"ఆ మంటపమున నొక మూల నొక పర్వతమువంటి తిన్నె యందు గిరిగ్రామ మను పల్లపు ప్రాంతము కలదు. నదులు, పర్వతములు మున్నగు వానిచే నావరింపబడిన ఆ గ్రామమందు పండితుడగు బ్రాహ్మణు డుండెను. అతడు శ్రౌతాగ్నుల నారాధించును. సపత్నీకుడు, ఆరోగ్యవంతుడు, పాడియావులు

కలవాడు. రాజభయ విధూరుడు అతిథి, అభ్యాగతుల నాదరించు వాడు, తపోధనుడు, ధర్మపరుడునై యుండెను. వయోవేష కర్మ విద్యా వైభవములచే వశిష్ఠ సమానుడు. కాని, అతటి జ్ఞాన సంపన్నుడు కాడు. అయినను వశిష్ఠ నామధారియై ప్రసిద్ధి వహించెను. చంద్రునివలె సుందరమైన వదనముకల ఆతని భార్య, సప్తర్షి మండలమున నున్న అరుంధతీ నామమును ధరించి భూలోకమున కవతరించిన యరుంధతిగా ప్రఖ్యాతి వహించెను. పాతివ్రత్యాది విషయము లందు అరుంధతి వంటిదే కాని, ఆ అరుంధతి మాత్రము కాదు.

"ఒకనాడీ వశిష్ఠుడు సకల వృక్షములతోడను పచ్చని పచ్చికతో రమణీయమైన నొక పర్వత ప్రదేశమునను పవిష్టుడై సమగ్ర పరివార సమేతుడై, మృగయా వినోదాభిలాషతో దిగువ భాగమున కరుదెంచిన మహీపతి నవలోకించెను. ఆతని వైభవోన్నతిని దలపోయుచు నీ వశిష్ఠుడాత్మగతమున, "సర్వసౌభాగ్య సముజ్జ్వలమైన ఈ రాచరిక మెంత మనోహరమైనది! ఎన్నటికైన దశదిశాంతర వ్యాపిత కీర్తి మంతుడనైన మహారాజుగ జన్మింప గలుగుదునా! ఈ కొల్బలము, రథ. గజాశ్వము లు, ఛత్రచామరాది భోగముల ననుభవింతునా! కుంద మకరంద సుగంధ వాయువులు సేవింతునా! అంతఃపుర వనితా సురతశ్రమ ఆ వాయువులచే నుపశమించునా?" అని ఈ విధముగా సంకల్పములు కలవాడై, స్వధర్మ కర్మ నిరతుడై కాలము గడపు చుండెను కొంత కాలమున కా బ్రాహ్మణునకు పచ్చికను మంచు జలము కొన్న పగిది మాయ ఆవరించినది. ఆసన్న మరణుడైన, ఆ బ్రాహ్మణుని భార్య మిక్కిలి విచారము కలదియై 'నీవు నన్ను ప్రార్థించిన విధముగనే ఆరాధించి అమరత్వము దుర్లభమని భావించి వర మర్థించినది. "దేవీ! నా భర్త మరణించినచో ఆయనలోని జీవాత్మ నా భవనమును వీడిపోకుండు నట్లు వరమిమ్మ." అన నే నామెకట్లే వర మిచ్చితిని.

కాలవశమున నొకనాడా బ్రాహ్మణుడు మరణించెను. ఆ యింటి ఆవరణమునందే ఆతడు జీవాకాశమును పొంది యుండెను. జీవాకాశమనగా అంతఃకరణ వాసనలు కలిగి యుండుట.

ప్రాక్తనములగు అనేక సంకల్ప వశమున ఆ బ్రాహ్మణుడు, ఆకాశ శరీరము గలవాడయ్యెను, పరమశక్తి సమన్వితుడైన, మహారాజుగ నవతరించెను. అతని మరణానంతరము పతివ్రతయగు అరుంధతి దుఃఖవివశురాలై కృశించి మరణించినది. భౌతిక శరీర పరిత్యాగ మొనరించి, సూక్ష్మ శరీరమును ధరించి, భర్త సాన్నిధ్యమును పొందెను. ఆ గిరి గ్రామము నందా వశిష్ఠునకు పుత్రులు. గృహములు, భూ స్థావరముల సంపత్తి కలదు. అతడు మరణించి ఎనిమిది దినములైనను, జీవము మాత్రము గ్రామము నందు, గృహాకాశమునందే యుండెను. రాజుగ జన్మించిన ఆతడే ఈనాటి నీ భర్త. అతని భార్య అరుంధతి. నీవుగా జన్మించితివి.

పుణ్య దంపతులగు పార్వతీ పరమేశ్వరుల విధమున మీ దంపతులు భూమిపై నీ తీరుగ నవతరించి రాజభోగము లనుభవించు చున్నారు.

ప్రాక్తనమగు సంసార భ్రమ సంతతిని నీకు వివరించితిని. భ్రాంతి మూలకమైన శూన్యము సృష్టిగా భాసించు చుండును. కనుకనే కులపద్మudu మరణించిన తరువాత గూడ రాజ్య పాలనము చేయుచుండుట, లీలాదేవి సమాధి నిష్ఠురాలై చూచుట, కులపద్ముడు మృతుడు గాక పూర్వము రాజ్యము నేలుట ఇది యంతయు భ్రాంతియే యగును. అట్లే ఇంతకు బూర్వము బ్రాహ్మణుడై యుండుటయు భ్రాంతి మాత్రమే యగును, అని బృహద్వాశిష్ఠమున వివరింపబడినది.

సరస్వతి వివరించిన విధమును విని, లీలాదేవి ఇట్లు ప్రశ్నించెను. " దేవీ ! నీ పలుకులు యథార్థములుగా దోచుట లేదు.

ఈ విధముగ నెట్లు సంభవించును ? బ్రాహ్మణుని జీవమెక్కడ ? స్వగృహమున నుండుట ఎక్కడ ? మే మిచట నీ రూపములతో నుండుట ఎక్కడ ? ఇచ్చట నా లోకాంతరములు, ఆ భూములు, ఆ పర్వతములు, ఆ దశదిశలు గృహాంతరములో నెట్లుండును ? ' ఆవగింజలో ఐరావతమును బంధించితిని. పరమాణువున మశకము మృగేంద్ర సముదాయముతో పోరు సల్పుచున్నది. తామర బీజమున మేరు పర్వతమును స్థాపింపగా తుమ్మెదపిల్ల తినివేసినది. అను మాటలు అసమంజసములైనట్లే నీ పలుకులు నసంగతములుగా దోచుచున్నవి." అనగా నా దేవి ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను

"సుందరీ ! నే నెన్నడును అనృతములు భాషింపను. యథార్థమునే వచించుచున్నాను. "నానృతంబ్రూయాత్" అసత్యమాడరాదు అను నియమమును మాలాటి వారలతి క్రమింపరు."

"ఆ గిరి గ్రామ మందుండు బ్రాహ్మణుని జీవాత్మ, ఆ గ్రామము నందే, ఈ మహీ రాజ్యమును, చిదాకాశ రూపమును దాల్చి, చిత్తాకాశమునందు జూచుచున్నాడు. మేము బ్రాహ్మణ దంపతులము, అను ప్రాక్తన స్మృతి, మీ దంపతులకు లుప్తమైనది. అంతియకాని వేరు కాదు.

"జాగ్రదవస్థ యందున్న స్మృతులు స్వప్నావస్థయందు నశించును. దీనిని 'మరణ' మనియు నందురు. దర్పణమున స్వప్నము ప్రతిబింబించునట్లు, సంకల్పమాత్రమున భూమండల మంతయు నంతరంగమున దృశ్యమానమగును. కాని ఇది యంతయు సత్యముకాదు. పంచకోశముల నడుమ, చిదాకాశము నందు భాసించునది మాత్రమే సత్యపదార్థమగును. బిడ్డా ! ప్రతి చిదాత్మయందు, పరమాణు రూపములై, జీవస్వరూపములై, అంత రాంతరములందు ప్రతిభాసాత్మకములైన జగము లెన్నియో గలవు." అనగా లీలాదేవి ఇట్లు ప్రశ్నించెను. "పరమేశ్వరి !

బ్రాహ్మణుడు ఎనిమిది దినముల క్రిందట మృతుడైనాడు అని యంటివి. కాని, మాకవి ఎన్నియో సంవత్సరము లైనట్లుగా నున్నది. ఇట్లగుటకు కారణమేమి ?" యన దేవి ఇట్లు సమాధానము నిచ్చెను.

" చిద్వ్యోమాకాశరూపియగు బ్రహ్మ పదార్థమునకు దేశ విస్తృతి లేని విధముగనే కాలవిస్తృతియు లేదు. అది ప్రతిభా మాత్రకము" దీని క్రమ మభివర్ణించు చున్నాను వినుము.

" మిథ్యామాత్రములైన మరణ మోహములను జీవుడు క్షణకాల మనుభవించి, మరుక్షణముననే ప్రాక్తన భావమును మరచి, వేరొకభావము ననుభవించు చున్నాడు. సుందరీ ! నేనీ వస్త్వాధారముగ నున్నాను. ఇది నాకు ఆధేయము. ఈ హస్త పాదాద్యవయవములు గల దేహము నాది. ' అని భావించుచున్నాడు. నేనీ తండ్రికి బుత్రుడను. నాకు ఇన్ని సంవత్సరముల వయస్సు కలదు. వీరు నాకు ఆప్త బంధువులు. ఇది నా సుందర మందిరము అను నీ మొదలగు భ్రాంతులెన్నియో ఈ జగత్తున నుండును. మృతి మోహానంతర మీ భ్రాంతు లుండవుకదా !" అని వివరింప నా లీలాదేవి యిట్లు ప్రశ్నించెను. " దేవీ ! పరమాత్మ దృష్టిని నాకు ప్రసాదించితివి. కాని ఈ దృష్టియందు నాకు పరిపక్వ స్థితి సిద్ధింపలేదు. అభ్యాసము లేకుండ నది సిద్ధింపదు. అంతవరకు బ్రాహ్మణ దంపతుల సృష్టిని గూర్చిన విషయమును బోధపడదు. కాన ఈ విషయమున నాకుగల యుత్సాహమును దీర్పుము " అని యర్థించెను. అంత నాదేవి ఈ విధముగ నుపదేశించెను.

" అదృశ్యమైన చిద్రూపము పరమ పవిత్రమైనది. అది జ్ఞాన రూపము. ఈ స్థూలరూపమును పరిత్యజించి ఆ రూపమును ధరింపుము నిర్మల దృష్టికల దానవగుము. అట్లయినచో ఆ బ్రాహ్మణ దంపతులను నిరాటంకముగ జూడగలవు. భౌతిక దేహ మాసృష్టిని జూడ జాలదు. ఈ జగత్తులు రూపరహితములు, మాయచే మూర్తిమంతములుగ

దోచుచున్నవి. మీవంటివారు బంగారమును ఉంగరమని తలంచు చున్నారు. బాలా! అభ్యాసము లేక పోవుటవలన, ఆకారము బ్రహ్మత్వము నొందజాలకున్నది. అది కల్పనా రూపమును ధరించి యున్నది. అందువలన బ్రహ్మపదార్థమును జూడజాలవు. అభ్యాస వశమున మా వంటివారు స్థిరమైన బ్రహ్మ సంవిత్తి మార్గమును జూచుచున్నారు. ఇక మీ వంటివారు చిరకాలము ఆధిభౌతిక బుద్ధి కలవారలగుటవలన, ఆతివాహికమని భావించుచున్నారు. దేహ సంబంధమైన వాసన యున్నంతవరకు నీకు దేహముపట్ల ఆతివాహిక భావమే యేర్పడుచుండును. పరిశుద్ధమగు సత్వమును పొందిన వాసన, మిక్కిలి విస్తరించి మంచు ఉష్ణము సోకినంతనే నీరుగా మారిన విధమున ఆతివాహికతను అనగా సూక్ష్మ శరీరమును పొందును. నిర్మల దేహసంబంధమైన వాసనకై యత్నింపుము. దాని యందు అనుభవము లభించి జీవన్ముక్తురాల వగుదువు. శీతకరుడగు జ్ఞానచంద్రుడు, పరిపూర్ణత నందువరకు ఈ శరీరమును ఇక్కడనే యుంచి, వేరొక సృష్టిని దర్శింతువుగాక!" అనగా లీల ఇట్లు పలికెను. "దేవీ! జ్ఞాన పరిపూర్ణతకు ఉపకరించెడి అభ్యాసమేది? దాని నెట్లభ్యసింప వలయును? అది వృద్ధిపొందు విధానమేది? వృద్ధి నందిన తరువాత ఏమి జరుగును?" అన సరస్వతి ఇట్లు వివరింప దొడగెను.

"కుమారీ! బ్రహ్మ పదార్థమును గూర్చి విచారించు చుండుట, ఇతరులకు బోధించుట, తనకు తెలియని విషయములను, తెలిసినవారినుండి తెలిసికొనుట, దాని యందు నిమగ్నమై యుండుట, అను వాటిని అభ్యాస మందురు. ఔదార్యము, సౌందర్యము, వైరాగ్యముల సారాంతరమందు ఆనందాను భూతిగల మనస్సు కలవారు మాత్రమే పరబ్రహ్మాభ్యాసమున కర్హులు. దృశ్యము అసత్యము అను నిశ్చయ భావ సంపత్తి కలవారికి, జ్ఞేయవస్తువు యుక్తిమూలమున, శాస్త్రములవలన స్థిరబుద్ధికలవారు

బ్రహ్మాభ్యాస పరులు. సృష్ట్యాదియందు ఈ దృశ్యపదార్థము ఉత్పన్నమైనది. ఇది సర్వదా నిలిచియుండదు. ఇది జగత్తు. ఇది నేను, అని త్రికాలములందు అభ్యాసము చేయుటను పరమాత్మ బోధాభ్యాసమని పండితులు పల్కిరి. రాగ ద్వేషాది భావములు నశించి, దృశ్యభావనను విడచి జ్ఞాన వాసన దృఢముగా నభివ్యక్తమగుట బ్రహ్మాభ్యాసమని యందురు. దృశ్యాసంభవ బోధము జ్ఞానమగును. ఇదియే జ్ఞేయం. దాని నభ్యసించుటవలన అనగా అపరోక్ష జ్ఞాన ప్రాప్తివలన మోక్షము సిద్ధించును" అని వరాంగన లిరువురు నా రాత్రి సంభాషించుకొని, నిశ్చల సమాధి స్థితికు నిరుపద్రవమగు ప్రదేశమునకేగి సమాధి మగ్నులైరి అని వశిష్ఠుడు శ్రీరామచంద్రునకు ప్రబోధించెనని వాల్మీకి మహర్షి భరద్వాజునకెరిగించెను.

"నిర్వికల్ప సమాధి మగ్నులైన ఆ లీలా సరస్వతులు పూర్వ దైహిక వాసనలను పరిత్యజించిరి. సరస్వతీదేవి జ్ఞాన దేహముతో సంచరింప మానవసతిలీల మానుష దేహమును విడిచి సంచరించెను. ఈమెకు ప్రాదేశమాత్ర దేహాంతరము లభించినది. చిదాకాశరూపిణులైన లీలా సరస్వతులు రూపాంతరములు ధరించి ఆకాశమున విలాసముగ సంచరించిరి అసంవిత్తి స్వభావము కలవారలై నందున బహుదూరము ప్రయాణించిరి. ఏ కార్ణవమై యున్న గంభీర నిర్మలాకాశమును దర్శించిరి. అచట సుఖావహమగు వాయు స్పర్శ ననుభవించిరి. వాయువేగ మనోవేగాది మహా సిద్ధులు, ఉచ్ఛ్వాస నిశ్వాసలను జయించినవి ఒక వంక కూష్మాండ, రాక్షస, పిశాచ సముదాయము కలదు. మరియొక వంక సముద్ర తరంగములవలె ఢాకినీ సంఘములు, చిత్ర విచిత్ర గతులతో నాట్యమాడుచున్నవి. శ్వాన, వాయస, ఉష్ట్ర, ఖదాననులగు యోగినీ జన పరివృతమై యుండెను. వారు నిరర్థకముగా శత యోజనముల పర్యంతము సంచరించి మరలి వచ్చుచుండిరి. వాయు విశేషరూపమైన జ్యోతిర్మండలమున ప్రవహించు గంగా జలము కలదు. భిత్తిరహిత

ములుగా నిర్మితములైన గృహములందు నారద తుంబురులు గాన మాలపించుచుండిరి. కల్పాంత మేఘము లొకచోట, చిత్రార్పితముల భాతి మూకాకారములు ధరించి భాసించుచుండెను. వేరొకచోట సప్తమాతృకలు నున్మత్తులై పంక్తులు తీర్చి యుండిరి. కొన్ని లక్షల యోజనములు భూతజాలము లేక శూన్యమై యుండెను. శాశ్వతమైన గాఢాంధకార మొక వంకను, శాశ్వతమైన తేజఃపుంజములతో సూర్యాగ్నుల కాంతుల ననుకరించుచు వేరొక బోవెలుగొందు ఆకాశమును తిలకించిరి. మేడింఁదు గర్భములో నుండి వెలువడు పురువుల విధముగ దోచు, మల్లోకము లందున్న భూత సముదాయమును అధఃకరించి ఆ లీలా సరస్వతులు నింకను ఉపరితలమున కేగి, అచట కొంతవడి సంచరించి, తిరిగి భూతలమునకు వచ్చుటకు ఉద్యుక్తులైరి" అని వశిష్ఠమహర్షి యభివర్ణించెను.

ఇట్లు ఆ లీలా సరస్వతులు బ్రహ్మాండ మండలమంతయు పరిభ్రమించి గిరిగ్రామముననున్న వశిష్ఠ గృహమున కేతెంచిరి. జ్ఞాన సిద్ధినిపొందిన వారలగుట వలన వీరిరువురు నదృశ్యరూపములు కలవారై యుండిరి. వశిష్ఠుని దాసదాసీజనము విచారగ్రస్తమై యుండెను. నిరంతరాశ్రుపాతము వలన కళాహీన వదనులై యున్న యా బ్రాహ్మణ గృహిణులు పూర్వవైభవము నంతయు గోల్పోయి పిడుగుపడి తగులబడిన చెట్టువలె నుండిరి.

అనంతర మాలీలాదేవి, చిరకాలము నిర్మల జ్ఞానము నభ్యసించిన దగుట వలన, సత్యకామయు, సంపన్నురాలు, సత్యసంకల్పమునై దేవతా స్త్రీవలె నుండును. ఆమె 'వీరు నా బంధువులు. ఈ దేవిని, నన్నును వీరు చూచెదరుగాక! అని సాధారణ వనితా రూపమును తలంచెను. వెంటనే ఆ యింటిలోనివారు సాక్షాత్కరించిన మహాలక్ష్మి, గౌరీదేవుల వలెనున్న నా స్త్రీద్వయమును

జూచిరి. ఈ వనితాద్వయ మా గృహమును తేజోమయ మొనరించు చుండిరి.

వశిష్ఠుని కుమారులలో జ్యేష్ఠశర్మ అను నాతడు లీలా సరస్వతులను వనదేవతలనుగా భావించెను గృహపరివార జనముతో గూడి వారికి వందన పుష్పాంజల్యాదు లర్పించెను " దేవతలారా! మా మాతాపితరులు జగత్తున సర్వోత్తములు అతిథి సత్కార నియమ నిష్ఠాగరిష్ఠులగు వంశోద్ధారకులు. బ్రాహ్మణ కులస్థితికి ఆధారభూతులు. అట్టివారు తమ పుత్రులను, పశువులను, బంధువులను, గృహ, సంపదలను వీడి స్వర్గమలంకరించిరి మాకీ ముల్లోకములు శూన్యములుగా తోచుచున్నవి దేవతలగు మీరు మాకు శోకవినాశము జేయుదురుగాక! మహాత్ముల దర్శనమెన్నడును నిష్ఫలముకాదు గదా!" అని అభ్యర్థించు కుమారుని జేరజేరి యా లీల అతని శిరస్సును తనచేతితో స్పృశించెను. వెంటనే అతని దుఃఖ సంకటములు దూరములయ్యెను తొలకరి మబ్బు సంసర్గమున గ్రీష్మతాపము శాంతించిన పర్వతము రీతినయ్యెను మిగిలిన పరిజనమును దుష్కర దుఃఖ విదూరులైరి. ఆ పర్వత సమీపమందలి గిరిగ్రామమునగల గృహాంతరమందున్న వారినిగాంచి, పరామర్శించి, సిద్ధాంగన లిరువురు నంతర్హితులైరి."

"బిడ్డా! జ్ఞేయవస్తువును సంపూర్ణముగ దెలుసుకొంటివి. దృష్టాంత స్మృతులను దర్శించితివి. బ్రహ్మసత్త్వ మిట్టులుండును. ఇంక నేమి తెలుసు కొనదలచుచుంటివో చెప్పుము." అని ఆ జ్ఞాన మూర్తియగు సరస్వతి ప్రశ్నించెను. "దేవీ! మరణించిన నా భర్తృజీవము రాజ్యపాలన మొనరించు దేశమునందలి ప్రజలు, నన్ను జూడజాలరైరి కాని గిరి గ్రామమందలి నా పుత్రుడు మాత్రము దర్శింప గలిగెను. దీనికి కారణమేమో తెలియజేయుము." అని లీలాకాంత ప్రశ్నింప నా దేవి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "నీ భర్తృజీవము రాజ్యపాలనముజేయు దేశమున కేగినపుడు

నీకభ్యాసము స్థిరపడనందున ద్వైతభావము నశింపలేదు. ఇంతియ కాదు నేను లీలను, అను అహంభావము కూడ నస్తమించ లేదు. కాన అపుడు సత్యములగు సంకల్పములు కలుగలేదు. ఇపుడు ద్వైతభావము నశించినది. అహంభావ మస్తమించినది. సత్య సంకల్పము లుద్భవించినవి. 'నా కుమారుడు నన్ను దర్శించుగాక!' అని భావించినంతనే నీ వాంఛిత మీడేరినది. ఈ స్థితిలో నీ భర్త సమీపమున కేగితివేని, పూర్వపు రీతి నాయనతో వ్యవహారింపగలవు." అనగా నా లీల యిట్లు వచించెను. "జగన్మాతా! నా జన్మ రాజసమైనది. కాని తామసికము, సాత్త్వికమును కాదు" అని తెలుసుకొంటిని. సృష్టి యారంభమైనది మొదలు నింతవరకు నేను ఎనిమిది వందల జన్మముల నందితిని. వివిధ యోనులయందు బుట్టి, గిట్టితిని ఇప్పుడవి యన్నియు నొకదానివెంట నొకటి స్మృతిపథమున మెరయుచున్నవి."

"దేవీ! ఒకప్పుడు నేను సంసార మండలమున లోకాంతర మను పద్మమందు షట్పదముపగిది విద్యాధర వనితనై జన్మించితిని. మరియొకప్పుడు దుర్వాసనా దూషితురాలనై మానవకాంతగా ప్రభవించితిని. వేరొకప్పుడు పన్నగరాజ భామినిగ నవతరించితిని. ఇంకొకపుడు బిల్వజంబీరాది వృక్ష సముదాయముగల వనాంతర సంచారిణినై, వృక్షపత్రములు వస్త్రములుగా ధరించు శబరాంగనగా బుట్టితిని అనంతర మొకప్పుడు పక్షిగా జన్మించి, యొక వ్యాధుడు పన్నిన వలలో జిక్కికొంటిని అతి కష్టమున నీచములగు నా వాసనలను ఛేదించిన విధమున, ఆ వలను ఛేదించితిని. ఇంకొకప్పుడు భ్రమరాంగనగా రూపుధరించి, నా చెలికానితో గూడి పద్మకోశమున పుప్పొడి నారగించుచు కర్ణికాగ్రకోశయ్యపై నేకాంతముగ విశ్రమించి యుంటిని. పురుష ఫలప్రదాయకములగు కర్మల పరిపాకము ననుసరించి సౌరాష్ట్ర దేశమున మహారాజుగ నవతరించి యనేక సంవత్సరములు రాజ్యపాలన మొనరించితిని.

అటు తరువాత బూరుగు చెట్టు ఆకులను బట్టి ఉయ్యాలలూగు దోమల గుంపులోనొక దోమగా బుట్టితిని. కాని తోటి దోమలవలె నయ్యాలలూగు అదృష్టమునకు నోచుకొనక దీనురాలనై చూచు చుంటిని. ఇట్లు అనేక విధములగు దుఃఖ పరంపరలతో గూడిన అనంతములగు జన్మ పరంపరల ననుభవించి, యనేక కష్టముల ననుభవించుచు, చుకానిలేని యోడ ప్రవాహవేగమున బడికొట్టు కొని పోవు విధమున ఈ సంసార చక్రమున భ్రమించితిని " అని లీల చెప్పుచుండ సరస్వతి యాలకించుచు యోగమార్గమున నంబర తలమందు చాల దూరము పయనించిరి. " అని వశిష్ఠుడు శ్రీరామ చంద్రున కెరిగించి మరియు నిట్లు వచింప నారంభించెను.

" లీలా సరస్వతు లిరువురు నా సృష్టినుండి, ఈ రెండవ సృష్టికి వెంటనే చేరుకొనిరి. లీలాంతఃపురమున పుష్పాచ్ఛాదిత మైన మహారాజ కళేబరమును జూచిరి. యోగనిష్ఠలో నున్న లీలాదేవి సరస్వతీదేవితో గూడ భర్తృ దేశమున ప్రవేశించెను. ఇంతలో నొక రాజు తన సామంతరాజ సైన్యసమేతుడై మిగుల నుద్రేకమున నా దేశముపై దండెత్తి వచ్చెను. ఆకాశము వలె మిక్కలి విస్తీర్ణమైన ఒక మహారణ్య మైదానమున యుద్ధము నిర్ణయమయ్యెను. ఉభయ సైన్యములు తమ తమ రాజులను, ప్రశాంతముగ నున్న మహాసాగరములవంటి, తమ మధ్యనుంచు కొని పోరు సల్పుచుండెను. ప్రజ్వలితాగ్నులరీతి నా సైన్యములు విజృంభించుచుండెను. ఆకాశవీధి యందుండి లీలా సరస్వతు లిరువురు నా భీకర దృశ్యమును దర్శించుచుండిరి.

ప్రళయ సమయ ఉల్లోల కల్లోల మహాసాగరమువలె నా రాజ సైన్యము లుప్పొంగి, విస్ఫులింగములవంటి యాయుధ ప్రహారములు చేయుచుండిరి. పడిపోవుచున్న మదపుటేనుగులచే భూమి కంపించు చుండెను. యంత్రములందు ప్రయోగింపబడిన

పాషాణములకు భయపడి ఖేచరులు దూరముగ తొలగిపోవు చుండిరి. సుదూరమువరకు నెగిరి ఖద్యోతములవలె ప్రకాశించు ఖడ్గఖండములు కనులకు మిరిమిట్లు గొలుపుచుండెను. పిడుగుల వంటి పిడిగుద్దుల తాకిడికి భటుల కవచములు బ్రద్దలగు చుండెను. వీర సముదాయమను మేఘ సమూహము, బాణ పరంపరలను, వర్ష ధారలు గురియింప, తలలు తెగిన మొండెములను మయూరములు నాట్యమాడుచుండెను. ప్రళయ కాలమున గిర గిర తిరుగు కులపర్వతములరీతి మద మాతంగములు పరిభ్రమించుచుండెను. ఆ సంకుల సమరమున భుజాస్ఫాలనములచే సందడించు భటసముదాయమున, అష్టభాగ దశాశేషమగుట ప్రతాపము గోల్పోయిన వీరునివలె, రవి తన ప్రతాపమును కోల్పోయెను. దూతలు, సేనాధిపతులు మంత్రులతో మంతనములు సలిపి ఆ దినమునకు యుద్ధమును చాలించిరి. దిక్కులు పిక్కటిల్లునట్లు ధ్వనించెడి యుద్ధ దుందుభులు మౌనము వహించినవి. ఉభయ సైన్యములు తమతమ శిబిరములకు తరలి పోవుచుండెను. రక్త సిక్తుడైన వీరవరునివలె రవి తన నిలయమునకరిగెను.

చీకటి సైన్యము, ముందు నడచుచుండ ఉదారాత్ముడగు లీలాకాంతా కాంతుడు, మనఃఖేదముతో మతిమంతులైన మంత్రి పుంగవులను రావించి, భావికార్యక్రమమును గూర్చి సమగ్రముగ నాలోచించి, చంద్రకాంతమణిమయ శయ్యాగృహమున నొక ముహూర్త మాత్రము విశ్రమించెను.

అనంతరమా దివ్యయోగినీద్వయము లీలా సరస్వతులు రాజ శయనాగారమున ప్రవేశించిరి. సుధాకర కిరణ శీతలత, సంతరించుకొన్న వీరి శరీర కాంతులకు మహారాజు ఆహ్లాదితుడై అమృతసిక్తునవలె మేల్కాంచెను. ఎదురుగా రెండు సింహాసనము లందధిష్ఠించియున్న అపరూప సౌందర్యవతులను వీక్షించి, త్రుటికాల

మాలోచనా నిమగ్నమానసు డయ్యెను. వెంటనే ఆశ్చర్య పులకిత గాత్రుడై, శేషశయ్యనుండి ఉత్థితుడగు శ్రీ మహావిష్ణువువలె లేచెను. పుష్పలావికుని పగిది వికసిత పుష్పసంతతుల నంజలి నిండుగ గ్రహించెను. భూమి మీద పద్మాసనా బద్ధుడై యుపవిష్టుడయ్యెను. ప్రజా దుస్థితి దాహదోషమునకు చంద్రకాంతివలె, బాహ్యాభ్యంతర వ్యాపితాంధ కారమును నశింపజేయు రవి ప్రభలవంటి మీకు జయ్యమగుగాక !' అని వారి పాదములపై పుష్పాంజలి సమర్పించెను.

మహారాజ జన్మవృత్తాంతమును లీలకు వివరించి చెప్పదలచిన సరస్వతీదేవి, అటనే యొకప్రక్క శయనించియున్న మంత్రిని తన సంకల్ప మాత్రమున మేల్కొల్పెను. ఆతడు యోగినులను దర్శించి, వందన మాచరించి, పాదములను పుష్పాంజలితో నర్చించి వినమ్రుడయ్యెను. అంత నా సరస్వతి నీ "వెవరి పుత్రుడవు ? ఎప్పుడు జన్మించితివి ? నీ జన్మ వృత్తాంతమును వివరింపుము" అని యాజ్ఞాపించెను. ఈ పలుకుల నాలించి మంత్రి ఈవిధముగ ప్రత్యుత్తర మొసంగెను.

"దేవతలారా ! మీ యనుగ్రహము వలన నా జన్మవృత్తాంతము నెరిగించుటకు నాకు తగిన సామర్థ్య మేర్పడినది ముందుగ మా ప్రభు జన్మవృత్తాంత మెరిగింతును ఆలింపుడు " ఇక్ష్వాకు వంశమున ఐశ్వర్యవంతుడు పరాక్రమ వంతుడునైన 'కుందరథుడను మహారాజుగలడు. ఆతనికి పూర్ణచంద్ర నిభాననుడైన 'భద్ర రథుడను పుత్రుడు కలడు. అతని కుమారుడు' విశ్వరథుడు. ఇతనికి 'మనోరథుడను పుత్రుడు కలడు. మనోరథునకు విష్ణురథుడను, ఇతనికి' బృహద్రథుడును జనించెను. ఈయన తనయుడు సింధురథుడు. ఈయనకు శైలరథుడు, ఈతనికి' కామరథుడు, ఇతనికి మహారథుడు, జన్మించెను మహారథుని కుమారుడు 'విదూరథుడు. ఈయిన మాయేలిక సుప్రసిద్ధుడు. గౌరిదేవికి కుమార

స్వామి జనించిన విధమున ఈయన తన తల్లియగు సుమిత్రకు పూర్వపుణ్య విశేషము వలన నపర కుమారస్వామిగ జన్మించెను.

విదూరథుడు దశవర్ష ప్రాయుడై యుండ, ఈయన తండ్రి రాజ్యభారమును, కుమారునకు సమర్పించి, తాను వానప్రస్థాశ్రమ స్వీకార మొనరించెను. అనాటినుండి ఈయన మా మహారాజు. ధర్మ బద్ధముగ న్యాయము నతిక్రమింపక రాజ్యపాలన జేయుచుండెను అని సచివపుంగవుడు మౌనము వహించెను. దోసిలియొగ్గి పద్మా సనబద్ధుడై యున్న మహారాజు శిరమును నిమురుచు సరస్వతీదేవి "రాజా! నీవు పూర్వజ్ఞాన సంపన్నుడవై గత విషయములు వివరింపుము" అని ఆజ్ఞాపించెను.

మహారాజు నావరించిన మాయ తొలగిపోయినది. అంత రంగము కాంతి వంతమయ్యెను. పూర్వజన్మ వృత్తాంతము లన్నియు స్మృతి పథమున వెలుగు లీనెను. భూమండల మంతటికిని, తాను ప్రభువై లీలాదేవితో భోగము లనుభవించు చున్నట్లుగా భావించెను. వెంటనే అతడు " దేవీ! ఆత్మస్వరూపమగు నీ సంసారమున మాయ ఎంత ప్రగాఢంగ విస్తరించి యున్నది!. ఆహా!! మీ యనుగ్రహమున దాని నిపుడు గ్రహింప గలిగితిని. దేవతలారా! పూర్వదేహమును విసర్జించి యొక్కదినము మాత్రమే గడచినది. కాని, ప్రస్తుతము డెబ్బది సంవత్సరముల వయస్సు వచ్చినట్లును. అనేకమంది బంధు, మిత్ర పరిజనము లేర్పడినట్లు భావించు చున్నాను. ఇది సత్యమా ? ఇట్లు భాసించుటకు కారణమేమో ఊహింపలేకున్నాను. తెలియజేయుము" అని అర్థించెను. అపుడు సరస్వతి విదూరథుని కిట్లు వివరించెను. " మహారాజా! మరణము అను మూర్ఛ నీ కేర్పడినది. దానిచే నీ వా లోకము నుండి గతించితివి. వెంటనే ఆ గృహా న విస్తారమగు విభ్రాంతిమూలక మైన సృష్టి యేర్పడినది. అపుడు నిర్మలమగు నీ హృద యాకాశమున డెబ్బది సంవత్సరముల వయస్సు గడచినది అను నీ

మొదలగు లోక వ్యవహార సంబంధమగు ప్రతిభాస మేర్పడినది. స్వప్నానుభవ కాలము క్షణమాత్రమే అయినను, శత సంవత్సరములు గతించినట్లు భ్రాంతి గలుగుట లేదా! మాయా విలాసమున నీకు జాగ్రదవస్థయందు నిట్టి భ్రమ జనించుచున్నది యథార్థమునకు నీవు మరణించుట గాని, తిరిగి జన్మించుట గాని జరుగలేదు. పరిశుద్ధమగు విజ్ఞాన స్వరూపుడవు, శాంతస్వరూపుడవునై ఆత్మయందున్నావు. ఈ సమస్తమును జూచుచున్నావని భావించుచున్నావు. కాని దేనిని జూచుట లేదు. నిత్యము నీవు సర్వాత్మకత్వముతో నీయందే ప్రకాశించు చున్నావు. చిత్తశుద్ధి లేని మూఢుడు బ్రహ్మపదార్థము నెరుగజాలడు. ఆతడీ జగత్తు శాశ్వతమైనదిగా, వజ్రసారమైనదిగా భావించును. బాలునకు మరణ పర్యంతము భేతాళ భయముండుట దుఃఖప్రదమైన దగునట్లు మూఢునకు అసత్యమున శాశ్వతమునగు జగము సత్యముగ, శాశ్వతముగ భాసించుటయు ప్రమాద హేతువు. మృగముల కెండ మావులు, జలాశయముగ భాసించుట లేదా! కడియమునకు బంగార మాధారము కాగా, ఈ విషయ పరిజ్ఞాన శూన్యునకు కడియము సిరరూప మని తోచును. అటులనే ఈ జగత్తునకు కధిష్ఠానము బ్రహ్మ అను జ్ఞానము లేనివానికి దృశ్య జగత్తు నందలి పట్టణములు, నగరములు, తరునగ నగేంద్రాదు లన్నియు యథార్థము లనియు శాశ్వతము లనియు భాసించును. కాని ఇది యంతయు బ్రహ్మ పదార్థ వికారము అను పరమార్థ జ్ఞాన ముండదు. చిత్తము అహంకారము అను నీ మొదలగు విషయములతో నిండిన ఈ జగత్తు ఒక మహాస్వప్నము. ఇందు ప్రత్యక్షము లగుచున్న పురుషాదులకు, స్వప్న గృహ పురుషాదులకు భేద మిసుమంతయు లేదు. సర్వగతము, శాంతము, పరమార్థ స్వరూపము. పవిత్రము, చిన్మాత్రమునై వ్యాపించి, జగత్తున కధిష్ఠాన భూతమగు పరమాకాశము కలదు. ఇది సర్వమును దెలిసికొను సర్వశక్తులు కలది. సర్వాత్మకమైనది. సర్వ రూపములతో సర్వత్ర

నుండును. రాజా! లీలాదేవికి జగము మిథ్య అని దృష్టాంత సహితముగ దెలియుటకు నిన్ను జూపించితిని. నా కార్యము ముగిసినది. మేము వెడలుచున్నాము. నీకు శుభ మగు గాక!" అని సరస్వతి వచించెను. ఆ మాటల నాలకించిన విదూరథు డిట్లు ప్రశ్నించెను. " "దేవీ! అర్థి జనులకు నా సందర్శనము వ్యర్థము కాదు. ఇక మహాఫల ప్రదాయినివైన నీ దర్శనము వ్యర్థ మెట్లగును? వరప్రదాయినీ! నే నీ శరీర పరిత్యాగ మొనరించి పద్మ నామకమైన ఆ పూర్వ దేహమును ఎప్పు డాశ్రయింతును? ఈ విషయము నెరిగింపుము" అని అభ్యర్థింప సరస్వతి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను "రాజా! యుద్ధమున నీవు మరణింతువు. అనంతరము పూర్వ రాజ్యమునకు పరిపాలకుడ వయ్యెదవు. ఈ విషయము నీకు ప్రత్యక్ష మగుచునే యున్నది గదా!" అనెను. అని వశిష్ఠమహర్షి శ్రీరామచంద్రునితో, "రామచంద్రా! ఈ విధముగ నా సరస్వతియు, విదూరథుడు భాషించు కొనుచుండగా నొక భటు డచటికి తత్తరపాటుతో నరుదెంచి, 'మహారాజా! పట్టిస, చక్రము, అసి, గద పరిఘాది ఆయుధములు ధరించి ప్రచండ మగు శత్రు సైన్యము మహాసాగర ముప్పొంగినట్లు పరిగిడి మన రాజ్యము మీదికి వచ్చుచున్నది. అదిగో! పట్టణ ప్రవేశ మొనర్చి నట్లున్నది. పర్వతముల బోలు మహాప్రాసాదములు అగ్ని కాహుతి యగుచున్నవి. ఛటఛటా ధ్వనులు నలుగడల వ్యాపించుచున్నవి. ప్రళయ కాలపయో సముదాయ సన్నిభముగ ధూమసమూహము, గగన భాగమును గ్రమ్ముచున్నది. పర్వత పంక్తి, ధూమావృతమై, మింటికెగయు గరుడ పక్షుల ననుకరించుచున్నది" అని యాతడు చెప్పుచుండగా, వెలుపల మహా కోలాహలము, దిక్కులు పిక్కటిల జేయుచు శ్రవణ గోచర మయ్యెను.

ఆ కర్ణాంతము నారిసారించి విడిచిన బాణవర్ష మొకవంకను మరియొక వైపున మదమాతంగఘీంకార ధ్వనులును, వేరొకవంక

మండుచున్న భవనముల చటచటా ధ్వనులును, ఇంకొక దెస నగ్ని కాహుతి యగుచున్న దారాపుత్రాది సముదాయము నీక్షించి చేయు బంధువుల ఆక్రందన ధ్వనులును, మరియొకవంక పురజనార్త నాదములు నా నగరమున నలముకొనెను.

ఆ యర్ధరాత్రమున నగరమున వ్యాపించిన ఈ కల్లోలమును లీలా సరస్వతులును, మంత్రియు, విదూరథుడును భవన గవాక్షముల నుండి వీక్షించిరి. ప్రళయకాలపు ప్రభంజన సంక్షోభిత సప్త సాగర వేగసదృశమై, కల్పాంత పయోదపంక్తి విధమున శత్రుసైన్యముచే నా నగరము పరివేష్టితమగు చుండెను. మేరు మందర పర్వతములు కాలాగ్ని దగ్ధములగుచున్న విధమున, మంటలు మింటికెగయు చుండెను. ప్రావృట్కాల పర్జన్య గర్జాను కారములగు భీషణ ఘోషలు చేయు సైనికుల కలకల ధ్వనులకు కర్ణపుటములు పగులు చుండెను అంబరతలము వైపు విసరిన, కొరవిగములు, భయంకర అగ్ని వర్షము ననుకరింప, భయాందోళనలుకల ప్రజలు రోదనములు సలుపుచుండిరి.

నవ యౌవనవతియగు రాజమహిషి, భయవిహ్వలయై చెలికత్తెలను వెంటనిడుకొని యచటికి—రాజభవనమున కరుదెంచెను. ఒక చెలికత్తె—"మహారాజ! అంతఃపురమును వీడి భయవిహ్వలయై మహారాణి యరుదెంచినది. అంతఃపుర కాంతలను కొందరను, బల వంతులగు శత్రు పరివారము వారు ఎత్తుకొనిపోయిరి. అంతఃపుర పరిపాలకులు నిహతులైరి. దూరాగతులగు శత్రువులు నగరమును ముట్టడించిరి" అను మాటలు వినుచుండగనే మహారాజు— "దేవత లారా! నేను యుద్ధమున కేగుచున్నాను. నా భార్య మీ పాదాంబు జపట్పదము మీరలే ఈమె సంరక్షకులు." అని కోపారుణితలోచనుడై యా మహారాజు వనమునందలి మదపు టేనుగుల కుంభస్థలములను వ్రయ్యలు చేయదలచి, గుహాంతరము నుండి వెలువడిన మృగరాజు వలె రణరంగమున కరిగెను.

అనంతరము లీలాదేవి, స్వాకార సదృశాకృతిగల, విదూరథుని భార్యయగు లీలను, దర్పణమందలి తన ప్రతిబింబమువలె అవలోకించెను. జ్ఞానవంతురాలగు నామె సరస్వతిని జూచి—" దేవీ ఏమిటి, ఆశ్చర్యముగా నున్నది! ఈమె నాకు పతిరూపముగ నున్న దేమి? తెలవిమ్ము" అని అభ్యర్థించెను. అంత నా సరస్వతి, " నీ రాజధానీ, నగరమున నీ భర్త మరణించు సమయమున నే భావము కలిగియుండెనో ఆ భావములు కలవాడై జన్మించి తదనుకూల విషయములను, వస్తుసముదాయమును జూచుచున్నాడు. ఆ సర్వ పదార్థ సముదాయము వ్యవహారదశయందు తద్భావాను గుణముగ భాసించును. అదియే హృదయ దర్పణమున ప్రతిబింబించుచున్నది. స్వప్న దృష్ట వస్తుజాలము, జాగ్రదవస్థయందు మిథ్యగా తెలియును గదా! అట్లే జాగ్రదవస్థయందలి ఈ విశ్వమంతయు స్వప్నావస్థ యందు అసద్రూపమగును. జీవితకాలమందు మృత్యు, వసద్రూపము కాగా, మరణానంతరము పునర్జననము గూడా నసద్రూపమే యగును. ఈ విధముగ నీ ప్రపంచము ఒకప్పుడుండుట, మరియొకప్పు డుండకుండుట అనునది భ్రాంతి మాత్రమై విజృంభించుచున్నది. పూర్వానుభవమువలన, నీ అనుభూతులు కొన్ని మాత్రము కలుగు చుండును. ఇవి అపూర్వములుగను, సమములుగను, అసదృశములుగ నుండును. నీ స్వభావానుగుణము, నీ యాచారసదృశము, నీ కులానుగుణము, నీ శరీర సదృశమునై ప్రతిబింబరూపమైన మనో భావన లీలగా ప్రతి భాసించుచున్నది. పూర్వజన్మమున నీ భర్త యగు, నీ విదూరథుడు ఈ శరీర పరిత్యాగ మొనరించి, నీ యంతః పురమున, పుష్పాచ్ఛాదిత శరీరమును పొందగలడు" అని లీలకు సరస్వతి వివరించెనని వశిష్ఠమహర్షి శ్రీరామచంద్రున కెరిగించెను.

విదూరథుని భార్య యగు లీల, సరస్వతి పలికిన మాటలు విని, వినయ వినమిత గాత్రయై అంజలి ఘటించి, " దేవీ! నిరంతరము నా పూజలందుకొను సరస్వతీదేవివలె నుంటివి. ఈ

దీనురాలి ననుగ్రహించి వరము ప్రసాదింపుము. నా భర్త దేహాంతర ప్రాప్తినందు ప్రదేశమునకు నేనును ఈ శరీరముతో జేరుకొనగలుగుదునుగాక !' అని వేడుకొనెను. సరస్వతి 'అట్లే యగుగాక !' అని యనుగ్రహించెను. అంత దివ్యదేహము ధరించి, తనవెంటనున్న లీల 'జననీ ! ఈమెకు స్థూలదేహము తోడనే లోకాంతరగతుడైన భర్తృసాన్నిధ్యమునకు జేరుకొనగలుగునట్లనుగ్రహించితివి. నాకు సూక్ష్మశరీరధారణచే గాని యా భాగ్యము కలుగజేయలేదు. ఈ శరీరముతోడనేకదా నేను గిరిగ్రామము జేరుకొనగలిగితిని' అని యడిగెను. అపుడా సరస్వతి, బుద్ధిమంతురాలా ! నేను స్వయముగా నా ఇచ్ఛానుసారముగా నెవ్వరికిని ఏమియు నిచ్చుటలేదు. ప్రాణులకు వారి వారి సంకల్పములను మాత్రమే సిద్ధించునట్లు జేయుచున్నాను. నీవు ముక్తి కావలయునని నభిలాషముతో నన్నర్చించితివి. అందుకు దగిన జ్ఞానమును ప్రసాదించితిని. ఆ విదూరథుని భార్యయగు లీల స్థూల శరీరముతో భర్తృలోకమున కేగవలయునని యభిలషించి యర్చించినది. ఆమెకు ఆ యభిమత మీడేరునట్లు కరుణించితిని. మానవులు తమ యభిలషితములను, సంకల్పములను నా యనుగ్రహమువలన సఫలీకృత మొనరించుకొనుచున్నారు. అంతేకాని, నేను నా యభిమతానుసారము వారి వాంఛితములను ప్రసాదించుటలేదు. తమతమ కర్మానుసారములగు సంకల్పములు వారికి కలుగుచుండును. అవి సఫలము లగుటకు వారు నన్నారాధించుచున్నారు" అని సరస్వతి వివరించి చెప్పెనని వశిష్ఠుడు పలికెను.

విదూరథుడు అపరిమిత సేనాపరివార సముపేతుడై, రత్నాభరణాలంకృతగాత్రుడై గృహమునుండి బయలువెడలి, రథోత్తమమున నధిరోహించి, స్వసైన్యములోని వీరవరుల నుత్సాహపరచుచు, ముక్తామణిమయభూషణాంచిత మహా

పర్వతముఁ రీతి రణరంగప్రవేశ మొనరించెను. ఆ సమయమున మదేభములు ఘీంకరించినవి. దుందుభి ధ్వనులు భూ నభోంతరముల వ్యాపించినవి. అశ్వహేషలతోను, సైనిక పదఘట్టనలు, హుంకార ధ్వనులతోను, ధనుష్టంకారములతోను, బాణప్రయోగ సమయ ఝుంకార, హుంకారములతోను, పరస్పర భటాహ్వానములతోను, ప్రతాప వాగ్జాలములతోను, శత్రుసైనిక బందీకృత వనితాక్రందన తోను, శిథిలీకృత అశేషబ్రహ్మాండ కుహరధ్వనితోను, దశదిశాకుంఙ పూరకమై మేళవించినది.

సైనికుల పదఘట్టనలచే నుద్ధృతమైన పరాగము ఆకసమున కెగసి, అసమయ అంధకారమును వ్యాపింపజేసెను. అది యౌవనా వస్థయందు హృదయము నావరించిన మూర్ఖత్వమువలె నుండెను. ఆ సమయమున క్షీరసాగరమున ప్రవేశించిన మందరాద్రిపగిది, విదూరథమహారాజు రణరంగమున ప్రవేశించెను.

ఆయుధాఘాత సంజనిత విస్ఫులింగములు ఉల్కలై వెలుగులు వెదజల్లినవి. సైనిక మేఘపంక్తి గంభీరగర్జనలనతో శరవర్షము గురిపించెను. ఖడ్గప్రహారములతో వీరవరాంగములు ఖండితము లయ్యెను. పటపట ధ్వనులతో ఖడ్గఖండములు నభోవీధి కెగసెను. కబంధ నరసముదాయము యమపురికి యాత్రాసన్నద్ధ మయ్యెను. వీరభట రక్తప్రవాహమున భూమి జంబాళిత మయ్యెను. ఖడ్గప్రహార సంజనిత విస్ఫులింగము లంధకారము నడచెను. యుద్ధైకధ్యానావస్థితులైన భటుల వాగ్విజృంభణము లంత రించెను. మృత్యువు నిర్ణీతమగుటవలన భయము దొలగి పోయెను. నిశ్శబ్దముగ, నిర్భయముగ రణము జరుగుచుండెను. అది మహాప్రళయము. మహాభయంకరము " అని వశిష్ఠ మహర్షి సమరాభివర్ణన మొనరించెను.

ఆ సమయమున సరస్వతీదేవి నవలోకించి లీల లిరువురు నిట్లు పలికిరి: "పలాయన సంక్షుభితములైన మదమాతంగ యూథములుగల ఈ మహాసంగ్రామమున మా పతిదేవుడు, విదూరథుడు జయమును వరించునో, అపజయము పొందునో వచింపుము" అని ప్రార్థించిరి. అంత నా సరస్వతి, "బిడ్డలారా! విదూరథుని శత్రువు విజయార్థియై నన్ను చిరకాలమారాధించెను. విదూరథు డట్లు చేయక మోక్షార్థియై యారాధించెను. కాన శత్రు మహీపాలుడు విజయము నందును. విదూరథు డపజయము నందునుకాని ప్రతిభారూపమగు ముక్తిని పొందును. శత్రు భూపతి రాజ్యపాలనము జేయును" అని సరస్వతి వచించెనని వశిష్ఠుడు పలికెను.

ఆ యర్ధరాత్రమున వాగ్దేవి యుద్ధ ఫలితము నభివర్ణించు చుండ నుభయ సైన్య మాశ్చర్యపడునట్లు రవి ఉదయాద్రి నధిరోహించెను. కజ్జలసాగరసముత్థితమైనట్టు లీ లోకము భాసించెను. దినకర కిరణములు సువర్ణశలాకల విధమున మనోహరముగ వెలుగు లీనుచుండెను.

ఇప్పటికి యుభయ సైన్యములందును సైనికులు చాలా వరకు కాలగతి నందిరి. రణరంగ మంతయు స్వల్ప సైన్యముతో వెలితి వెలితిగా నుండెను. విదూరథుడు ధనుష్టంకార మొనరించుచు, శిరము పైకెత్తి తనమీదికి లంఘించుచున్న సింధురాజు నెదిరించెను. ప్రళయకాల ప్రభంజనము మేరు పర్వతమును కదిలించినట్లు, కల్పాంత భాస్కర కిరణములు ప్రసరించిన రీతి, నమోఘ నిశిత సాయక పరంపర గురియించి యాతనిని చలింపజేసెను. ఆతడును తన బాణప్రయోగ లాఘవమును ప్రదర్శించుచు విలాసముగ విదూరథుని బాధల పాలు గావించెను. ధ్వజమును ఖండించెను. రథమును తుత్తినియలు జేసెను. అశ్వముల మడియించెను. సారథిని

దునిమెను. కార్ముకమును ముక్కలు చేసెను. కవచమును వ్రయ్యలు గావించెను. సర్వాంగము లందును బాణములను నింపెను. పీనవక్షస్థలరక్షకమగు శిలాసదృశపట్టమును భేదన మొనరించెను. కడకు విదూరథుని నేలపై నొరగునట్లు జేసెను. ఈ దృశ్యమును గాంచిన శేషసైనికులు, "మా మహారాజు మరణించెను. మా మహారాజు శత్రు నిహతు డయ్యెను" అని ఆక్రోశింప దొడగిరి. ఆ పలుకుల నాలించిన ప్రజ లందరు వ్యాకులత నందిరి. తమ తమ గృహోపకరణములను శకటములపై నింపుకొని, భార్యాపుత్రులతో రోదించుచు రాజ్యమును వీడి పోవుచుండిరి.

విదూరథుని భార్య లీల శ్వాసావశిష్టుడై స్మృతిదప్పి రణరంగమున బడియున్న భర్తను జూచి సరస్వతీదేవితో నిట్లనెను : "జననీ! నా నాథుడు శరీరత్యాగము జేయుటకు సంసిద్ధుడై యున్నాడు. నేనును నాభర్త ననుసరింతును, కరుణింపుము" అని సరస్వతీ ధ్యానమున శక్తిమంతురాలగు నా లీల స్థూల శరీరత్యాగ మొనరించి, సూక్ష్మ శరీరమును ధరించి, క్షణకాలములో విహంగము వలె నంబరతలమున కెగసెను. మేఘ మండలము నతిక్రమించి వాయు మండలమున ప్రవేశించెను. దాని నధిగమించి సూర్య మండలమును జేరెను. దాని నతిక్రమించి నక్షత్ర మండలమున జొచ్చెను. దాని నధఃకరించి బ్రహ్మాదిలోకముల నాక్రమించెను. అచటి నుండి బ్రహ్మాండఖర్పరమునకు, నటనుండి జలాద్యావరణముల నతిక్రమించి, గరుత్మంతుడు కోటి కల్పములు మహావేగమున పయనించియు జేరుకొనజాలని చిదాకాశాంతరమును ప్రవేశించెను. మహారణ్యమున ననేక ఫలజాతులున్న విధమున నందు ననేక కోటి బ్రహ్మాండములు ఒక దాని కొకటి తెలియకున్న స్థితిని తిలకించెను. వాటిలో నొక బ్రహ్మాండమును భేదించి, లోనికి ప్రవేశించెను. అచట పద్మమహారాజ నగరమును దర్శించెను. 'సరస్వతీదేవి యనుగ్రహము వలన నా భర్తకంటె ముందుగనే చేరుకొంటిని' అని తలంచి,

యంతఃపురమున పుష్పాచ్ఛాదితమై యున్న పద్మమహారాజ కళేబరమును జూచి, 'ఈ వీరుడు నిశ్చయముగ నా భర్తయే యగును' అని నిర్ణయించుకొనెను. సుందరచామరము నొకదాని చేబూని, నవయౌవనవతియగు నా లీల రాజ శవమునకు వీవ దొడగెను" అని వశిష్ఠ మహర్షి వచించి మరియు నిట్లభివర్ణింప దొడగెను:

"శ్రీరామచంద్రా! రణక్షేత్రమున పడియున్న విదూరథుని జీవము ఆకాశమున నుండగా లీలా, సరస్వతీ దేవతలు దివ్యదృష్టితో జూచిరి. దాని సమీపమున కేగిరి. వీ రిరువురు దాని నవలోకించుచుండిరి. జీవకళమాత్రము వీరిని దర్శింప లేకుండెను. వీరా జీవకళ ననుగమించుచు నొక లోకమునుండి మరియొక లోకమున బ్రవేశించుచు, కడకు పద్మమహారాజ నగరమున జేరిరి అచట లీలాంతఃపుర మంటపమున ప్రవేశించిరి. జీవకళయు ముందుగ నచటికి బ్రవేశించెను.

లీలా, సరస్వతులు పద్మమహారాజ శవమునకు ప్రక్కగా నాసీనమైయున్న విదూరథ ధర్మపత్నియగు లీల నవలోకించిరి. వాగ్దేవి విదూరథుని జీవకళ తిరిగి యా కళేబరమున ప్రవేశింప కుండ మనోగతిని నిరోధించిన విధముగ నిరోధించెను. చారునయన యగు లీల సరస్వతి దిక్కు మొగముంచి: "అమ్మా! నా స్థూల శరీరమును ఇచటనుంచి సమాధినిష్ఠురాలనై యోగ శరీరమును ధరించి నీవెంట నరుదెంచితినికదా! ఇపు డా స్థూలశరీర మిచట కానరాదేమి?" అని ప్రశ్నించెను. అపు డా సరస్వతి ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను: "కుమారీ! నీ వడిగిన ప్రశ్నమునకు సమాధానము నాలింపుము. సమాధినిష్ఠయందున్న నీ శరీరము, నిర్జీవమై ఎండిన చిగురుటాకువలె పుడమిపై నొరగినది. మంచువలె చల్లబడి, కట్టెగానై శవముగా మారినది. మంత్రివర్యుడు సపరివారముగ నరుదెంచి చూచి, పరీక్షించి, మరణము నొందితివి

అని భావించి చందనాదిదారువులతో జితి జేర్పించి, నేయి వోసి, ఆ స్థూల శరీరమునకు దహన సంస్కారను గావించెను. ఇపుడు ఇక్కడ శరీర రహితవైన నిన్ను జూచిన జనులు, 'ఈమె పరలోకము నుండి వచ్చిన'దని తలపోసి మహాదాశ్చర్య సంభ్రమము లంద గలరు. ఇంక నీకు స్థూల శరీర ముండదు. సూక్ష్మ శరీరమును మాత్రము ధరించి, ప్రతిభారూపిణివై యుందువుగాక! వాసనలు నశించుటవలన స్థూలదేహభ్రాంతి తొలగినది. యోగజ్ఞానదృష్టి రూఢ మగుటవలన ఆధిభౌతిక ముపశమించినది. లీలా! సంకల్ప లీలచే లీలకు మనము దర్శనమగుదము రమ్ము. ఆమె ప్రవర్తనా వ్యవహారములను పరికింతము" అనెను.

ఇచట పద్మమహారాజు దేహమున ప్రాణము లేకపోయినను దహన సంస్కారము జేయకుండుట, లీలా శరీరము సమాధి మగ్నమైనను దహింపబడుటకు కారణము 'బృహద్యోగ వాశిష్టము'న నిట్లు చెప్పబడినది : సరస్వతీదేవి యనుగ్రహ విశేషమున పద్మ మహారాజు శరీరము చివికిపోక ; జీర్ణము, శీర్ణము కాక ప్రాణముగల దేహమువలె యథాపూర్వకముగ నుండెను. లీలా శరీర మట్లుగాక శిథిలమై దుర్గంధ భూయిష్టము కాగా దహన సంస్కారము గావింప బడినది.

వాగ్దేవి తన యంతరంగమున 'ఈ గృహమందలి లీల నన్నును ఈ లీలను జూచునుగాక!' అని సంకల్పించెను. వెంటనే ఆ గృహమంతయు దివ్యతేజఃపుంజము లలముకొనెను. ఈ విచిత్ర సంఘటనమున కాశ్చర్యచకితురాలయిన లీల తత్కాంతులకు హేతుభూతలయిన యోగలీలను, సరస్వతిని దర్శించెను. సంభ్రమముతో లేచి ఆమె వారి పాదములపై వ్రాలెను. వారిని ఉచితాసనములపై నుపవిష్టలను గావించెను. 'హంసగమనలారా! ఈ శవరూపమున నున్న పద్మరాజును మేల్కొల్పుదముగాక!' అని సరస్వతి ఆ లీలాద్వయముతో పలుకుచు, తన యధీనమున

నున్న పద్మరాజు జీవకళను విడచెను. అది సూక్ష్మమగు సమీరాకార సదృశమై మహారాజ నాసికాపుట సమీపమున ప్రవేశించెను. వేణు రంధ్రమున ప్రవేశించు వాయువువలె, నా ప్రాణవాయువు ఘ్రాణాకాశమున ప్రవేశించెను. జీవము అంతస్థమైనంతనే మహారాజ ముఖము కాంతివంత మయ్యెను. క్రమక్రమముగ నవయవము లన్నియు ప్రకాశవంతము లయ్యెను. మహారాజు తన యంగములను. మెల్లగ కదలించెను. కన్నులను దెరచెను. అవి నిర్మలముగ నుండెను. జంగమ వింధ్యనగమువలె ప్రకాశించుచున్న తన శరీరమును కదలించి లేచెను. 'ఎవడురా అక్కడ?' అని మేఘగంభీర గర్జనము చేయ నా లీల లిరువురు నాయనకు ఎదుట నిలచి, 'ఆజ్ఞాపింపుడు ప్రభూ!' అని పల్కిరి. వారిని జూచి, 'నీవెవరు? వారెవరు?' అని ప్రశ్నించెను. అపు డాతని భార్యయగు లీల ఇట్లు చెప్పెను: 'దేవా! నేను వచించు విషయమును సావధానముగ నాకర్ణింపుడు. నేను లీలను. మీ యర్ధాంగిని. నా పోలికలుగల నీమె, నా మాయచే నీ కొరకు సృజింపబడినది. ఈమె నీ రెండవ భార్య. నీ శయ్యకు సమీపమున శిరోభాగమున సువర్ణ పీఠమున నలంకరించియున్న యామె జగజ్జనని వాణి' అని చెప్పగా విని, యా మహారాజు వాగ్దేవిపాదాంబుజములపై వ్రాలి, సంతోషాంతరంగుడై యభివాదన స్తోత్రము లాచరించెను. ఆమెయు నాతని శీర్షమును నిమురుచు నిట్లనెను: 'వత్సా! సకలవిధములగు నాపదలు, దుష్కృతములు, దోషదృష్టులు నశించుగాక! మీకు అనంత శుభములు, సుఖములు ప్రాప్తించుగాక! నీ పరిపాలనమున ప్రజలు నిత్యసంతోషసంతృప్తులు కలిగియుందురుగాక! నీ రాజ్యమున మహాత్ములు స్థిరముగా ప్రకాశింతురుగాక!' అని యాశీర్వదించెను.

బ్రహ్మాణి యంతర్ధానము నొందిన యనంతరము జయ జయ ధ్వనులు, మంగళతూర్య నాదములు, పుణ్యాహ ఘోషలు ప్రతిధ్వనించెను. ప్రజలు మహదానందసంభరితులై రాజమందిరమున

కరుదెంచిరి. భూసురులు, భూపతులు, సచివోత్తములు నా పద్మమహారాజునకు తిరిగి పట్టాభిషేక మహోత్సవము జరిపించిరి.

నా లీలాద్వయమును, పద్మమహీపాలుడును జీవన్ముక్తులై పూర్వవృత్తాంతములను స్మరించుకొనుచు, సంతోష సంభరితాంతరంగులై కాలము గడపిరి. సరస్వతీదేవి యనుగ్రహమున లభించిన జ్ఞానముతో వివేకవంతు డయిన ఆ పద్మభూపతి ఆ లీలాద్వయముతో నెనుబదివేల సంవత్సరములు రాజ్య పరిపాలన మొనరించెను. జీవన్ముక్తులగు నా ముగ్గురును నిష్కంటకముగా రాజభోగము లనుభవించి పరిశుద్ధ మనస్కులై, జ్ఞానవంతులై కాలాంతరమున మోక్షమును పొందిరి" అని వశిష్ఠుడు శ్రీరామచంద్రునకు చెప్పెనని వాల్మీకి భరద్వాజునకు వివరించెను.

## కర్కట్యుపాఖ్యానము

"శ్రీరామచంద్రా! ఆకాశజోపాఖ్యానమును, లీలోపాఖ్యానమును 'బ్రహ్మపదార్థము సత్యమనియు, జగము మిథ్యయనియు, మాయామేయ'మనియు వివరించినవి ఆ యర్థము సులభగ్రాహ్య మగుటకు ఇపుడు దాని సారాంశమును సంక్షిప్తముగ నభివర్ణించుచున్నాను.

దృశ్యమాన జగత్తు మిథ్యయని నిరూపించుటకై అమోఘమైన లీలోపాఖ్యానమును జెప్పితిని. ఇక నీ సృష్టి సత్యమను భావమును విడువుము. అట్లయిన నిక సత్యవస్తువేది అని యందువా; అసదాభాసమైనది. పరిశుద్ధమగు పరమాత్మస్వరూపము అంతట నావరించి యున్నది. అది సర్వ నియామకమైనది. మిక్కిలి భయంకరమైనది. నాశరహితమైనది. 'ఆనందము' అను నామము ధరించినది. దృశ్యమాన జగత్తు ఉన్నను, లేకపోయినను ఒకే రూపమున నుండును. ఇది పరిపూర్ణమైనది. శుద్ధ సత్త్వస్వరూపమైనది.

చిద్బ్రహ్మ రహితమైనది. నిర్వికారమైనది. దాని నెరిగినవారు సైతము 'ఇది ఇట్టిది' అని నిరూపించుటకు వీలుకానిది " అని వశిష్ఠుడు జీవాహంకార స్వరూపము నిట్లు వివరించెను.

## జీవాహంకార స్వరూపము

"రామవ! నిస్తరంగ సముద్రమువలె, నివాతదీపకళిక భాతి నుండునది జీవము. ఇదియే బ్రహ్మస్వరూపము, జీవధారియగువాడు, చలనశీలుడు, జీవరూపము ధరించిన బ్రహ్మము, ఘనసంవిత్తి వశమున నహంకార రూపమును పొందును. కట్టెల నధికముగా జేర్చుటవలన అగ్నికణములు ప్రకాశత్వమును పొందిన విధముగ నా అహంకారము స్వస్వభావనల వలన వృద్ధి పొందును. క్రమముగ నిది సంకల్పముల కభిముఖత్వము నొందును. 'చిత్తము, చేతస్సు, మనస్సు, మాయ, ప్రకృతి' అను నామములు కలదై మనస్సు అగుచున్నది. పరబ్రహ్మము నుండి ముందుగ సంకల్పాత్మకము, వ్యాపకము నగు మనస్సు జనించినది. అది జగములను సృజించు చున్నది. మహాసముద్రమున తరంగములు బుద్బుదములు. ఫేనము మున్నగు రూపములు జల వికారములైనట్లు, చిద్రూప మగు నాత్మ మనోరూపమును ధరించి, సంకల్పమాత్రమున నానారూపములుకల జగద్రూప మగుచున్నది. సక్రమముగ జూడనందున స్థాణువునందు మనుష్యభ్రాంతి యేర్పడినట్లు, మనస్సున కధీనమైన దగుటవలన నీ సంసారము దీర్ఘ స్వప్నస్థితిని పొందుచున్నది.

## జీవ బ్రహ్మల కభేదము

చిదాత్మకు, జీవునకు ద్విధాభావము లేనివిధమున జీవము నకు, చిత్తమునకు విభేదము లేదు. జీవమునకు, చిత్తమునకు భేదము లేని పగిది చిత్తమునకు, జగత్తునకు విభేదము లేదు"

## కర్కట్యుపాఖ్యానము

అని వచించిన వశిష్ఠ మహర్షి, "శ్రీరామచంద్ర! ఈ వివరించిన విషయములు దృఢమగుటకు ఉదాహరణ పూర్వకముగ నొక పురాతన నేతిహాసమును జెప్పుచున్నాను, వినుము.

సమస్త వేదాంత విషయగర్భితములైన ప్రశ్నల నొక రక్కసి ఈ యుపాఖ్యానమున ప్రశ్నించుట విశేషము.

కజ్జల పర్వత నిర్మితమైన మహా భయంకర సాలభంజికము వలె ప్రకాశించు నొక రక్కసి కలదు. దానిని 'కర్కటి' అని యందురు. అది హిమవత్పర్వతమునకు ఉత్తరదిశయందావాసము కల్పించుకొనెను. దాని నేత్రములు విద్యుల్లతలవలె ప్రకాశవంతములు. జానువులు ఖర్జూర వృక్షములు. వైడూర్యమణి వినిర్మితశూర్పసదృశ్యములు నఖములు. నరములు, ఎముకలు, గ్రంథులు శరీరమంతయు నిండి యున్నవి. మహాకాయముగల దగుటవలన బడబాగ్నిసిబోలు జఠరాగ్ని కలది కాన తగినంత యాహారము లభింపక అసంతృప్తితో జీవించుచుండెను.

'సముద్రగర్భమునందలి బడబాగ్ని నిరంతరము జలము నాహరించుచు తన క్షుద్బాధ తీర్చుకొను విధమున, ఈ జంబూ ద్వీపమున నున్న మానవులందరిని, ఊపిరికూడ విడువకుండ నిరంతరము భక్షింతునుగాక! మృగమరీచక మేఘదర్శనమున నుపశమించు రీతి, నా యాకలి దానితో నడంగుగాక! నా అభిమతార్థసిద్ధికై నిశ్చల మనస్సుతో మహోగ్రతప మాచరింతును గాక!' అని యొకనాడు సర్వజీవ భక్షణ కాంక్షతో నాలోచించి, యొక భూత దుర్గమారణ్యమున ప్రవేశించి, తపశ్చర్య కనుకూల మగు ప్రదేశమును వెదకెను. అట నా రక్కసి స్నాన మాచరించి, యొక పర్వతశిఖరమున సూర్యచంద్రులవలె ప్రకాశించు నేత్రములను స్థిరముగ నిలిపి, ఒంటికాలితో నిల్చి

ఘోరముగ తపమాచరించుచుండెను. క్రమముగ దినములు, పక్షములు, నటుతరువాత మాసములును గతించెను. శీతవాతా తపములకు చలింపక శిలాకృతిగ నుండెను. ఈవిధముగ సహస్ర వర్షములు జరిగిపోయెను. ఆమె తపోదీక్షకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. దారుణ తప మాచరించుట వలన నీచుల కయినను దైవము ప్రత్యక్షమగును కదా!

మానసికముగ నా కర్కటి బ్రహ్మకు వందన మాచరించెను. యథాపూర్వముగ నిశ్చల తపోనిష్ఠలో మునిగెను. కొంతవడికి తపోనిష్టనుండి మేల్కాంచి, తన క్షుద్బాధోపశమనమునకై ఎట్టి వరమర్థింప వలయునా అని ఆలోచింపదొడగెను. 'అనాసియు, నాయసియు నగు జీవసూచిక నడుగుదును గాక! సమయమునకు జక్కని యాలోచనము వచ్చినది. ఈ వరమునే ప్రజాపతి నర్థింతును గాక! ఈ వరప్రభావమున యథేచ్ఛముగ జీవజాలమును గ్రసింతును. అందుచే నా క్షుద్బాధ యుపశమించును. నాకు సుఖము, సంతోషము ప్రాప్తించును. ఇంక నేను జీవ హృదయములలో సులభముగ ప్రవేశింతునుగాక!' అని తలపోయుచున్న కర్కటి నవలోకించి యా కమలాలయుడు: 'బిడ్డా! రాక్షసకుల పర్వతమునకు మేఘ మాలికవంటి దానవు. నీ తపోనియమమునకు సంతుష్టాంతరంగుడ నైతిని, లెమ్ము. అభిమత వరము నర్థింపుము' అనెను. కర్కటి భక్తి ప్రపత్తులు వెల్లివిరియ 'భగవానుడా! భూతభవ! పరమేశ్వర! నాకు వరప్రసాద మనుగ్రహింప దలచితివేని అనాసియు, నాయసియు నగు జీవసూచిక నగునట్లు వరమిమ్ము' అని యభ్యర్థించెను" అని వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రున కభివర్ణించి చెప్పెను. అంత నా రామచంద్రుడు "అనంతర మేమయ్యె" నని ప్రశ్నింప, వశిష్ఠు డీరీతి జెప్పదొడగెను.

బ్రహ్మదేవుడు కర్కటికి: 'నీ యభిమతార్థ మీడేరుగాక!' అని యిట్లు ప్రబోధించెను: "మహోపద్రవకరమగు విషూచిక అను

సూదివి యగుదువు గాక ! దుష్ట భోజనము భుజించువారిని, దురారంభులు, మూర్ఖులు, దుర్మార్గులు, దుర్దేశవాసులు, దుష్టులు నైన వారిని బాధించి భక్షింపుము. ప్రాణవాయువు ద్వారా వారి హృదయ ప్రవేశ మొనరించి పద్మప్లీహాదులను బాధించుటచే ' విషూచిక ' అను వాతరూప వ్యాధివి కాగలవు. గుణవంతులు, గుణహీనులు నగువారి నందరను నీవు బాధింతువు. కాన గుణ వంతులు ఈ వ్యాధి బారినుండి రక్షింపబడుటకు నొక మహా మంత్రమును జెప్పుచున్నాను—

మంత్రము : " ఓమ్, హ్రామ్, హ్రీమ్.
శ్రీమ్, రామ్, విష్ణుశక్తయే, నమోభగవతి !
విష్ణుశక్తి ఏహి, ఏనాం, హర, హర !
దహ ! దహ ! హన ! హన !
పచ ! పచ ! మథ ! మథ ! ఉత్సాదయ, దూరే
కురు, కురు, స్వాహా !
విషూచికే ! తం హిమవంతం గచ్ఛ ! గచ్ఛ
జీవసార మండలం గతోఽపి స్వాహా ॥ "

ఈ మహామంత్రమును వేయువాడు, తన కుడి చేతితో నెడమచేతియందు వ్రాసికొని, వ్యాధి సోకినవారి శరీరమందంతటను ఆ చేతితో తుడువవలయును. హిమవంతమున కెదురుగా నా విషూచిక పరుగిడునట్లుగా నెంచవలయును. ఆ రోగగ్రస్తుడు, చంద్రమండలమున అమృతములో నుండినట్లుగను, సమస్తరోగ విముక్తుడైనట్లును, జరామరణ వర్జితుడైనట్లు తలంపవలయును. మంత్రసాధకుడు శుచియై, ఏకాగ్రచిత్తుడై ఈవిధముగ నాచరించిన సమస్తములగు విషూచికా వ్యాధులు నశించును " అని బ్రహ్మ దేవుడు వచించి, యంతార్ధానము నందెను.

అనంతపురము ప్రాదేశమాత్ర రూపంబును, అటుతరువాత నంగుళ ప్రమాణాకారంబును, అటుమీద మినపకాయ సదృశమును,

తుదకు సూచీ రూపమును ధరించెను. ఆ కర్కటి రోగగ్రస్తులై దుర్బలులైన వారును, విపులకాయము గలవారును నగు వారల హృదయముల యందు అయస్సూచీ రూపమున ప్రవేశించి, విషూచికా రోగముగ పరిణమించుచున్నది. స్వల్పబుద్ధికలవారు స్వస్థులైనను వారి హృదయములలోనికి ప్రవేశించి దుర్బుద్ధులనుగా జేయుచున్నది. ఈవిధముగ నా కర్కటి ప్రాణులకు ప్రాణ ఘాతినియై, అయస్సూచీ రూపమునను, జీవసూచీ రూపమునను ప్రవర్తిల్లుచు, ననేక సంవత్సరములు భూతలమున సంచరించెను.

ఈవిధముగ చాల కాలము గడచినది. ఒకనాడు కర్కటి, 'నే నెంత నికృష్ట కార్యము జేయుచుంటిని' అని తనను తాను నిందించుకొనుచు, బాధపడుచుండెను. 'నేను ఈ సూది రూపము నేల గోరుకొంటిని ? ఈ సూక్ష్మ శరీరముతో నేమి యనుభవింప గలను ? కణమాత్రపు రక్త మాంసముల తోడనే నా యుదరము పరిపూర్ణమగుచున్నది. కాని, నా యంతరంగము నందలి ఆశాసూచిక దుర్భరమై, ఎన్ని ప్రాణులను హరించినను సంతృప్తి నొందకున్నది. అతి విస్తృతములైన నా పూర్వావయవములు పండుటాకులవలె నెచ్చటనో రాలిపోయినవి. నా బుద్ధిమాలినతన మెంత హీనతను దెచ్చినది ! ఈ సూచీ రూపము ధరించినను నాలోనున్న యాశ యంతరించ లేదు సరికదా, మరింత యధిక మైనది. రుచ్యమైన మాంసమును దిని, కవోష్ణ రక్తమును దృప్తిగా, ఆశ తీరునట్లు పానము జేయవలెనని యున్నది కాని, దానికి దగిన బృహదాకారము లేకపోయెను కదా! అని పరితపించి, జీవమారణకర్మ పరిత్యజించి, మరల తప మాచరించుటకు హిమాలయ శిఖరమున కేగెను.

జీవసూచికా రూపము ప్రాప్తించినందున మిక్కిలి సంతాపము గల కర్కటి, వాంఛా పరిత్యాగ మొనరించి, మనోనిగ్రహముతో మహోగ్రతప మాచరించెను. ఆహారమును విసర్జించినది.

సంకల్పములను నిరోధించివేద. మనస్సును నిశ్చల మొనరించు కొనినది. ఈవిధముగ నొక వేయి సంవత్సరములు గతించినవి. అపు డా రక్కసి పవిత్రమగు స్థితిని పొందెను. తపస్సుచే కల్మషము లన్నియు క్షాళితము లయ్యెను. నిర్మల స్థితి సమకూరెను. ఈ స్థితి వలన స్వయముగ పరమాత్మ స్వరూప జ్ఞానము సిద్ధించెను. ప్రాపంచిక విషయములపట్ల నేహ్యాభావ మంకురించెను. సంకల్ప రహితముగా తప మారంభించి సహస్ర వర్షములు వ్యతీతము లయ్యెను. చిత్తమునకు స్వస్థత చేకూరెను. పరమ పదమును పొందియున్న ఆ కర్కటి స్థితి నెరిగిన బ్రహ్మ ప్రత్యక్ష మయ్యెను. "పుత్రీ! నీ విపుడు జీవన్ముక్తురాలవైతివి. నీలోని యజ్ఞా నాంధకారము తొలగిపోయినది. పూర్వ శరీరమును పొంది సుఖముగ భూమండలమున సంచరించుము. మూర్ఖులు, దురారంభులు, దుష్కార్యాచరణశీలురు, దుష్ట దేశములం దుండువారు నీకు ఆహార మగుదురు గాక!" అని బ్రహ్మ యదృశ్యు డయ్యెను. అనంతర మా కర్కటి పూర్వ రూపము ధరించెను. బాహ్య కల్లోలములు తొలగి, యంతరంగమున జ్ఞాన రూపము ప్రకాశించెను. బహుకాల మీ విధముగ నిర్వికల్ప సమాధియం దుండెను.

ఒకనా డా కర్కటి, చిత్తస్పందన కలుగుటవలన బాహ్య వృత్తుల కభిముఖురాలయ్యెను. వెంటనే మరల క్షుద్బాధ ప్రారంభ మయ్యెను. "దేహ ముండునంతవరకును, దాని ధర్మము నశింపదు కదా! నా జాతి సముచితమగు నాహారము నరయుదునుగాక! విధి మూఢజనుల నాహారముగ విధించెనుగదా! ఆ మూఢులనే యన్వేషింతును" అని ఆలోచించి, ఆ నగేంద్రశిఖరము నుండి లేచి, కిరాతజనకీర్ణమైన, గిరిప్రాంత ప్రదేశమునకు పయిన మయ్యెను. అచట నొకానొక మహారణ్యమును, తన కావాసముగ నిర్ణయించుకొనెను. కొన్ని దినములకు గాఢాంధకారమునకు నిలయమైన కృష్ణపక్షపు రాత్రి యరుదెంచెను. అట్టి రాత్రులందు

'విక్రముడు' అను పేరుగల పరాక్రమ వంతుడగు నొక మహారాజు, తన మంత్రిసత్తమునితో గూడి, తపస్కారవధార్థమై యా యరణ్య ప్రాంతమున సంచరించుచుండును. దైవయోగమున, ధైర్యాస్త్ర ధారులై సంచరించు రాజామాత్యుల నొకనాడు కర్కటి సందర్శించినది. 'చిరకాలమునకు నా కాహారము లభించినది. వీర లిరువురు నాత్మజ్ఞాన శూన్యులైన మూఢులు గావలెను వీరల కీ దేహములు భారహేతువులు. మూర్ఖులు ఇహ పరములందు దుఃఖముకొరకే జీవించుచున్నారు. వీరు పాపార్జన మాచరించువార లగుటవలన వధార్హులు సృష్ట్యాదిని బ్రహ్మ ఆత్మజ్ఞానశూన్యులగు మూఢులను క్రూర జీవుల కాహారము కాగలరు అని నిర్ణయించెను. కాన నాకు వీరు భోజ్యార్హులు. యత్నరహితముగ ప్రాప్తించినదాని నుపేక్షించిన వాఁడు నిర్భాగ్యుఁడు. వీరు గుణగరిష్ఠులగు వరిష్ఠులు కాకపోయినచో భక్షింతును. అట్లుగాక ఆత్మజ్ఞానగుణసంపత్తి యుక్తు లయిన వధింపరాదు. మున్ముందుగ వీరి జ్ఞానాజ్ఞానములను పరీక్షించి, మూర్ఖు లయినచో భక్షింతును. అట్లు కానిచో విడచి వైతును. శాశ్వత సౌఖ్యము, కీర్తి, నాయువు నభిలషించినవాడు సజ్జనులు, గుణవంతులు నగువార లర్థించిన దాని నొసంగి పూజింప వలయును. వీరు గుణమాన్యులే యగుచో క్షుద్బాధాపీడితురాల నైనను వీరిని విడచివేయుదును. వీరిని వధింపనుగాక! సజ్జన సాంగత్య మను నౌషధమున మృత్యువునుండి కూడ మరలవచ్చును. నేను రక్కసినే యగుదును. అయినను గుణగణ్యుల రక్షింతును. గుణగరిష్ఠుని మణిహారమువలె గౌరవింపనివా డెవడుండును! ఉదారగుణసంయుతులగు సజన సాంగత్యము అమృతాంశుని అంశువులవలె శీతలము, హృద్యము నై యుండును. ఇంతియకాదు. వారిని తిరస్కరించుట మరణహేతువు. వారిని ఆశ్రయించుట ఆయుష్కారకము, భోగప్రదము, మోక్షదాయకము. కనుక వీరిని కొన్ని ప్రశ్నల నడిగి పరీక్షింతునుగాక! అపుడు వీరి పరిజ్ఞానము

నిర్ణయ మగును' అని కర్కటి ఆలోచించి నిర్ణయించుకొనె" నని వశిష్ఠుడు శ్రీరామచంద్రునకు వివరించి చెప్పెను.

"రామచంద్రా! మహారణ్య మధ్యమున ప్రభవించిన సుగంధ సంభరిత ప్రసవ గుచ్ఛము పగిది రాక్షస వంశమున జన్మించిన ఆ కర్కటి, కటిక చీకటియందు మేఘ గంభీర ధ్వనితో నిట్లు గర్జించెను: ' ఈ భయంకరారణ్యమున ఆకాశమందలి సూర్య చంద్రుల విధమున మీరు, మహామయాతమఃపిఠశిలాకోటర కీటకములవలె ప్రవేశించినారు. మీరు నా కాహారమై యొక్క క్షణములో ప్రాణములను కోల్పోవ నున్నారు. మీరు బుద్ధిమంతులో లేక బుద్ధిహీనులో నెరుంగను. ఆలసింపక మీ వృత్తాంతముల 'నెరిగింపుడు' అనెను. ఆ పలుకుల నాలకించి, విక్రమ మహీపాలుడు: భూతమ! నీ వెవరవు? ఎచట నుందువు? నీ స్వరూపమును ప్రకట మొనరింపుము. భ్రామరీ నినాదమువంటి నీ వాగ్విజృంభణము నకు భయమందువారము కాము' అని పలుక నా కర్కటి 'ఆహా! ఈత డెంత రమ్యముగా భాషించినాడు!' అని తన అంతరంగమున సంతసించియు, తన స్వస్వరూప ప్రకటన సమయమున వారు భయభీతులు కావలయునని యెంచి వికటాట్టహాసమొనరించెను. దిక్కుల బిక్కటిలజేసె డా ధ్వనితోబాటు కర్కటియు బ్రత్యక్ష మయ్యెను. దాని సందర్శనమున వారెంతమాత్రమును విచలితులు కాలేదు. యథాపూర్వముగ నిర్వికారచిత్తులై యుండిరి. మంత్రి సత్తముడు, 'మహారాక్షసి! నీ యట్టహాసము వలన ప్రయోజనము లేదు. ఈ స్వల్పమునకే ఇంత యార్భాటము జేయవలయునా? నీ యట్టహాసములు, నార్భాటములు మానుము. ఇట్లు చేయుట నీకు శుభావహము, శోభస్కరము కాదు. బుద్ధిమంతులు తమ కార్య సాధనకు విషయమునందే ప్రవర్తింతురు. కాని, అబలా! నీ వంటివారు చేయు వ్యూహము లన్నియు మశక సంతానము వంటివి. అస్మాదృశుల ధీరతావాతమున, జీర్ణ తృణసంఘాతమువలె వినువీధికి విసరివేయ

బడును. అట్టహాస జ్వరమును విడనాడి, స్వస్థచిత్తుడై ప్రాజ్ఞుడు వ్యవహారయుక్తితో స్వకార్యమును సాధించుకొనును. ఇక నీయభిమత మేమో వివరింపుము. అర్థురాల వైనచో నీ యభ్యర్థనము నర్థింపము. మ మ్మర్థించినవాడు స్వప్నమందై నను అభీప్సితము నందక మరలి పోవుటకు వీలు లేదు. నీ యభ్యర్థనమును మన్నించినట్లుగా భావింపుము ' అనగా నా పిశితాశనాంగన తన హృదయమున, ' ఈ మహాపురుషులు పవిత్రములైన యాచారములు కలవారుగా నున్నారు. సామాన్యులు కారని వారి భాషితములు నిరూపించు చున్నవి. వీరి ఆత్మగతాభిప్రాయమును, వా ఙ్ముఖ నేత్రములువ్యక్తము జేయుచున్నవి. ధీమంతుల యాశయము నా ఇంద్రియ త్రయము ప్రవాహాతరంగములరీతి నేకీభావము నొందును. నా భావమున కనుగుణమైన భావముకలవారు వీరు. కాన, వీరిని వధింపరాదు. వీరు స్వయముగ నశించువారును కారు. నా సందియములను వీరె మూలమున నివృత్తి జేసికొందును. ప్రాజ్ఞులు సంప్రాప్తించి నపుడు నరాధములు తమ సందేహములను నివృత్తి జేసికొన జాలరు ' అని యాలోచించెను. వారిని ప్రశ్నించుటకు దగిన వాతావరణమును కల్గించుటకు తన యట్టహాసములను, గర్జనలను చాలించి, సౌమ్యభావముతో నిట్లనెను : ' మహానుభావులారా! ధీరులగు తమ రెవరు ? ' అనగా మంత్రివర్యుడు, ' ఈ మహా త్ముడీ కిరాత దేశాధీశుడు. నే నీ మహారాజునకు మంత్రిని. నక్తంచరుల నడుపులో నుంచుట రాజధర్మము కదా! నీవంటి దుర్మార్గవర్తనులను నిగ్రహింప దలచి యీవిధముగ రాత్రులందు సంచరించుచుంటిమి ' అని గంభీరముగ పలికెను. మంత్రి మాటల నాలకించిన యా రకాసి, ' మహారాజా! మంత్రి దుర్మార్గు డగుచో రాజును దుర్మార్గు డగును. మంత్రి సన్మార్గు డగుచో రాజును సన్మార్గు డగును. సజ్జనుడైన మంత్రి రాజునకు వివేకమును బోధించును. రాజు వివేకవంతుడై ప్రజలను వివేకవంతులనుగా

చేయును. రాజవిద్యవలన నతనికి సమదృష్టి, ప్రభుత్వము లభించును. ఆ విద్య నెరుగనివాడు రాజుగాని, మంత్రిగాని కానేరడు. మీర లా విద్య నెరిగినవార లైనచో, నభివాదములు. మీకు శుభమగు గాక! మీర లా విద్య నెరుగనివార లయినచో నా స్వభావము ననుసరించి మిమ్ము భక్షింతును. బాలకులారా! ఒక యుపాయ మాత్రమున మీరు నానుండి తప్పించుకొన గలరు. కొన్ని ప్రశ్నములు అను పంజరమున మిమ్ము బంధింతును. సూక్ష్మ బుద్ధితో మీరు సదుత్తరముల నొసంగినచో నా పంజర బంధము ఛేదింపబడును. మీకు స్వేచ్ఛ లంభించును ' అని రక్కసి రాజునకు చెప్పెను అని వశిష్ఠుడు శ్రీరామచంద్రునకు వినిపించెను" అని వాల్మీకి భరద్వాజునకు వివరించి మరియు నిట్లనెను: "అనంతర మా నక్తంచరి ఈవిధములగు ప్రశ్నల నడిగెను. వీనికి దగిన సమాధానముల నీయలేకున్నచో వారిని తన జఠరాగ్ని సమిధలుగా జేతు ననెను.

## కర్కటి ప్రశ్నలు - మంత్రి సమాధానములు

1-వ ప్రశ్న: సాగర బుద్బుదములవలె ననేక బ్రహ్మాండములను లీనమొనరించుకొనుచు, ననేక రూపములు కలదై యొక్కటిగా నుండు పరమాణు వేది?

సమాధానము: అది 'చిన్మాత్రమగు పరమాత్మ' అను పరమాణువు. నామరహితమై 'మనస్సు, చెవి, ముక్కు, నాలుక, నేత్రము, చర్మము' అను షడింద్రియములకు అగోచరమై ఆకాశమునకంటె సూక్ష్మమైనది. అందు అనంతములగు బ్రహ్మాండములు సాగర బుద్బుదముల భాతి క్షణములో నుద్భవించి, మరుక్షణమున లయించును.

2-వ ప్రశ్న: ఆకాశమువలె నుండియు లేని దేది?

సమాధానము : బాహ్యము లేని దగుట వలన నాకాశము. సకలవస్తువులు తన యందుంచుకొని ప్రకాశించునది యాకాశము. అదియే బ్రహ్మము. చిద్రూప మగుట వలన నాకాశము కాదు.

3-వ ప్రశ్న : కదలుచు కదలన ట్లుండును. నిలువక యే నిలచు చున్నది. అది యేది ?

సమాధానము : ఇట్టిదని నిరూపించుటకు వీలుకానిది. కాన కదలుచు గదులనట్లుండును. అది సకలవస్తువులలో సద్రూప మగుట వలన నిలువక యే నిలచుచున్నది.

4-వ ప్రశ్న : పోవుచు పోవక యున్న దేది ?

సమాధానము : అది పరమాత్మ, అది సర్వగము, సర్వ సంబద్ధము. కానిగత్యభావము వలన పోవుట లేదు.

5-వ ప్రశ్న : లేనిది యయ్యు నుండున దేది ?

సమాధానము : ఉన్నవానికి ఆశ్రియ ముండును. పరమాత్మ ఆశ్రియ విహీనమైన దగుటవలన లేనిది, పరమార్థమగు సద్రూప మగుటవలన నున్నది యగుచున్నది.

6-వ ప్రశ్న : చేతనమయ్యు పాషాణ మేది ?

సమాధానము : బ్రహ్మ ప్రకాశాత్మకజ్ఞానస్వరూప మగుటవలన చేతనము. తనకంటె ఇతరమగు, తెలిసికొన దగిన వస్తువు లేనందువలన వృత్తి శూన్యము. కాన నది పాషాణము.

7-వ ప్రశ్న : ఆకాశమున విచిత్రము గొల్పున దేది ?

సమాధానము : నిర్మలమగు చిదాకాశమున, అనగా జ్ఞానాకాశమున 'బ్రహ్మము, జగత్తు' అను చిత్రమును నిర్మించినది. అదియే విచిత్రము.

8-వ ప్రశ్న : బీజమునందు వృక్షము పగిది జగ మే యణువు నందు కలదు ?

సమాధానము : పరమాణు వను చిద్రూపమగు పరమాత్మ యందు ననంత బ్రహ్మాండములు సముద్ర బుద్బుదములవలె నున్నవి.

9-వ ప్రశ్న : సముద్రమునకు, నందలి తరంగములకు భేదము లేనట్లు, కించిద్వస్తువు కూడ దేనికంటె వేరు కాదు ?

సమాధానము : జగత్తు బ్రహ్మము కంటె వేరు కాదు.

10-వ ప్రశ్న : ద్రవత్వము సముద్రము కంటె భిన్నమైనను, అభిన్నమైన విధమున దేనికంటె నేది యభిన్నము ?

సమాధానము : దృశ్యమగు జగము, దృగ్రూపమగు బ్రహ్మమునకు రూపాంతరము. కాన, ద్రవత్వము సముద్రముకంటె నభిన్నమైనట్లు, జగము బ్రహ్మముకంటె వేరుకాదు.

రక్కసి యడిగిన ప్రశ్నములకు మంత్రి పైవిధముగ సమాధానములను వచించెను. వాటిని వినిన ఆ రక్కసి, 'మహామంత్రీ ! నీవు పవిత్రమైన ప్రత్యుత్తరములు వచించితివి నేను మిక్కిలి సంతసించితిని. రాజీవపత్రాక్షుడగు మహారాజును ఈ ప్రశ్నలకు బదులు చెప్పవలసి యున్నది' అనగా, మహారాజు, 'కమలాయతపత్రనేత్రి ! ఈ జగత్సంబంధముగా 'జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి' అను మూడవస్థలు కలవు. వీనియందును, భేదజ్ఞానములేక స్వయంప్రకాశమై, ఈ యవస్థలకు అధిష్ఠానమగు 'తురీయము' అను జ్ఞానము కలదు. అదియే బ్రహ్మ స్వరూపము. ఈ బ్రహ్మజ్ఞానము ప్రపంచ జ్ఞానమునకు విలక్షణమైనది. సంకల్పముల నన్నిటిని విడచిన మనసుకు గోచరించునది బ్రహ్మ పదార్థము. బ్రహ్మ పదార్థ సంకోచము మహా ప్రళయము. దీని వ్యాకోచము సృష్టి. ఈ బ్రహ్మ పదార్థము వేదాంతశాస్త్రములోని మహా వాక్యముల వలన గ్రహింపదగినది. నామ, గుణాదులు లేని దగుట వాక్కులకు గోచరింపదు. నీ వడిగినది దీనిని గురించియే కదా ! ఇది స్థూలమును, సూక్ష్మమును కానిది. 'ఇట్టిది' అని

చెప్ప నలవి కానిది. స్థూల, సూక్ష్మ రూపములు గాని, సమస్త ప్రపంచముగా గాని భాసించుటకు కారణము మనస్సు. అదియే ఈ జంగమ స్థావరాత్మకమైనది. అదియే బ్రహ్మము. జంగమ స్థావరాత్మకమైన ప్రపంచ రూపము ధరించినను, దీని యఖండత్వము నకు భంగ ముండదు. సత్తుమాత్రము రూపముగా నుండి, నిత్యమై ప్రకాశించు బ్రహ్మమును గూర్చి నీవు ప్రశ్నించితివి" అని వచించెను. ఈవిధముగ వశిష్ఠ మహర్షి వివరించి అనంతర కథ నిట్లు వివరించెను :

"శ్రీరామచంద్రా! వన మర్కటమును పోలిన ఆ కర్కటి మహారాజ వాక్యములను విని, తన మాత్సర్యజాలమును వీడి, తత్త్వజ్ఞానమును పొందెను. ప్రావృట్కాల పర్జన్య గర్జనలకు మయూరము పగది, శరద్రాత్రులకు కుముద్వతి విధమున, నంత శ్శీతలతనొంది, సంతాపమును విడచి ప్రశాంతిని పొందెను. తరువాత రాజును, మంత్రిని నుద్దేశించి, 'ఆహా! పవిత్రాత్ములగు మీ యుభయుల బుద్ధి ప్రకాశమానుడగు భాస్కరునివలె బ్రహ్మ జ్ఞానముతో ప్రకాశించుచున్నది. వివేకవంతులగు మీరు జగత్పూజ్యులు సర్వజనసంసేవ్యులు. మహాత్ముల సాంగత్యము సర్వ దుఃఖనాశకరము కరదీపిక కలవాడు అంధకారమును లెక్క సేయడు కదా! ఈ మహారణ్యమున నాకు సందర్శన మిచ్చిన మీరలు భూలోక భాస్కరులు. కాన, మిమ్మిపుడు పూజింతును. పవిత్రాత్ములగు మీ యభిమతముల నెలవిందు' అని అభ్యర్థించెను. ఆ పలుకులను విని మహారాజు నిశాచరాంగనతో 'రక్షఃకులకానన మంజరీ! నేటినుండి నీవు ప్రాణిహింసా పరిత్యాగ మొనరింతువు గాక అని ప్రార్థించుచున్నాను' అనెను. ఆ మాటలకు కర్కటి సంతసించి, 'మహారాజా! నీ యభీప్సితానుసారముగ వర్తింతును. నేడు మొదలు ప్రాణిహింసా పరిత్యాగ మొనరింతును. ఇది యథార్థము' అనెను. 'పరజీవభక్షణపరాయణచణురాలా!

నా యభీప్సితానుసారము వర్తించినచో నెట్లు జీవింపగలవు?' అని రాజు ప్రశ్నించెను. 'మహారాజా! ఇదివరకు చాలకాలము సమాధి నిష్ఠురాలనై యుండి కొలదిదినముల క్రిందటనే ప్రబుద్ధురాలనైతిని, భక్షణ వాంఛ జనించినను, దానిని ప్రధానముగ భావింపను. తిరిగి హిమవత్పర్వత శిఖరమునకు బోయి, వెనుకటి విధముగా ధ్యాననిశ్చలురాలనై, ఇచ్ఛవచ్చినంతకాలము సుఖముగా సజీవసాలభంజిక విధమున జీవితము గడుపుదును సర్వగమై, శివశబ్దవాచ్యమగు పరబ్రహ్మను దర్శించుచు, నశ్వర శరీర పరిత్యాగ పర్యంతము పరప్రాణహింసాదూరురాలనై యుందును' అని కర్కటి తన నిశ్చయమును తెలియ బరచి, ఆ మహారాజు, మంత్రిపట్ల సౌహార్దము ప్రకటించుచు ప్రయాణోన్ముఖురా లయ్యెను. అంత నా మహారాజు, 'మన సౌహార్దమును వ్యర్థము కానీయకుము. సజ్జన సందర్శన మాత్రముననే సౌహార్ద మభివృద్ధి నందును కదా! నీవు ఈ వికృతాకారమును విడచి మనో హారమై, సౌభాగ్యప్రదమగు ఆకారమును ధరించి. మా ప్రాసాద మున కరుదెమ్ము, అచట సుఖముగా నుండుము' అని యర్థించెను. 'మహారాజా! ముగ్ధమనోహరరూపిణియగు నాకు భోజనము కల్పింతువు. కాని రాక్షసజాతి సంజనితనైన నా కా భోజనము సంతృప్తికరము కాదు. నరమాంసాదులతో గూడిన రాక్షసాహారమే నాకు సంతృప్తి నిచ్చును. దేహ ముండునంత వరకు నైజస్వభావము తొలగిపోదుకదా!' అని వచించు కర్కటికి మహారా జిట్లు ప్రత్యుత్తర మిచ్చెను: 'మానినీ! సువర్ణాభరణభూషితవై పుష్పమాలలు ధరించి, సుందరాకార ధారిణివై, కొన్నిదినములు అనగా నేను కోరినన్ని దినములు మా గృహమున నుండుము దుష్కృత్యముల నొనరించు వధ్యు లగు చోరులను, పాపాచారులను, ఆ యా మండలములనుండి, రాష్ట్రములనుండి తెప్పించి నీకు మృష్టాన్న భోజన మర్పింతును. అపుడు నీ వీ మనోహరకాంతారూప పరిత్యాగ మొనరించి, వారి

నందరిని పరిగ్రహించి, హిమవత్పర్వత శిఖరమున కేగి యథా సుఖముగ నారగింపుము. మహాశనుల కేకాంత భోజనము తృప్తి కరము కదా! ఈవిధముగ భుజించి, శయనించి, అనంతరము సమాధినిష్ఠురాలవు కమ్ము. తిరిగి సమాధినుండి లేచినపుడు, ఇచటకు వచ్చి, వధ్యార్హులను గొనిపొమ్ము. ఇట్టివారిని హింసించుట, ధర్మ శాస్త్రానుసారము హింస కానేరదు. స్వధర్మానుసారము చేయబడు హింస, కరుణాసదృశము అని పండితు లందురు. కాన, నీవు సమాధినుండి లేచినప్పుడు తప్పక ఇచటికి, మా గృహమునకు వచ్చుచుండ వలయును. దుర్మార్గుల తోడి స్నేహమైనను రూఢ మైనచో విడచుట కష్టముకదా!' అన, నపు డా రక్కసి, 'మహా రాజా! యుక్తియుక్తముగా బలికితివి. నేను మిక్కిలి సంతసించితిని. మిత్రమా! నీవు చెప్పిన చొప్పున నడచుకొందును. సౌహార్ద ముతో బ్రివర్తించుమాని మాటల నభినందించనివా డుండడు కదా!'' అనెనని వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు జెప్పి మరియు నిట్లనెను :

"మహారాజాభిమతానుసారముగ నా కర్కటి మనోహరా కారయై, వారి ననుసరించి నగరమున కేగెను. రాత్రియు వారి వెనుకనే యంతరించెను. ఆ యిద్దరును రాజ ప్రాసాదమున ప్రవేశించిరి. ఆత్మవిచారముతో నిశా శేషము నపనయించిరి. ప్రాతః కాలమున రాజకాంతపగిది నా కర్కటి యంతఃపురమున ప్రవేశించెను. రాజును, మంత్రియు తమ తమ కర్తవ్యపరాయణులైరి. అనంతర మా మహారాజు ఆరు దినము లవరకు తన రాజ్యము నుండియు, పర రాజ్యముల నుండియు మూడువేలమంది వధ్యులగు దుర్మార్గుల నా రక్కసి కప్పగించెను, నిశా సమయమున వారి నందరిని ఆ కర్కటి తన భుజముల సందున నిరికించుకొని, రాజానుమతి వడసి హిమవత్పర్వత శిఖరమున కరిగెను. ఆ నాటినుండి నేటి వరకు, నా రక్కసి, సమాధినుండి లేచిన వెంటనే కిరాత రాజ్యమున కేతెంచి, వధ్య జనమును గొనిపోవుచుండును.

## ఐందవోపాఖ్యానము

శ్రీరామచంద్రా ! కర్కటీ్యుపాఖ్యానమున పరమాత్మ సత్య మనియు, తద్వ్యతిరిక్తమగు ప్రపంచ మంతయు నసత్యమనియు, మనస్సు ప్రపంచ రూపమును ధరించి ప్రకాశించుచున్న దనియు వివరింపబడినది. ఇప్పు డీ యభిప్రాయము మరింత రూఢమగుటకు మనోహరమైన ఐందవోపాఖ్యానమును జెప్పుచున్నాను, సావధానుడవై యాలకింపుము" అని వశిష్ఠ మహర్షి ఈవిధముగ జెప్ప నారంభించెను :

"ఈ జగమంతయు మనోవికార రూపము. అవివేకియగు బాలుడు తన నీడను జూచి పిశాచ మను భావమును జెందునట్లు, మనస్సు తన రూపమే యగు జగత్తును జూచి భ్రాంతి జెందుచున్నది. వృద్ధులవలన నా బాలుడు వివేకవంతుడై తాను జూచినది పిశాచము కాదు. ఆత్మచ్ఛాయ అని యథార్థ విషయము నెరుగు విధమున, మనస్సు వివేకమును పొంది, జగము తన రూపమేయని నిశ్చయించుకొనును. అనురాగము, క్లేశము మున్నగు దోషములచే దూషితమైన చిత్తము, సంసారరూపము ధరించుచున్నది. ఆ దోషము లకు దూరమైనంత నే మోక్షమునకు హేతువగు చున్నది.

బ్రహ్మదేవు డొకప్పుడు పవలు గతించినంత, తన సృష్టి కార్యక్రమమునుండి నివృత్తుడై ప్రశాంతముగ నిద్రించెను. ప్రాభాతమైనంత మేల్కొని, సంధ్యావందనాది కాల్యకృత్యములను యథావిధిగ నిర్వర్తించుకొని తిరిగి తన సృష్టి కార్యక్రమము నారంభింప దలచి, ఆకాశమువైపు దృష్టి సారించెను. అచట తన సృష్టి కంటె విలక్షణ లక్షితమై, మహారంభములు కలిగి, నిర్బాధముగ నున్న ప్రపంచమును గాంచెను. 'ఇదియేమి ? ఈ సృష్టి ఎట్లు జరిగినది ?' అని ఆ ప్రపంచములను దర్శించిన సృష్టికర్త మహా దాశ్చర్య నిమగ్నమానసు డయ్యెను. చాలా కాలమువరకు

నీవిధముగ నుండి, యొకనాడు తన సత్యసంకల్పమాత్రమున, ఆ ప్రపంచముల నుండి యొక సూర్యుని, తన సమీపమునకు రప్పించుకొని యిట్లనెను : 'మహానుభావ! నీ వెవరవు? ఈ జగజ్జాలమంతయు నెట్లారంభించినది? నీ వెరిగి యున్నచో తెలియజేయుము' అని ప్రశ్నింప నా సూర్యభగవానుడు, భక్తివినమ్రచిత్తుడై నమస్కరించి, 'జగదీశ్వరా! ఈ దృశ్య ప్రపంచమునకు నిత్యకారణము నీవే కదా! అయిన నీకు తెలియని విషయము లుండునా? నన్ను ప్రశ్నించుట ఆశ్చర్యకరముగ నున్నది. నా మాటలు విన నీకు నుత్సాహము జనించెనేని, నా జన్మ వృత్తాంతమును జెప్పుచున్నాను, వినుము. జంబూద్వీపమున నొకమూల కైలాసపర్వత తలమున నీ పుత్రులు మరీచ్యాది నవబ్రహ్మలు శోభాయుక్తమై, అనంత సుఖప్రదము, సుందరము నగు 'సువర్ణజటము' అను నొక దేశమును సృష్టించిరి. ఆ దేశమున కశ్యపవంశ సంజాతుడగు 'ఐందవుడు' అను బ్రాహ్మణోత్తము డొకడు కలడు. అతడు ధర్మాత్ముడు, బ్రహ్మజ్ఞాని, శాంతచిత్తుడునై యుండెను. ఆయనకు ప్రాణసమానయగు ధర్మపత్ని యుండెను. కాని, మరుభూమియందు వృక్షము లుద్భవించని రీతి నా దంపతులకు సంతానము లేదయ్యెను. వారు మిగుల విచారము జెంది, సంతాన ప్రాప్తికై తప మొనరింప దలచి, శుచివ్రత పరాయణులై కైలాస పర్వతమును జేరిరి. అచట నేవిధమగు భూతబాధలేని యొక పాదరింటియందు జలము మాత్ర మాహారముగ గొనుచు ఘోరమగు తప మాచరించిరి. వారి తపమునకు శశికళామౌళి సంతృప్తిజెంది ప్రత్యక్ష మయ్యెను. 'విప్రవర్యా! మీ తపమునకు మెచ్చితిని. అభీప్సితార్థములను కోరుకొనుడు' అని పలికెను. అంత నా విప్రుడు, 'దేవాధిదేవుడవగు మహాదేవా! మహామేధావంతులు, పూజ్యులు నగు పదిమంది పుత్రులను ప్రసాదింపుము' అని అభ్యర్థించెను. ఈశ్వరుడు, 'అట్లే యగును

గాక!' అని యంతర్హితు డయ్యెను. ఆ దంపతులును వరమును పొంది సంతుష్టాంతరంగులై స్వగృహమునకు మరలి వచ్చిరి.

కొంతకాలమున కా బ్రాహ్మణ పత్ని పదిమంది కుమారులను ప్రసవించెను. ఆ బాలురు దినదినాభివృద్ధినొంది పెద్దవారైరి. అనిందిత ప్రవర్తనులై సకలశాస్త్రముల నభ్యసించిరి. కాలాంతరమున ఐందవ దంపతులు తమ గతి నెరిగినవారలై తనుత్యాగ మొనరించి పరలోకగతులైరి.

అనంతర మా పుత్ర దశకము మాతా పితృ వియోగ వ్యథిత మనస్కులై స్వగృహమును విడచి, కైలాస శిఖరమున కేగిరి. బంధు రహితులైనవార లుద్విగ్న హృదయులై యచట నీవిధముగ చింతించిరి: 'ఈ జగత్తున మిక్కిలి శ్రేయఃప్రదమగున దేమి కలదు? దుఃఖప్రదము కానిదియు లేదుకదా! ఈ భోగైశ్వర్యముల ప్రయోజనమేమి? ప్రజలకంటె సామంతరాజు, నతనికంటె మహారాజు, నంతకు మించి చక్రవర్తి యైశ్వర్యవంతుడుకదా! అతని కంటె నింద్రుడు, నాతనికి మించి బ్రహ్మ యైశ్వర్య సంయుతుడు కదా! ఈయన జీవితకాలములో నొక్క క్షణ మాత్రము ననే ఇంద్రుని మహేంద్రత్వ మడుగంటును. ఈవిధముగ నొక దాని కంటె నొకటి యధికమై కల్పాంతకాలమున నశించునదియే కదా! అట్టితరి నీ లోకమున శ్రేయస్కరమైన దేమి కలదు?' అని సహోదరులు దురపిల్లుచుండ, వారిలో జ్యేష్ఠు డీవిధముగ పలికెను: 'సోదరులారా! ఈ ఐశ్వరము లన్నిటిలో కల్పాంతకాలమునందు ననశ్వరమైనది బ్రహ్మత్వము. అది మహోత్కృష్టమైనదని నాభావము. దానిని మించినది మరియొకటి లేదు' అన మిగిలిన సహోదరులు, 'అగ్రజా! నీ పలుకులు యుక్తములుగా నున్నవి. సర్వదుఃఖాపహమైన జ్ఞానమును మాకు ప్రబోధింపుము. దానివలన మేము బ్రహ్మత్వము నొంది శాశ్వతుల మగుదుము' అని పలుక నా జ్యేష్ఠుడు సోదరుల కిట్లు బోధించెను: 'అనుజన్ములారా!

పద్మాసనాసీనుడనైన, ప్రకాశమానుడనగు నేను బ్రహ్మను. నా తేజస్సుతో నీ జగములను సృజించుచున్నాను, సంహారము జేయుచున్నాను అను ధ్యానము మీకు జాలకాలమువరకు నుండుగాక!' అని యగ్రజుడు పలుక నుత్తములగు నా సహోదరులు 'బాగున్నది' అని వచించి ధ్యానాధీనబుద్ధులై చిత్రిప్రతిమలవలె నుండిరి.

అంతస్థమైన మనస్సుతో, 'నేను బ్రహ్మను, జగత్తునకు సృష్టికర్తను. కర్తను, భోక్తను,మహేశ్వరుడను నేను. ఈ దిక్పాలకులను, లోకములను చతుర్దశ భువనములను నేను నిర్మించితిని. వానిలో నంతర్యామినై వసించుచుంటిని' అని ధ్యానించుచుండిరి. ఇట్లు బ్రహ్మజ్ఞానసమాధినిష్ఠులగు నా బ్రాహ్మణ పుత్రులు పూర్వవాసనలను విస్మరించి, దేహములను మరచిరి. అనంతర మా దేహములు వాయువు, నాతపము, కాలముచే శుష్కించి కాలాంతరమున పండుటాకులవలె రాలిపోయెను. ఆ పదిమంది సహోదరులకు పది విధములగు సర్గప్రతిభాసములు కలిగినవి. భావపరిపక్వతచేత ఆ పది మందియు బ్రహ్మత్వము నందిరి. ఆ పది విధములగు నీ సంస్కారములు చిదాకాశమున నుండెను. వీనిలో నొక ప్రపంచమునకు రేయం బవళ్లను కలుగజేయు భాస్కరుడను నేను' అని ఆ దినకరుడా బ్రహ్మదేవునకు నాత్మవృత్తాంత మెరిగించి నిజమందిరమున కరిగెను. దేవేశ్వరుడగు విరించియు స్వకీయవ్యాపారనిరతు డయ్యె" నని వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రున కెరిగించెను.

## కృత్రిమేంద్రోపాఖ్యానము

వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు ఈవిధముగ వివరించెను: "ఈ జగములకు కర్త పరమపురుషు డగు మనస్సని యెరుంగుము. సర్వమును మనస్సు చేయుచున్నది గాని శరీర మేమియు జేయుట లేదు. ఐందవ పుత్రులు సాధారణులగు బ్రాహ్మణులయ్యు. మనోభావనచే బ్రహ్మత్వమును వడసిరి. మనస్సామర్థ్యమును

గమనింపుము. మనస్సుచే భావ్యమై దేహము దేహత్వమును పొందు చున్నది. దేహ భావమును విడచుటవలన దేహ ధర్మములగు శీతోష్ణములు, సుఖ దుఃఖములు, మానావమానములు బాధింపవు. అంతర్ముఖతవలన యోగి దేహ సంబంధములగు ప్రియాప్రియము లను భావింపడు. ఈ విషయమున నింద్రుడు అహల్యతో గూడి యానందించుటయే నిదర్శనము" అనగా శ్రీరామచంద్రుడు, "మహాముని! అహల్య ఎవరు? ఆ ఇంద్రు డెవరు? వారి వృత్తాంతము విన గుతూహలము పొడముచున్నది. కాన, వినిపింపు" మని ప్రార్థింప వశిష్ఠు డిట్లు జెప్పనారంభించెను:" శ్రీరామ చంద్రా! పూర్వము మగధ దేశమున ఇంద్రద్యుమ్నునివంటివా డగు మరియొక ఇంద్రద్యుమ్నుడను మహీపాలుడు గలడు. ఆ మహీపతికి కమలలోచనయు, నింధునిభాస్యయు నగు 'అహల్య' అను పేరుగల భార్య, చంద్రునకు రోహిణివలె విరాజిల్లు చుండెను. ఆ పట్టణమున 'ఇంద్రుడు' అను విటాగ్రేసరుడు నగర మానినీ చిత్తచోరుడై సంచరించు చుండెను.

రాజపత్నియగు నహల్య, పూర్వకాలమునాటి యహల్యా మహేంద్రుల ప్రేమకలాపమును, పురాణ శ్రవణముచే మనోవ్యాపారము మారినదై, నగరమున నున్న ఇంద్రజారుని పట్ల ననురాగవతియై యుండెను. వార లిరువురకు సమావేశము సంఘటిల్లి నిరాటంకముగా, యథేచ్ఛముగా విహరించు చుండిరి. క్రమముగ నీ విషయము రాజునకు దెలిసినది. వారి యక్రమ సంబంధము నరికట్టి, సన్మార్గానువర్తనులనుగా జేయ దలచి, యా రాజు అనేకవిధములుగ శాసించెను. భేదోపాయములను ప్రయోగించెను. జలాశయములలో ద్రోయించెను. ఏనుగులచే ద్రొక్కించెను. కొరడాలచే గొట్టించెను. అగ్నిజ్వాలలకు గురి జేయించెను. అయినను వార లెంతమాత్రమును తమ వ్యాపారము నుండి మరలక, యథాపూర్వముగ సంతోషాంతరంగులై సంచరించు

చుండిరి. వారి వృత్తమున కా మహారాజు ఆశ్చర్యనిమ్నమానసు డయ్యెను : 'దుర్బుద్ధులగు మి మ్మెన్నివిధముల బాధించినను కష్టము నొందకుండుటకు కారణ మేమి ?' అని వారలను రావించి ప్రశ్నించెను. వారు, 'మహారాజా! మా ముఖకాంతిని మే మన్యోన్య హృదయములలో దర్శించుచు, దన్మయత్వము నొంది, దేహములను విస్మరించి యుంటిమి. కాన, మీరు విధించు కష్టములు మమ్మెంత మాత్రమును బాధింపలేదు. తన కిష్టవస్తువును చిరకాలము స్మరించు ధీరుని చిత్తమునకు, శారీరక బాధలు పీడాకరములు కావు మా దేహ భావములను విస్మరించి ప్రవర్తించుట వలన మీరు విధించిన శిక్ష లేవియోగూడ మాకు దెలియదు. తీవ్ర వేగముగల మనస్సుతో భావించు వస్తువు మాత్రమే ఎదుట గోచరించును గాని శారీరక చేష్టలు దృశ్యములు గావు. మహామునుల శాపాదికములగు నెట్టి కార్య కలాపములైనను, తీవ్ర వేగ సంపన్నమగు మనస్సును చలింపజేయ జాలవు. ఒక కార్యమందు నిత్యమైన ధీరుని మనస్సు, నే విధములైన ప్రతిఘాతములైనను, మేరునగమునువలె చలింపజేయలేవు. కాన, రాజా ! ఈ శరీరములు వ్యర్థములు, వీనికి మనస్సు ప్రధానము. అడవియందలి వృక్ష లతాదులకు జలమే ప్రధాన కారణము. కాన, శరీరము, చిత్తప్రాధాన్యమైనదని భావింపుము. ఈ దేహము నశించినచో మనస్సు నూతన దేహము నాశ్రయించును. ఇట్లు దేహముల నెన్నింటినో స్వప్నమునందువలె సృజించును. ఆ మనస్సు క్షయమైనచో దేహములను సృజించు ప్రసక్తి యుండదు. కాన, చిత్తరత్నమును సావధానుడవై రక్షించుకొనుము' అని ప్రబోధించె" నని వశిష్ఠుడు శ్రీరామునకు వివరించెను. మరియు "శ్రీరామా! ఆ యహల్యా కృత్రిమేంద్రుల పలుకుల నాలకించిన ఇంద్రద్యుమ్న మహీపాలుడు, తన పార్శ్వభాగమున నున్న 'భరతు' డను ముని పుంగవుని జూచి ఇట్లనెను : 'మహాత్మా! వీరు కామాంధులైనను, వాక్కులు మాత్రము పరమాత్మను బోధించునవై యున్నవి. నాకు మిక్కిలి యాహ్లాదప్రదములైనవి. శాస్త్రవిధి ననుసరించి వీరిని

శాసించితిని. అయినను దానివలన ప్రయోజనము లేకపోయినది. ఇక నిపుడు ప్రజాక్షేమమును కాంక్షించి, వీరిని దేశ బహిష్కారము గావించెదగాక!' అని వారిని నిర్వాసితులజేసి యాత్మ సంతృప్తి నందెను.

## చిత్తోపాఖ్యానము

అనంతర మా వశిష్ఠ మహర్షి, రఘుకులతిలకునితో నిట్లు వచించెను: "రామచంద్రా! ప్రాణుల కన్నింటికి రెండు విధములగు శరీరము లుండునని ఆఖ్యాన రూపములుగా నీకు వివరించితిని. వానిలో నొకటి మనశ్శరీరము కాగా, రెండవది మాంసమయ శరీరము. ఇది ఏ మాత్రము పనిజేయ జాలదు" అనగా శ్రీరామచంద్రుడు, "బ్రహ్మర్షీ! జడవస్తు వయ్యును. జడముకాని యాకారమును ధరించి, అరూఢ సంకల్పమైన మనోరూపమును విస్తరించి బోధింప ప్రార్థించుచున్నాను" అన వశిష్ఠు డిట్లు ప్రారంభించెను.

## మనస్స్వరూపము

"అనంతము, ఆత్మతత్త్వము, సర్వశక్తిమంతము నగు పరమాత్మ సంకల్పశక్తిరచితమైనది మనస్సు అని పండితులు నిర్వచించిరి. సత్తు, అసత్తుల మధ్య భావరూపమై ఇది మానవులలో చలించుచుండును. అది 'సంకల్పాభి ముఖము' అనియు నందురు.' ఇది దేనినుండి జనించినది, రూపమేమి' అని యాలోచించినందువలన ప్రయోజనములేదు. నిత్యము నీ మనస్సును మోక్షమునకై ముక్తి యుక్తుల యందును, పరమాత్మ యందును వినియోగింప వలయును.

రామచంద్రా! ఇపుడు నీకు వివరింపబోవు చిత్తోపాఖ్యానమును పూజ్యుడగు బ్రహ్మదేవుడు పూర్వము నాకు జెప్పెను. నిర్మానుష్యమై, మిక్కిలి భయకంరమైన యొక మహారణ్యము కలదు. అది నూరు యోజనముల విస్తారము కలది. అందు వేయి

చేతులు, నేత్రములు గల పురుషుడు వ్యాకులచిత్తుడై, వికృతాకారము గలిగి, చూపరులకు భయము గొలుపుచుండెను. అతడు తన సహస్ర కరములతో పరిఘలనుగొని, తన పృష్ఠ భాగమున మోదుకొనుచు, భయపడుచు వనాంతరమున యోజన సహస్రము పరుగిడుచుండెను. మోదుకొనుట వలన బాధ కలిగి మొరలిడుచు, వివశుడై యొక కృష్ణపక్షమునాటి రాత్రి ఆకాశమువలె గంభీరమైన నొక యంధ కూపమున గూలెను. అందుండి చాలా కాలమునకు వెలువడి తిరిగి తనను తాను గొట్టుకొని, పరుగిడి, కరంజ మను కంటకాకీర్ణ వనమున, అగ్నియందు జొచ్చు శలభమువలె ప్రవేశించెను. అందుండి యొకక్షణములో వెలికివచ్చి. తిరిగి తనను తా మోదుకొనుచు మొర లిడుచుండెను. బాధను భరింప జాలక దూరమునకు బరువెత్తుకొని పోయి చంద్రకిరణ ప్రసారమువలె చల్లనై, మనోహరమగు కదళీ వనములో సంతోషమున ప్రవేశించెను. ఒకక్షణకాలములో నందుండి వెలువడి మరల మోదుకొని యరచుచు, దూరముగ పలాయితుడై పోయి యంధకూపమున గూలెను. అందుండి మరుక్షణమున వెలువడి మరల కదళీ వనములో ప్రవేశించెను. ఆ కదళీ వనమునుండి కరంజ వనమునకు, అందుండి యంధ కూపమునకు, నందుండి కదళీ వనమునకు బ్రవేశించుచు తన్ను దాను మోదుకొనుచుండెను.

నిత్యము నీవిధమగు ప్రవర్తనముకల అతనిని, జాలకాలము నుండి వీక్షించుచున్న నేను ఒకనాడు బలవంతముగ నొక్క ముహూర్త కాలము నిరోధించి, 'నీ వెవ్వరవు? ఈవిధముగ జేయుటకు కారణమేమి? నీ యభిమతమేమి? ఏదైన ప్రయోజనము నాశించి పలాయితుడ వగుచుంటివా, లేక వ్యర్థముగా నిట్లు జేయుచుంటివా?' అని ప్రశ్నించితిని. రామచంద్రా! నే నట్లు అడుగగా నా పురుషుడు, 'మహాముని! నే నెవ్వడనుగాను. ఏమియు జేయుటలేదు. నన్ను వ్యర్థముగా నీవు నిరోధించితివి.

కాన, నాకు శతృడవు. నన్ను నీవు జూచుట వలన దుఃఖ సుఖ ముల రెండిటికి దూరమైతిని' అని తన స్వాధీనమున లేని యవ యవములను జూచుకొని దుఃఖించుచు, పర్జన్య గర్జనమువలె రోదించుచు, వర్షధారలవలె నశ్రుపాతము జేయుచు, క్షణమాత్ర ములో నా దుఃఖమును విడచి, మరల తన యవయవములను జూచుకొని, వికటాట్టహాస మొనరించెను. అనంతరము నేను జూచుచుండగనే తన యవయవముల నన్నిటిని క్రమముగ విరచివైచెను. ప్రథమమున శిరస్సును ఖండించుకొనెను. తరువాత బాహువులు, వక్షఃస్థలము, ఉదరము, గూలిపోయెను. అంత నొక్కక్షణములో నా పురుషుడు యథాపూర్వముగ తన యవ యవములను విడచి, నియతి శక్తిచే నెచటికో పోవ యత్నించెను. ఇంతలో వేరొకచోట మరియొక పురుషు డట్లే మోదుకొనుచు పర్యాకులాంతరాంత్ముడై తిరుగుచుండెను. వాని దగ్గర కేగి పూర్వ విధముగ ప్రశ్నించితిని. అతడును వెనుకటివాని విధముగ ప్రవర్తించి, శిథిలము లయిన తన యవయవములను విడచి యదృశ్యు డయ్యెను. ఆ యడవియందు మరియొకపు డింకొక చిత్రమైన వ్యక్తిని జూచితిని. అతడు మహాంధుడు. అతడు పరుగెత్తుచు నంధ కూప మున గూలెను. అత డెపుడు వెలికి వచ్చునా అని యెంతయో కాలము ప్రతీక్షించుచు నుంటిని అత డెంత కాలమునకు నందుండి వెలికి రాలేదు.

ఆ వనమందు మరియొక విచిత్ర పురుషుని జూచితిని. అతడు ఇటు నటు పడిపోవుచుండెను. వానిని జూచి, పూర్వవిధమున ప్రశ్నించితిని. అతడు 'మూఢుడా! నీవు నన్ను నెరుంగవా? దుర్మతీ! పొమ్మావలకు' అని తన కర్తవ్యమగ్ను డయ్యెను. ఈవిధముగ నా మహారణ్యమున నా విధమగు మానవు లనేకమంది సంచరింతురు. నేటికిని యా మహాటవి యట్లే విరాజిల్లుచున్నది. అది భయంకర ముగా, కంటకావృతమై యున్నది. అంధకారబంధురమై యున్నను,

ఆత్మజ్ఞాన విహీనులు సుఖాభిలాషులై దీనిని కుసుమగుల్మవిరాజిత మునుగా భావించి యందు జేరుచున్నారు" అని వశిష్ఠుడు చెప్పగా శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను : "మహాముని! ఆ మహాటవి యెట్టిది ? అది ఎచట నున్నదో సెలవిండు. ఆ పురుషులను గూర్చియు, వారు తిరుగుచుండుటకు కారణమును, వాటి యంతరార్థము నెరిగింపు" మన నా బ్రహ్మర్షి ఈవిధముగ నభివర్ణించెను : "రఘుకులపుంగవా! నేను వివరించిన విషయముల యంతరార్థము నెరిగించుచున్నాను, వినుము. ఆ మహారణ్యము యథార్థమునకు మహారణ్యముకాదు. అది దూరముననులేదు. అది ఈ సంసారమే. ఇం దనేకవిధములగు బిలములు కలవు. శూన్యమైనదైనను యథార్థమను భ్రమను కలుగజేయు చున్నది. నేను వివరించిన మహారణ్యమే ఇది. ఆ సంచరించు పురుషులు సామాన్యులు గారు. మనస్సులు మహాపురుషులుగా నాకారములు ధరించి దుఃఖ కంటకములలో జిక్కుకొని భ్రమించుచున్నారు. వారిని దర్శించిన నన్ను వివేకమునుగా భావింపుము. 'వారికి బోధించుట' యనగా వివేకమును జాగరితము జేయుటకు యత్నించితిని, నా ప్రబోధమువలన వారిలో కొందరు పరమాత్మస్వరూపము నెరిగిరి. 'తమ యవయవములను విరచుట'యనగా సంసారమును పరిత్యజించి ప్రశాంతిని పొందుట. మరికొందరు వివేకస్వరూపి నగు నన్ను తిరస్కరించిరి. అందుచే వారు స్వయముగా నరకకూపమున గూలిరి. ఆ అంధకార కూపములే నరకములు. 'కదళీవన' మనగా స్వర్గము. 'కరంజవన' మనగా మర్త్యలోకముగా భావింపుము మహాపాతకములతోగూడినిరంతరము నరకమునం దుండు మనస్సులు చీకటి నూతులలో బడి, తిరిగి వెలికి రాకుండ నుండును. దారాపుత్రాదులయం దనురాగరస సంభరితమైన మర్త్యలోకము కంటకాకీర్ణమై బాధాకరముగా నుండును. అదియే కరంజ వనము. కొందరు పురుషులు నన్ను 'దుర్మతీ' అని తిరస్కరించిరి. ఆత్మజ్ఞాన శూన్యములగు మనస్సులు. తమ వివేకమును

తిరస్కరించినవని గ్రహింపుము. 'నేను నీచే చూడబడి నశించితిని కాన నీవు నాకు శత్రుడవు అగుట నిశ్చయము' అనుటకు, ఆత్మ విచారము వలన చిత్తము నశించును కదా! రామచంద్రా! 'నరులు మహాక్రందనలు జేసిరి' అనగా మనస్సు భోగ సముదాయమును విడచుచు, రోదించిన దని భావము. వివేకమును సంపూర్ణముగ పొందక, ఆత్మజ్ఞానమును బాగుగా నెరుంగక, భోగములను విడచుట మనస్సునకు పరితాప హేతువుకదా! 'పురుషులు నన్ను జూచి నవ్విరి' అనగా ఆత్మజ్ఞానమున మానసికానందము జనించినదని తాత్పర్యము. వివేకవంతుడై, సంసారస్థితి దూరుడై తన రూపమును త్యజించు వానికి నానందము వృద్ధి యగును. 'ఆ పురుషుని నేను నిరోధించి చూచితిని' అనుదానికి, వివేకము చిత్తమును బలాత్కారముగ స్వాధీనము జేసుకొను నని భావము. 'ఇనుప బడియతో తనను తాను మోదించుకొనుట' అన, చిత్తము తన సంకల్పములను, ఆఘాతములచే తనను తాను మోదించుకొనుచుండెనని తెలియుము. 'ఆ పురుషుడు ఇట్లు మోదించుకొనుచు పలాయితు డగుచుండెను' అను దానికి, తనలోని వాసనలను ప్రహారముల మూలమున వచ్చుటచ్చుటికి మనస్సు స్వయముగా పరుగిడు చుండెనని భావము. పట్టుపురుగు తనలోని లాలాజలముతో స్వయముగ బంధింప బడుచున్నది కదా! రామచంద్రా! ఉత్తమమైన చిత్తోపాఖ్యానమును దాని అంతరార్థములతో నీకు వివరించితిని. నీవు చిత్తత్యాగమునకు సంసిద్ధుడ వగుము.

## బాలకోపాఖ్యానము

చిత్తోపాఖ్యానమున 'తన సంకల్పములవలన చిత్తము తనను బంధించుకొనుచున్నది కాన దానిని విడువవలయును' అని వివరింపబడినది. మనస్సును సత్యవస్తువునుగా భావించినచో తద్రచితమైన జగమును సత్యముగనే భావింతురు" అని వశిష్ఠ మహర్షి ఈ బాలకోపాఖ్యానము నభివర్ణించుచున్నాడు.

" ఇక్ష్వాకువంశమండన ! సర్వశక్తివంతమైన మనస్సు బ్రహ్మము. అది నిత్యము, అవ్యయము, ఆపూర్ణమునై యుండును కాని, వేరొకటి మాత్రము కాదు. పరమాత్మయందు లేని వస్తు వేదియు లేదు. అన్ని వస్తువులు దాని యందు కలవు. ఆ యా వస్తువుల శక్తితో ప్రకాశించుచు పరమాత్మ, వస్తు జ్ఞానమును కలుగ జేయు చున్నది. శ్రీరామచంద్రా ! పరమాత్మయొక్క చిచ్ఛక్తి శరీరముల యందును, స్పందన శక్తి వాయువుల యందును, దార్ఢ్య శక్తి శిలలందును, ద్రవ శక్తి జలమందును, దాహ శక్తి యగ్ని యందును, శూన్య శక్తి యాకాశమునందును, నాశ శక్తి నశ్వరము లందును భాసించుచున్నది. అండాంతర్జలమున బహువర్ణములు కల మయూర ముండునట్లు ఫల, పత్ర, లతా, పుష్ప, శాఖాదులు కల వృక్షము, బీజమున నిమిడియున్న పగిది, నానారూప విభూషితమైన ఈ జగము పరమాత్మయందు వెలుగొందుచున్నది.

ఈ పరమాత్మ భిన్నకాలములందు భిన్నశక్తులతో, భిన్న ప్రాంతములందు భిన్నభిన్న సస్యములు ఫలించు విధమున ప్రతిభాసించు చున్నది. రామచంద్రా ! ఆత్మ సర్వవ్యాపకము. నిత్యము ప్రకాశించు మహాకాయము కలది. అది మనన శక్తిచే మనస్సని చెప్పబడును. ప్రథమమున నది బంధమోక్ష దృష్టి కలది. అనంతరము, 'జగత్తు' అనబడు ప్రపంచ రచన కల దయ్యెను. ఈ స్థితి యంతయు బాలునకు, కల్పనా రూపమున జెప్పు కథవలె నసత్యము " అనగా శ్రీరామచంద్రుడు, " మునీంద్రా ! మనో వర్ణన పూర్ణమైన ఆ బాలకోపాఖ్యానమును క్రమముగ జెప్పు"డని ప్రార్థింప, వశిష్ఠుడిట్లభివర్ణించెను :

" అవివేకి యగు బాలుడు తన దాదిని ' దాదీ ! వినోద ప్రదమగు నొక వార్తను అనగా కథను జెప్పుము' అన నా దాది బాలునకు వినోదము కలుగుటకు ప్రసన్నమధురాక్షర స్నిగ్ధమైన ఈ కథను విన్పించెను. ' కుమారా ! ఒక శూన్య

నగరమున మహాత్ములు, ధర్మాత్ములు, శౌర్యవంతులు నగు ముగ్గురు రాజకుమారులు కలరు. వారిలో మొదటి ఇరువురు జన్మింపలేదు. మూడవవాడు గర్భస్థితుడే కాదు. ఒకనాడు ఆ మువ్వురును ఉత్తమ లాభార్థులై, తమ శూన్య నగరమునుండి నిర్మలాశయులై ఆకాశమున పుష్ప, ఫల భరితములైన వృక్షములను గాంచిరి. అచటికి పోయి, ఆ వృక్ష చ్ఛాయను కొంతసేపు విశ్రమించి, మధురములగు నా వృక్ష ఫలములను భుజించిరి. అనంతర మా ముగ్గురును అచటినుండి విలాసముగా ప్రయాణము సాగించిరి. క్రమముగ వారలు ఉల్లోల కల్లోలములైన మూడు నదీతీరములకు జేరుకొనిరి. ఒక దానిలోని నీరు పూర్తిగా ఇంకి పోయెను. మిగిలిన రెండిటిలో జల మెంత మాత్రమును లేదు. ఇంకి పోయిన నీరుగల నదిలో వారు దిగి యథేచ్ఛముగా జలక్రీడలు సల్పిరి. క్షీరోపమము లగు జలమును గ్రోలిరి.

సూర్యాస్తమైనంతనే ఆ మువ్వురును భవిష్యన్నగరమున ప్రవేశించిరి. ఆ నగరవాసులు యథేచ్ఛముగ విహరించుచుండిరి. వారి సరస సల్లాపములు శ్రావ్యములై, శ్రవణ సుఖ మొసంగుచుండెను. వారు అచట మూడు భవనములను వాసయోగ్యములుగ సంపాదించిరి. వాటిలో నొకదానికి గోడలు లేవు. రెండవ దానికి స్తంభములు లేవు. ఇక మూడవది నిర్మాణమే కాలేదు. ఈ రాజకుమారులు గోడలు లేని భవనమున ప్రవేశించిరి. అందు తప్తకాంచన నిర్మితములైన మూడు పాత్రలు లభించినవి. వాటిలో రెండు పాత్రలు ముక్కలు చెక్కలు నై యుండెను. మూడవది చూర్ణమై యుండెను. ఈ ముగ్గురు కుమారులు చూర్ణ పాత్రమును గ్రహించిరి. ఆ పాత్రలో ద్రోణత్రయము తక్కువగా మూడు ద్రోణముల బియ్యమును పోసి పాకమును వండిరి. నోరులేని బ్రాహ్మణు లనేకు లా వంటను సంతృప్తిగా నారగించిరి. భుక్తశేషమును రాజపుత్రులు తుష్టిగా భుజించిరి.

భవిష్యన్నగరమున రాజపుత్రులు మృగయాఖేలనవ్యాపార పరాయణులై సుఖముగా నుండిరి' అని చెప్ప, బాలకుడు విని పరమానంద హృదయుడై యందలి విషయములు యథార్థములని భావించెను. రామచంద్రా! ఆ బాలకోపాఖ్యానమును నీకు వివరించితిని. ఈ కథ బాలకునకు సత్యమని భాసించు రీతి, జగత్తు సత్యమని భావించు వారలకు అనగా వైరాగ్య భావములేని వారికి సత్యముగనే భాసించును. ఈ సృష్టి యంతయు సంకల్ప జాలముచే సృజింపబడినది. మనస్సు సంకల్ప జన్యము. కాన, నీవు సంకల్ప రహితుడవై, నిర్వికల్ప స్థితి నాశ్రయించిన నిశ్చయముగా ప్రశాంతి నంద గలవు.

## లవణోపాఖ్యానము

బాలకోపాఖ్యానమున, 'జగత్తు అసత్యమని భావించుట యే జ్ఞానమనియు, ఇది లేనివానికి సత్యముగనే భాసించు' ననియు ప్రబోధింప బడినది. ఇపుడు నిర్వికల్పసమాధి నాశ్రయించుటకు, బ్రహ్మ విచారము జేయవలయునని నిరూపించుటకు 'లవణోపాఖ్యానము' అను నామాంతరముగల 'శాంబరికోపాఖ్యానమును' జెప్ప నారంభించెను.

"శ్రీరామచంద్రా! మూఢుడు స్వసంకల్ప వశమున మోహమున మునుగుచున్నాడు. పండితు డట్లగుటలేదు. కాన, విచారధర్మియగు బుద్ధిచే, మోహ సంరంభ హీనుడవై, సత్యమగు బ్రహ్మను గూర్చి చింతింపుము. అసత్యమగు జగద్భ్రాంతిని వీడుము. బంధ రహితమైన దానిని బంధయుతముగా భావించి వ్యర్థముగా దుఃఖింతువేల? అనంతమైన ఆత్మ తత్త్వను బంధించునదేది? అది ఎట్లు బంధించును? చిదాత్మ అనంతము, చిదానంద స్వరూపము, నిర్వికల్పము నై యుండగా దానికంటె వేరగు మరియొక వస్తువు లేనందున బంధించువా డెవడు? విడువబడువా డెవడు? ఈ బంధ

మోక్షములు కల్పితములు. వాస్తవములు కావు. సంకల్పమాత్రము బంధ మగును. మనస్సును సంకల్పరహిత మొనరించిన మోక్షము ప్రాప్తించును. మనోమహిమ విచిత్రమైనది. అది గోష్పదమును యోజనముగను, కల్పప్రమాణ కాలమును ఒక్క క్షణముగను జేయును. రామచంద్రా ! ఈ జగ ద్రూప మొక ఇంద్రజాలము. ఇది మనస్సు నెటుల భ్రాంతి మగ్నము జేయుచున్నదియు నీ 'లవణో పాఖ్యానము'న నభివర్ణితమైనది.

ఈ వసుధా పీఠమున 'ఉత్తర పాండవము' అను జనపదము కలదు. అది యనేక మహాటవీ సంభరితమై, రమణీయమైనది. అందు హరిశ్చంద్ర మహారాజ కులోద్భవుడగు 'లవణుడు' అను మహారాజు కలడు. అతడు పరమ ధార్మికుడు. భూలోకమున వేరొక భాస్కరుని రీతి ప్రకాశించుచుండెను. దశదిశావ్యాప్త కీర్తిమంతుడై, కుటిల స్వభావము నెరుంగక ప్రజాసౌఖ్యమును ఆత్మసౌఖ్యమని భావించి రాజ్యపాలన మొనరించు చుండెను. పరద్రవ్యాభిలాషను దరికి రానీయడు. వాక్కు నర్థమును ధరించినట్లు, అతడు ఉదారభావమును ధరించి యుండెను. ఒకనాడు మంత్రి సామంతాది పరివార పరివృతుడై యుండ నొక ఐంద్రజాలికుడు, మహాటోపముగ సభా ప్రవేశ మొనరించెను. సింహాసనాసీనుడైన మహారాజునకు సాష్టాంగ దండప్రణామము లాచరించి, ఎలుగెత్తి యిట్లు పలికెను : 'మహారాజా ! నే నొక చమత్కారమును జేయుదును. తమరు సింహాసనాసీనులై యవలోకింపుడు' అని పద్మమందలి షట్పదము పగది ఝంకారభరిత స్వరమున భాషించెను. వెంటనే పరమాత్మ సంబంధమైన దేదియో భ్రమించిన రీతి, మయూర పింఛ దండమును ద్రిప్పెను. అది యనేక వికృతులకు మూలము. భ్రాంతి ప్రదమై కాంతిపుంజములు వెదజల్లెను. మహారాజు దానిని దర్శించి నంత మాత్రముననే సింధుదేశపు సామంతరాజు సభా ప్రవేశ మొనరించెను. ఆయన వెంట నొక జవనాశ్వము కూడ వచ్చినది.

సామంతుడా యశ్వమును జూపుచు నిట్లనెను : 'రాజేంద్రా ! ఈ హయ రత్నము ఉచ్చైశ్శ్రవమును బోలినది. మా ప్రభువు దీనిని తమకు కానుకగా సమర్పించెను. మహాత్ములకు శ్రేష్ఠపదార్థములను సమర్పించుటవలన శ్రేయములు ప్రాప్తించును కదా !' అని సామంతుడు వచించుచుండగా, ఇంద్రజాలికుడు, 'ప్రభూ ! తమ రీ శ్రేష్ఠమైన హయము నధిరోహించి, భూమండల మంతయు విహరింపుడు' అని పలుకుచు, నా యశ్వరాజమును జూపెను. ఇది యంతయు సత్యము అని భ్రాంతిని జెందియున్న రాజు, చిత్రోపమాకృతి కలవాడై రెండు ముహూర్తముల కాలము ధ్యానాసక్తునివలె నా యశ్వమును విలోకించెను. వెంటనే లిపి కర్మార్పితుని విధమున నిశ్చేష్టితు డయ్యెను. సభాసదు లందరు ఆశ్చర్యమగ్నమానసులైరి. మంత్రిపుంగవులు సందేహ సాగర నిమజ్జనులైరి. సభయందు జెలరేగిన కోలాహలము శాంతించెను.

మహారాజు నిశ్చేష్టితుడై యుండెను. సభాసదులు భయ మోహావిషణ్ణులై, ముకుళించిన పద్మవనము పగిది, ప్రశాంత కాంతి సమన్వితులై యుండిరి" అని చెప్పి వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రుని జూచి మరియు నిట్లనెను : "శ్రీరామచంద్రా ! ఆ రాజు రెండు ముహూర్తములలో స్వస్థత జెందెను. అయినను, తన సింహాసనమున గూర్చుండి కంపితు డగుచుండెను. ఎదురుగనున్న సభాసదు లాయనను బట్టుకొనిరి. వార లాతని స్థితిని జూచి ఈవిధముగ బ్రశ్నించిరి: 'మహారాజా ! నిర్మలమగు తమ మనస్సు మోహమగ్నమగుటకు గారణ మేమి? ఎంత మోహప్రద విషయమందైనను, జ్ఞానవంతులు భ్రాంతి జెందరు కదా !' ఆ మాటలకు రాజు కనులు తెరచి, మహదాశ్చర్యము నొందుచు, 'సభాసదులారా ! చిత్ర విచిత్రమగు నీ కథ నాలింపుడు. ఇంద్రజాలికుడు పించమును త్రిప్పినంతనే భ్రాంతి జెందితిని. వెంటనే యాతడు జూపిన యశ్వము నధిరోహించితిని. అతివేగమున మృగయా వినోదమున కేగితిని. విషయభోగాసక్తుని చిత్తము

మూర్ఖుని బహుదూరము గొనిపోవు విధమున నా జవనాశ్వము మహావేగమున నన్ను ఎచటికో గొనిపోయినది. ఆ ప్రదేశము ప్రళయ సమయ నిర్దగ్ధ జగత్తువలె మిక్కిలి భయంకరమై యుండెను. పశు, పక్షి, వృక్ష, జల శూన్యమై విస్తారము మంచు కలిగి యుండెను. కడు బడలికగలవాడనై నేనా మహారణ్యమునుబోలు దాని యందు ప్రవేశించితిని. సూర్యాస్తమయ పర్యంతము సంచరించితిని. కడకు వివేకవంతుడు సంసార సాగర మధిగమించిన విధమున నతి కష్టమున నా యెడారి ప్రదేశమును దాటి, స్వల్ప మాత్ర జలము కల ప్రదేశమును జేరితిని. జంబూ, చూతాది బహు పాదప సమాకీర్ణమై, యా ప్రదేశము నేత్రపర్వముగ నుండెను. బహువిధ శకుంత సంతానము లా వృక్ష సముదాయముపై నుండి మృదు మధుర కలాపాలాపము లొనరించుచు. పాంథ బాంధవుల నాహ్వానించు చుండెను. ఆ వృక్ష సముదాయము మధ్య నుండి పోవుచుండగా జంబీర వృక్షము మీద నుండి వ్రేలాడుచున్న యొక తీగ నా బుజమునకు దగులుటను గమనించితిని. వెంటనే దానిని గ్రహించి పట్టుకొని వ్రేలాడుచుండగా, నంతట నా కార్యమైన యశ్వము గంగాస్నాన మొనరించిన వానిని వీడి దుష్కృత సంచయము పోవునట్లు, నన్ను విడచి పలాయన మొనరించెను. బహుదూరము నెడతెగక ప్రయాణము జేసియున్నవాడ నగుచుటచే నలసట జెంది యొక వృక్ష మూలము నాశ్రయించి, మోహామగ్న హృదయునకు కల్ప సదృశమై భాసించెడి యా రాత్రిని గడపితిని. స్నానము నాచరింపలేదు. పూజాదికమును నిర్వర్తింప లేదు. భుజించుట కేదియు లభింప లేదు. ఆపదల నెదుట నుంచుకొని యా రాత్రి నెట్లో యపనయించితిని.

ఆ రాత్రి నేననుభవించిన స్థితి అతిదారుణము. చలి యధికముగా నుండటవలన దంతము లప్రయత్నముగ కటకట గొట్టుకొనుచుండ సీత్కారములు విడచుచుంటిని. గాఢాంధకారము

వ్యాపించుట వలన మూర్ఖుని యందు గుణ లేశము కన్పింపని రీతి నే వస్తువు నగోచరమై యుండెను. పక్షులు మాత్రము నిస్సంకోచముగా నప్పుడపుడు మండలాకారముగ భ్రమించుచు అవ్యక్త మధురాలాపములు చేయుచుండెను. కొంతవడికి నిద్రావివశుడనై తిని. నాలుగు గడియల పొద్దు మింటిపై కెగబ్రాకి నాకు మేలుకువ గలిగించినది.

ఒక కన్య అన్నపాత్ర శిరమున ధరించి యా దారిని బోవుచుండుట గాంచితిని. ఆ చంచలాక్షి శ్వేత వస్త్రములు ధరించినది. యెలప్రాయము గలది. కాళరాత్రి నెదురొ్కను చంద్రునివలె నే నా శ్యామలాంగి కెదురేగితిని. 'బాలా! నేను భయంకరమైన యాపదలో జిక్కుకొంటిని. కొంత భోజనము బెట్టి ప్రాణ సంరక్షణ మొనరింపుము. దీనుల బాధలను దూరము జేయు వారలకు సంపద లభివృద్ధి నందును. నాకు క్షుద్బాధ యధికమై భరింపజాలకున్నాను' అని ప్రార్థించితిని. లక్ష్మీదేవి పాపాత్మునకు ధనము ననుగ్రహింపని విధముగా నామె నాకు నన్న మిడుట కంగీకరింప లేదు. అయినను విశ్వాసమును వీడక, నీడవలె నామె ననుగమించుచుంటిని. ఆమె, 'నేను చండాల కన్యను. నీ వెంతగా ప్రాధేయపడినను భోజనము నిడను' అని నిష్కర్షముగా జెప్పి యడుగులు తడబడ నొక పొదరింటిలో నిలబడి యిట్లనెను: 'నీవు మహారాజువలె దోచుచున్నావు. నన్ను వివాహ మాడినచో భోజన మిడుదును భర్తను ప్రాణము లర్పించియైన పూజింపవలయును కదా! ఈ యన్నమును నా తండ్రికి గొనిపోవుచున్నాను. ఆత డిచటికి సమీపముననే పొలము దున్నుచున్నాడు. కష్టించి, పాటుపడి అలసి సొలచి ఈ యన్నమునకై యెదురు చూచుచుండును. ఏ సంబంధమును లేని నీ కీ యన్నమున భాగము సమర్పించితినేని ఆయన ఆగ్రహించును' అని యామె

నిర్ద్వందముగా భాషించెను. గత్యంతరము లేక, అన్నాతురుడనైన నేను ఆమె యభిమతమున కొడంబడితిని. ఆపత్కాలమునందు వర్ణ, జాతి, కుల క్రమముల యాలోచనముండదు కదా! ఆమె నా యభిప్రాయము నభినందించి ఆ అన్నములో కొంతభాగమును నా కిడినది. దానిని భుజించి జంబూఫల రసమును పానము జేసి తృప్తి నందితిని. మోహోపహృతచేతస్కుడనై కొంతతడవు విశ్రమించితిని.

అనంతర మా చండాలిక తన బహిఃప్రాణమునువలె నన్ను వెంట నిడుకొని దురాచారుడు, భయప్రదుడు నగు తన తండ్రి కడకు దుర్మార్గుడగు వానిని 'అవీచి' యను నరకమునకు గొని పోయిన విధమున గొని పోయెను. ఆమె, 'జనకా! నే నీతనికి నా మనస్సు నర్పించితిని. ఇతడు నా భర్త. నీకును ఇష్టుడు కాగడు' అని నన్ను పరిచయ మొనరించెను. కుమార్తె మాట నాత డంగీకరించి సంధ్యాసమయ మగుసరికి యముడు తన కింకరులను విడచిన విధమున తన యెద్దులను విడచి పుచ్చెను. దశదిశల మంచు గ్రమ్మి, ధూళి ధూసరితములవలె నుండ భేతాళ బంధనము వంటి యా వనము నుండి బయలు దేరితిమి.

క్షణకాలములో బోయపల్లెకు జేరితిమి. అట నెచట జూచినను ఖండిత సూకరములు, నశ్వములు, కుక్కుటములు, వాయసములు పడి యుండెను. ఎండబెట్టబడిన జంతువుల నరములపై పక్షులు వ్రాలుటకు యత్నించుచుండెను. పిల్లలకు ఉపాహారముగ నీయబడిన మాంస ఖండముల మీద నీగలు మూగి రొద జేయుచుండెను. కదళీ స్తంభములు ఖండితములై పడి యుండెను. క్రమముగ నా పల్లెలోని నూతన శ్వశుర గృహమునకు జేరుకొంటిమి రక్తారుణనేత్రాంచితుడగు మా మామ ఏకాక్షియగు మా యత్తకు నన్ను జూపుచు, 'ఇతడు మన యల్లుడు' అని తెలియజేసెను. ఆమె నన్నభినందించినది. ఇంక నధికముగా నభివర్ణించి ప్రయోజన

మేమి? ఒక దినమున వివాహము నిర్ణయమైనది. ఆ కృష్ణకాయుడు శ్యామాంగియగు తన ముద్దుకూతును, దుష్కృతమును ప్రసాదించిన విధమున నాకు సమర్పించి వివాహ మొనరించినాడు. తప్పెటలు మున్నగు చర్మవాద్యములు భూ నభోంతరముల, తమ భీకర ధ్వనులను వ్యాపింప జేసెను. మాంసభక్షణ మొనరించి, మదిర కుత్తుకబంటిగా సేవించి వివాహోత్సవానితులు మత్తెక్కి ప్రలాపించు చుండిరి. వారి కీ వివాహ వినోదములు మహోల్లాసము గలిగించు చుండ, నాకు మాత్ర మేనాటి దుష్కృతమో ఇట్లు పీడించు చున్నట్లుండెను.

అనంతరము లవణ మహారాజు తన ప్రసంగను నిట్లు కొనసాగించెను: ఈ విధములగు వివాహ వినోదములతో నేడు దినములు గడచినవి. క్రమముగ నెనిమిది మాసములు గతించినంత, నా ధర్మపత్ని పుష్పవతియైనది. ఆ వేడుకలు కొన్ని దినములు జరిగినవి.

కొంత కాలమునకు నా భార్య గర్భము ధరించినది. ఆపద దుఃఖమును ప్రసవించురీతి నామె దుఃఖదాయని యగు కుమార్తెను గనెను. ఆ బిడ్డ, మూర్ఖునకు విచారము పెరిగినట్లు దినదినాభి వృద్ధి నందుచున్నది. మూడు సంవత్సరముల కాలము గడచు సరికి దుష్టబుద్ధి అశుభమును కనినట్లు పుత్రుడు జన్మించెను. అనేక సంవత్సరము లామెతో నేను శీతాతపక్లేశ వివశుడనై సంసారము సాగించితిని. భార్యను, సంతానమును పోషించు విచారముతో దండహ్యామగుచున్న నాకు, దుర్దినము లారంభ మైనవి. దిక్కులు దహింపబడుచున్నట్లు దోచినవి. ఈ పరిస్థితుల కనుకూలముగ నాకు వయోభార మధికమైనది. శిరము మంచుచే గప్పబడిన విధమున తెల్లనయ్యెను. ఇంతలో నా ప్రాంత మంతయు దుర్భిక్షము వ్యాపించి దానికి దోడయ్యెను.

పుడమిపై గరికపోచ సైతము నెండి పోయెను. చండాల మండల మంతయు నన్నపానములు — కడకు నాకులలములు కూడ లభింపక అలమటించి, మలమల మాడిపోవు చుండెను. కొందరు తృణపత్రాంబుపూర్ణములైన ప్రదేశముల వరయుచు, వింధ్య పర్వత ప్రాంతములకు తరలి పోయిరి. మేఘములు వర్షించుటలేదు. వాయువులు నిప్పులు చెరగుచున్నవి. చెట్లు చేమలు, నోరపిడిచే నిప్పు రగిలి తగులబడి పోవుచున్నవి. ఎచట జూచినను కాటకము వికటాట్టహాసము జేయుచు ప్రజలకు భీతి గొల్పుచుండెను. ఈ మహా విపత్తును భరింపజాలక జనులు, తమతమ బంధు మిత్రులను కలుపు గొని దేశాంతరములకు పయనమై పోవుచుండిరి. కొంతమంది జన్మస్థాన మందలి మమకారముతో విడిచి వెళ్లజాలక, అచటనే మరణించుచుండిరి. ఇక గొంతమంది యగ్నిప్రవేశ మొనరింప, మరికొందరు వాపీ కూపములలో గూలి ప్రాణత్యాగ మొనరించు చుండిరి. ప్రయాణమై పోవు వారిలో గొందరు మార్గమధ్యమున క్షుత్పిపాసా ర్తులై మడియు చుండిరి. ఈ దారుణ స్థితిని భరింప లేక నేనును భార్యను, సంతానమును వెంట నిడుకొని కష్టతరమైన యా ప్రదేశమును వీడి దేశాంతరమునకు పయనమైతిని.

కొంతదూర మేగిన యంత బడలిక జెందిన మే మొక తాళ వృక్షచ్ఛాయ నాశ్రయించితిమి. అచట నా బుజములపై నెక్కించు కొన్న పిల్లలను, అనర్థములను దించుకొనిన విధమున క్రిందకు దించి, రౌరవ నామక నరకమునుండి వెలువడిన రీతిని భావించి, కొంతతడవు విశ్రమించితిని. ఆ శీతల తరుచ్ఛాయ నాశ్రయించి నా ధర్మపత్ని, గాఢనిద్రా పరవశురా లయ్యెను. ఆమెను గాఢముగ పరిష్వంగ మొనరించి యిరువురు పిల్లలు గాఢసుషుప్తి మగ్నులైరి, కడగొట్టు కుమారుడగు ప్రచ్ఛకుడు మెల్లగా నన్ను సమీపించి కంట దడి పెట్టుచు దీనవదనుడై, 'జనకా! ఆకలి యగుచున్నది. తినుటకు మాంసమును, త్రాగుటకు రక్తము గొనిరమ్ము' అని దుఃఖించుచు,

నన్ను వేధించుచు, ప్రాణాపాయస్థితియం దుండెను. వాని స్థితిని జూడజాలక నేను మిగుల పరితపించుచుంటిని. వాని యభీప్సిత మును దీర్పజాలక, మతిభ్రంశము నందుచుంటిని. ప్రాణ పరి త్యాగము దప్ప వేరొక యుపాయాంతరము లేదని యంతరంగమున నిర్ణయించుకొంటిని. కట్టెల నేరుకొని వచ్చి చితి బేర్చితిని. అది ఛటఛటార్భటులతో, 'వెంటనే నా కాహుతి కమ్ము.' అని యాహ్వానించుచుండెను. వెంటనే నే నా చితిలోబడ యత్నించు నంత నీ సింహాసనమున, మీచే గదుపబడి తెలి వొందితిని. ఇంతలో తూర్యవాద్య నినాదములతో జయశబ్దము శ్రవణ గోచర మయ్యెను. నేనును మెలకువ నందితిని. ఆ ఇంద్రజాలికుడు నాకీ మోహము గలుగజేసెను. జీవునకు నజ్ఞాన వశమున, ననేక దశలు ప్రాప్తించునని తెలియ జేసెను' అని ఆ లవణ మహీపాలుడు తేజో వంతు డయ్యెను. అయినను, వెనుకటి భ్రాంతినుండి పూర్తిగా విముక్తుడు కాలేదు. సభాసదులు మహారాజ వచనముల నాలించి, 'ఈ వచ్చినవాడు శాంబరికుడు కాడు. ఇతనికి ధనకాంక్ష లేదు. సంసార స్థితిని ప్రబోధించుటకు మహాపురుషుడో, లేక మహా దేవతయో ఈ రూపమున నవతరించి యుండవలయును. తాము వివరించిన విషయము ననుసరించి ఇదియంతయు మనో వివర్తనమే సంసారము అని విశదమగుచున్నది సర్వశక్తిమయుడగు నా యనంతరరూపుని విలాసము మనోమయ జగత్తు' అని పలికిరి.

## చిత్తవ్యాధి చికిత్స

పరమాత్మ వివర్తమగు మనోవిలాస మీ ప్రపంచము. ఇది మిథ్య. దీనికి అధిష్ఠానమగు బ్రహ్మము శాశ్వతము అని అనేక విధములగు నాఖ్యానోపాఖ్యానములతో వివరించి ప్రబోధించినను మనస్సు నిశ్చలముగా నుండదు. కాన దానిని స్థిరముగా నుంచు కొనుటకు ప్రాపంచిక విషయముల పాలికి బోనీయక, నిరోధింప

వలయును " అని చెప్పదలచి వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకీ విధముగ పలికెను :

" శ్రీరామచంద్రా ! మనస్సు చేయు దానిని కార్యమునుగా నెరుంగుము. అది విడచిన దానిని త్యాగ మని భావింపుము కాని, శరీరముతో చేయునది కార్యము. దానిచే విడువబడునది త్యాగము కానేరదు. ఆ కార్య, త్యాగములకు మనస్సే ప్రధానము. మనన వర్జితమై, నిశ్చలమైన మనస్సు కలవాడు ఉత్తమోత్తమమగు ధ్యానయుక్తు డగును. అది మనస్సంయమనము. ఇది కలవాడు ప్రశాంతుడు. మందరగిరి తిరుగుచుండ క్షీరోదధి సంక్షోభము జెందు విధమున సంసార భ్రాంతి చిత్త విక్షోభమునకు కారణము. భోగ సంకల్ప విభ్రమములు మానసిక వృత్తులు. అవి సంసార విష వృక్షమునకు బీజములు.

చిత్తమునకు సంభవించిన మహావ్యాధికి చికిత్సా సంబంధ మైన మహౌషధములు నీ యధీనముననే కలవు. అవి రుచ్యములు. సుసాధ్యములు. వాని గూర్చి వివరించుచున్నాను. సావధానుడవై యాలకింపుము.

అభిమతవస్తు పరిత్యాగ మొనరించి, అన్యవిషయముల మీదికి మనస్సును మరలనీయకుండ నుంచుట మనోజయము. తన యధీనమున నున్న యేకాంతమును గోరుచు, నభిమతవస్తు పరిత్యాగ విషయమున, బాధనందు మానవ కీటకము నీచాతి నీచమైనది. శాస్త్ర పరిచయమున తీక్ష్ణమై, సంతాప రహితమగు మనస్సుతో, సంసార చింతాపరితప్త మనస్సును, పదునైన యినుప ముకటితో తప్త లోహములను ఖండించిన విధముగా ఛేదించుము. అనగా శాస్త్ర పరిజ్ఞానము, సజ్జన సాంగత్యములతో బంధహేతువులగు వాంఛలను విడువవలె ననుట.

స్వపౌరుషైక సాధ్యము, ఆత్మాభిమత త్యాగరూపము నగు మానసిక ప్రశాంతి కంటె మించి సుగతి, మరియొకటి లేదు. చిత్తము 'సంకల్ప రహితము' అను శస్త్రముతో ఖండితమైనప్పుడు అనగా, మనస్సునం దేవిధములైన సంకల్పములను రానీయక, నిశ్చలముగ నిలుపుకొని నపుడు సర్వాంతర్యామి, సర్వవ్యాపకము, ప్రశాంతము నగు బ్రహ్మము లభ్యమగును. ఆ మహాపదవి నొక్క దానిని చాలకాల మనుభవించిన చిత్తము చిద్భాసితముగా, ననగా సాక్షి చైతన్య మాత్రము మిగిలినదానిగా జేసి, దానికంటె పరుడవు కమ్ము. అనగా సాక్షిభూతుడవుగా నగుము. పరమాత్మ సంబంధమైన భావనాబుద్ధియుక్తుడవుగా నుండుము. మనస్సును వ్యగ్రము కానీయకుము. చిత్తమున కంటె పరమగు నాత్మను ధారణ జేయుము. యమ, నియమాది పురుష ప్రయత్నముల నాశ్రయింపుము. చిత్తమును సంకల్ప రహిత మొనర్పుము. ఆ మహాపదవిని, అనగా బ్రహ్మపదమును పొందుము. అది అనశ్వరము. ఉద్వేగము లేకుండ నుండుట సంపదలకు మూలము. అనుద్వేగము వలన మానసిక జయము లభించును. దీని ముందు త్రిలోక విజయము గూడ తృణప్రాయ మగును.

హృదయాకాశమున, పరమాత్మ ధ్యానరూప మను చక్రాయుధముతో నిశ్శంకముగ, మనో మారణ మొనరించినచో ఆది వ్యాధులు బాధింపవు. రమణీయ వస్తువును రమణీయత లేని దానినిగ భావన జేసినప్పుడు, చిత్త సంబంధములైన యంగము లన్నియు భిన్నాభిన్నములై పోవునని నా యభిమతము, 'నేను ఇటువంటి వాడను, అది నాది' అను స్వభావము కలది మనస్సు. 'నేను, నాది' అను భావనను విడచుట మాత్రమున కత్తిచే నరుకబడిన కట్టులవలె సంబంధము సడలి పోవును. శరదృతువునందు పయోదములు వాతాహతములైనట్లు, సంకల్ప రాహిత్యము వలన మనస్సు అంతర్ధానము నందును. కల్పాంత వాయువులు

పీచినను, సప్తసాగరము లేకములైనను, ద్వాదశాదిత్యులు తపింప జేసినను సంకల్ప రహితునకు చలన ముండదు. నాశము కలుగదు.

సంకల్పమాత్రైక సాధ్యమై సకలసిద్ధి ప్రదమైనదగు నిర్వికల్పసమాధి సామ్రాజ్యమందు పరమాత్మధ్యానతత్పరుడవై యుండుము. మనశ్శత్రువు సంకల్పమాత్ర విభవముతో వివిధ వస్తు సందర్శనము గావించి నిన్ను జయింప దలంచుచున్నది. నిస్సంకల్పత్వమున సంతోషమాత్ర విభవుడవై ఆ మనశ్శత్రువును జయించి, సుఖ మనుభవింపుము. పరమ పావనము, హిమ శీతమునగు నాత్మజ్ఞాన సంపన్నులకు సమ్మతమైన సమత్వభావము కలదియు, అహంకార నాశకము, శాశ్వతము నగు పరబ్రహ్మపదము నీకు లభించు గాక! అగ్నికి ఉష్ణత్వము ధర్మమైనటు, మనస్సునకు చంచలత్వము ధర్మము. చంచలత్వము లేని మనస్సు అందరకు నుండదు" అని ప్రబోధించి మరియు వశిష్ఠు డిట్లు చెప్ప దొడగెను :

"శ్రీరామచంద్రా! చిత్తత్వమునందు గల చంచల స్పంద శక్తి, జగద్భ్రాంతిని కలుగజేయుచున్నది. అదియే మానసిక శక్తినిగా నెరుంగుము. ఈ చంచలత లేని మనస్సు అమృతము. దానిని 'తపస్సు' అనియు నందురు. దీనిని శాస్త్రములు 'మోక్ష మని' సిద్ధాంతీకరించుచున్నవి. రామ! ఆ మనశ్చాంచల్యమును 'అవిద్య' యని యందురు. దానికి 'వాసన' అని మరియొక నామము కలదు. అవిద్య ఆత్మవిచారమున నాశ మగును. ఈ అవిద్య, వాసన అనునవి అంతరంగమున లీనములై యుండును. వానిని పరిత్యజించుటవలన పరబ్రహ్మ గోచరించును.

## మనస్స్వరూపము

సదసద్వస్తువుల రెండిటికిని (చిత్తజాడ్యములయిన చేతనా చేతనములకును), 'నేను, నాది' అను వృత్తులకును మధ్య డోలాయమానముగ సంచరించునది మనస్సు. ఈ మనస్సును జడవస్తువుగా

భావించుటవలన, జడాత్మకత్వముచేత, నిరంతరాభ్యాస వశమున జడరూప మగుచున్నది. జ్ఞానము ననుసంధానము జేయుటవలన, చిదానందాత్మముచేత, తదనుగుణదృఢాభ్యాస వశమున, చిన్మాత్ర రూపము నగుచున్నది. పురుష ప్రయత్నముతో నీ మనస్సును ఏ వస్తువునందు ప్రవేశపెట్టిన ఆ వస్తు రూపమును అభ్యాస వశమున పొందుచున్నది. కాన మనస్సును మనస్సుతో పురుష ప్రయత్నముచే నిగ్రహించి, శోకరహిత పదము నవలంబించి నిరాటంకముగ స్థిరుడ వగుము. మనస్సును జయించుటకు మనస్సే సమర్థవంతమైనది కదా! రామచంద్రా! రాజు కానివాడు, రాజును నిగ్రహించుటకు సమర్థుడు కాడు కదా! సంసారసాగర మగ్నులై, ఆశ యను మొసలిచే పట్టుకొనబడినవారలై, సుడిగుండములలో కొట్టుకొనిపోవు వారి 'మనస్సు' అను నౌక తమను దూరముగ గొనిపోవుచున్నది. దృఢముగ బంధించు మనస్సనెడి పాశమును, మనస్సు చేతనే ఛేదించి, ఆత్మను సంసారమునుండి తరింప జేయుము. తరించుటకు దీనిని మించిన వేరొక యుపాయము లేదు. అనేక విధములుగ మనస్సనెడి వాసన యంకురించుటకు గారణమైన దానిని ప్రాజ్ఞుడు పరిహరింపవలెను. దానిచే నవిద్యారూపమగు వాసన క్షయించును. ప్రప్రథమమున భోగైకవాసనను త్యజించి, యటు తరువాత, భేద వాసనాత్యాగ మొనరింపుము. అనంతరము భావాభావములను విడచి, నిర్వికల్పుడవై సుఖ మనుభవింపుము. మనోనాశమును అవిద్యా నాశన మనియు నందురు. మనోనాశ మనగా, దానియందు నుద్భవించు కోరికలను లయింపజేయుట విషయములం దాసక్తి లేకుండుట మోక్షము. వాటియం దాసక్తి కలిగి యుండుట దుఃఖ మగును. విషయ వాసనా పరిత్యాగ ప్రయత్నమును, బ్రహ్మ ప్రాప్తి యత్నమందురు. వాసనా పరిత్యాగమున క్షణకాలములో బ్రహ్మాత్వము నంద గలడు. జ్ఞాన హీనులయందు మాత్రమే యవిద్య చోటు జేసుకొని యుండును. నామమాత్రధారిణియై, రూప

శూన్యమగు నీ యవిద్య ప్రాజ్ఞులయందు కానరాదు" అని వశిష్ఠ మహర్షి ప్రబోధింప శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను: "మునీంద్రా! అవిద్యా సంపదచే నావరించిన గాంఢాంధకారము తొలగు నుపాయమును మరల ప్రబోధింపుము" అన వశిష్ఠ మహర్షి ఈవిధముగ జెప్ప నారంభించెను:

"ఆత్మావలోకనేచ్ఛ మోహ సంక్షయకరము. అవిద్యా నాశకారిణి. కష్టతర దుఃఖములను, కంటకవృక్షాకీర్ణమైన మహాటవి వంటివి యగు సంసారమును, ఆత్మావలోకనేచ్ఛ జనింపనంత వరకు నవిద్య, తనతో గూడ దేహిని ఆందోళన పరచుచున్నది. ఈ అవిద్య, తనకంటె పరమగు నాత్మను, పరబ్రహ్మను దర్శించుట తోడనే నశించుచున్నది. సర్వగమైన జ్ఞానోదయమున, నవిద్య తనంతతాను లయించుచున్నది. ఇది యిచ్ఛామాత్రమైనది. అది నశించుటయే మోక్షము. 'అవిద్య సంకల్పరాహిత్యము' అను శాస్త్రముచే నశించును. 'మనస్సు' అను నాకాశమున, 'వాసన' యను రాత్రి గతించి నంతనే చిదాదిత్యుఁడు జ్ఞాన భాస్కరుడు ఉదయించును" అన, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను: "బ్రహ్మస్వరూపా! ఈ దృశ్యమాన ప్రపంచ మంతయు నవిద్య యనియు, ఆత్మ భావనచే నా యవిద్య నశించుచున్న దనియు దెలియ పరచితిరి కదా! ఆ ఆత్మ స్వరూపమును విశదపరుప వలసినదిగా ప్రార్థించుచున్నాను" అని యడుగ వశిష్ఠ మహర్షి ఈవిధముగ విశదీకరించెను.

## ఆత్మస్వరూపము

"సాధారణముగ సర్వగమైన, అదృశ్యమైన, అనిర్వచనీయ మగు చిత్తత్త్వమును 'ఆత్మ లేక పరమాత్మ' అని చెప్పుదురు. నిత్యమై, దృశ్యమానమగు నీ ప్రపంచ మంతయు నవ్యయమగు చిద్రూపము. మనస్సను పేరుగల వేరొక కల్పనయేదియు లేదు. ఈ ముల్లోకములందును ఏ వస్తువును పుట్టుటగాని, గిట్టుటగాని జరుగుట

లేదు. భావ వికారముల శక్తియు లేదు. సర్వసామాన్యమై, కేవలాభాసమాత్రమై, అక్షయమై, దృశ్యసంబంధము లేని చిన్మాత్ర రూపము బ్రహ్మము. సర్వవ్యాపకమై, పవిత్రమై, నిరుపద్రవమై, చిన్మాత్రమై, శాంతమై, సమముగ సర్వత్రవ్యాప్తమై, నిర్వికారమై ఆత్మయం దావిర్భవించినదై, స్వభావగతమై స్వయముగా సంకల్పించుకొని ఇయ్యది పరుగు లిడుచున్నది. తాను బ్రహ్మస్వరూపముగాన, నిరుపద్రవమైనది. మనన శక్తి కలదగుటవలన మనస్సనబడుచున్నది. సర్వగమై, సర్వశక్తిమయమైన మహాత్మునినుండి విభాగములను కల్పించుశక్తి, నీటి నుండి తరంగములు వెలువడినట్లు లుద్భవించుచున్నది. కాన, సంకల్పసిద్ధి సంకల్పము మూలముననే నశించుచున్నది. వాయువు వలన జన్మించిన యగ్ని వాయువు మూలమున నశించుచున్నది కదా! 'నేను బ్రహ్మను కాను' అను దృఢసంకల్పము వలన మనస్సు బంధప్రాప్తి నొందుచున్నది. 'సర్వం బ్రహ్మ' అను దృఢ సంకల్పము వలన మనస్సు మోక్షము నొందుచున్నది. 'నేను కృశించితిని, దుఃఖితుడను, బంధితుడను, హస్తపాదాద్యవయవములు కలవాడను' అను నీ మొదలగు భావానురూప వ్యవహారములతో బద్ధు డగుచున్నాడు. నేను దుఃఖితుడనుగాను. బంధితుడనుగాను. ఆత్మకు బంధన మెట్లుండును?' ఈ మొదలగు భావానురూప వ్యవహారములచే ముక్తుడగుచున్నాడు. 'నేను మాంసమును గాను. ఎముకలు కలవాడను గాను. ఈ దేహమున కంటె పరుడను. పరమాత్మ స్వరూపమును' అను నిశ్చయము కలవాడు అవిద్యనుండి తొలగి ముక్తుడగుచున్నాడు. రాఘవా! ఆత్మకానిదానియందు ఈ అవిద్యచే కేవలము అజ్ఞాని, ఆత్మ భావనను కల్పించుచున్నాడు. కాని జ్ఞానవంతుడు కల్పించుటలేదు. మనస్సు అనుసరించుదానిని సర్వేంద్రియములు అనుసరించుచున్నవి. రాజాజ్ఞ ననుసరించి ఈ మంత్రు లందరును క్షణకాలములో సమస్త వస్తు సంపాదనము జేయుచున్నారుకదా! కఠినమగు పురుష ప్రయత్నము చేతను, దృఢమగు నిర్ణయము మూలమునను చిత్తము నుండి

భోగాశా భావనను సమూలముగ తొలగింపవలెను 'వీరు నా బిడ్డలు, ఇది నా సంపత్తి, నే నింతటివాడను, ఇది నాది' అను వాసన ఇంద్రజాలమువలె భాసించుచున్నది. నీవు అజ్ఞానివి కావలదు. జ్ఞానివి కమ్ము. ఈ సంసార సంబంధమైన వాసనను పరిత్యజింపుము. అనాత్మయందు అనగా, ఆత్మ కానిదానియందు ఆత్మభావన కలిగి, అజ్ఞానివలె దుఃఖింతువేల ? ఈ జడము, మూగది యగు దేహము నకును, నీకును గల సంబంధమేమి ? రాఘవ ? దీని సంబంధములగు సుఖ దుఃఖములకు వశుడవై హర్షామర్షముల నందుచున్నావు. మానవులు సత్యమగు బ్రహ్మ పదార్థమును విస్మరించిరి. అసత్యమగు నవిద్య మాత్రమే వారి యెదుట ప్రకాశించుచున్నది. నీవు చేయు కార్యములపట్ల రాగానురంజనము కలుగకుండు గాక ! స్ఫటికమణి యందు ప్రతిబింబములు చిత్రితమగు రీతిని అనాసక్తి కలిగి యుండుము" అని మహాత్ముడగు వశిష్ఠ భగవానుడు ప్రబోధింప శ్రీరామచంద్రుడు వికసితాంతఃకరణుడై ఇట్లు పలికెనని వాల్మీకి మహర్షి భరద్వాజున కెరిగించెను.

"వశిష్ఠ మహర్షీ ! బిసతంతు సంతతి మహాగజమును బంధించునట్లు, అస్తిత్వము లేని అవిద్య ప్రపంచమునంతను బంధించు చున్నది. తృణము వజ్రాయుధమైన పగిది, నిది నిగళ బంధనమై లోకమును ఛేదించుచున్నది. మహాత్మా ! మరియొక సందేహము కలదు వెనుక తాము అభివర్ణించిన లవణ మహారాజు ఆ విధములగు ఆపద లందుటకు కారణము నూహింప లేకున్నాను" అన వశిష్ఠు డీ విధముగ జెప్పదొడగెను:

"రామచంద్రా ! అద్భుతావహమైన లవణ మహారాజు వృత్తాంతము నభివర్ణించుచున్నాను, వినుము. ఆత్మచిత్త విభ్రమము కారణమున నీ లవణుడు చండాలత్వము నందెను. ఈ కథవలన 'మనస్సే కర్తయై, కర్మఫలము ననుభవించుచున్నది కాని శరీరము మాత్రము కర్తయై కర్మఫలము ననుభవించుట లేదు' అని తెలియుము.

ఈ లవణుడు హారిశ్చంద్ర వంశమున ప్రభవించెను. ఒకనాడు ఏకాంతముగ నుపవిష్టుడై యిట్లు లాలోచించెను: మా 'పితామహుడు రాజసూయయాగ మొనరించెను. ఆయన వంశసంజాతుడనైన నేను, మానసికముగనైన రాజసూయమును జేయుదుగాక!' అని యజ్ఞమునకు గావలసిన సకల సంభారములను సమకూర్చుకొని, యజ్ఞదీక్షితుడై యుండెను. మానసికముగ ఋత్విక్కులను గల్పించుకొని, అగ్నిని ప్రజ్వలింపజేసి దేవతాహ్వానమునకు గడంగెను. ఉద్యానవన మాయనకు యజ్ఞవాటిక యయ్యెను. ఈవిధముగ నొక వత్సర కాలము గడచినట్లు భావించెను. బ్రాహ్మణులు మున్నగు వారలకు తన సర్వస్వమును యాగ దక్షిణలుగ సమర్పించి, సంధ్యా సమయమగు సరికి, పూర్వ సంకల్పములను విడచి, లౌకిక వ్యవహార నిమగ్నుడగుచుండెను. ప్రతినిత్యము మానసికముగ జేయుచున్న ఈ రాజసూయ యాగము వలన కడకు నా యాగ ఫలము నందు కొనెను. కాన రామచంద్రా! సుఖ దుఃఖముల ననుభవించునది మనస్సు అని గ్రహింపుము. జన్మ పవిత్ర హేతువగు పరబ్రహ్మము నందు మనస్సును లగ్న మొనర్పుము.

లవణ మహారాజ సన్నిధి కరుదెంచిన శాంబరికుని చరిత్ర నభి వర్ణించుచున్నాను, వినుము. ఆ శాంబరికు డరుదెంచినపుడు నేనూ నా సభయం దుంటిని. అతనిని ప్రత్యక్షముగ జూచితిని. ఆత డదృశ్యుడైనంతనే యచటి సభ్యులు, 'ఇది యంతయు నేమి?' అని రాజును ప్రశ్నించిరి. అపుడు, వారి సందేహ నివృత్తికై, నే నాలోచించి యిట్లంటిని: 'రాజసూయ యాగము జేసిన వారు పండ్రెండు సంవత్సరములు నానావిధములైన కష్ట నష్టముల ననుభవింతురు. కాన, మానసికముగ రాజసూయ మాచరించి, తత్ఫలము నందిన లవణ మహారాజును దుఃఖముల పాలుచేయదలచిన వాడై దేవేంద్రుడు, శాంబరకాకృతి గల యొక దేవదూతను పంపెను. ఆత డీ లవణ మహారాజునకు మహాపదలు వాటిల్ల జేసి

సుర సిద్ధ సంఘములతో గూడిన నభోమార్గము ననుసరించి వెడలి పోయెను" అని చెప్పితిని అని వశిష్ఠుడు శ్రీరామచంద్రునకు వివరించెను.

## జ్ఞాన, అజ్ఞాన భూమికలు

"శ్రీరామచంద్రా! ఇపుడు జ్ఞాన భూమికలను, అజ్ఞాన భూమికలను గూర్చి వివరించుచున్నాను, వినుము. ఈ జ్ఞాన, అజ్ఞాన భూమికలు రెండును, ఒక్కొక్కటి సప్త విధములుగ నుండును. ఇంతియగాక, ఇంకను అసంఖ్యాకములుగా కూడ నుండును. ఇవి బద్ధమూలములై ప్రతి యొక్కటి తమ తమ ఫలముల నొసంగును.

## జ్ఞాని, అజ్ఞాని విశేష లక్షణము

సత్యము, జ్ఞానము, ఆనందము లక్షణముగా గల స్వరూపము నందు నిశ్చలముగ నుండుట ముక్తి యనబడును. ఈ లక్షణములు కలవాడు 'జ్ఞాని' యనబడును. వీనికి వ్యతిరేకమైన దేహేంద్రియాది లక్షణములు తానే యని భావించుట యజ్ఞానము. ఇది కలవాడు 'అజ్ఞాని' యగును. శుద్ధ సంవిత్తి స్వరూపమునుండి చలింపని వారికి రాగద్వేషాది భావములు కలుగ నేరవు. కాన వారికి అజ్ఞత్వము సంభవింపదు. ఆ శుద్ధ సన్మాత్ర సంవిత్తి స్వరూపము నుండి పరిభ్రంశము నొంది దేహేంద్రియాదులు తానే యని భావించు వారలకు రాగ ద్వేషాదులు అంకురించును. దీనిని మించిన మోహము మరియొకటి లేదు.

ఒక వస్తువు మీది నుండి మరియొక వస్తువు మీదికి చిత్తము పోవునప్పుడు ఈ రెండు వస్తుల మధ్యనుండు కాల స్థితి స్వరూప స్థితి యనబడును. సమస్త సంకల్పములను విడచిన,

పాషాణమువలె జాడ్యము, నిద్రలేని స్థితి ఈ స్వరూప స్థితి. అహంకారము నశించి, విభేదము తొలగి, నిశ్చలత్వము కల చిత్తము కలిగి, జడ స్వరూపము కానిదియై ప్రకాశించునది స్వరూప స్థితి యనబడును.

## అజ్ఞాన భూమికలు

'బీజ జాగ్రత, జాగ్రత, మహా జాగ్రత' అను నీ మూడును జాగ్రదవస్థలు. 'జాగ్రత్స్వప్నము, స్వప్నము, స్వప్న జాగ్రత' అను నీ మూడును స్వప్నావస్థలు. సుషుప్తి అను దానితో నా మూడు జాగ్రదవస్థలు, స్వప్నావస్థలు గూడి సప్తవిధ మోహము లగుచున్నవి. ఇవి ఒక దానితో నొకటి గూడి యనేకము లగుచున్నవి. వాని లక్షణములను వివరించుచున్నాను.

చేతనము : ఇది సుషుప్తి నుండి మేల్కొనినవుడు నామ రహితమైనది. నిర్మలమైనది. చిత్తము, జీవము మొదలగు నామములకు శబ్దార్థ భాజనమైనది.

1. బీజ జాగ్రత : జాగ్రదవస్థకు బీజ మగుటవలన 'బీజ జాగ్రత' యనబడును. ఇది జ్ఞానమునకు నూతనావస్థ.

2. జాగ్రత : పరమాత్మనుండి నూతనముగ నావిర్భవించిన వానికి అనగా జీవునకు 'ఈ దేహ ధారిని నేను', 'ఇది నాది' అను భేద భావము, ప్రాగ భావము అనగా, జన్మాంతర స్మృతి లేనిది జాగ్రత యనబడును. అంకురావస్థక కంటె రెమ్మలు గల యవస్థ విధమున, బీజ జాగ్రత కంటె జాగ్రత విలక్షణమైనది.

3. మహా జాగ్రత : 'గత జన్మమున నే నొనర్చిన కర్మల ఫలము ననుభవించుచున్నాను' అను జ్ఞానము దృఢముగ నుండుట 'మహా జాగ్రత' అనబడును.

4. జాగ్రత్స్వప్నము : జాగ్రదవస్థ యందుండి, తన మనో రాజ్యమున రూఢమైన పదార్థమును గాని, అరూఢమైన

వస్తువును గాని భావించి సర్వథా తన్మయత్వము జెంది యుండుట. ఇరువురు చంద్రు లనియు, ముత్యపుచిప్పయందు వెండి కలదను భ్రాంతి, మృగతృష్ణయందు జలముండునను భావనగాని అభ్యాసము వలన జాగ్రత్త్వమును పొందిన స్వప్న మనేక విధములుగా నుండును

5. స్వప్నము : జాగ్రదవస్థ యందలి పదార్థ వాసన నిద్రా సమయమున స్మృతి మాత్రముచే స్వల్పకాలము అస్పష్టముగా జూడబడి, మేల్కాంచిన యనంతరము మాయమై పోవునది.

6. స్వప్న జాగ్రత : చిరకాలానువృత్తమైన స్వప్నము జాగ్రదవస్థయందువలె పుట్టి, జాగ్రదవస్థను పొందినను, భాసించునది.

7. సుషుప్తి : చేతనము తప్ప మిగిలిన షడవస్థల తరువాత జీవునకు జడత్వమైన భవిష్య దుఃఖ బోధాఢ్యమైన స్థితిని యేడవది యగు 'సుషుప్తి' యందురు ఈ యవస్థ యందు అంధ తమస్సు లీనమై యుండును. శ్రీరామచంద్రా ! అజ్ఞానమునకు గల సప్తావస్థలను వివరించితిని. చేతనము తప్ప మిగిలిన వన్నియు, కార్య విశేషము నాశ్రయించి యనేక విభేదము లొందుచుండును.

ఇపుడు సప్త విధములగు జ్ఞాన భూమికలను వినుము. వీని వలన మోహము తొలగి పోవును" అని చెప్పి వశిష్ఠుడు మరియు నిట్లనెను:

"రామచంద్రా! జ్ఞాను లీ జ్ఞాన భూమిక లనేక విధములుగా జెప్పుదురు. కాని ఈ చెప్పబోవు సప్త విధములే ప్రధానములు, సుఖప్రదములు నని నా భావము. ఈ సాప్త భూమికమైన జ్ఞానము వదాన్యము. వీని వలన కలుగు ముక్తి, పరమైన జ్ఞేయమని వర్ణింప బడినది.

ఈ జ్ఞాన భూమికలలో 1. శుభేచ్ఛ, 2. విచారణ, 3. తను మానసము 4. సత్త్వాపత్తి 5. అసంసక్తి 6. పదార్థా భావని

7. తుర్యగ. ఈ ఏడింటికిని పైన 'ముక్తి' అనునది కలదు. దీనిని పొందినవాడు దుఃఖమును పొందడు. ఇపుడు 'సప్త భూమిక' ల లక్షణములను వివరించుచున్నాను, వినుము.

1. శుభేచ్ఛ: 'మూఢునివలె నుంటినేమి? శాస్త్రాభ్యాస పరులైన సజ్జనుల సాంగత్యము వలన వైరాగ్యము నంది ఆత్మ స్వరూపమును తెలిసికొందును గాక!' అనునది 'శుభేచ్ఛ'.

2 విచారణ: వైరాగ్యాభ్యాసపరులగు శాస్త్ర జ్ఞానము కల సజ్జనుల సాంగత్యము, సదాచార సంపత్తి 'విచారణ'.

3. తనుమానసము: శుభేచ్ఛ, విచారణల మూలమున ఇంద్రియార్థములైన భోగ విషయములందు విరాగము కలుగుటను 'తనుమానస' మందురు.

4. సత్త్వాపత్తి: శుభేచ్ఛ, విచారణ, తనుమానసము లను మూడు భూమికలను అభ్యసించినందు వలన మనస్సున విషయ వాసనలు నశింపగా పరిశుద్ధమైన ఆత్మయందుండు స్థితిని 'సత్త్వా పత్తి' యందురు. ఈ దశయం దుండువాడు 'బ్రహ్మవిదు' డన బడును.

5. అసంసక్తి: ఇంతకు పూర్వము చెప్పబడిన నాలుగు భూమికలను అభ్యసించుటవలన అవిద్యాకృత్యమగు సంసక్తి గాని, అవిద్యా సంసక్తి గాని లేనిది 'అసంసక్తి' యనబడును. ఈ దశ ననుభవించువాడు 'బ్రహ్మవిద్వరు' డన బడును.

6. పదార్థాభావన: వెనుకటి అయిదు భూమికల నభ్యసించుట వలన దృఢమైన ఆత్మనిష్ఠకలవాడై బాహ్యాభ్యంతర పదార్థ అభావన వలన 'పదార్థాభావన' యన బడును. ఈ స్థితిగలవాడు 'బ్రహ్మ విద్వరీయు' డన బడును.

7. తుర్యగ: పై ఆ రవస్థలను చిరకాల మభ్యసించుట వలన భేదభావన నశించి, సచ్చిదానంద లక్షణమగు నాత్మయందు స్వభావైక నిష్ఠత్వము 'తుర్యగము'. ఈ యవస్థ యందున్న వాడు 'బ్రహ్మవిద్వరిష్ఠు' డనబడును. ఇతడు బ్రహ్మ విదాదులలో నాల్గవ వాడు. ఇతడు జాగ్ర త్స్వప్న సుషుప్తుల కతీతుడుగాన 'తుర్యగు' డగును.

ఈ తుర్యావస్థ జీవన్ముక్తులయం దుండును. దీనికంటె నతీతమైనది 'తుర్యాతీతము.' విదేహ ముక్తులయందు నీ బ్రహ్మరూపము భాసించును. కాన, ఆ యవస్థ నిందు జేర్చలేదు. శ్రీరామచంద్రా! సప్తమ భూమికయగు తుర్యగ అను భూమిక నాశ్రయించిన వారు ఆత్మయందు క్రీడించువారును మహాత్ములు, మహాభాగులు నని భావింపుము. జీవన్ముక్తులు సుఖ దుఃఖ వికారములకు లోనుగారు. ప్రాకృతములగు కార్యములను తమ కిష్టమైన చేయుదురు, లేకున్న జేయరు. ప్రక్కనున్నవారు ప్రబోధింపగా, పూర్వాచార క్రమాగతములైన యాచారములను నిద్రా ప్రబోధితునివలె నిరాటంకముగ జేయుదురు. సప్తభూమిక లనునవి ధీమంతులకు మాత్రమే గోచరించును. పశు, మ్లేచ్ఛాదులు జన్మాంతర సంస్కార విశేషమున ఈ సప్త భూమికల అభ్యాసము కలిగినచో, 'జీవన్ముక్తులు' లేక 'విదేహముక్తులు' నగుదురు. ఇది నిస్సంశయము. జ్ఞాన మనగా నహంకార గ్రంథి విచ్ఛేదము. దీనివలన ముక్తి లభించును. 'ఎండ మావులందు జలముండదు' అను విషయము దీని మూలముననే తెలియును. గాఢమగు మోహాంధకారము నుండి వెలువడిన వారు మాత్రమే పరమపదప్రాప్తి నందుదురు. వారు ఆత్మ జ్ఞానమును పొంది ఈ జ్ఞాన భూమికల నాశ్రయించుచున్నారు. వీనియందు సుస్థిరులై యున్నవారు మహానుభావులు, వంద్యులు. వారు జితేంద్రియులు. సామ్రాజ్యపదవి, స్వర్గరాజ్యాధిపత్యమును గూడ తృణముగా భావింతురు. వీరు ఉత్తమ పదవి నందుచున్నారు" అని వశిష్ఠుడు శ్రీరామచంద్రునకు మనశ్చాంచల్యమును తొలగించుటకు

సాధనము నగుట వలన నజ్ఞాన భూమిక యోగ మని చెప్పబడినది"
అని సప్తజ్ఞాన భూమికలను వివరించెను.

## బ్రహ్మస్వరూపము

"జ్ఞాన భూమికలయందు నిష్ఠులైనవారికి పరబ్రహ్మ పదము కరతలామలకమని వెనుక విశదీకరించితిని. 'నేను, పరుడు' అను భేద భావము కలిగినప్పుడు 'ఇది యున్నది, అది లేదు' అను భావము లుదయించును. ఆ భావాభావములు లేనప్పుడు సర్వగమగు పరబ్రహ్మ పదము సిద్ధించును. అది సర్వాత్మకము, ప్రశాంతము, నిరాలంబము, వ్యోమస్థము నై యుండును. ఇంతియకాదు. శాశ్వతము, శివము, ననామయము నై భాసించును. అయినను అనాభాసము, ననాత్మకము నై, కారణ రహితమై, ఆదిమధ్యాంత రహితమై యుండును. సర్వజగ ల్లక్షణమై, మనోవాగగోచరమై, శూన్యమై, సుఖంబు కంటె సుఖమై, అసంవేదము, ననాతీతమై, ఆత్మవేదనమై యుండును. ఇది బ్రహ్మ స్వరూపని తెలియుము" అని వశిష్ఠుడు శ్రీరామున కెరింగించెను.

మరియు నిట్లు చెప్ప దొడగెను: "శ్రీరామచంద్రా! జ్ఞానము సాప్తభూమికమైనదని వివరించితిని. ఇపుడు అవిద్యా మాహాత్మ్యము నాలింపుము.

ఆ లవణ మహీపాలుడు ఇంద్రజాలికుని వలన నా విధముగ భ్రాంతికి లోనై, మరునాడు మరల నా మహారణ్యమునకు స్వయముగ వెడల దలచి ఇట్లు తలపోసెను: 'ఆ మహాకష్టము లకు కారణమైన మహాటవి ఎచట నున్నది? అది వింధ్యాద్రి ప్రాంతముగ దోచుచున్నది' అని నిశ్చయించుకొని మంత్రులతో గూడి, దిగ్విజయార్థము వెడలిన విధమున, దక్షిణా పథము నాశ్రయించి, వింధ్యపర్వత ప్రాంతమునకు బయలు వెడలెను.

సాధనము నగుట వలన నజ్ఞాన భూమిక యోగ మని చెప్పబడినది" అని సప్తజ్ఞాన భూమికలను వివరించెను.

## బ్రహ్మస్వరూపము

"జ్ఞాన భూమికలయందు నిష్ఠులైనవారికి పరబ్రహ్మ పదము కరతలామలకమని వెనుక విశదీకరించితిని. 'నేను, పరుడు' అను భేద భావము కలిగినప్పుడు 'ఇది యున్నది, అది లేదు' అను భావము లుదయించును. ఆ భావాభావములు లేనప్పుడు సర్వగమగు పరబ్రహ్మ పదము సిద్ధించును. అది సర్వాత్మకము, ప్రశాంతము, నిరాలంబము, వ్యోమస్థము నై యుండును. ఇంతియకాదు. శాశ్వతము, శివము, ననామయము నై భాసించును. అయినను అనాభాసము, ననాత్మకము నై, కారణ రహితమై, ఆదిమధ్యాంత రహితమై యుండును. సర్వజగ ల్లక్షణమై, మనోవాగ గోచరమై, శూన్యమై, సుఖంబు కంటె సుఖమై, అసంవేదము, ననాతీతమై, ఆత్మవేదనమై యుండును. ఇది బ్రహ్మ స్వరూపని తెలియుము" అని వశిష్ఠుడు శ్రీరాముని కెరింగించెను.

మరియు నిట్లు చెప్ప దొడగెను: "శ్రీరామచంద్రా! జ్ఞానము సాప్తభూమికమైనదని వివరించితిని. ఇపుడు అవిద్యా మాహాత్మ్యము నాలింపుము.

ఆ లవణ మహీపాలుడు ఇంద్రజాలికుని వలన నా విధముగ భ్రాంతికి లోనై, మరునాడు మరల నా మహారణ్యమునకు స్వయముగ వెడల దలచి ఇట్లు తలపోసెను: 'ఆ మహాకష్టము లకు కారణమైన మహాటవి ఎచట నున్నది? అది వింధ్యాద్రి ప్రాంతముగ దోచుచున్నది' అని నిశ్చయించుకొని మంత్రులతో గూడి, దిగ్విజయార్థము వెడలిన విధమున, దక్షిణా పథము నాశ్రయించి, వింధ్యపర్వత ప్రాంతమునకు బయలు వెడలెను.

పూర్వ, దక్షిణ, పశ్చిమ దిశా వ్యాప్తమైన యా మహారణ్యమును, రవి యంబర వీథిని దిగ్భ్రమ్మరినట్లు తిరిగెను. తుద కొక్కచోట, తన యెదట సాక్షాత్కరించిన యాలోచనా రీతిని బట్టి పరలోకమువంటి యా మహారణ్యమును గుర్తించెను. అచట విహరించుచు, తాను మునుపు గాంచిన సకల వృత్తాంతములను దిలకించుచు, నచటివారి నడిగి తెలిసికొనుచు పరమాశ్చర్య భరితు డయ్యెను. తా నిదివరకు చూచిన బోయలను గుర్తించియు, గుర్తింపనివాని చందమున నాశ్చర్యముతో జిత్త విభ్రాంతి నంది తిరుగుచుండెను. క్రమముగ నొక చోట, తనను పోషించిన చాండాల గ్రామమును దర్శించెను. అచటి కుటీరములను, అచటి ప్రజలను గుర్తించెను. ఒక వృద్ధస్త్రీ తన బంధుజనుల నందరిని గోల్పోయినదై దీనాతిదీనముగ దుఃఖించుచుండెను. ఆమె తన భర్తయు, నిరుగు పొరుగు వారలు విన నిట్లు వాపోవుచుండెను: 'బిడ్డలారా! నన్ను వీడి మీర లెచ్చటి కేగితిరి? పుత్రి! గురివెంద గింజల హారము ధరించుదానవు కదా! నా దురదృష్టము వలన నీ వియోగము సంభవించినది. రాజకుమారా! చంద్ర మనోహర స్వరూపా! అంతఃపుర కాంతా వ్యామోహమును వీడి నా కుమార్తెపై వలపులు గురియించితివి. ఈమె నీకు శాశ్వతానంద ప్రదాయిని కాజాలక పోయెను కదా! ఈ సంసార సాగరము తన తరంగ భంగ క్రియా విలాసముచే బండితులు పరిహసించు నసహ్యాకరము లగు కార్యముల నెన్నిటినైన జేయును కదా! అట్లుగాకున్న, మహారాజు మతంగకన్యయందు అనురాగవంతు డగుట ఏమి!' అని పలవించు వృద్ధనారిని విలోకించి, మహారాజు తన పరివారజనము నామె నూరడింపజేయ వలసినదిగ నాజ్ఞాపించెను. 'నీ వెవరవు? నీ పుత్రు లెవ్వరు? నీ కుమార్తె ఎవరు? ఏమైనది?' అని ప్రశ్నించెను. ఆమె బాష్పాకుల లోచనయై, 'అయ్యా! ఇది పుకరాస పోషణ మను గ్రామము. నా భర్త ఈ గ్రామమున కధిపతి. మాకు చంద్రోపమ యగు కుమార్తె కలదు. దైవయోగమున

నామెకు మహేంద్ర సముడగు మహారాజు భర్తగా లభించెను. ఆమె యతని గూడి చాలకాలము కాపుర మొనరించి సుఖము లనుభవించెను. ఇరువురు కుమారులు, నొక కుమార్తెయు జనించిరి.

కొంతకాలమునకు మహాభయంకరమై మానవ వినాశకర మగు కాటకము సంభవించినది. దానికి తట్టుకొనజాలక ఈ గ్రామ ప్రజలు కొందరు తృణ కాష్ఠ జల సమృద్ధములగు ప్రాంతముల కేగిరి. మరికొందరు మార్గమధ్యమున హతులైరి. మా దంపతులము మాత్ర మీ నిర్జన గ్రామమును వీడజాలక జీవించి యుంటిమి. పుత్ర పుత్రికలను గోల్పోయి, దుఃఖభాగులమై యుంటిమి' అని చెప్ప విని మహారాజు మహాశ్చర్యమగ్నమానసు డయ్యెను. పార్శ్వము లందున్న మంత్రుల నవలోకించి, చిత్రార్పితుని వలె నుండెను. వారా చండాల దంపతుల దుఃఖోపశమనమునకై సాంత్వన వచనము లతోబాటు ననేక వస్తు సామగ్రులను బహూకరించిరి. మహారాజు కరుణాంతరంగుడై, దృష్టలోకపరావరుడై స్వ నగరమునకు మరళి వచ్చెను. నే నాతనికి అవిద్యా విలాసమును ప్రబోధింప జ్ఞానవంతుడై సుఖముగా నుండెను రాఘవా! అత్యంత భ్రమ కలుగజేయునది యగు నవిద్య, లేని దానిని యున్నదానినిగాను, ఉన్నదానిని లేని దానినిగాను భ్రాంతిని కలుగజేయును" అని వశిష్ఠ మహర్షి చెప్ప శ్రీరామచంద్రుడు ఇట్లు పశ్నించెను : "మునీంద్రా! స్వప్నావస్థ యందలి విషయములు, జాగ్రదవస్థ యందు నశించిన విధమున నా సందియములు తొలగి పోయినను, ఆ స్వప్నానుభూతి వీడని విధముగ వదల కున్నవి. కాన విశదముగా జెప్పు"డని ప్రార్థించెను.

"శ్రీరామచంద్రా! ఇది యంతయు నవిద్యా విలాసమని చెప్పితిని కదా! ఈ విషయము, ముందు నేను వివరింప బోవు గాధి వృత్తాంతమున బాగుగా స్పష్ట మగును. కాకతాళీయన్యాయము వలె వాసనల వలన మనస్సు స్వయముగా మహారంభములైన వ్యవహారములతో సంబంధము కలదై వ్యాకుల మగుచున్నది.

వెనుకటి లవణోపాఖ్యానమున నింద్రజాలికుడు నెమలి పింఛమును త్రిప్పగా మహారాజును అవిద్య ఆక్రమించినది. దాని ప్రభావము మరునాడుకూడ భాసించినది. స్వప్నసమానమైన ఆ భ్రాంతి వింధ్యపర్వత ప్రాంతమందలి పుక్కసుని మనస్సు నందును భాసించినది. ఇట్లు మహారాజు మనస్సు నందు చండాల సంబంధమగు జ్ఞానమును, చండాలుని మనస్సున మహారాజ సంబంధమగు జ్ఞానము నంకురించినది. ఈ భ్రమ వ్యవహారము స్వప్నగత వ్యవహారము వంటిదై జాగ్రత్తునందును భాసించును. జ్ఞాన మాత్రముతో నాలోచింపబడినదై నపుడు, దాని నిజ స్వరూపము బయలు పడును. సత్య పదార్థము మాత్రము శాశ్వతముగా నుండును.

## తత్త్వోపదేశము

శ్రీరామచంద్రా! చూచెడి వస్తువునకును, చూడబడు వస్తువునకును సాక్షిమాత్ర రూపమై 'చూచువాడు, చూపు, చూడబడు వస్తువు' అను నీ మూడింటియందును భాసించుచు, ఈ మూడిటికంటె విలక్షణమైన దానిని 'బ్రహ్మము' అందురు. మనస్సు ఒక వస్తువు నుండి, మరియొక వస్తువును జూచుటకు పోవునపుడు — ఈ రెండు వస్తువులకు నడుమనుండు దృశ్య రూపముగాని, వృత్తి రూపముగాని, సంకల్ప రూపముగాని కానిదియగు రూపమును పొందుము. అది జాగ్రత్స్వప్న సుషుప్తులను అవస్థాత్రయ రహితమైనది, సనాతన మైనది, అచేతనమైనది, జడమైనది. నీ వా రూపమును సర్వదా పొందుము. జడత్వమును వదలి, శిలాహృదయ రూపమైన అమనస్క రూపమును, సంకల్ప రహిత స్వరూపమును పొందుము. చిత్తమును దూరముగ విడచి, వేదానుకూలములగు యుక్తి ప్రయుక్తులతో సంకల్ప శూన్యుడవై స్థిరముగా నుండుము. సంసార మనెడి ఘటీయంత్రమున అనగా ఏతమునందు గట్టిన త్రాడు వంటిది వాసన. ఈ వాసన యను త్రాడును ఛేదింపుము. అపుడు అధోముఖ, ఊర్ధ్వ ముఖ గమనశక్తి గోల్పోయి స్థిరముగ నుండును.

## ప్రకరణార్థ సంక్షేపము

పరమాత్మ తత్త్వము నుండి ముందుగ మనస్సు జన్మించినది. ఆ మనో వికల్ప జాలముల నుండి జగత్తు ప్రభవించినది. శూన్యమగు నాకాశమునుండి, శూన్యమగు నీలిమత్వ మభిరామమై ప్రకాశించు విధమున ; శూన్యమగు మనస్సు నుండి శూన్యమగు జగత్తు పుట్టినది. సంకల్ప క్షయ మగుట వలన చిత్తము విడిపోవును. అపుడు సంసార మోహ మను మేఘములు తొలగిపోవును. శరదాగమనమున ఆకాశము నిర్మలముగ భాసించునట్లు, ఆద్యంత రహితమైన చిన్మాత్రమగు ఆత్మస్వరూపము స్వచ్ఛముగ ప్రకాశించును" అనెను.

# స్థితి ప్రకరణము

ఉత్పత్తి ప్రకరణమున 'మన స్సంకల్పము వలన నీ జగత్తు జన్మించిన దనియు, నా సంకల్పము లయింపగా నీ జగద్భ్రాంతి నశించు' ననియు జెప్పబడినది.

ఈ స్థితి ప్రకరణమున 'మన స్సంకల్ప సంజనితమైన జగత్తు మనస్సునందే యుండుననియు, నా మనస్సు తన పుట్టుకకు హేతువైన పరమాత్మయం దుండు'ననియు విశదము జేయుచున్నది.

ఇందు 'శుక్రోపాఖ్యానము', 'దామాద్యుపాఖ్యానము', 'భీమాద్యుపాఖ్యానము', 'శూరోపాఖ్యానము', 'ఉపదేశోపాఖ్యానము నను 'పంచోపాఖ్యానము'లు గలవు.

మన స్సంకల్ప జనితమగు జగత్తు, మనస్సుతో గూడ నాత్మయందుండుటచే నాత్మ ఆధారమనియు, దృశ్యము ఆధేయ మనియు నిరూపింప దలచి వశిష్ఠుడు శ్రీరామచంద్రున కిట్లు చెప్ప నారంభించెను:

"రామచంద్రా! ఈ జగత్తు ఒక విధమగు చిత్ర రచన. దీనిని రచించిన శిల్పి ఎవ్వడును లేడు. ఏవిధము లయిన శిల్ప రచనా ద్రవ్యములును లేవు. కుడ్యాది ఆధారము లేవియు లేవు. ఆత్మ నిష్క్రియ మగుట వలన కర్త లేనిది. ఇతర వస్తువులు లేని దగుట వలన వర్ణములు లేనిది. ఆధారము లేని దగుటవలన చిదాకాశమున నేర్పడినది. దృష్టి యున్నపుడు దృశ్య ముండును. జగత్తు దృష్టిలేని దృశ్యము. స్వానుభవ రూపము. నిద్రలేని స్వప్నము. అనగా జాగత్స్వప్నము. సాక్షిభూతమగు, స్వచ్ఛమైన నిర్వికల్ప చిదాకాశమునందు నీ జగత్తు, దర్పణ మందలి ప్రతిబింబమువలె నిరర్థకముగ ప్రతిబింబించుచున్నది. శ్రీరామా! ఈ విశ్వ సంపద ప్రతిభామాత్రరూపమై, కార్యకారణ భావములేక బ్రహ్మపదార్థమందు

భాసించుచున్నది. ఈ బ్రహ్మము 'ఏకరూపమైనది, చిదాకాశ రూపము, సర్వాత్మకము, నఖండితము' నని భావించి చిత్తచాంచల్య శాంతికై యత్నపూర్వకముగ భావింపుము. భేదము కన్పించు చుండ భేదము లేదని చెప్పుట ఎంతవరకు సమంజసమందువేని ఒకే శిల చిత్రకారుని చేతిలో రేఖోపరేఖలుగ ననేక రూపాంతరము లను సంతరించుకొనుట లేదా! అట్లే బ్రహ్మపదార్థ మొకటియే. త్రైలోక్యవలితమై పరివర్తనమంది దృశ్యముగా భాసించుచున్నది. పరమాత్మ కంటె వేరగు రెండవ కారణము లేనందున అనుత్పన్నమైన జగత్తు ప్రతిభామాత్ర రూపమును ధరించి బ్రహ్మ యందు భాసించుచున్నది. దీనికి నుదాహరణముగా భార్గవ వృత్తాంతమును చెప్పుచున్నాను, వినుము. దీనివలన ననుత్పన్నమగు నీ విశ్వమును మనస్సునం దే విధముగ జూచు చున్నావో తెలియ గలదు.

పూర్వము మందర పర్వత సానువునందు భగవాను డగు భృగు మహర్షి ఘోరతప మాచరించుచుండెను. బుద్ధిమంతుడు, తేజోవంతుడు, పూర్ణచంద్రనిభకాంతిమంతుడు నగు నా మహర్షి కుమారుడు శుక్రుడు సూర్యునివలె ప్రకాశించుచు పితృ సపర్య లాచరించుచుండెను. ఇతడు విద్యావిద్యల నడుమ రోదసి యందు వెలుగు త్రిశంకుని వలె మహోపదవిని పొందక వర్తిలు చుండెను.

ఒకప్పుడు భృగు మహర్షి నిర్వికల్పసమాధినిష్ఠు డయ్యెను. శుక్రుడును శత్రు విజేత యగు భూపాలుని విధమున నిర్విచారుడై ఏకాంతముగ నుండెను. ఇంతలో మందారమాలాలంకృతయై, మందమారుతచాలితాలకాలంకృత యగు నప్సరఃకాంత వియన్మార్గమున బోవుచుండెను. శుక్రునకు ఆమెను చూచినంతనే మనస్సు చలించినది. వెంటనే యామెను ధ్యానించుచు నిమీలిత నేత్రుడై మనోరాజ్యమును సృజింప నారంభించెను. 'ఈమె

యాకసము నుండి ఇంద్రలోకమున కేగుచున్నది కదా! నేను కూడ నీమె ననుసరించి దేవతలు నివసించు స్వర్గలోకమును జేరితిని. మదనపీడిత మత్తకాశినులు వనలతలు వనమునువలె దేవేంద్రుని సేవించుచున్నారు. ఇచట వేరొక సృష్టికర్త పగిది ఆస్థాన మలంక రించిన మహేంద్రున కభివాదన మొనరింతునుగాక!' అని యాలోచించి యపర భృగు మహర్షి విధమున సురాధిపతికి మానసిక ముగ వందన మాచరించెను. నాకాధిపతి గౌరవపురస్సరముగ సింహాసనోత్థితుడై శుక్రుని బూజించెను. స్వర్గవాసులచే నామో దితుడై యందాతడు స్వేచ్ఛగ విహరింప దొడగెను. కాంతామధ్య గతయగు నా మృగశాబాక్షి నీతడు విలోకించెను. ఆమెయు నాతనిని దర్శించి మోహపరవశ యయ్యెను. అన్యోన్యానురాగరంజితచేత స్కులైన యా శుక్రాప్సరసలు శృంగారరసాభినివిష్టులై ప్రాతః కాల పద్మినీ భాస్కరుల మాడ్కి శోభావంతులైరి.

తనయందా యప్సరోభామినికి ననురాగము కలదని యెరిగిన శుక్రుడు, భూతభోక్త సంహారమును గల్పించిన విధమున స్వసంకల్పితార్థభాజనమైన తమస్సును సంకల్పించెను. భూతము లన్నియు తమ యభిమతమగు దిశకు జేరికొన, ఆ యప్సరసాంగన నీలజీమూతమున కెదురేగు మయూరి పోలె భృగుపుత్రున కెదు రేగెను. వారిరువురు నొక కల్పలతానికుంజాంతరమున ప్రవేశించిరి.

ఈవిధముగ శుక్రుడు చిత్త విలాసముతో, తా నూహించిన విధముగ వివిధప్రణయ సుఖము లనుభవించుచు జాలకాలమునకు సంతుష్టుడయ్యెను. ఎనిమిది మహాయుగము లామెతో మహా భోగము లనుభవించెను. అనంతర మాతని పుణ్యము క్షయముకాగా భూమండలమున ప్రవేశించెను. భూ పతనమగుట వలన నాతని శరీరము శతథా శకలము లయ్యెను. ఆజీవకళలు చంద్రమండలమున ప్రవేశించి, పాశ్రితేయత్వము నొంది, వెంటనే ధాన్యరూపము

భరించెను. ఆ ధాన్యమును దశార్ణదేశములందలి బ్రాహ్మణుడు భుజించెను. శుక్రజీవకళ లాతనిలో శుక్రత్వము నంది, తన భార్య యందు ప్రవేశించి పుత్రరూపమున జన్మించెను. ఆ కుమారుడు దినదినాభివృద్ధినంది మునుల సాంగత్యము వలన జ్ఞానవంతుడై మేరుగిరి ప్రాంతమున తప మాచరించు చుండెను పవిత్రముగ నిట్లొక మన్వంతర కాలము గడచెను. అచట నా శుక్రునకొక లేడియందు మానవ రూపుడగు పుత్రు డుదయించెను. క్షణకాలములో నా శుక్రు నకు పుత్రానురాగరూపమగు మోహ మంకురించినది. ఈ పుత్రు నకు ధనము, సద్గుణ సంపత్తి, దీర్ఘాయువు కలుగుగాక!' అని నిరం తరము తలపోయుచు తపఃపరాఙ్ముఖు డయ్యెను. పుత్రేషణమువలన ధర్మచింతాపరిభ్రష్టుడై, భోగచింతాపరుడై, క్షీణాయుష్కుడై సర్ప ముచే వాయువు గ్రసింపబడు విధమున మృత్యువుచే నతడు గ్రసింప బడెను. భోగచింతాపరుడై మరణించుట వలన నా శుక్రుడు మద్ర దేశాధిపతికి పుత్రుడై జన్మించెను. కాలాంతరమున మద్రదేశమున కధిపతి యయ్యెను.

అనంతరము అనేకవిధములగు జన్మముల నంది కడ కా శుక్రుడు గంగాతీరమున మునిపుత్రుడై జన్మించి తప మాచరించు చుండెను.

కొంతకాలమునకు భృగు మహర్షి ఆత్మ శుక్రసముద్భవ మైన యా శుక్రగాత్రము వాతాతపజర్జరితమై భూమిపై బడియుం డెను. పవిత్రమైన ఆ ఆశ్రమ ప్రాంతము రాగ ద్వేష విహీనమైన దగుట వలన, భృగు మహర్షి మహాతపస్సంపన్ను డగుట మూలమున, శుక్ర శరీరమును మృగ పక్షి సముదాయము భక్షింపలేదు. వేయి దివ్య సంవత్సరములకు పరమ సంబోధాత్మకమైన ఆ మహా సమాధినుండి భృగు మహర్షి మేల్కొనెను. తన కుమారు డెదురుగ దర్శన మీయ లేదు. అతడు వినయశీలుడు, గుణవంతుడు, పుణ్యమూర్తి. అని యాలోచించుచు నిటు నటు దృష్టి నిగిడించెను. ఒకచోట దేహధారి యగు నభాగ్యము విధమున, మూర్తీభవించిన దారిద్ర్యము పగిది,

తాప శుష్క శరీ రేంద్రియ రంధ్రములందు తిత్తిరి పక్షులు ఆవాస మేర్పరచు కొనిన మనుజ కంకాళమును గాంచెను. దాని యుదర గుహాయందు మండూక సంతతి నిర్భయముగ నివసించు చుండెను.

దుఃఖ మను గజమును బంధించు కొయ్యవంటి ఆ శుష్క కంకా ళమును దిలకించి పూర్వాపరపరామర్శపరిజ్ఞానదూరుడై భృగు మహర్షి కోపోద్దీతు డయ్యెను. తాను జూచిన యపుడె పుత్రుడు మర ణించి యుండునని భావించి కాలు నియందు మండిపడెను. 'అకాలమున నా పుత్రుని గొనిపోనేల' అని యాతని శపింప నుద్యుక్తు డాయెను. ప్రజాప్రాణాంతకుడగు కాలుడు భౌతికరూప ధారియై, కవచకుండల విరాజితుడై, ఖడ్గపాశములు ధరించి షడ్భు జములు, షణ్ముఖములు గలవాడై, యనేక మంది కింకరులు సేవించు చుండ భృగు మహర్షికి ప్రత్యక్ష మయ్యెను. ప్రళయ కాల సంక్షుభిత మహాసాగరగంభీరఘోష ననుకరించు ధ్వనితో, క్రోధఘూర్ణిత మానసుడైనను, సాంత్వన పూర్వక భాషణములతో: నిట్లనెను

"బ్రాహ్మణోత్తమా! నీవు మహాతపోవిభవుడవు. మేము నియమ పాలకులము. నీ తపఃకారణమున పూజనీయుడవైతివి గాని వేరు కారణమున గాదు బుద్ధిహీనుడా! వేగిరపడి నీ తపమును క్షయ మొనరించుకొనకుము. కల్పాంతకాలమహానలములు కూడ నన్ను దహింపజాలవు కదా! నీ శాపము న న్నేమి చేయునని దలంచితివి? నేను బ్రహ్మాండ పంక్తులను గ్రసింతును. రుద్ర కోటులను, విష్ణు బృందములను మ్రింగుదును. నా కసాధ్యమైనది లేదు. నేను భోక్తను. మీవంటివారు భోజ్య పదార్థములు. ఈ నియమము మన మేర్పరచుకొనినది కాదు. ఇది స్వయంసిద్ధము. నిర్మల జ్ఞాన దృష్టితో నాలోకించిన ఆత్మ నిర్వికారమైనదగుట వలన కర్తయు, భోక్తయు లేదు. ఇక కళంకదృష్టితో నాలో కించినచో ననేక మంది కర్తలు, భోక్తలు కలరు. వృక్షములకు పుష్పములు, భువనములయందు భూతములు తమ తమ కర్మల

మూలమున వచ్చుచున్నవి, పోవుచున్నవి. కల్పాంతమున విధికిని మృత్యువు సంభవించును. ఇక జ్ఞాన దృష్టి ఎక్కడ? నీ మహాత్వము, ధీరత్వము నెక్కడ, సర్వప్రసిద్ధ మార్గమునందున్నై తము నంధుని విధమున మోహ మందెదవేల ? మహాముని ! స్వకర్మపరిపాకము వలన కలిగిన దశనుగుర్తింపక, మూర్ఖునివలె నన్ను శపింప నుద్యమింతువేమి ?"

## చిత్త మహిమ

కాలపురుషుడు భృగు మహర్షికి చిత్తమయ సంసారాన్ని గూర్చి తెలుపదలచినవాడై ఈవిధముగా వచించెను : " బ్రహ్మణ్యుడా ! చిత్తమే పురుషుడు. ఆ చిత్త కృతమైనది కృతము. మనస్సు ప్రాణములను ధరించిన దగుట వలన 'జీవ' మనియు, నిశ్చయాత్మకమైన దగుట వలన 'బుద్ధి' యనియు నహంకారాభిమంతృత్వమువలన నిది యనేక రూపముల నందు చున్నది. నీవు సమాధిమగ్నుడవైనంత, భవత్పుత్రుని మనస్సు శుక్ర శరీర పరిత్యాగము చేసి దేవలోకమున కేగినది. అచట 'విశ్వాచి' అను దేవతా సుందరిని సేవించి, తదనంతరము కోసల, దశార్ణ దేశముల యందు మహారాజుగ జన్మించెను. తరువాత మహారణ్యమున కోయవానిగను, అటుతరువాత గంగాతీరమున హంసగను. అనంతరము సూర్యవంశమున పౌండ్రక మహారాజుగను, సాల్వ దేశమున సౌరమతాచార్యునిగను, ఒక కల్పమున విద్యాధరునిగను, అటుతరువాత మునిపుత్రునిగను, సౌవీర దేశములందు సామంతరాజుగను, అనంతరము త్రిగర్త దేశము నందు శైవాచార్యునిగను, తరువాత కిరాత దేశమున వెదురు పొదగను, జాంగల దేశమున హరిణముగను, ఒక తాళ వనమున సర్పంబుగను, తమాల వనమున వనకుక్కుటముగను జన్మించెను. ఇట్లు వాసనా వశమున చిత్ర విచిత్రములగు యోనుల యందు జన్మించెను. ప్రస్తుతము 'వాసుదేవు' డను పేరున విప్రకుమారుడై జన్మించి.

జడలు ధరించి, జపమాల చేబూని జితేంద్రియుడై, అష్ట శత వర్షంబుల నుండి గంగాతీరమున సుస్థిరుడై తప మాచరించుచున్నాడు. మహాముని! స్వప్నసదృశమైన యీ మనోరథమును దర్శింప నెంతువేని నీ జ్ఞాననేత్రమును దెరచి చూడుము" అని సమదృష్టిగల జగదీశ్వరు డగు నా కాలపురుషుడు వచించెను. భృగు మహర్షి కన్నులను దెరచి, కుమారుని స్థితి గతుల నరసెను. ప్రతిభావశమున మరుక్షణములో నాతని బుద్ధి దర్పణమున ప్రతిబింబించిన పుత్ర వృత్తాంతమును దర్శించెను. అటనుండి తిరిగి మందర పర్వత సానువు నందున్న కాలపురుషుని ఎదుట నున్న ఆత్మ శరీరమును స్మరించెను. విస్మయస్మేరమై, మనోహరమైన దృష్టితో కాలపురుషు నవలోకించి, మహాముని వీత రాగుడై, వైరాగ్యవంతుడగు కాలునితో నిట్లనెను:

"భగవానుడా! మేము బాలులము. ఉజ్జ్వల మనస్కులము గాము. నీవు భూత, భవ్యముల కధిపతివి. మీవంటివారల బుద్ధి మాత్రమే త్రికాలములను దర్శించగలదు" అని పలికెను. ఆమాట లకు జగద్గతి యగు కాలపురుషుడు దరహాసితవదనారవిందుడై, భాస్కరుడు అమృతాంశుని గ్రహించిన విధమున ఆ భృగు హస్తమును తన హస్తముతో గ్రహించెను. వెంటనే కాల భృగువులు మందర కందరమును విడచి గంగాతీరమును జేరిరి. అచట నిశ్చల తపోనిష్ఠుడై సమాధిలో నున్న కుమారుని భృగువు విలోకించెను. కాలపురుషుడు భార్గవు నుద్దేశించి, 'ఈ కుమారుడు ప్రబుద్ధు డగు గాక!' అని సంకల్పించెను. వెంటనే అతడు సమాధి నుండి మేల్కాంచెను. నేత్రములు తెరచి ఎదుటనున్న కాల భృగువులను తిలకించెను. కదంబ లతా పీఠమునుండి లేచి, ఆగంతుకు లిరువురకు వందన మాచరించెను. కొంతసే పా మువ్వురును భాషించుకొనిరి. అనంతర మా సమంగా నదీ తీరస్థుడగు బ్రాహ్మణ బాలుడు శాంత వచస్సులతో 'మహాత్ములారా! తమ దర్శన భాగ్యమువలన

నేడు నేను నిర్వృతి నందితిని. శాస్త్రముచేగాని. తపస్సు వలనగాని, జ్ఞానము మూలమునగాని, విద్యచేతగాని లభింపని మహానందానుభూతి కలిగినది. నా మనోమోహము నశించినది. మహాత్ముల దర్శనము వలన లభించు నానందము అత్యంత పరిశుద్ధమైన యమృత వర్షమునగూడ లభింపదు. ఆకాశమును పావన మొనరించుచున్న సూర్య చంద్రుల వంటి, మీ చరణ పరాగమున ఈ దేశమును పవిత్రి మొనరించుచున్న తేజోవంతులగు తమ పరిచయము నర్థించుచున్నాను' అనగా నా ఇరువురు, జన్మాంతరమున భృగుపుత్రుడగు నా విప్రబాలకుని జూచి 'వత్సా! నీవు ప్రాజ్ఞుడవుగాని, యజ్ఞుడవు కావు. కాన నీ పూర్వజన్మ క్రమమును స్మరింపుము' అని భృగు మహర్షి పలుక, నతడు ప్రబోధితుడై, ధ్యానోన్మీలిత లోచనుడై ముహూర్త మాత్రమున తన జన్మాంతర దశలను స్మృతికి దెచ్చుకొనెను. వెంటనే విస్మయ స్మేర విరాజితాననుడై, సంతుష్టాంతరంగముతో నా కాల భృగువులకు ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను.:

'ఆహా! ఎంతటి విచిత్రము! నా మనస్సున భ్రాంతి దృష్టి భాసించుచున్నది. దానికి వశమై ఈ జగజ్జాల మంతయు ప్రవర్తించుచున్నది. జ్ఞాతవ్యము సర్వము నవగత మయ్యెను. ద్రష్టవ్యము నంతటిని దర్శించితిని. చిరకాలము శ్రమించి ఇపుడు విశ్రాంతి నందితిని. చిన్మాత్రముకంటె వే రేదియు లేదని నేడు విదితమైనది. తండ్రీ! వందనము స్వీకరింపుము. లెమ్ము. మందర పర్వతముపై నున్న నా పూర్వశరీరము జూచుట కుత్సహించుచున్నాను. పోవుదము, రండు. ఇపుడు నాకు సంకల్ప, అసంకల్పములు లేవు' అని వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రున కభివర్ణించి మరియు నిట్లనెను:

"తత్త్వజ్ఞాన సంపన్నులగు నా కాల, భృగు, భార్గవులు జగత్తు యొక్క స్థితిగతులను గూర్చి చర్చించుకొనుచు, సముంగాన దీతీరమునుండి తుణకాలములో మందర కందరమునకు జేరుకొనిరి.

భార్గవు డచట తన పూర్వదేహమును తిలకించెను. 'పితృదేవా! పూర్వము సుఖ భోగములతో నీచే లాలింపబడిన ఈ శరీరము జీర్ణమై శుష్కమై సందేహరహితముగా నున్నది. ఉత్సాహమంతయు నశించికల్పన లన్నియు నస్తమించి సుఖముగా నెట్లుపడియుండెనో చూడుడు. సర్వాశాజ్వర సమ్మోహములను మంచుతోగూడిన శరత్కాలమునకు, అమనస్క యోగమునకు మించి జీవులకు మరి యొకమార్గము లేదు. అది శ్రేయో మార్గము. ఈ యోగాను భవముకలవారు మాత్రమే సుఖభోగ సీమాంతము జేరుకొందురు. ఇది సర్వదుఃఖ రహితమైనది. పరితాప శూన్యమైనది. ప్రస్తుతము దీని ననుభవించుచున్న నా శరీరమును దైవ వశమున నీ వనముందు దర్శించితిని' అని వచించుచుండ, కాలుడా భార్గవుని గాంచి 'సజ్జనుడా! పట్టణమున ప్రవేశించు పార్థివుని పగది నీ వీ శరీరమున ప్రవేశింపుము. రాతసులకు గురుడవై రాణింపుము. నీకు శుభమగు గాక! నేను నా కభిమత దిశ ననుసరించి యేగుచున్నాను' అన భృగు, భార్గవు లిరువురు బాష్పాకులిత నేత్రులై, యవరుద్ధకంఠలై చూచుచుండ కాలు డంతర్హితు డాయెను.

అనంతరము భార్గవుడు సమంగానది తీరమందు తప మాచరించుకొను బ్రాహ్మణుడ నను భావమును వీడి, భృగు మహర్షి వీర్యసంజనిత దేహమున ప్రవేశించెను. పుత్ర శరీరమున జీవ ప్రవేశము జరుగుట తోడనే భృగు మహర్షి మంత్రపూత కమండల జలము నా శరీరముపై నభిషేకించెను. ఆ శరీరమున నాడు లన్నియు యథాపూర్వకముగ పరిపూర్ణము లయ్యెను. ప్రాణవాయు ప్రసారమున శుక్రుడు పునరుజ్జీవితుడై పవిత్రాకారము కలిగి లేచి, ఎదుట నిలచిన తండ్రికి నభివాదన మాచరించెను. ఆ భృగు భార్గవు లిరువురు మహదానందసంభరితాత్ములై పావనమగు నా కాననమున, తరంగ రహితమైన హ్రదము మాడ్కి మనస్సంకల్ప విరహితులై యుండిరి. రఘునందనా! నీకు భార్గవ వృత్తాంతమును

వినిపించితిని. నీ చిత్తమున దీనిని బాగుగ నాలోచించి నీ యిచ్ఛానుసార మాచరింపుము.

## దామాద్యుపాఖ్యానము

వెనుక వివరించిన భార్గవ వృత్తాంతమున 'సంసారము మనోవికార'మని అభివర్ణింపబడినది. ప్రస్తుత మీ దామాద్యుపాఖ్యానమున 'మనోవికార స్వరూపమగు సంసారము వివేకము, మనస్సు అడగిపోయినంతనే అదియు నణగిపోవు ననియు, వివేకోదయము కాకున్నచో నది వృద్ధిపొందు'ననియు నభివర్ణింప దలచి, చిత్త నైర్మల్య సాధన సంపత్తిని జెప్పుచున్నాడు.

## చిత్తప్రసాద సాధనములు

ఆత్మవిచారపరుడైన జీవుడు, అనురాగాది మనోవృత్తులు లేనివాడై, సంకల్పములను పరిత్యజించి, పరిణతాతుడై, హేయమగు దృశ్యపదార్థమును త్యజించి, గ్రాహ్యమగు పరమాత్మను గ్రహించి, ద్రష్టను దర్శించుచు, పరతత్త్వమగు నా జ్ఞేయమునందు జాగరూకుడై జీవించి, అధిక మోహామయమైన సంసార మార్గమున నిద్రించిన వానికి, రసా రసములయందు పరిపక్వమైన వైరాగ్యమువలన సంసార వాసనా జాలమునందు దగుల్కొనిన పక్షి జాలమును విడిపించుటకై ఛేదన మొనరించు మూషకము విధమున, వైరాగ్య వేగముతో హృదయగ్రంథి నుండి విడువడిన యహంకారము, చిల్లగింజ నరుగదీసి జలమున విడువగా పరిశుద్ధమగు జలము విధమున, విజ్ఞానముచే స్వభావము పరిశుద్ధ మగును. విరాగి, నిస్సంగి, నిర్ద్వంద్వి, నిరుపాశ్రియము నగు మనస్సు మోహ పంజరమునుండి పక్షి చాడ్పున నెగిరి పోవును. పరిపూర్ణ చిత్తము ప్రశాంతముగ నుండును. అది సందేహ రహితమై, గత కౌతుక విభ్రమమై, పూర్ణచంద్రుని చందమున ప్రకాశించును. పరమాత్మ

విచారమున, పరిజ్ఞాతృ సంభావ్యుడగు పరిపూర్ణాత్ముని యందు బ్రహ్మవిష్ణ్వింద్ర శంకరులు నిరంతరము దయగలవా రగుచున్నారు. 'నే నెవ్వడను ? ఈ జగత్తంతయు నే విధముగ నావిర్భవించినది ?' అను నాలోచనము కలుగనంతవరకు అంధకారమును బోలు సంసారాడంబరము విడువదు.

## ఆత్మజ్ఞాని లక్షణము

తనవాడని. పెరవాడని భేదములేని దృష్టితో జూచువాడును, సమస్తమును చిన్మాత్రముగా భావించువాడును పరమాత్మను దర్శించుచున్నాడు. చిద్రూపము, సర్వశక్తిమంతము, అనంతాత్మ, సర్వభావాంతర సంస్థితము, అద్వితీయము అని తనలో భావించువాడు ఆత్మ సందర్శనము జేయుచున్నాడు. 'అహం' అనునది గాని, తదన్యమైనది గాని యేదియులే దనియు, బ్రహ్మ నిరామయమైనదనియు భావించుచు, సదసన్మధ్యదృష్టి కలవాడు మాత్రమే పరమాత్మను దర్శించును. అప్రయత్నముగా నతములగు నేత్రములు సమీపస్థములగు ద్రవ్యలందు విరాగముతో నున్నట్లు, ఆత్మవిదుడు తన కార్యములందు ఆవిధముగనే ప్రవర్తించును. తెలిసి యనుభవించిన భోగము వలన తృప్తి కలుగును. తెలిసి దొంగతనము చేసిన చోరుడు మిత్రుడగును కాని, శత్రుడు కాడు కదా! బాటసారులు యాత్రా సమయమున తమకు గోచరములగు నగర గ్రామాదులను సందర్శించిన విధముగ నాత్మవిదులు భోగములను నిరపేక్షముగ ననుభవింతురు. నిగృహీత మనస్కుడు విలాసార్థభోగ మల్పమైనను, అనల్పముగా భావించి సంతృప్తి జెందును. బంధితుడైన మహీపాలుడు, గ్రాసమాత్ర భోజనముతో తృప్తి జెందును గాని రాజ్యముతో తృప్తి నందడు కదా! అబద్ధుడు, అనాక్రాంతుడు నైన రాజునకు మాత్రము రాజ్యము వలన తృప్తి కలుగును.

## మనోజయోపాయము

హస్తమును హస్తముతో నదిమిపట్టి, దంతములతో దంతములను నొక్కియుంచి, అవయవముల నవయవములతో నాక్రమించి ప్రథమమున మనస్సును జయించుటకు సాధనము జేయవలయును. హఠయోగాదులచే వాయువును నిరోధించుట మున్నగు నుపాయములతో మనస్సును జయింపవలయును. సంసార సాగరమును దాటుటకు మనోజయమున కంటె వేరొక యుపాయము లేదు. మనోజయ మొనరించినవారలే ఈ భూతలమున సౌభాగ్యవంతులు, సాధుచేతస్కులు. అగు పురుషులు. వారు పురుష కథలయందు గణ్యులు. మనోజయము సాధింపలేనివారు గణ్యులు కారు. 'మన'స్సను విష సర్పము హృదయ బిలమున కుండలీకరణముగా శయనించినది. దాని నుపశాంతి జేసి సంతసించు నిర్మలుడగు మహాపురుషునకు నమస్కారము" అని వర్ణించి మరియు వశిష్ఠ మహర్షి ఇట్లు చెప్ప దొడగెను :

"దుష్కృతములు మదగజములవంటివి. అవి మహానరక సామ్రాజ్యాధిపత్యము కలవి, 'ఆశ' అను శరశలాకాద్యములయ్యు నింద్రియ శత్రు సముదాయమును జయింప సమర్థములు కావు. మనోదర్పితుయమైనవాడు, ఇంద్రియ శత్రుజయ సమర్థుడగును. హేమంతరువున తామరలు తుయించునట్లు, భోగవాసనలు అట్టివానిలో నుండవు. పరమాత్మస్వరూప సంబంధమైన దృఢాభ్యాసాదుల వలన మనోజయ మొనరింప వలయును. అట్లొనరింపనంతవరకు నర్ధరాత్రమున పిశాచ గణము పగిది, వాసనలు హృదయ మందిరమున గంతులు వేయుచుండును. అభిమత కార్యాచరణ సమయమున భృత్యునిగ, సత్కార్యాచరణ సమయమున సచివునిగ, ఇంద్రియముల నాక్రమించు తరి సామంతునిగ, విద్యాప్రదాన తరుణమున గురునిగ, లాలన సమయమున ప్రియకాంతగ, పాలించు సమయమ్మున పితరునిగ, విశ్వాసమున స్నేహితునిగ మనస్సు వర్తించుచు పండితుల కాహ్లాదజనకమై యుండును.

'మనస్సు' అనుజనకుడు, శాస్త్రదృష్టితో చూడబడుచు, బుద్ధితో ననుభవింపబడుచు నాత్మపరిత్యాగ మొనరించి పరమగు సిద్ధిని అనగా కైవల్యమును ప్రసాదించుచున్నాడు. ఇది యొక యనర్ఘమణి. హృదయమున భాసించుచున్నది దృఢమైనది. స్వచ్ఛము, మనోహరము నైనది, జ్ఞానవంతము. స్వగుణములతో సర్వము సంపాదింపబడినది. శ్రీరామచంద్రా ! ఈ మనోమణి అనేకవిధములగు వాసనాపంకములతో కళంకితమైనది. దీనిని వివేకజలముతో శుద్ధికొరకు క్షాళన మొనరించి, జ్ఞానదృష్టికలవాడవు కమ్ము, పరమగు వివేకము నాశ్రయించి, బుద్ధితో సత్యము నెఱిగి, ఇంద్రియ శత్రువును జయించి సంసారార్ణవము నుత్తరించుము, మహామతీ ! 'అహమస్మి' అను నిశ్చయము వ్యర్థము. స్వబుద్ధితో నా భావమును తొలగించి, పరమపదము నాశ్రయింపుము. అమనస్కుడవు కమ్ము. శాశ్వత సౌఖ్యము ననుభవింపుము. అపుడే వివిధములగు బంధములును బంధింపవు' అని మహర్షియగు వశిష్ఠుడు వచించి మరియు నిట్లు వివరింప దొడగెను :

"రాఘవ ! 'దామ వ్యాళ కట న్యాయము'గ నీవు వ్యవహరింపకుము. భీమ భాస దృఢులవలె దుఃఖశూన్యుడవై వ్యవహరింపుము" అన శ్రీరామచంద్రుడు, "భగవానుడా ! దామ వ్యాళ కట న్యాయము, భీమ, భాస దృఢ స్థితి యననేమో, భవతాపహారివగు నీవు వివరింపుము" అని ప్రార్థించెను. అంత వశిష్ఠ మహర్షి యీవిధముగ జెప్ప నారంభించెను :

"రాఘవ ! దామ వ్యాళ కట న్యాయమును ; భీమ, భాస దృఢ స్థితిని వివరించుచున్నాను, శ్రద్ధతో నాలకింపుము, అనంతరము నీ యిచ్ఛవచ్చిన విధముగ నాచరించుము.

సర్వైశ్వర్య సముపేతమగు పాతాళ కుహరమున మాయామణి మహార్ణవము వంటి 'శంబరు' డను దైత్యేంద్రుడు కలడు. అతనికి సురసైన్య వినాశకర మగు మహాసైన్యము కలదు. ఒకమారా

సైన్యము దేశాంతరమునకు పోయి నిద్రావివశులై యుండ, దేవతలా సమయమును గనిపెట్టి వెంటనే దానిని హతమార్చిరి. ఈ విషయము నాలించిన శంబరుడు, ముండికాంకుడు, దుర్ముదు మున్నగు మంత్రి సామంతులను తన సేనా సంరక్షణార్థము నియోగించెను. సమయము జూచి దేవతలు వారిని గూడ బరిమార్చిరి. ఈ కృత్యమునకు శంబరుడు ఆగ్రహోదగ్రుడై స్వయముగ స్వర్గము మీదికి దాడి వెడలెను. ఆతని మాయా బలమునకు వెరచి, దేవతలు పలాయితులైరి. వారు మేరు పర్వత ప్రాంత కానన కుంజములలో దాగికొనిరి. ఆ శంబరుడును, అతని వెంటనంటి అరచుచు వచ్చు పరివారజనమును దేవతాగణము బాష్పాకులితవదనలగు స్త్రీలుగల స్వర్గమును కల్పాంత కాల మందలి శూన్య జగము విధముగ జూచిరి. భుజబలదర్పితు డగు శంబరుడు ఈ స్థితిని గాంచి మిక్కిలి కోపించి, దిక్పాలక నగరమును భస్మీపటలము గావించి, నిజ నివాసంబున కరిగెను.

ఈవిధముగ దేవ దానవులకు పరస్పర విద్వేషము ప్రబలము కాగా, దేవతలు నిరాశ్రయులై, రహస్యప్రదేశముల వసింప సాగిరి. శంబరాసురుడు నియమించిన సేనాధిపతులను తరి వేచి దేవతలు అదను లభించినంతనే వధించుచుండిరి. ఈ యకార్యమునకు శంబరుడు కోపోద్విగ్నమానసుడై వెంటనే తన మాయవలన భయంకరాకారులు. మహాబలవంతులు నైన మువ్వురు రక్కసులను సృజించెను వారు నడగొండలవలె నుండిరి. మహామాయా విశారదులై దామ, వ్యాళ, కట నామములు ధరించి విజృంభించుచుండిరి. పరమాత్మ నుండి వారు ప్రభవించుటచే వాసనా, ఆత్మాభిమాన శూన్యులు. శత్రువుల మీదికి దాడి వెడలుట, శత్రువులు తమ మీదికి వచ్చుట, పలాయితు లగుట, జీవించుట, మరణించుట యను నవియు జయాపజయములను గురించియు నాలోచింపక, ఎదుట సైన్యమును జూచి నంతనే వధించుచుండిరి. శంబరుడీ కృత్యమునకు సంతుష్టాంతరంగుడై

యిట్లు తలపోసెను : 'ఈ దామ, వ్యాళ, కటులు వాసనా వాంఛా విరహితులు, దేవతలు వారిని దండించుచున్నను లెక్క చేయక పలాయితులు కారు' అని నిశ్చయించి యా దైత్యేంద్రుడు దేవేంద్ర సైన్యవధార్థమై వారితో గూడిన సైన్యమును సమకూర్చి పంపెను. సముద్ర గిరి గహ్వర ప్రాంత కుంజముల నరయుచు వారు సాయుధపాణులై, సపక్ష గిరీంద్రముల వగిది భయంకరముగ బయలు దేరిరి. అందందు గుప్తముగ వసించుచున్న దేవతలు బయలు పడక తప్పలేదు. దేవాసుర పతాక ధ్వజములు గల యుభయ సైన్యములకు భూలోకమున నకాల ప్రళయ కాలమువలె భయంకర సంగ్రామము జరిగెను. ఆ సంకుల సమరమున నమరవరుల అవయములు ఖండితములై రక్తము మహానదిగా ప్రవహించినది. సైనిక నికాయము పలాయిత మయ్యెను. అగ్నులు ఇంధనముల ననుసరించు విధమున దామ వ్యాళ కటులు అంతర్హితు లగుచున్న దేవ సైనికుల ననుగమించు చుండిరి. అయినను వారు లభింపకుండుటచే ప్రముదితాత్ములై పాతాళలోకమున నున్న తమ ప్రభు సన్నిధానమునకు జేరు కొనిరి. విషణ్ణచిత్తులగు దేవతలు క్షణమాత్ర మూరట జెంది అనంతతేజోవిరాజితుడైన చతురాననుకడ కేగిరి.

రక్తాసనచ్ఛవితో నను రక్తుడైన బ్రహ్మ, దేవతలకు దర్శన మొసంగెను. వా రాతనికి నమస్కరించి, శంబరాసురిని యాగడమును, దామ వ్యాళ కటుల విజృంభణమును, తమ యాపదను విన్నవించిరి. బ్రహ్మ వారి యాలాపము నాలించి దీర్ఘముగ నాలోచించి, వారి నోదార్చుటకై ఈవిధముగ వచించెను: 'దేవతలారా! వేయి సంవత్సరముల యనంతరముగాని, మీరు శంబరుని జయింపగల శక్తియుక్తులు కలవారు కాలేరు. అంత దనుక కాలమును ప్రతీక్షించుచుందురుగాక ! మీరు దామాదులతో యుద్ధము జేయుచు పలాయితు లగుచుండుడు. మీ రీ విధముగ

మాటిమాటికి జేయుచుండుట వలన అహంకార చమత్కారము వారి హృదయ దర్పణముల ప్రతిఫలించును. వా రపుడు వాసనలకు లోనై వలలో జిక్కుకొనిన పక్షుల విధమున మీకు జయింప సాధ్యు లగుదురు. అనంతములగు దుఃఖములకు ఆశా మాత్రమే ఆకరమగునని పండితులు పలుకుచుందురు. ఆశా విరహితత్వము సుఖముల కాకరము. ఈ లోకము వాసనాతంతు బద్ధము. అది అభివృద్ధి నందిన అనంత దుఃఖప్రద మగును. క్షయము నొందిన అనంత సుఖప్రదము నగును. ధీరుడు, బహుశ్రుతుడు, వృద్ధుడు, మహాత్ముడైనను ఈ ఆశచే శృంఖలాబద్ధ మృగేంద్రము చందమున బద్ధుడగుచున్నాడు' అని ప్రబోధించి చతురానను డంతర్ధానము నొందెను. దేవత లాయన పలుకులను హృదయమునం దిడుకొని యథేచ్ఛగా వెడలిరి.

ప్రళయకాల పర్జన్య గర్జానుకారియగు భీషణ ఘోషణము చేయుచు దేవత లంబరతలమున సమర ప్రలాపము లాచరించుచుండిరి. వాటి నెఱిగిన రక్కసులు పాతాళమునుండి వెలికివచ్చి యంతరిక్షము ననే యుద్ధము జేయ దొడగిరి. ఇపుడు కాలక్షేపార్థమైన యుద్ధము ప్రవర్తిల్లుచున్నది. కొంతవడికి దేవతలు పలాయనము చిత్తగించిరి. ఈవిధముగ పలుమారులు సంఘటిల్లినది. దైత్యవ్యామోహ జననార్థము, కాలహరణమునకును దేవతలు యుద్ధము లొనరించుచుండిరి కాని దానవ విజయాభిలాషతో మాత్రముకాదు. యుద్ధమున తమను జయించుట అసాధ్యము, వృథా ప్రయాసము అను దేహాభిమానము కామ వ్యాళ కటులలో ప్రబలినది. వెంటనే సంసార వాసగ్రస్తులైరి, మోహావాసనా విలసితులైరి. ఆశాపాశవిబద్ధులై కడకువారు దీనస్థితి నందిరి. 'నా శరీరము స్థిరముగనుండుగాక ! నా ధనము స్వసుఖార్థమై వినియోగింపబడుగాక !' అను భావములు వారిలో నభివృద్ధి చెంది ధైర్యమును పరాస్తము గావించెను. వారు యుద్ధమున మరణింతుము. మరణింతుము' అను ఆలోచనముచే

హాతాశయులై జీవితాపేక్షకలవారైరి. మ్లానసత్వులై, శత్రు సైనికుడు తనను చంప నుంకించుచున్నను, ప్రశమితాగ్ని హావిస్సును భస్మము చేయజాలని యట్లు వానిని వధింపజాల కుండిరి. ఎన్నిచెప్పిన నేమి ప్రయోజనము ? మృత్యుభయభీత చేతస్కులై దేవ శత్రువులు దేవతలచే పరాజితులై నశించిరి. బుద్ధిశాలివగు రామచంద్రా ! నీవు ప్రబోధితుడ వగుటకై ఈ యుపాఖ్యానమును వచించితిని. నీవు దామ వ్యాళ కటులవలె వ్యవహరింపకుము. అవివేకానుసంధానము వలన చిత్త మీ విధమగు నాపద ననుభవించును. అంతములేని సంసార దుఃఖమును విలాసముగ ననుభవింపుము” అని వశిష్ఠ మహర్షి వివరింప, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను : “మునిపుంగవా ! ఈ దామ వ్యాళ కటులు పరమపదము నుండి జన్మించిరి అని నుడివితిరికదా ! వా రా విధముగ నేల జన్మించిరి అను సందియము బాధించుచున్నది. దీనిని దూరము జేయుదురుగాక !” అనెను. అపుడు వశిష్ఠు డిట్లు చెప్ప నారంభించెను :

## దామాద్యుత్పత్తి

“శ్రీ రామచంద్రా ! ఈ దామాదులు ప్రతిభామాత్ర స్వరూపులు. వారు మాయచే సృజింపబడిరి. మనము కూడ ప్రాతిభాసిక రూపులమై బ్రహ్మపదార్థమునందే యుంటిమి కాని ఆ చిదాకాశము నకు వెలుపలనున్నవారము కాము. ఇక ‘నీవు, నేను’ అను భావము లసత్యములు. దామ వ్యాళ కటాదుల భావమున సత్యమే యగును, పరమాత్మ సంబంధమగు ప్రాతిభాసిక మయమగు జీవశక్తి యేద్దియో శంబర ధ్యానము వలన సంక్షోభము చెంది త్రివిధములగు నాకారములను ధరించినది. ఆ మూర్తిత్రయమే దామ వ్యాళ కటులను వారు. అంతియకాదు, మనమును సత్యముకాదు. ఆ దామాదులు సత్యము కాదు. ఇక శుద్ధసంవేదనము, నిరంజన మగు జ్ఞానస్వరూపము మాత్రమే సత్యమైనది. ఈ సత్యపదార్థము

సర్వవ్యాపకము, ప్రశాంతము, ఉదయాస్తమానములు లేనిది. దాని శక్తి సముల్లాస మాత్రమున ఈ జగత్తు అను స్థితి యేర్పడినది. మనము అనుభవించుచున్న విధముగ నిది యంతయు నంతట వ్యాపించి యున్నది. ఏ కొంచెము ననుభవింపకుండ నుండునది లేదు తానొక్కటిగనే యుండి, పరిశాంతమైనదై, ఈవిధముగ సత్పదార్థము వ్యాప్తమై యున్నది. కాన సందియమును వీడి, భేదభావము లేనివాడవై యుండుము.

## భీమాద్యుపాఖ్యానము

దామాద్యుపాఖ్యానమున 'అవివేకమునకు కారణభూతమగు 'నేను, నాది' అను నభిమానము వలన ఈ సంసార దుఃఖము వృద్ధియగుచున్న'దని వివరింప బడినది. ఇపు డీ యుపాఖ్యానమున "దేహాదులయందు నహంకారభావరాహిత్యమే పురుషార్థ సాధకము" అని వశిష్ఠ మహర్షి శ్రీరాముని కెరింగించెను.

"మహామతీ! రామచంద్రా! 'ఇది నాది, ఇది నీది' అను భావము తన దౌర్భాగ్యవశమున కలుగును. ఇది సత్యమగు నాత్మ స్వరూపమును దర్శింపజేయ జాలదు. త్రైలోక్య సంపదనైతము నిత్యము తృణప్రాయముగ భావించు నతడు, మృగములు జరత్తృణ మును గ్రహింపనట్లు, ఆపదలను దరికి రానీయక యుండును. సత్యపదార్థ చమత్కారము నిరంతరము తన యంతరాత్మయందు భాసించుచున్నచో, నతనిని దిక్పాలకులు బ్రహ్మాండమును రక్షించు విధమున కాపాడుచుందురు. గుణములయం దనురాగము, శాస్త్రములయం దానందము, బ్రహ్మమువం దాసక్తి గలవారలు మాత్రమే మానవులు. తదన్యులు పశువు లనబడుదురు. దుర్భరము లగు నాపదలు సంభవించినను అక్రమమునకు పాల్పడరాదు. రాహువంతటివాడు అక్రమముగ నమృతపాన మొనరించుటచే హతు డయ్యెను. అవశ్యులు కూడ సద్గుణవంతులకు వశ్యు లగుదురు.

వారిని ఆపదలేవియు దరిజేర జాలవు. అతుయ శ్రేయస్సు వారికి సమకూరును. సత్పౌరుషము నాశ్రయించి, సదుద్యమవంతుడై, శాస్త్రవిహితకార్యాచరణశీలుడై యుద్వేగము నందనివాడు సర్వమును సాధించును. కాన యథా శాస్త్రము విహారింపవలెను. త్వరపడువానికి కార్యములు సిద్ధింపవు. చిరకాల పరిపక్వసిద్ధి అత్యధిక ఫలప్రద మగును. శోక, భయ, ఆయాస, కామ, కౌటిల్యములను వీడి శాస్త్ర ప్రకారము వ్యవహారింపవలెను. వినాశమును వాంఛింపరాదు. అర్థ సంపదలు అనర్థము కొరకే లభించును. భోగ సముదాయము భవరోగమును కలిగించును. సర్వసంపదలు, సర్వాపదలకు మూలములు. కాన వీని నన్నింటి యెడలను ననాదర భావమే ఆయుప్రదము. సదాచారసంపత్తి కలిగి, వివిక్త వ్యాపారుడై, సంసార సౌఖ్య ఫలములను, దుఃఖదశలయందు ననాసక్తుడైన వానికి ఆయువు, సద్గుణములు, సంపదలు, కీర్తి లభించి, వసంతర్తువునందలి లతల విధమున వికసించి వెల్లివిరియును" అని వశిష్ఠుడు చెప్పి మరియు నిట్లనెను :

"సంసార సాగరము నుత్తరించుటకు తపములుగాని, తీర్థములుగాని, శాస్త్రములుగాని, జపములుగాని యుపయోగపడవు 'సజ్జన సేవ' అనున దొకటి మాత్రము చాలును. లోభ, మోహ దోషములను ప్రతిదినము తగ్గించుకొనువాడు, యథాశాస్త్రముగ స్వకర్మల నాచరించువాడు 'సజ్జను' డనబడును. 'అహం' అను శబ్దార్థము నెరుగకున్న, పరమార్థ మను నంబరమున కళంక మేర్పడును. ఆ శబ్దార్థ పరిజ్ఞాత యగుచో పరమార్థాంబర మే యగును. చిజ్జ్యోత్స్న అహంకార మేఘావృతమై యున్నంతవరకు పరమార్థ మను కలువ వికసింపజాలదు. అతుయాత్మములగు జన్మ వృక్షములకు అహంభావములు అంకురము లగును. 'నాది, నీది' అను మమత్వ బుద్ధులు ఆ వృక్షమును విస్తరింపజేయు శాఖలు, దుఃఖములు, ఫలములు నగును" అని వశిష్ఠుడు చెప్ప, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను :

"ప్రభూ ! అహంకార మేవిధముగా నుండును ? అది ఎట్లు విసర్జింప బడును ? సశరీర మైనదైనను, అశరీర మైనదైనను దానిని విడచుట వలన కలుగునదేమి ? " అన, వశిష్ఠ మహర్షి ఇట్లనెను :

" రాఘవా! ఈ యహంకారము మూడు లోకముల యందు మూడు విధములుగా నుండును. వీనిలో రెండు విధములగు నహంకారములు శ్రేష్ఠములు. మూడవది పరిత్యాజ్యము. వానిని వివరించుచున్నాను, వినుము. 'ఈ విశ్వమంతయు నేనే, నేను నాశము లేని పరమాత్మ స్వరూపమను, నాకంటె వేరయినది ఈ సృష్టిలో లేదు' అని భావించుట శ్రేష్ఠమగు నహంకారము. ఇది బద్ధునకు గాక, జీవన్ముక్తునకుండును. ఇది మొదటి యహంకారము.

ఇక రెండవ యహంకారము : 'కేశాగ్రశతాంశరూపుడనై యన్నిటికంటె వేరైన వాడను నేను' అను జ్ఞానము శుభప్రదమైన రెండవ యహంకారము. ఇది మోక్షదాయకముగా నిబంధకము గాదు. ఇదియు జీవన్ముక్తునకే యుండును.

'నేను ఈ పాణి పాదాది యుక్తుడను' అను నిర్ణయము కలిగి యుండుట మూడవ యహంకారము. ఇది లౌకికమైనది. మిగుల తుచ్ఛమైనది. ఈ యహంకారము దుర్మార్గున కుండును. ఇది సంసార సంతతికి మూలము. కాన దీనిని విడువ వలయును. దీనిచే జీవుడు పాతాళమున కణగ ద్రొక్కబడును. ఈ దురహంకార పరిత్యాగము వలన వెంటనే ముక్తుడై శ్రేష్ఠాహంకార సంయుతు డగును. మొదటి రెండహంకారములు శ్రేష్ఠములైన వగుట వలనను, అలౌకికములైన వగుట వలన నుగ్రాహ్యములు. మూడవది, లౌకికమై దుఃఖప్రదమగుట వలన పరిత్యాజ్యము. ఈయహంకార పరిత్యాగము వలన బ్రహ్మ పదార్థము లభించును. మొదటి రెండహంకారములను భావించుట వలన పరమపద మంద గలడు.

ఈ రెంటిని గూడ విడచి, సర్వాహంకార రహితుడైనచో శాశ్వత బ్రహ్మ పదవి నందును. ఈ శరీరావస్థ మహా పుణ్యప్రదమైనది. దురహంకార వర్జనము వలన మరింత యుత్కృష్టమై, శ్రేయస్కరము, పరమపదప్రదము నగును.

ప్రస్తుతము దామాదులు నశించిన తరువాత వృత్తాంతమును వివరించుచున్నాను, వినుము. శంబరుడు దేవతలచే పరాజితుడై ఏనాటికైన మరల దేవతలను నిర్జింపవలయు నని దృఢ నిశ్చయుడై యుండెను. 'మాయచే సృజింపబడిన దామాదులు మోహావశులై మిథ్యాహంకారసంభరితాత్ములై నశించిరి. ఇపుడట్లు మోహావివశులు కాని దానవులను మాయతో నిర్మింతునుగాక! వారు అధ్యాత్మశాస్త్రవిదులై, వివేకసంపన్నులై యుందురుగాక! వారు తత్త్వజ్ఞానము కలిగి, మిథ్యాజ్ఞాన వర్జితులై అహంకారమునకు లోనుగారు. కనుక దేవతలను నిర్జింతురు' అని యాలోచించి, యాశంబరాసురుడు మాయచే, సముద్రుడు బుద్బుదములను సృజించిన విధమున మాయామహిమాన్వితులైన రాక్షసులను సృజించెను. వారు సర్వమర్మజ్ఞులు, వేదవేత్తలు, వీతరాగులు, పాపరహితులు, ప్రాప్తకార్యాచరణశీలురు, పవిత్రాత్ములు. నుత్తములునై యుండిరి. వారిని 'భీముడు, భాసుడు, దృఢుడు' అని యందురు. పవిత్రాశయులై జగమును తృణముగా భావించుచుండిరి. వారు తమ యధిపుని యాజ్ఞానుసారము ఆకసము నంతయు వ్యాపించిరి. దేవతలతో ననేక వత్సరములు యుద్ధ మొనర్చిరి. వారిలో 'నేను' అను వాసన యంకురించుటతోడనే 'ఆ నేను అనగా నెవరు?' అను విచారణ వలన నా వాసన నశించుచున్నది. అంత వారు నిరహంకారులై, జరామరణ నిర్భయులై, ప్రాప్తార్థకార్యులై, వర్తమానానువర్తనులై, వీరులు, వీతరాగులు, గతద్వేషులు, సమదృష్టులునై యుండిరి. భోక్తలు భోజ్య పదార్థములను ఖండించి, కాల్చి భక్షించునట్లు వారు దేవ సైన్యమును దండించి,

ఖండించి పరిమార్చుచుండిరి. దేవత లీ బాధ ననుభవింపజాలక హిమవంతము నుండి జారిపడు గంగానది విధమున నతి వేగమున పలాయితులైరి. వాతాహతమైన మేఘమాల, శైలేంద్రుని మాడ్కి, వారు క్షీరసాగర శయనుడైన శ్రీమహావిష్ణువును శరణు జొచ్చిరి. వారి ప్రార్థన నాలించి శ్రీమహావిష్ణువు భయంకర యుద్ధ మొనరించి యా రక్కసులను తన చక్రాగ్నితో భస్మీ భూతము గావించి విష్ణులోకమునకు జేర్చుకొనెను. కాన వాసనతో గూడిన మనస్సు బంధహేతువు. వాసనా రహితమైనది ముక్తి హేతువు. రామచంద్రా! నీవు వివేకము వలన వాసనా రహితమగు మనస్సును పొందుము. సమ్యగాలోకనము వలన, సత్యజ్ఞానము వలన వాసన నశించును. వాసన నశింప మనస్సు తైలరహిత దీపము భాతి లయించును.

## జగన్మాయా స్వరూపము

శ్రీరామచంద్రా! భీమాద్యుపాఖ్యానమున 'నహంకార పరిత్యాగమే మోక్షదాయక'మని నిర్ణయింపబడినది. ప్రస్తుతము ఆ యహంకార పరిత్యాగ మొనరించుటకు జగత్స్థితిని, మాయకత్వ. మును దెలియవలయును. కాన ఆ విషయమును వివరించుచున్నాను, వినుము.

సర్వోపద్రవకారకమగు నీ సంసార దుఃఖమును నివారించు కొనుటకు మనోనిగ్రహ మొకటియే యుపాయము. అందుకు జ్ఞాన మలవడవలయును. కాన జ్ఞాన సర్వస్వమును వివరించుచున్నాను. దీనిని మనఃపేటికయందు పదిలపరచుకొనుము. భోగానుభవ వాంఛ బంధ హేతువు. ఆ వాంఛను పరిత్యజించుటయే మోక్షము. దీని కితర శాస్త్ర విచారణలతో పనిలేదు. నా యుపదేశానుసారము భోగేచ్ఛా పరిత్యాగ మొనరింపుము. ఈ జగత్తున మనోహరముగ కన్పించు ప్రతివస్తువును విషవహ్నిగా భావింపుము. విషయ భోగ

ములు, విషమయములని నిరంతరము భావించి, వాటిని పరిత్యజించి, సుఖావహములైన వాటిని సేవింపవలయును. మనస్సు నభ్యుదయ మొనరించుకొనుట వినాశహేతువు, దానిని నాశ మొనరించుకొనుట మహోదయ కారణము. జ్ఞానవంతమగు మనస్సు లయ మొందును. అజ్ఞానికి మనస్సే ప్రతిబంధకము. శ్రీరామచంద్రా! జ్ఞాని మనస్సు ఆనందమయముగాని, నిరానందమైనదిగాని, చంచలమైనదిగాని, నిశ్చలమైనదిగాని, స్థిరమైనదిగాని, సద్వస్తువుగాని. అసద్వస్తువుగాని కాదు. పరస్పర విరుద్ధములగు వీని మధ్య భాసించునదియు కాదు" అని చెప్ప, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను: "మునిసత్తమా! విశ్వాతీతమగు చిదాత్మయందు నీ విశ్వమెట్లు కుదురుగ నున్నదో నాకు వివరింపుము," అన వశిష్ఠ మహర్షి చిదాత్మయందు వివర్తభావముగ విశ్వమున్నదని వివరింప దలచి చిదాత్మ స్వరూపమును ముందుగ నిట్లు వివరించెను :

"ఆకాశము సర్వవస్తుగతము. అయినను సూక్ష్మమైన దగుట వలన దృశ్యము కాదు. అట్లే నిరంశమగు చిద్భావమును సర్వ వ్యాపియయ్యు దృశ్యము కాదు. సర్వసంకల్ప రహితమై, సర్వ సంజ్ఞా విరహితమై 'చిదాత్మ, స్వాత్మ' అను నామములు ధరించి, అవినాశ స్వరూపమై జ్ఞానుల యందు నిష్కళంక రూపమును, అజ్ఞానుల యందు సంసార రూపమునై వెలుగొందు చున్నది. జలార్ణవ సముద్భవములైన తరంగాది నానావిధ స్వరూపములు తద్వ్యతిరేకములుగానట్లు, చిదర్ణవ సంభవములైన 'నీవు, నేను' అను భావములును చిన్మాత్రవ్యతిరేకములు గావు. అజ్ఞానులకు నసద్భావములై మిక్కిలి భయంకరము అగు సంసారములు కలిగించున దగును. జ్ఞానులకు ప్రకాశరూపమై సకలరూపాత్మక మగును. అనుభవ వశమున నిత్యము కర్మాదులను ప్రకాశింప జేయునదిగ, సంసారస్థులగు సర్వభావులకు మధుర భావనయు నగును, ఇట్టి చిత్పదార్థము ఉదయింపక, అస్తమింపక, లేవక, కూర్చుండక,

వెడలక, తిరిగిరాక, ఇకడగాని, అక్కడగాని యుండక, పరిపూర్ణంబై యుండును. శ్రీరామచంద్రా! ఈ చిత్తు నిర్మలాకారమై ఆత్మయందు స్వయముగా వసించుచు ప్రపంచముచే నిది 'జగత్తు' అను నామముతో పిలువబడుచు ప్రకాశించుచున్నది. సహజముగ చిన్నామమున సర్వవ్యాప్తమై యుదయించుటతో ప్రకాశమానము, నప్రకాశమానమునై, నిరంకుశమై అంశధారణమై, స్వయంభావ్యమై, అనంతపదమును విసర్జించినదై, 'ఈ స్వరూపము కలవాడ' నను భావముచే నజ్ఞాన పదమును మెల్లగా చేరునదియు, నానాత్వ మభివృద్ధి చెందగా, సంస్కృతి పూర్వకమైనదియు భావాభావములను గ్రహించుట, విడచుట యను పదమందు స్థితిని పొందినదై సంకల్ప శతముచే పుర్యష్టకమును జేయుచు, యథార్థమునకు నేమియు జేయక యున్నది. ఈ విధములగు స్థిరతరాకారములగు సంసార పంక్తులు అంతటను స్వతసిద్ధముగా బ్రహ్మమునుండి అన్నియు వచ్చుచు, పోవుచు నుండును. చిదాభాసమున వ్యోమమందు వేసవికాలమున ప్రవాహములవలె సృష్టి సృష్టులు, చిత్తత్త్వమునందు చూడబడుచున్నది మదము వలన ఆత్మ ఇతరునివలె భాసించునట్లు, అజ్ఞానము వలన చిదాత్మపరునిగా తోచును. రాఘవ! శబ్ద, రస, రూప, గంధములను తెలిసికొనుటకు కారణమైనది ఆత్మయగు పరబ్రహ్మ స్వరూపము. అది సర్వవ్యాపకమై యున్నది. ఈ బ్రహ్మము అనేక నామములతో ప్రకాశించును. సముద్రోదకము తరంగాది రూపములతో భాసించునట్లున్నదే కాని వేరు కాదు. శ్రీరామ చంద్రా! అగ్నియం దుష్ణము తప్ప వేరుగ నింకొక గుణము లేని విధముగా, నీ జగత్తునందు బ్రహ్మస్వరూపము కంటె నితరమైన దింకొకటి లేదు. ప్రథమమున శమదమాది గుణములతో శిష్యుని శిక్షింపవలయును. అనంతరము 'ఇది యంతయు బ్రహ్మ స్వరూపమే యనియు, ఆ పరిశుద్ధ బ్రహ్మమే నీవు అనియు బోధింపవలయును. ఏమియు నెరుగని వానికి, సగము మాత్రమే

తెలిసిన వానికి సర్వము బ్రహ్మమయమని ప్రబోధించినచో
నతనిని నరకజాలములలోనికి నెట్టినట్లే యగును. నిస్సంకల్పుడు,
భోగవాంఛా విరహితుడు, వివేకవంతుడు నగు వానికి 'అవిద్య'
అను కల్మషముండదు కాన నీ యర్థము గోచరించును. దీపము
వలన ప్రకాశము లభించునట్లు, సూర్యుని వలన పగలు కలుగు
నట్లు, పుష్పము వలన పరిమళము వచ్చునట్లు, చిత్తువలన జగత్తు
ప్రకాశించుచున్నది. కాని ఈ జగము యథార్థముగా ప్రకాశించుట
లేదు" అన విని, శ్రీరామచంద్రుడు వశిష్ఠ మహర్షి నిట్లు
ప్రశ్నించెను: "మునినాథా! క్షీరసాగర సదృశములు, శీతల
ములు, నిర్మలములు, దీప్తిమంతములు, విచిత్రములు నగు తమ
సూక్తులచే ప్రబోధింపబడితిని. శీతాతప లవమగు వర్షాకాలమున
చంచలాభ్రములు కల పగటివలె క్షణకాలము చీకటియు, క్షణ
కాలము ప్రకాశమును పొందుచున్నాను. అనంతము, నప్రమే
యము, సర్వాత్మకము, నద్వితీయము నై ప్రకాశించు పరబ్రహ్మము
నకు అవిద్య ఎట్లు సంభవించినది అనగా చీకటి తేజోమూర్తి
నాచ్ఛాదింపజాలదు కదా! జ్ఞాన స్వరూపమున కజ్ఞాన మేవిధముగ
కలిగినది?" అని ప్రశ్నించెను. అంత వశిష్ఠు డీ విధముగ సమాధా
నము చెప్పెను:

"శ్రీరామచంద్రా! నా పలుకు లన్నియు యథార్థములు.
కాని అసమర్థములు, విపరీతార్థములు, పూర్వాపర విరోధములు
కలవి మాత్రము కావు. జ్ఞానదృష్టి సుప్రసన్నమై నీవు స్వస్థచిత్తుడ
వైనపుడు నా వాక్కుల దృష్టి, బలాబలములను గుర్తింప గలవు.
స్వాత్మనాశమునకై యుద్భవించిన యుత్తమమగు నవిద్యచే నితరము
లగు నవిద్యాదులు నశింప, చరమ సాక్షాత్కారమగు విద్య లభించు
చున్నది. అస్త్రముచే నస్త్రమును, మలినముచే మలినమును, విషముచే
విషమును, శత్రువుచే శత్రువు నుపశమింప జేసికొనుట లేదా?
సర్వనాశనము నగు మాయ సంతోషప్రదమైనది. అది యే అవిద్య.

దీని స్వభావము కన్పించదు కాని, చూచుటతోడనే నశించును. యథార్థమునకు అవిద్య అనునది లేదను భావనచే జ్ఞానివై, జ్ఞేయమును పొందుటవలన దీని యాశయమును నీ వెరుగుదువుగాక! పరబ్రహ్మములో నైక్యము జేయు జ్ఞానము కలుగనంతవరకు నా వాక్యము మూలమున 'నాకు అవిద్యలేదు' అను నిర్ణయము నిశ్చలమై యుండుగాక! సర్వము బ్రహ్మమయమని అంతర్భావన మున్న వానికి ముక్తి లభించును. అవిద్య యనగా భేదదృష్టి. దాని నే విధముగ నైన పరిత్యాగ మొనరింపవలెను. ఆత్మజ్ఞానము నందుట కంటె నవిద్యా నదిని దాటుట యవసరము. అభయమగు పరమపదమే యా నది కావలి యొడ్డు. అవిద్య ఎట్లు జనించినది అను ఆలోచన నీకు వలదు. దీని నెట్లు నాశము జేయవలయునా అను ఆలోచన జేయుము. ఈ అవిద్య కృశించి, నశింపగా నది యెట్లు కలిగినదో, వృద్ధి నందెనో, నశించెనో ఆ విషయము లన్నియు తెలిసికొనగలవు. కాన పునర్జన్మ దుఃఖముల ననుభవింపకుండ నుండునట్లుగా, సంసార రోగములకు మూలమగు నీ యవిద్యకు చికిత్స జేయుటకు, రోగశాలను స్థాపించుటకు యత్నింపుము. ఆత్మయందు నాత్మచేత ఆకాశము నందు వాయువు సంచరించు విధముగా, ఆత్మ ఆత్మశక్తితో తన యాత్మయందు చంచలత్వము నొందుచున్నది. అనగా ఆత్మయే జగత్తున కధిష్ఠానమును, ఉపాదాన కారణమును, నిమిత్తకారణము నగుచున్నదని భావము. తన యాత్మయందు, తన పరిస్పందనల మూలమున చిత్తను సముద్రము ప్రకాశించుచున్నది. అది 'ఏకాత్మకము అఖండము' అని నీ యాత్మయందు దృఢముగా భావింతువుగాక! చిదాత్మయందు ఆ చిచ్ఛక్తి కొంచెము చలించినదైనను, మహా సముద్రమున చలించు తరంగమువలె ప్రకాశించుచున్నది.

## సృష్టి క్రమము

చిద్రూపిణియగు నా దేవి సర్వశక్తి సంపన్నయగుట వలన క్షణమాత్రము ప్రకాశించుచు దేశ కాల క్రియా శక్తులను సృజించు

టకు తన చెలికత్తెలను ప్రేరేపించుచున్నది. స్వస్వభావము నెరిగి సమున్నతము, ననంతము నగు కైవల్యపదమం దుండియు, నవిచారముగా తన రూపమును పరిమితమునుగా భావించుచున్నది. ఇట్లు భావించినప్పు డీ చిచ్ఛక్తి నామము, సఖులు అను నీ మొదలగు భేద భావము లంకురించినవి.

## క్షేత్రజ్ఞ అహంకారము

దేశ కాల క్రియా నిలయమై వికల్ప కల్పితమైన ఆకాశము కల చిద్రూపమును 'క్షేత్రజ్ఞుడు' అందురు. జీవుడే క్షేత్రజ్ఞుడు. ఈ క్షేత్రజ్ఞుడు వాసనలను కల్పించుకొని, అహంకార రూపుడై యుండును. ఈ అహంకారము నిశ్చయాత్మకమైన కళంకమగు 'బుద్ధి' యనబడును. ఈ బుద్ధి సంకల్పకలితమై మనస్సుగా రూపొందును. ఈ మనస్సు ఘనమైన సంకల్ప వికల్పములతో గూడి మెల్లగా నింద్రియ రూపము ధరించుచున్నది. ఆ ఇంద్రియములు పాణి పాదాదులు గల దేహ మగుచున్నదని పండితు లందరు. ఈవిధముగ జీవుడు సంకల్ప వాసనా రజ్జు వేష్టితుడై, దుఃఖజాలమునకు లోనయి, క్రమక్రమముగ నీచత్వము నందుచున్నాడు. శక్తివంతమైన చేతస్సు ఘనమగు నహంకారత్వమునంది పట్టుపురుగువలె స్వయముగా బంధనములో జిక్కుకొనుచున్నది. తన సంకల్ప మాత్రము లయిన శబ్ద స్పర్శాది భోగ జాలములో బడి శృంఖలాబద్ధ మృగేంద్రమువలె మిక్కిలి వివశత్వము నందుచున్నది. ఇది యొకచోట 'మనస్స'నియు; మరియొకచోట 'జ్ఞాన'మనియు; నింకొకచోట 'క్రియ'యనియు; వేరొకచోట 'నహంకార'మనియు,; మరియొకచోట 'పుర్యష్టక'మనియు; ఒకచో 'ప్రకృతి' యనియు, నింకొకచో 'మాయ' యనియు, వేరొకచో 'మల'మనియు; మరియొకచో 'కర్మ'యనియు; నింకొకచోట 'బంధ' మనియు; వేరొకచోట 'చిత్త' మనియు; మరియొకచోట 'నవిద్య' యనియు; నింకొకచోట 'నిచ్ఛ' యనియు; ననేకవిధములుగా చెప్పబడుచున్నది.

రామచంద్రా ! ఈ యఖిల సంసారము నాశా పాశముచే కట్టబడినది. వట వృక్షమును ధరించిన వట బీజమువలె నిష్ఫలమైన సంసారమును లోపల ధరించి, 'చింత'యను నగ్నిజ్వాలతో దగ్ధమై'కోప మను 'నజగరము'చే మింగబడి, 'కామ'మను సాగరతరంగముచే హతమై, తన పితామహుని విస్మరించినదగు మనస్సును, మదము నుండి మాతంగమును వలె నుద్ధరింపుము. 'జరా మరణ విషాదము' లను మంటలకు, మూర్ఛనొందినదై, శుభా శుభ ప్రసరణల మూలమున పరాస్త మొన రింపబడినదై, హృదయమునందు దయా స్వభావము లేనివాని జీవితము, మానవ రూపమున నున్న 'రాక్షసు'డన బడును' అని మరియు వశిష్ఠు డిట్లనెను :

"ఈ విధముగ జీవరూపమగు చిత్తునుండి సంసార భావనయందు హితము లయిన భావములు బ్రహ్మచే లక్షలు, కోట్లుగ కల్పితాకారములైనవి. ఇంతకు బూర్వము సంఖ్యాతీతముగ జన్మించినవి. (ప్రస్తుతము జన్మించుచున్నవి). ఇకముందు గూడ ప్రవాహోదకము నుండి జలబిందువుల భాతి జన్మింప గలవు. ఈ జీవులలో కొందరు ప్రథమముగ జన్మించిన వారు కాగా, మరికొందరు శతాధిక జన్మల వారు కలరు. మరికొంద రసంఖ్యాక జన్మపరంపర లనుభవించువారున్నారు. ఇంక కొందరు రెండు మూడు జన్మముల నందిన వారును; గంధర్వ, విద్యాధర, కిన్నరోరగులుగను; మరికొందరు అర్కేందు, వరుణ, త్ర్యక్ష, అధోక్షజ, పద్మజులుగను; ఇంక కొందరు బ్రాహ్మణ, భూపాల, వైశ్య, శూద్రాది గణములుగను; మరికొందరు పుణ్యౌషధీ పత్ర ఫలమూల పతంగకములుగను; వేరుకొందరు కదంబ, జంబీర, రసాల, తాల, తమాలములుగను; ఇంకను కొందరు క్షార, దధి, క్షీర, ఘృత, ఇక్షు జల రాశులుగను; వేరుకొందరు మహేంద్ర, మేరు, సహ్య, మందర, హిమాది పర్వతములుగను, మరియు గొందరు విశాలములగు దిశలుగను; కొందరు వేగవంతములగు కూలంకషములుగను జన్మించుచున్నారు. కొందరు ఉన్నత స్థానముల నంది

గౌరవింపబడుచుండ, మరికొందరు అథస్థ్సానగతులై పై కెగయ యత్నించుచున్నారు. కొందరు కందుకముల వలె మిన్నంటుచు మృత్యువుచే నిరంతరము పీడింపబడుచున్నారు. కొంద రనేకవేల జన్మపరంపరల నందియు, తిరిగి సంసార సంకట మునమునుగుచున్నారు. కొంద రజ్ఞానులై, అవివేకులై, బుద్ధిహీనులై పతన మగుచున్నారు. ఈ విధముగ త్రిభువన రచనా మూలమై అందరను మోహ మగ్నుల నొనరించెడి మాయ, బ్రహ్మ పదార్థమునందు, సాగరమున తరంగము వలె వెలుగొందుచున్నది. అది విస్తృతి నంది వ్యర్థముగా బుట్టుచు, నశించుచున్నది" అని చెప్ప, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను : "మహాత్మా ! జీవుడు మనోరూపమును పొంది బ్రహ్మపథము నేవిధ ముగా పొందునో వివరింపుడు" అన, వశిష్ఠ మహర్షి ఈవిధముగా విశద మొనర్చెను :

"మహాబాహూ ! బ్రహ్మ శరీరమును ధరించిన విధము నభి వర్ణించి యనంతర మా విషయమును వివరింతును, వినుము. దీనిని ఆధారముగ గొని జగత్తుయొక్క స్థితిని తెలిసికొన గలవు. దిక్కా లాద్య నవచ్ఛిన్నమై, ఆత్మతత్త్వమై, తన శక్తిమూలమున విలాస ముగ దిక్కాల కలితమైన శరీరమును బ్రహ్మ ధరించెను. అది వాసనా వశమున జీవ పర్యాయమును, జ్ఞానాజ్ఞానోన్ముఖము, చంచలమును నై నమనస్సుగా నవతరించినది. ప్రథమమున మనశ్శక్తి, మనన శీలము కలదియై క్షణకాలములో నాకాశ తత్త్వము వలన నుత్పన్నమైన శబ్ద, బీజ రసోన్ముఖముగా భావించెను. అట్లు ఆకాశరూపాత్మకమైన మనస్సు క్రమముగ స్పర్శ బీజ రసోన్ముఖమై స్పందభావము గల అనిల రూపమును భావించెను. ఆ యాకాశ వాయువుల దృఢా భ్యాస వశమున, శబ్ద స్పర్శ రూపముల సంఘర్షమువలన ననల ముద్భవ మయ్యెను. అనంతరము ఆ మనస్సు శబ్ద స్పర్శాగ్నుల రసతన్మాత్ర వేదనమున క్షణకాలములో జల్లనైన జలరూపంబును పొందెను. తద్గుణగతమగు మనస్సు గంధతన్మాత్రమును భావించి క్షణములో

గంధ గుణకమై భూ రూపమును ధరించెను. ఇట్లు పంచభూత తన్మాత్ర వేష్టితమైన మనస్సు విస్తరించి వహ్నికణాకారమై ప్రకాశించు శరీరము ఆకాశమును జూచెను. అహంకార కళలతో గూడినదై బుద్ధిబీజ సమన్వితము, భూతహృత్పద్మషట్పదమునైన పుర్యష్టకము (సూక్ష్మ శరీరము) అయ్యెను. అందలి మనస్సు తీవ్ర సంవేగము వలన ప్రకాశవంతమగు శరీరమును భావించుచు, పరిపాక వశమున బిల్వఫలము పగిది స్థూలత్వము నొందెను. మూస యందు కరుగబడిన బంగారము విధమున నిర్మలాంబరమున ప్రకాశించుచున్న ఆ తేజస్సు తన స్వభావము వలన ఊర్ధ్వ భాగమున శిరస్సును, క్రింది భాగమున పాదములు, పాదములందు హస్తములు, మధ్య భాగమున నుదరము కలిగిన యాకారమును ధరించెను. అట్టి నిర్మల విగ్రహము కాలక్రమమున స్ఫుటత్వము నొంది 'బుద్ధి, సత్త్వము, బలము, ఉత్సాహము, విజ్ఞానైశ్వర్యంబులు' ను గుణములు కలదయ్యెను. ఆతడే భగవంతుడు, సర్వలోక పితామహుడైన బ్రహ్మ.

ఉత్తమము, మనోహరము నైన తన శరీరమును జూచుకొని బ్రహ్మ త్రికాలామల దర్శనుడై ఇట్లు తలపోసెను: 'పరమాకాశము చిన్మయైకాత్మ రూపము కలది. ఆద్యంత రహితమైనది. ప్రప్రథమముగ దీనియందు నావిర్భవించినదేది?' అని సద్యోజాతుడు, నిర్మలాత్మజ్ఞానసంపన్నుడు నగు నా చతురాననుడిట్లు చింతించి, గతించిన అనంత భూతజాలము నంతను విలోకించుచు, సకల ధర్మ గుణ క్రమముల నన్నిటిని స్మరించుచు విలాసముగా, చిత్రములగు సంకల్పజములైన ప్రజను, నానాచార సమారంభమైనది యగు గంధర్వ నగరమును సృష్టించెను. ఆ ప్రజకు స్వర్గాపవర్గములకు, ధర్మార్థ కామ సిద్ధికిని ననంతములు, విచిత్రములు నగు శాస్త్రములను కల్పించెను.

శ్రీరామచంద్రా! ఈవిధముగ నీ సృష్టి విరించి రూపమును ధరించిన మనస్సు నుండి మధు మాసమున పుష్ప సంపదవలె నీ

స్వర్గము నందు స్థితిని పొందెను” అని చెప్పి వశిష్ఠుడు మరియు నిట్లు వివరింప నారంభించెను : “ఈ దేవాసుర, నరామరాదు లందరును స్వసంకల్ప మాత్రమున సృజింపబడిరి. నిజ సంకల్పోపశమనమున స్నేహ హీన దీపకళికవలె వారందరు నశించుచున్నారు. కల్పనా మాత్రమున విస్తరించిన ఈ సమస్తమును ఆకాశ సదృశమైనది. ఈ జగత్తును సుదీర్ఘ స్వప్నముగ భావింపుము. ఇచట జన్మించు నదియు, మరణించునదియు నేదియు, నెన్నడును లేదను పరమార్థ దృష్టి కలిగి యంతయు మిథ్య యని భావింపుము. ఆశా భుజంగ సముదాయమున కాకర మగు నీ సంసారాడంబరమును విడువుము. ఇది యంతయు నసత్య మని భావించి, భావమును దీనియందు జొరనీయకుము. గంధర్వ నగరమును భూషించినను, దూషించినను ప్రయోజనము లేదు. అవిద్యాంశ సంభూతులగు సుతాదులచే సుఖ దుఃఖాదు లేవియు నుండవు. ధన దారాది సంపదల యభివృద్ధి దుఃఖ దాయకముగాని సుఖప్రదము గాదు. మాయా మోహము వృద్ధి పొందగా ఎవనికి శాంతి లభించును ? భోగము లభివృద్ధి జెందుట వలన మూర్ఖున కనురాగమును, ప్రాజ్ఞునకు విరాగము కలుగును. కాన, రాఘవా! తత్త్వజ్ఞుడవై సకల వ్యవహారములందు వ్యవహరింపుము. నష్టమును నష్టమైనదిగనే యుపేక్షించి, ప్రాప్యమును మాత్రము ప్రాప్తముగా గ్రహింపుము. అనాగతము లైన భోగముల కాశింపక, ఆగతములగు భోగముల ననుభవించుట పండిత లక్షణము. సకలవస్తు సంతతుల విషయమున ‘ నిది నా కుండవలయును ’ అను భావము లేక, ప్రవర్తించు సర్వజ్ఞుని అసత్య మగు నవిద్య యావరింపదు. సత్, అసత్‌ల మధ్య నుండు పరిశుద్ధమైన తత్త్వమును బుద్ధితో గ్రహించి బాహ్యాభ్యంతరముల దృశ్యమును గ్రహింపక, విడువక యుపేక్షించి యుండుము. ఇష్టాయిష్టములు లేక గర్మాచరణమాత్రుడై యున్నవాని మనస్సు తామరాకుపై నీటివలె నంటక యుండును. అనగా నతనికి హర్ష విషాదముల ఫల మనుభవించుట యుండదు. రాఘవ ! హృదయమునందు

నింద్రియార్థము లందున్న శోభ నీకు రుచింపక పోయినచో జ్ఞాతము నెరిగినవాడవై భవార్ణము నుత్తరింతువు. పరమగు ప్రజ్ఞా కైవల్య ప్రాప్తికై పుష్పము నుండి పరిమళము విధమున మనస్సును వాసనల నుండి వేరుజేయుము. వాసనా జల పరిపూర్ణమైన ఈ సంసార సాగరము నందు, ప్రజ్ఞానావ నధిరోహించువారు మాత్రమే పారము జేరుకొనుచున్నారు. దుఃఖితులు మాత్రము తరింప జాలరు. సంసార పారావార పార మెరిగినవారు అనగా తత్త్వజ్ఞాన సంపన్నులు జగత్సంబంధమైన వ్యవహారమును విడువరు. కాని, దానిని వాంఛింపరు. సమస్తము ననుసరించుచు వర్తింతురు. వారు శూన్యమున ఖేద పడరు. నందనోద్యాన విహారములకు పరమానంద సంభరితులు కారు. ఇట్టి మహాత్ములహంకారునివలె తమ నియమముల నధిగమింపరు, అని వాల్మీకి మహాముని భరద్వాజున కెరిగించె"నని వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు వివరించెను.

నిర్మలాశయుడైన వశిష్ఠ మహర్షియొక్క మృదు మధురము లైన వాక్కులను విని, శ్రీరాముడు వినయ వినమితుడై, జ్ఞానామృతప్రకాశమానాంతరంగము కలవాడై, పూర్ణచంద్ర సదృశశీతలహృదయము కలవాడై యిట్లనెను: "మహాత్మా! ఈ సృష్టి యొకే విధముగ నుండునో, బహువిధములుగా నుండునో వివరింపుము, దాని నెరిగినచో మాయా స్వరూపము పరిస్ఫుటముగా బోధపడునుకదా!" అన, వశిష్ఠు డిట్లు చెప్ప నారంభించెను:

"శ్రీరామచంద్రా! ఈ సృష్టి ఎల్లప్పుడు నొకే విధముగా నుండదు. ఒకప్పుడు శర్వునిచే సృజింప బడ, మరియొకప్పుడు బ్రహ్మదేవునిచే సృజింప బడును. ఇంకొకప్పుడు శ్రీమహావిష్ణువుచే సృజింపబడ, వేరొకప్పుడు మునులచే సృజింపబడును. బ్రహ్మదేవు డొకప్పుడు 'పద్మజు' డనియు, నింకొకప్పుడు 'సలిలోద్భవు' డనియు వ్యవహరింపబడును. మరి యొకప్పుడు 'అండోద్భవు'నిగ, వేరొకప్పుడు 'అంబరోద్భవుడు' గ నుండును. ఈ సృష్టియు నొకప్పుడు సందు

లేకుండా దట్టముగా వృక్షములతో నిండి యుండును, మరి యొకప్పుడు మానవ సమూహాముతో నిండి యుండును. వేరొకప్పుడు పర్వత పరిపూర్ణమై యుండును. ఇంకొకప్పుడు ఈ భూమి మృద్రూపమునను, వేరొకప్పుడు శిలా రూపముగను, మరొకప్పుడు సువర్ణ రూపముగను, ఇంకొకప్పుడు మాంస రూపముగ నుండును. ఒకప్పటి సృష్టికి యాకాశము ప్రాధాన్యత వహించును. వేరొకప్పుడు భూమికి ప్రాధాన్యత యుండును. ఇంకొకప్పుడు జలము ప్రాధాన్యత వహించును. ఒకానొక కాలమున తేజస్సును, మరొక కాలమున వాయువును ప్రాధాన్యము వహించును. ఉదాహరణమునకై ఒక్క ప్రజాపతి సృష్టిని మాత్రమే వివరించితిని. ఈ జగదుత్పత్తికి నొక నియమ మను నది లేదు. మొదట కృత యుగము గతింపగా త్రేతా యుగము, మరల ద్వాపర యుగము, అనంతరము కలి యుగము నడచును. ఇటు లీ యుగములు ఒకదాని తరువాత నొకటి చొప్పున ఆవృత్త మగుచునే యుండును. ఈ జగన్మాయా స్వరూపము సుస్పష్టముగా తెలియుటకు దాశూరోపాఖ్యానమును జెప్పుదును.

## దాశూరోపాఖ్యానము

ఈ వసుధా పీఠమున విచిత్ర కుసుమద్రుమ విరాజితమై, శ్రీమంతమై ప్రసిద్ధి గాంచిన 'మాగధ' మను జనపదము కలదు. అయ్యది యనేక కదంబ వన విస్తారమై, విచిత్ర పక్షి గణ సంకులమై, మనోహరమై, యాశ్చర్యకరమై విరాజిల్లు చుండెను. కర్ణికార వ్యాప్తమై, కదళీ షండ మండితమై, నీప గుల్మ విరాజితమైన యొక గిరితటమున మహాతపస్సంపన్నుడు, ధర్మాత్ముడునగు 'దాశూరుడు' అను ముని నిష్ఠా గరిష్ఠుడై తప మాచరించు చుండెను. 'శరలోము' డని ప్రఖ్యాతి వహించిన అతని తండ్రి అపరబ్రహ్మదేవుని విధమున కుమారునితో గూడి యా పర్వతమునందే వసించు చుండెను. దేవ గురునకు కచుని పగిది నా శరలోమునకు దాశూరు

ద్రోక్రుడే కుమారుడు. ఇందువలన నతనితో నా వనమున కాలము గడపు చుండెను. శరలోము డనేక వేల యుగముల కాలము జీవించి గూటిని వీడిన పక్షివలె స్వశరీరమును వీడి స్వర్గ మలంకరించెను. దాశూరు డా వనమున నొంటరివాడై పితృవియోగ వ్యథ భరింప జాలక కురర పక్షి విధమున సకరుణముగ విలపించు చుండెను.

మాతా పితృ వియోగ సంజనిత శోక సంతాపితాశయుడై హేమంత మందలి పంకజము విధమున నా దాశూరుడు కృంగి, కృశించి పోవుచుండెను. దీనుడు, బాలుడు నని ఈతనిని ఆ వన మందలి వనదేవతలు అదృశ్య శరీరములతో నాశ్వాసించు చుండిరి. 'ఋషిపుత్రా! మహాప్రాజ్ఞ! ఏల అవివేకివలె దురపిల్లెదవు? ఈ సంసార స్వరూప స్వభావములను నీ వెరుంగవా? దీని స్థితి ఎల్లపుడు నీవిధముగనే చంచలమై యుండును. ప్రతి జీవియు జన్మించుచు, జీవించుచు ననంతరము తప్పక మరణించును. నీ తండ్రి మృత్యు డయ్యెనని వ్యర్థముగా దుఃఖింపకుము. ఉదయించిన సూర్యు డస్తంగతుడు కాకుండునా! అట్లే జన్మించినవానికి మరణ మవశ్యము కల్గును. కాన, నీవు దురపిల్లవలదు' అని యశరీరవాణి పలికిన పలుకులను విని, మేఘ గంభీర గర్జనము నాలించి ధైర్యము నందిన మయూరమువలె దాశూరుడు ధైర్యము వహించెను. తానున్న స్థానము నుండి లేచి, తండ్రికి జేయదగిన యవశ్యకరణీయములగు నుత్తర కర్మలను నెరవేర్చి, యుత్తమ స్థితి కొరకు దృఢ బుద్ధితో తప మాచరింప నిర్ణయించుకొనెను. వైదిక కర్మ పరాయణుడై యా యరణ్యమున తప మాచరించుచున్న నతనికి ననంత సంకల్పమయమైన శ్రోత్రియత్వము ప్రాప్తించెను. అజ్ఞాత జ్ఞేయ బుద్ధి కలవాడగుట వలనను, మంచి శ్రోత్రియత్వము కలవాడగుట చేతను, నతని చిత్తము పవిత్రమైన నీ ధరాతలమున సంతృప్తి జెందదాయెను. ఈ ధరాతలము నంతను నపవిత్ర మైనదిగా భావించి, యనేక ప్రదేశముల కేగెను. ఎచ్చటను ప్రశాంతి

నందజాలక పోయెను. వృక్షాగ్రమును పవిత్రమైనదిగా భావించి, యది తనకు వాసయోగ్యముగా స్వీకరించెను. పక్షివలె వృక్షశాఖల యందును, ఆకులమాటునను వసించుచు ఘోరతపము జేయుదు గాక ! యని తలంచెను. అగ్నిని ప్రజ్జ్వలింపజేసి, అందు నిజ భుజ స్కంధముల నుండి మాంసమును గోసి వేల్వదొడగెను. మదీయ ముఖమున సమర్పించిన ఈ బ్రాహ్మణ మాంసము మూలమున గీర్వాణబృందగళభిత్తికలు భస్మము కాకుండుగాక ! అని భావించిన యా యగ్నిభట్టారకుడు దప్తాంశుడగు వాక్పతి ప్రత్యక్ష మైన విధమున దశదిశల తన కాంతులను వెలుగొంద జేయుచు, దాశూరుని యెదుట నిలచెను. 'ఓ విప్రకుమారా ! క్రోశమందుంచిన మణివలె అభిమతవర మర్థింపుము' అనెను ఇట్లు పలుకుచున్న అగ్ని హోతుని స్తుతి వాదముతో విప్రకుమారుడు పూజించి, 'భూత కోటిచే బరిపూర్ణమైన నీ భూమండలమున, పవిత్ర ప్రదేశమే లభించుటలేదు. కాన, వృక్షాగ్రమున నా కావాసము లభించుగాక !' అని యర్థించెను. సర్వదేవతాముఖుడైన ఆ యగ్ని 'తథాస్తు' అని పలికి యంతర్హితు డయ్యెను.

అగ్నిభట్టారకు డంతర్థానము నందినంతనే, ఆ మరుక్షణమున కానన మధ్యస్థమై, మేఘమండల సంస్పర్శమానమై రోదసీస్తంభ ముగానున్న కదంబవృక్షము నధిరోహించి ఆకాశము వైపుగానున్న కొమ్మకుగల చిగురుటాకున ప్రవేశించెను. అచ్చట నిర్విశంకుడై ఏకాగ్రమున తప మారంభించెను.

ఒకమా రతడు మృదుపల్లవమున నుపవిష్టుడై కౌతుక లీలతో క్షణకాలము నలుగడల నవలోకించెను, నదులు ముక్తాహారములుగ పర్వతరాజములు స్తనములుగ, నిర్మలాకాశము కబరీబంధముగా, విలోల నీలాంబుదములు ముంగురులుగ భూమండల మొక సుందర తరుణిగా భాసించినది. క్షణకాల మావిధముగ నా దృశ్యము నవలో కించి దృఢపద్మాసనాసీనుడై తన మనస్సు నా దృశ్యమునుండి

మరలించి, అజ్ఞాత పరమార్థముతో క్రియామాత్రనిష్ఠుడై ఫల లోభావిష్టమైన మనస్సుతో యజ్ఞము నాచరించెను. పది సంవత్సరము లీవిధముగ సురలనుద్దేశించి మానసయాగము నాచరించెను. గోమేధ, అశ్వమేధ, నరమేధాదులు మానసికముగ జేసెను. ఇట్లు మానసిక యజ్ఞాచరణమున కాలక్రమమున చిత్తము నిర్మల మయ్యెను. ఆత్మ తత్త్వసకాశమగు జ్ఞానోదయ మయ్యెను. వాసనల యావరణము నశించి నిర్మలు డయ్యెను.

కొంతకాల మిట్లు కాలము గడుపగా, నొకనాడు ఆ చిగురుటాకున కెదురుగ విశాల లోచనయు, విశాల వదనయు నగు వనదేవత ప్రత్యక్ష మయ్యెను. "ఉత్పలపత్రాక్షీ ! నీ వెవ్వరవు ?" అని దాశూరుడు ప్రశ్నించెను. ఆమె ముగ్ధమందాక్షరములతో నా మునికిట్లు సమాధాన మిచ్చెను: 'మహాత్ములను యాచించినచో దుర్లభములగు వాంఛితములు సైతము నీ భూలోకమున ప్రాప్తించును కదా ! ఈ దుర్మాకీర్ణలతాలీలాలయవన మందలి వనదేవతను. చైత్రశుద్ధ త్రయోదశినాడు నందన వనమున వనదేవతల మదనోత్సవము జరిగినది. ముల్లోకములలోని వనదేవతలు నా యుత్సవమున కాహ్వానింపబడిరి. నేను నచ్చటకు వెడలితిని. ఆ యుత్సవమునకు నా చెలికత్తె లందరును తమ తమ కుమారులను వెంట నిడుకొని వచ్చిరి. పుత్రులు లేని నాకు వారిని జూడగా దుఃఖము పొరలి పొరలి వచ్చినది. అర్థిజనకల్పవృక్షమవైన నీ వుండగా ననాథవలె పుత్రులు లేని నేను దుఃఖించు టేల ? మహాత్మా ! నాకు పుత్ర దానము జేయుము. అట్లుగానిచో నీ పుత్ర దాహోప శాంతికై యిచట నా దేహమును అగ్నికాహుతి యొనర్తును' అని యర్థించెను. ఆమె వచనములకు దాశూరుడు, మందస్మితవదనారవిందుడు, దయాంతరంగుడునై తన చేతి యందున్న పుష్పము నామె కొసగెను. "సుందరాంగీ ! లత, లతాంతము విధమున నొక మాసములో మనోహరమైన పుత్రుని బడయు గలవు. కాని, మరణావేశోపాయునివై పుత్రుని

యాచించితివి కాన, నాత డతి కష్టమున జ్ఞానవంతు డగును' అనెను. ప్రసన్నముఖ మండల యగు నామె, 'పరిచర్య చేయు దాన,' నని ప్రార్థించినను మన్నింపక పంపివైచెను. ఆమె తన గృహమున కేగినంత దాశూరుడు స్వధర్మకర్మపరాయణు డయ్యెను. ఇట్లు కొన్ని ఋతువులు అయనములు వత్సరములు గతించెను.

ఒకనాడు వనదేవత ద్వాదశవర్షప్రాయుడగు పుత్రుని వెంటనిడుకొని, దాశూరుని యంతికమున కరుదెంచెను. ఆ యిందువదన ఆ మహామునికి వందన మాచరించి, మృదుమధుర వాక్కులతో నిట్లనెను: 'స్వామీ! ఇతడు తమ దయాకుమారుడు. ఇతనిని సకలకళావిశారదుని జేసితిని కాని, జ్ఞానము మాత్రము లభింపలేదు. అందుచే సంసార యంత్రమున వివశుడై బాధ నందుచున్నాడు. నీ వితనిని కరుణించి జ్ఞానోపదేశము జేయవలసినదిగా నర్థించుచున్నాను' అని పలుకుచున్న యా వన దేవతను జూచి, 'ఈ కుమారు నిట విడచి నీవు పొమ్ము' అని యామెను సాగనంపెను.

ఆమె వెడలిపోయిన తరువాత సూర్యదేవున కరుణునివలె నా కుమారుడు తండ్రికి అంతేవాసియై యుండెను. దాశూరుడు చిత్రవిచిత్రములైన మాటలచేతను, స్వకపోలకల్పిత కథలు గాథల చేతను, దృష్టాంతముల తోడను, ఇతిహాసముల మూలముననను, వేదవేదాంత వినిర్ణయముల వలనను యథాక్రమమున పుత్రుని శిక్షితు జేసెను'' అని వశిష్ఠ మహర్షి వివరించి మరల నిట్లనెను:

''ఒకప్పుడు నేను కైలాస పర్వతమునందుగల నది యందు స్నానము జేయవలయునను తలంపుతో సప్తర్షి మండలము నుండి బయలు వెడలి యాకాశ మార్గమున బోవుచు రాత్రి సమయమునకు దాశూరు డున్న వృక్షమును జేరితిని. ఆ సమయమున దాశూరుడు తన కుమారునకు జెప్పిన ఈ కథను నీకు యథాతథముగ విన్పించు

చున్నాను, వినుము. ' కుమారా! ఆశ్చర్యకర మగు నొక కథను చెప్పుచున్నాను. భువనత్రయ విఖ్యాతుడు, మహా పరాక్రమవంతుడు నగు ' స్వోత్థితుడు ' అను నొక మహారాజు గలడు. చూడామణిని ధరించినట్లు లా మహీపతి యానతి నౌదల దాల్చుచుండిరి. స్వోత్థితుడు సాహసవంతుడే కాదు, నానాశ్చర్య విహారవంతుడు. ఆతని జయించువారు ముల్లోకములలో నెవ్వరును లేరు. సుఖ దుఃఖ ప్రదములైన యాతని కార్యారంభ సహస్రములు సముద్ర తరంగము లవలె నగణ్యములు. ఆతని పరాక్రమము శస్త్రాస్త్రముల మూలముననను, అగ్నులచేతను కూడ కుంఠితము కాదు. ఆతని కార్య సాధనములకు ఇంద్రోపేంద్ర శంకరులు కూడ జాలరు. అతనికి దిగ్భరణ సమర్థములైన సత్త్వరజస్తమోగుణాత్మకములగు నుత్తమ, మధ్యమ, అధమము లను మూడు శరీరములును జగత్తు నాక్రమించి యున్నవి. ఈ మూడు శరీరములును చిదాకాశమున బుట్టి అందే స్థితినంది, ఆకాశమున పక్షివలె, నందే లయ మగుచున్నవి. చతుర్దశ మహారథ్యలు కలిగి విభాగత్రయాలంకృతమై, కుల పర్వతములు క్రీడా శైలములుగను; సప్త సముద్రములు వాపీ కూపములుగను; శీతోష్ణ తేజో మూర్తులగు చంద్ర భాస్కరులు దీపములుగను ప్రకాశించు పట్టణము నిర్మితమైనది. ఆ పట్టణము నందు దేహ రూపములగు ననేకాంతర్గృహముల నా రాజు నిర్మించెను. ఊర్ధ్వముగ కొన్నిటిని, మధ్యకొన్నిటిని, అధఃప్రదేశమున గొన్నిటిని సృజించెను. శిరోజ రూపము లగు నల్లని తృణ వికేపము లచే గప్పబడి, శ్రోత్రాది నవద్వారములు కలిగి, నిరంతర వాయు సంచారము గల. నాసారంధ్రాది గవాక్షములతో విలసిల్లుచు, జ్ఞానేంద్రియాది దీప పంచకములతో వాత, పిత్త, కఫము లను మూడు స్తంభములు కలిగి, ఎముక లను శ్వేతదారు వినిర్మితమై, మాంస మృత్తికా పేశలమై, భుజాద్యవయవము లను వీధులు గల మాయాపరిపూర్ణము లా యంతర్గృహములు.

ఈ మహారాజ దృష్టి ప్రసార మాత్రముననే, భీతి జెందెడి యహంకారము అను మహాయక్షులు ఆ గృహ సంరక్షకులు. కులాయము లందు పక్షిగణమువలె నా స్వోత్థిత మహారాజు ఈ యంత్ర గృహములందు ననేకవిధములగు క్రీడలు సల్పుచుండును. త్రివిధ దేహ సంయుతుడగు నతడు యక్షులతో క్రీడించుచు, నచటినుండి మరియొక చోటునకు బోవును. కుమారా! చపలచిత్తుడగు నా రాజునకు, ఈ నగరము నుండి మరియొక నగరమునకు, అనగా భవిష్యజ్జన్మమునకు పోవలయును అను సంకల్పము కలిగినది. వెంటనే భూతావేశము కలవానివలె లేచి, పరువెత్తుచు గంధర్వ నగరమును పోలిన పట్టణమును జేరును. ఒకప్పుడు 'నాశనము నందును గాక!' యని సంకల్పించి నాశనము నందుచున్నాడు. సముద్రము తరంగములు సృజించిన విధమున జగత్తును సృజించుకొని, తన వ్యవహారమును తానే దూషించు కొనుచున్నాడు. 'నేను అజ్ఞానిని, ఏమి చేయుదును? దుఃఖితుడను' అని శోకించును. మరియొకప్పుడు సముదితాంగరంగుడై యుప్పొంగి పోవును. పుత్రా! మహామహిమా సంపన్నుడగు నా మహారాజు తాగుచు, నడచుచు, గంతులువైచుచు, జృంభించుచు, ప్రకాశవంతములైన రూపములను ధరించి ప్రకాశించుచు చంచలాత్ముడై సముద్రుని విధమున వెలుగొందు చుండెను" అని వశిష్ఠ మహర్షి వచించి మరియు నిట్లనెను: "శ్రీరామచంద్రా! ఆ జంబూ ద్వీపమున నర్ధ రాత్రమున, నా కదంబవృక్షపత్రస్థుడైన తండ్రిని పవిత్రాశయుడైన దాశూర పుత్రు డిట్లు ప్రశ్నించెను: 'జనకా! ఉత్తమాకృతికల స్వోత్థితు, డని విఖ్యాతి వహించిన ఈ రాజెవరు? ఆతని వృత్తాంతమును వివరముగా జెప్పు'మనన దాశూరు డిట్లు వివరించెను:

'పుత్రా! స్వోత్థితిని కూర్చి వివరించుచున్నాను, వినుము. దీనిమూలమున సంసారచక్ర స్థితి నెరుగగలవు. అసత్తునుండి

యుద్భవించిన ఆరంభము కలదియు, వస్తుమయము కాక యే వ్యాప్తమగునదియు. నగు నీ సంసార స్థితిని నీకు చెప్పితిని. పరమాకాశ సంజనితమైన సంకల్పమును 'స్వోత్థితు' డందురు. అతడు స్వయంభువుడై, స్వయం లయు డగుచున్నాడు ఈ పరిపూర్ణమైన జగమంతయు నాతని స్వరూపము. అతడు జన్మించినంత జగత్తు జన్మించును. అతడు లయింపగా జగము లయించును. బ్రహ్మ, విష్ణు, రుద్రేంద్రాదు లాతని యవయవములు. అతడు శూన్యాకాశమున త్రిజగము లను పురమును సృజించెను. ప్రతిభాసము ననుసంధానము జేయుట మాత్రము చేతనే బ్రహ్మత్వము నొంది చతర్దశ భువనములు, లోకాధిపులు, వనములు, నుపవనములు నుద్యానవనములు, క్రీడా పర్వతములు, సహ్య, మేరు, మందరాది పర్వతములు, శీతోష్ణ దీప్తులు కల చంద్రార్కులు దీపములుగ; చండావిలక్షతులగు సూర్యాంశుకము వలె చలించుచున్న నుత్తుంగ తరంగమౌక్తికములు కల సముద్రములు ప్రవహించుచున్నవి. మణులు, రత్నములు, తామరతూండ్లు కల ఇక్షు, క్షీరాదులును, బడబానల మను కమలములు కల సప్తసముద్రములును, దిగుడుబావులును కలిగి, ఈ త్రిలోక పురమున, నీ సంకల్ప మను మహారాజు ఆత్మ క్రీడార్థమై చిత్ర విచిత్రములగు దేహములు కల యంతర్గృహములను సృజించెను. దేవతా నామములు కల కొన్ని దేహములు ఊర్ధ్వ లోకముననుమనుష్య నామములు కల మరి కొన్ని దేహములు మధ్యమ లోకమునను, నాగ నామములు కల ఇంక కొన్ని దేహము లధో లోకమున నుంచబడినవి. ప్రాణ యంత్ర ప్రసారితములై మాంస మృత్తికామయములు, సితాస్థిదారు పూర్ణములు, మృదుచర్మ లేపములు, కేశములను. శ్యామలతృణాచ్ఛాదితములునై, కర్ణములు; నఖులు. నాసాదినవద్వార విలసితములై, కర్ణనాసాస్యతాల్వాది గవాక్ష గణాన్వితములై, భుజాద్యంగ సముదాయ విరాజితవీధులు కలవియై, పంచేంద్రియము లను దీపములు కలవియై ఆ మహారాజ నిర్మితములై మాయాపూర్ణములగు దేహములు వెలుగొందు చుండును.

లోకభీకరులగు నహంకారరూపులగు మహాయక్షులు ఈదేహము లను నా యంతర్గృహములను పాలించుచున్నారు. ఆ యక్షులతో నీగృహములయందా మహారాజు క్రీడించుచుండును. ఒక్క క్షణములో నారాజు అభ్యుదయమునందుచు, మరుక్షణమున తైలము లేని దీపము వలె క్షీణించిపోవుచున్నాడు. ఈ దేహ గేహము లందలి సంకల్పములు సముద్రతరంగములవలె క్షణకాలములో భవిష్యన్నగరమును నిర్మించి, మరుక్షణమున సంకల్ప రాహిత్యముచే దానిని నశింపజేయు చున్నాడు. ఒకప్పుడు సంకల్పము లనంతమైన ఆత్మదుఃఖమయ జగత్తును సృజించును. ఇది ఆనంద పదముకాదు ఆత్మ, అనాత్మలచే విస్తరించిన ఈ జగత్తు దుఃఖమును మాత్రమే వ్యాప్తి జేయును. ఇది అసద్రూపమైనందున నతడు భాస్కరుడంధకారమును దూరము జేసిన విధమున నంతమొందించుచున్నాడు. దుఃఖప్రదమగు తన కృత్యము వలన శోకించుచున్నాడు. సంకల్పితానంద లవమున సంతోషించుచున్నాడు. ఆ సంకల్పిత పురుషునకు మూడు దేహ ములు మాత్రము కలవు. అవి అధమ, మధ్యమ, ఉత్తమము లనునవి. అవియే తమస్సత్వరజస్సు లనునవి. ఈ జగత్తు యొక్క స్థితికిని కారణములు తమోరూప సంకల్పము నిత్యము నవివేక కృత్యము లకు దైన్యమునంది, క్రిమి కీటాది రూపముల నెత్తుచున్నది. సాత్విక సంకల్పము ధర్మజ్ఞాన పరాయణమై కైవల్య సామీప్యవర్తియై సామ్రాజ్యమందున్నదాని విధమున వెలుగుచున్నది. రాజస సంకల్పము లోకవ్యవహారముల నెరిగినదియై సంసారమున దారా పుత్రాను రంజితమై ప్రవర్తించుచున్నది.

శ్రీరామచంద్రా ! ఈవిధములగు రూపములను పరిత్యజించి, సంకల్పము రూపరాహిత్యమునొంది, పరమపదమును పొందుచున్నది. కాన, నీవు నీ మనస్సుతో మనస్సును నిగ్రహించి, సమస్త వాసనలను పరిత్యజించి, బాహ్యాభ్యంతరములయందు సంకల్పత్యాగ మొనరింపుము. పాతాళమున గాని, భూలోకమున గాని,

స్వర్గమునగాని, వేల సంవత్సరములు ఘోరముగ తప మాచరించుట కంటె సంకల్పక్షయ మొనరించుట యుత్తమోపాయము. ఇంతకంటె మోక్షోపాయ మింకొకటిలేదు. బాధారహితముగా, నిర్వికార ముగా, సుఖముగా, పరమపవిత్రమైన సంకల్ప క్షయమునకై పురుషకారముతో ప్రబల ప్రయత్న మొనరింపుము. సమస్త భావములు సంకల్పమునందే సమకూర్పబడినవి. ఆ తంతు విచ్ఛేదమైనంతనే వాసనా రూపములగు భావనలు తమంతతాము రాలిపోవుచున్నవి. కాబట్టి సంకల్ప రహితుడవై యథా ప్రాప్తంబులగు వ్యవహార ముల నాచరింపుము. సంకల్ప క్షయము కాగా, చిదచిత్యో న్ముఖము నందుచున్నావు. పరమార్థము నవగత మొనరించుకొనిన వాడవై సంకల్ప జాలమును పరిత్యజించి, సుషుప్తి యందలి చిత్తవృత్తి నవలంబించి, అత్యంతానందము కొరకు నద్వితీయ మైన పదవిని పొందుము' అని తండ్రి యగు దాశూరుడు వచింపగా, పుత్రు డిట్లనెను : 'తండ్రీ! సంకల్ప మనగానేమి? అది ఎట్లు పుట్టుచున్నది. ఏవిధముగా వృద్ధి నందుచున్నది? అది నశించు నుపాయ మేది? అని అన దాశూరు డిట్లనెను. 'అనంత మగు సత్తామాత్రస్వరూపమైన ఆత్మతత్త్వమగు చిత్తు ఉన్ముఖ మగుచో సంకల్పాంకురము అని పండితులు ప్రవచించిరి. ఇది ప్రారంభమున లేశమాత్రముగ నుండి క్రమక్రమముగ నభివృద్ధి చెంది, మేఘమువలె సర్వత్రి వ్యాప్తమై జడానుభవము కొరకు దృఢమైన చిత్తత్వమును పొంది, ఘనీభావము చెందుచున్నది. ఆత్మచైతన్యము దృశ్యమును తనకంటె వేరైన దానినిగ భావించునట్లు, బీజము అంకురరూపము ధరించిన విధమున సంకల్ప రూపమును పొందును. ఈ సంకల్పమాత్రమున భ్రాంతి రూప మును ధరించుచున్నది. కాని, అది యథార్థము కాదు. సంకల్ప మనగా కల్పింపబడినది అని యర్థము. ఇది నైజముగానే జనించును. స్వయముగ నభివృద్ధి చెందును. ఇదియు దుఃఖదాయకమే గాని,

సుఖప్రదము మాత్రము కాదు. సంకల్పము నెన్నడును కల్పించు కొనకుము. జగత్తు యొక్క యీ స్థితియందు భావము జొరనీయకుము. ఇట్టి భావముతోను నున్నచో మోక్షప్రాప్తికి యోగ్యుడ వయ్యెదవు. సంకల్ప లయమున కధికముగా ప్రయత్నింప నవసరములేదు. దీనిని భావింప కున్నచో స్వయముగ నశించును. సుమనః కుసుమమును మర్దించుటకు కొంతప్రయత్నము కావలయును. కాని, సంకల్ప నాశమున కంతమాత్రము ప్రయత్నము కూడ నవసరములేదు. మునిపుత్రా ! సంకల్పముచే సంకల్పమును, మనస్సుచే మనస్సును ఛేదించి స్వాత్మనిష్ఠుడవు కమ్ము. ఈమాత్రపు గార్యమునకు కష్టమేమి ? ఈ యాకాశము శూన్యముగ నుండు విధమున జగత్తుకూడ శూన్యము. ఈ రెండును అసన్మయములై కల్పించుట వలన కలిగినవి కాన శూన్యములు. బియ్యమునకు తవుడు, రాగికి చిలుమును ప్రయత్నపూర్వకముగ నశింపజేయు విధమున పురుషుని అజ్ఞాన మూలకమగు మలమును గూడ యత్నమాత్రమున నశింపజేయ వలయును. బియ్యమునకు తవుడువలె జీవునకు మలము అనగా అజ్ఞానము సహజము. అయినను అదినశించు ననుటలో సందేహాము లేదు. కాన నీవు ఉద్యమవంతుడవు కమ్ము. ఈ మహత్తర సంపద్విలాసములు నావి అను వ్యర్థమగు భ్రాంతిని జెందకము. విస్తారములగు నా విలాసములు, సంపదలు, నీవు, ఈ దృశ్యమాన సమస్త జగత్తు కూడ చిద్రూపమగు నాత్మతత్త్వమనియు, వేరు పదార్థము కాదనియు భావింపుము" అని చెప్పి మరియు వశిష్ఠ మహర్షి ఇట్లనెను : "ఆ దాశూరుని, నాతని పుత్రుని యాలాపము నక్కడ నా రాత్రి విని, ఫల పుష్ప శోభితమైన యా కదంబాగ్రమునకు బోయితిని. నన్ను జూచిన దాశూరుడు అర్ఘ్యపాద్యాద సపర్య లొనరించెను. అనంతర మొక విస్తీర్ణపత్రమున నుపవిష్టు జేసి పూజించెను. మా యిరువురకు చిత్రవిచిత్ర కథాలాపములు ప్రవర్తిల్లినవి. ఇతరములగు సంభాషణములు జరిగినవి.

ఆ రాత్రి యొక ముహూర్త మాత్రముగ గతించినది. అంత నుదయమగుట తోడనే దాశూరునికడ సెలవుగైకొని దేవనదికి పయనమైతిని. శ్రీరామచంద్రా ! దాశూరోపాఖ్యానమును నీకు వివరించితిని. ' ఈ జగత్తు ఇట్టిదియే యని భావింతువుగాక !

## ఉపదేశోపాఖ్యానము

శ్రీరామచంద్రా ! దాశూరోపాఖ్యానమున జగత్తుయొక్క స్థితి మాయా ప్రధానమని నిరూపితమైనది. ఇప్పుడీ స్థితి ప్రకరణ తాత్పర్యమును సంగ్రహముగ నభివర్ణించుచున్నాను.

అనంతమగు నీ కాలమున గత సంవత్సరము లన బహు స్వల్పమగు భాగము. ఈ స్వల్పమగు నాయుఃప్రమాణ విషయమున నాసక్తిని జూపువా డెవడు ? అంతరంగము నుండి భావనామయమగు నాసక్తిని పరిత్యాగ మొనరించి, ఈ జగత్తుసం దనంత రూపముతో విలాసముగ విహరింపుము. రత్నము ఇచ్ఛారహితముగ ప్రకాశించు విధమున సత్తామాత్రమునం దీ జగద్గుణము ప్రవర్తించుచున్నది. కాన, ఆత్మ యందు కర్తృత్వ, అకర్తృత్వములు రెండును కలవు. ఇచ్ఛా రాహిత్యము వలన నకర్తృత్వమును సాన్నిధ్య మాత్రమున కర్తృత్వము నేర్పడుచున్నది. కర్తృత్వాకర్తృత్వములు రెండును నాత్మయందే యున్నవి. వీనిలో నీకు చమత్కారముగ దోచిన దాని నాశ్రయించి స్థిరమతివై యుండుము. ' నేను దేనికి కర్తనుగాను,' అను దృఢ భావమున ప్రవాహ పతిత కర్మ చేయుచున్నను బద్ధుడు కాడు. తన చిత్తము సంకల్ప రహితమైన దగుటవలన విషయ వాసనల యందు నీరసత్వము నందుచున్నది. కాన, ' నేను కర్తనుగాను,' అను భావనను నిత్యము భావించుట వలన పరమామృత మను సమత్వ మవశిష్ట మగుచున్నది. ' ఈ సమస్తమును నేను జేయుచున్నాను,' అను మహాకర్తృత్వమును

వాంఛించుచుంటివేని నా స్థితియు నుత్తమమైనదానిగనే భావింపుము. ఏల ననగా, 'జగత్సంబంధమైన ఈ సమస్తమును నేనే చేయుచున్నాను. అను భ్రాంతి, తనకంటె నితరు డెవడును లేడను భావనతో గూడిన నగుట రాగద్వేషాదులు సంభవింపవు ఈ శరీరము పరులగు తల్లిదండ్రులచే లాలింపబడినది పుత్రాదు లగు నితరులచే దహింప జేయబడుచున్నది. ఈవిధమగు జన్మ వృద్ధి క్షయ రూపమగు శరీరము కర్మ విపాకమున సంభవించినది. దీనికై ఖేదోల్లాసముల ప్రమేయ మెందులకు ? నా సుఖాసుఖ విస్తారములు కల జగజ్జాల క్షయోదయము లందు ' నేనే కర్తను ' అని తలచు నప్పుడు ఖేదోల్లాసముల ప్రమేయ మెందులకు ? ఖేదోల్లాసములం దాత్మ కర్తృత్వభావనచే స్వసంకల్పము లయింపగా, సమత్వమే యవశిష్ట మగుచున్నది. సర్వపదార్థములయందు సమత్వభావము కలిగి యుండుటను సత్యమగు 'పరాస్థితి,' అనబడును. అట్టి సమభావ స్థితియందున్న చిత్తము తిరిగి జన్మదుఃఖము ననుభవింపదు. అనగా జన్మరాహిత్యము నందును.

శ్రీరామచంద్రా ! అట్లుగాక, సర్వకర్తృత్వమును, అకర్తృత్వమును సర్వమును విడచి, మనోలయ మొందినపు డుండెడి స్థితిని పొందినవాడవై స్థిరముగా నుండుము. 'నేను ఇటువంటి వాడను, అటువంటివాడను కాను. ఈ కార్యమును జేయు చున్నాను. ఈ కార్యము నాచరించుటలేదు ' అను భావాను సంధానముతోగూడిన దృష్టి, తుష్టిని కలుగజేయదు. 'ఈ దేశమే నేను' అను స్థితి కాలసూత్రము, మహోతరంగ సముదాయము. అది అసిపత్రవనశ్రేణి. ఏవిధముగనైన నట్టి భావనను పరిత్యాగ మొనరింప వలయును. అది సర్వవిధముల వినాశహేతువు. ఇది శ్వాన మాంస ధారిణియగు చండాలవనిత వంటిది. కాన స్పృశ్యముగాదు. దృష్టిపటల రోగమువంటిదగు నీ దేహాత్మబుద్ధి నశింప, మబ్బు విడువడ ప్రకాశించు వెన్నెలవలె సంసారసాగరము నుత్తరించుటకు సమర్థ

వంతమగు జ్ఞానదృష్టి యుత్పన్నమగును. 'నేను కర్తనుగాను, ఈ దేహమును నేనుగాను,' అని అంతరంగమున స్ఫుటముగా భావించి, 'నేనే కర్తను, ఈ సమస్తమును నేనే,' అను దృఢ నిశ్చయము కలిగి, 'నాకు మించి మరియొకడు లేడు,' అని సర్వోత్తమ పదార్థమునందు భావమును నిర్ణయించుకొని, పదవిదులగువారు ఉత్తమసాధువులై యుండెడి ఆత్మపదమున స్థిరుడవై యుండుము." అని వశిష్ఠ మహర్షి వచించి మరియు నిట్లు చెప్ప నారంభించెను. "వాసనలు చుట్టుముట్టి యుండుట బంధము. ఆ వాసనలు క్షయించుట బంధమోక్షము. వాసనలను పరిత్యజించి, మోక్ష సంబంధమగు వాంఛను సైతము వీడుము. మున్ముందుగ మానసికములైన విషయ వాసనలను త్యజించి, యటుతరువాత మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష అను వాసనలను గ్రహింపుము. ఈ మైత్ర్యాదివాసనా సహితుడవయ్యు, నంతరంగమున వానినిగూడ విడచి యంతశ్శాంతతను పొంది, చిన్మాత్రవాసనా సహితుడవై యుండుము. మనో బుద్ధులతోగూడి, దానినిగూడ విసర్జించి, మిగిలినదానియందు అనగా చిదాత్మయందు స్థిరసమాధినిష్ఠుడవై యుండుము. చిన్మనము, కలనాకారము, ప్రకాశతిమిరాదికము, వాసనయు, వాసన కలదియు, ప్రాణస్పందనపూర్వకమైనదియునై యుండును. దీనిని సమూలముగ పరిత్యజించి, ఆకాశసామ్యుడవై, ప్రశాంత చిత్తుడవై యథార్థమగు బ్రహ్మస్వరూపుడ వగుదువుగాక! మహామతీ! హృదయమునుండి సర్వమును పరిత్యజించి, నిశ్చల చిత్తుడవై యున్నచో ముక్తినందగలవు. అదియే పరమేశ్వరత్వ మనబడును. హృదయమునుండి సమస్తకోరికలను విడచినవాడు సమాధినిష్ఠుడైనను కాకపోయినను, కర్మాచరణుడైనను కాకపోయినను నుత్తమాశయుడై ముక్తినందును. నైష్కర్మ్య ముచేగాని, కర్మాచరణముచేగాని, సమాధి జప తపాదులచేగాని వాసనా రహితునకు ప్రయోజనము లేదు.

శ్రీరామచంద్రా ! ఎన్నియో శాస్త్రములను విలోకించితిని. చాలకాల మేకాగ్రబుద్ధితో నాలోచించితిని. సకల వాసనా రహిత మగు మౌనము కంటె మించిన యుత్తమ పద మింకొకటి గోచరింప లేదు. దశదిశలు, ఆకాశము నంతయు నింకను జూడ దగిన దాని నంతయు దిరిగి తిరిగి దర్శించితిని. జ్ఞానవంతు లక్కడక్కడ దర్శన మొసంగిరి. కాని, వార లెక్కువమంది లేరు. ప్రజల క్రియా కర్మములు, సమారంభములు నన్నియు శరీర పోషణార్థమునకే గాని, మోక్షప్రాప్తి కెంత మాత్రము నుపయోగింపవు. పాతాళమునందుగాని, భూతలమునందుగాని, స్వర్గమునందుగాని, నెచ్చటనైనను పంచభూతములే గాని ఆరవ భూత మెచటను లేదు ఇది యిట్లుండగా ధీర హృదయ మెచ్చటకు బోగోరును? యుక్తి, ప్రయుక్తులతో జరించు వానికి నీ సంసార సాగరము గోష్పాదము వంటిది. అనగా, పరబ్రహ్మ భావనా రూప మహాయోగముతో వ్యవహరించు వానికి సంసారమును తరించుట సులభము. ఈ యోగములేని వానికి మహార్ణవము వంటిది. కుగ్రామవాసిను లగు వనితలు, నాగరిక కాంతలకు బ్రియుడైన నాగరకుని అలరింపలేని విధమున నీ జగద్వికారము లగు వాసనలు తత్త్వజ్ఞానముకల వారికి ఆమోదప్రదములు కావు. విస్తార సముద్రము వంటిది యగు బ్రహ్మ పదార్థము, దానిలోని ఫీనము, కులాచలములు, మహాతేజోమయుడైన చిదాత్ముని, ఎండమావుల వలె భాసించును. ఈ సకల జగము లు చిద్విలాసములు అని భావము. శ్రీరామచంద్రా ! ఈవిషయమై గురుపుత్తు డగు కచునిచే గాన మొనర్పబడిన పవిత్రము లగు పూర్వజుల గాథలను చెప్పుచున్నాను, వినుము. ఒకనాడు కచుడు సమాధి నుండి లేచి సంతుష్టాంత రంగుడై యేకాంతమున గూరుచుండి గద్గద స్వరముతో నిట్లు పలికెను: 'ఇప్పుడు నే నేమి చేయవలయును ? ఎక్కడి కేగ వలయును ? దేనిని గ్రహింపవలయును ? దేనిని విడువవలయును ? మహా కల్పాంతమున నీ పృథివి నంతటిని జల మావరించిన విధమున

ఆత్మ నిండి యున్నది. బాహ్యాభ్యంతరముల యందు, దేహములోను, ఊర్ధ్వ భాగమున దిక్కుల యందు నిచట నచట ననేల, అంతటను ఆత్మ వ్యాపించి యున్నది అనాత్మయగున దేదియు లేదు. నేను లేని దేదియును లేదు. నా యందు లేని వస్తువును లేదు. నేను కోరు ప్రీతి వస్తువును చిదాభాసము కాని, తదన్యము కాదు" అని వశిష్ఠుడు ప్రవచించి మరియు నిట్లనెను: "రఘుకులతిలకా! ఆకాశమున చంద్రుని పగిది, మహాగుణ సంపన్నులు సత్త్వగుణ ప్రధానులై పుడమిపై జన్మింతురు. వారు నిత్యసంతోష పరిపూర్ణులై యుందురు. ఆపదల యందు, రాత్రి సమయమున కనక కమలము రీతి వారు దుఃఖము నందరు. ప్రకృతము కాని దానిని గూర్చి ఆలోచింపరు. శిష్టమార్గమునందు మాత్రమే రమింతురు. అతీంద్రమైన ఇందు సుందరి యగు శీతలత్వము, చంద్రుని విడువని విధమున నాపదలందు పరిపూర్ణత్వమును విజ్ఞానులు విడువరు. మైత్ర్యాది గుణములచే మనోహరమైన ఆకృతితో నవగా పుణ్యాత్ముల యందు మైత్రి, దుఃఖితులపట్ల కరుణ, సుఖవంతులయెడ ముదిత, పాపవంతుల విషయమున నుపేక్ష కలిగి రాగద్వేషాది గుణరహితులై సాధు వృత్తములు కలిగి సౌమ్యులై నిరంతరము సమరస భావము కలిగి విజ్ఞానవంతులు వెలయుదురు. విస్తరించిన యాశయములు కలవారలై సముద్రుని రీతి మర్యాదాతిక్రమణము జేయక వర్తించుచున్నారు. కాన, రాఘవా! వారికి బ్రహ్మపదవి యాపత్కరము గాదు. ఎల్లవేళల ననుగమింపవలయునే గాని, యాపత్సముద్రమున మునంగ రాదు. 'నే నెవ్వడను? ఈ సంసార మెట్లు వచ్చినది?' అని యత్నపూర్వముగ సాధువులగు విజ్ఞానులతో జర్చించి, అకర్మల యందు ప్రవేశింప దగదు. అనార్యులతో గూడి వసింప రాదు. సర్వసంహార కారిణి యగు మృత్యువు నవహేళన జేయ వలదు. అస్థి, మాంస, రక్తాదులతో నపవిత్రమైన శరీరమును

పరిత్యజించి, భూతము లను ముత్యములు దారమునందున్న విధమున నుండు చిన్మాత్రము నవలోకింప వలయును. ఆకాశమున భాస్కరుడు భాసించు విధమున ధరా వివర కోశస్థ మగు దానియందునిచిత్పదార్థము ప్రకాశించుచున్నది. సత్పురుషులు తామస, రాజస జాతులు గాని, తదన్య జాతులు గాని కలవారయ్యును, స్వప్రయత్నము వలన సాత్త్వికజాతిత్వమునే పొందుచున్నారు.

ఇది స్థితి ప్రకరణము

# ఉపశమ ప్రకరణము

'జగదుత్పత్తి, స్థితులకు మనస్సే కారణ'మని వెనుకటి స్థితి ప్రకరణమున నభివర్ణితమైనది. ప్రస్తుత మీ యుపశమ ప్రకరణమున మానసికోపశమనము వర్ణింపబడుచున్నది. ఈ విషయమును దృఢపరచుటకై 1 జనకోపాఖ్యానము. 2. పుణ్యపావనోపాఖ్యానము 3. బల్యుపాఖ్యానము 4. ప్రహ్లాదోపాఖ్యానము 5. గాధ్యుపాఖ్యానము. 6. ఉద్దాలకోపాఖ్యానము 7 సురఘూపాఖ్యానము 8. భాస విభాసోపాఖ్యానము 9. వీతహవ్యోపాఖ్యానము. 10. 'జీవన్ముక్తులకు ఆకాశగమనాదులులేవు; అను నుపాఖ్యానము' నను పది యుపాఖ్యానములు వివరింపబడుచున్నవి.

## 1. జనకోపాఖ్యానము

"శ్రీరామచంద్రా! దృఢములగు స్తంభములతో మంటపాదులు నిర్మింపబడిన విధమున, రజస్తమోగుణ ప్రధానులగు పురుషులచే సుదీర్ఘమగు మాయ సంసార రూపమున భరింపబడుచున్నది. సత్త్వగుణ ప్రధానులు, గుణవంతులు నగు నీవంటి ధీరులు సర్పము కుబుసమును విడచు విధముగా నీ మాయ నవలీలగా విడచుచున్నారు. విస్తృతమగు నీ జగత్తంతయు బ్రహ్మమయము. 'ఈ జగత్తు వేరు, నేను వేరు' అను భ్రాంతిని పరిత్యజింపుము. వ్యాప్తమై ఘనీభవించిన బ్రహ్మమునందు కల్పనలు సంభవింపవు. ఒకవేళ నెన్నడైన సంభవించినను అవి సముద్రమందలి తరంగముల వలె సద్రూపములు గావని తెలియుము. శోకముగాని, మోహము గాని, జన్మముగాని ఏదియు లేదు. చిన్మాత్రరూపంబగు బ్రహ్మము మాత్రము కలదు. కాన, శోక విరహితుడవు కమ్ము. నిర్ద్వంద్వుడవై, నిత్యసత్వస్థుడవై, అద్వితీయుడవై, వాసనా రహితుడవై

యుండుము. సర్వసముడవు, స్వస్థుడవు, స్థిరబుద్ధివి, శాంత మనస్కుడవునై శ్రేష్ఠమగు మణివలె స్వచ్ఛముగా నుండుము. ప్రాప్తించినదాని ననుభవింపుము. అప్రాప్తమును వాంఛింపకుము. త్యాగ, దాన, పరిగ్రహముల పట్ల సంతాప రహితుడ వగుము. చరమ జన్మమున నిర్మల విద్యలు ముత్యము ఉత్తమ వేణువును వలె నాశ్రయించును. ఆర్యత్వము, హృద్యత్వము, మిత్రత్వము, సౌమ్యత్వము, ముక్తత్వము, జ్ఞానిత్వము ననునవి విద్యలు కులకాంత లంతఃపుర ప్రవేశ మొనరించినట్టులు చరమజన్మ కల వాని నివి యాశ్రయించును. వనమృగములు వేణుగాన మాధుర్యము నభిలషించు విధమున మృద్వాచారసంవత్తి కల వానిని ప్రజ లందరు ప్రేమింతురు. సకలజీవ సాధారణమైన మోక్షక్రమము నుదహరించితిని. శ్రీరామచంద్రా! ఇపుడు మరియొక విశేషమును వివరించుచున్నాను, వినుము.

ఈ సంసారమున జన్మించిన దేహధారులకు రెండు విధములగు మోక్షమార్గములు కలవు. 1. గురు ప్రోక్తమై, యనుష్ఠాన వశమున మెలమెల్లగా ఈ జన్మమందుగాని, ఉత్తరజన్మలయందుగాని ప్రాప్తించునది 2, కించిత్ జ్ఞానము కలవానికైనను, తన యాత్మ యందు ఆకాశమునుండి ఫలము పతనమగు విధమున, జ్ఞాన ప్రాప్తి కలిగి మోక్షదాయక మగుచున్నది. ఈ రెండు మార్గములలో రెండవ పద్ధతిని నిరూపించెడి పురాతనమగు నొక వృత్తాంతమును వివరించుచున్నాను, సావధానుడవై యాలింపుము.

ఆపదల నధిగమించినవాడు, సర్వసంపద్విలసితుడు, ఉదార స్వభావుడు, విదేహ దేశముల కధిపతియు నగు 'జనకుడు' అను పరాక్రమవంతుడగు మహారాజు కలడు. ఆత డర్థిజనకల్పవృక్షము మిత్రపద్మ దివాకరుడు. అత డొకనాడు మధుమాసమున మదించిన కోయిలలచే ప్రకాశించు నుద్యానవనమునకు నందన వనమున కింద్రు డేగిన విధమున వెడలెను. నానావిధపుష్పశోభితమగునాయుద్యాన

వనమందు సంగరక్షకులను దూరముగ విడచి, జనకు డొంటరిగ నచటి పొదరిండ్లలో విహరించుచుండెను. అపు డొకతమాల వనగుల్మమునందుండి నిత్యము పర్వత గుహాలయందు సంచరించు వారును, నిర్జనప్రదేశ నివాసులు నగు సిద్ధులీ క్రింది విధముగ భాషించుటను ఆకర్ణించెను :

1. ద్రష్టకు దృశ్యసమాయోగము వలన ప్రత్యయానంద నిశ్చలాత్మ తత్త్వమునుండి వెలువడిన నిస్పందతత్త్వ స్వరూపుడవైన ని న్నుపాసించుచున్నాము.

2. ద్రష్ట, దర్శన, దృశ్యములను వాసనతోగూడ వీడి, దర్శన ప్రథమాభాసమైన యాత్మ నుపాసించుచున్నాము.

3. 'అస్తి, నాస్తి' అను నుభయ పక్షముల మధ్యగతుడై ప్రకాశమునకు ప్రకాశనమై నిత్యము భాసించువాని నుపాసించు చున్నాము.

4. సకార శిరస్కుడు అనగా అంతమందు 'స' కారముగల వాడును, 'హ' కారము ఆదియందు గలవాడును, అనగా 'హంస' మహామంత్రము నెల్లప్పుడు జపించు నాత్మ స్వరూపము నుపాసింతుము.

హృదయస్థు డగు పరమాత్మను విడచి, ఇతర దేవతలను సేవించువారు హస్తమందున్న కౌస్తుభమణిని వీడి, యన్య రత్నముల నభిలషించువారల విధముగా నున్నారు. ఆశల నన్నిటిని పరిత్యజించి ఆత్మోపాసనారూప ఫలము నభిలషించువాడు, ఆశలను విషలతలకు మూలమైన యజ్ఞానమును ఛేదించినవా డగును. దుర్మతి యగు వాడు ఆద్యంతములందుగల వైరస్యము నెరిగినవాడయ్యు, తిరిగి సంకల్పబద్ధుడగునేని అతడు గర్దభ సదృశుడుగాని తదన్యుడు కాడు. మాటిమాటికి తనలో నుద్భవించుచు, నశించుచు నుండెడి ఇంద్రియ శత్రువులను, వజ్రీత వజ్రాయుధనుతో పర్వత ఛేదన

మొనరించిన విధమున, వివేక మను దండముతో దండింపవలెను. హస్తమును హస్తముచేతను, దంతములను దంతములచేతను పీడించి. అంగముల నంగములతో నాక్రమించి, ముందుగ తన మనస్సును జయింప వలయును. మొదట పవిత్రమగు నుపశమ సుఖము నంద వలయును. అందుచే సాధుచేతస్కుడు శాంతిని పొందును. మనశ్శాంతి వలన నాత్మస్వరూపమున, చిరతరమగు నుత్తమ స్థితి కలుగును " అని వశిష్ఠుడు చెప్పి మరియు నిట్లనెను : " ఈవిధముగ నా సిద్ధగణములు పలుకుచుండగా, జనక మహారాజు విని రణ రవ శ్రవణమున భీతిల్లిన విధముగ విషాదము నందెను. అంత తన పరివారమును సంపూర్తిగా పరిత్యజించి, మృగేంద్రము పర్వతము నాశ్రయించిన పగిది నొంటరివాడై స్వయముగ నిజమందిరమున కరిగెను. అచట ప్రోద్భూయమానాలోల ఖగపతి చందమున లోకగతులను విలోకించుచు నాతురుడై విలపించెను.

## జనకవాక్యము

చంచలములగు ఈ లోక స్థితులు మిక్కిలి కష్టములు. వీటి యందు నేను మహా కఠినమైన పాషాణముల యందు పాషాణము వలె భ్రాంతి పూర్ణుడనై యుంటిని. అనంతమైన కాలములో నే నెన్నవ భాగమై జీవించుచున్నాను ! దీనియందు భావమును బంధించుచున్నాను. ఎంత బుద్ధి హీనుడను ! ఈ రాజ్య మనగా నెంత ? దీనివలన ప్రయోజనమేమి ? మతిహీనుడనై ఈ రాజ్యమున జీవితాంతము నాసక్తుడనై యుంటిని. అకృత్రిమము, నుదారము, రమ్యము నైన వస్తు వీ జగమున నేదియు లేదు. అట్టి దానిపై నా కేల నాసక్తి జనించినది ? మహాత్ముల శిర మలంకరించిన వస్తువు లయినను, కొలది దినములలో భూ పతనము లగుచున్నవి. ఆహా ! చిత్రమా ! ఇది ఈవిధముగ నుండ మహాత్తునందు నీకేమి విశ్వాసము ? ఆ మహీపాలుర ధనము లెక్కడ, బ్రహ్మదేవుని జగము లెక్కడ ? ప్రాకృతిక పదార్థము

లన్నియు నశించుచుండగా, నీయందు మాత్రము నమ్మక మేమి కలదు ? ఆ మహా సంపదలు, భోగములు, ఆ సజ్జనులు, సన్నిహిత సంబంధములు నన్నియు నశించును. ఈ వర్తమానము నందు నీ కేల ధైర్యము ? కోట్లకొలది బ్రహ్మలు గతించిరి. అనేక స్వర్గము లంతరించినవి. అసంఖ్యాకులగు భూపాలురు రేణువులవలె నెగిరిపోయిరి. ఇక నా జీవిత విషయమున నమ్మక మేమి ? దేహమయమగు నీ సంసారమను రాత్రి సమయమున దుస్స్వప్నమువంటి శూన్యభ్రాంతి యందు నా మనస్సు ఆసక్తి జెందుచున్నది. ఛీ ! ఈ పరిస్థితి నన్ను వీడిపోవుగాక ! ఇట్టి దినము లనేకములు వచ్చినవి, గతించిపోయినవి. అనశ్వరవస్తు సందర్శ నము జేయు దిన మిప్పటివరకు నొక్కటియు రాలేదు. నడుమ, యౌవన కాలమున, మనోహర దేహాదికము తుదను, పరిపక్వ కాలమున మనోహరమగు భూత ఫలాదికము, మొదట మాత్రము మనోహరమగు పుష్పాదికము—నివి యన్నియు నపవిత్రములు, నశ్వరములు నగుటవలన మనోహరములు కావు.

దినదినమును పాపాత్ములు, క్రూరాత్ములు నధికమగుట వలన మూఢజను లాదినమున కాదినము దుఃఖకరమైన యవస్థ లనుభవించుచున్నారు బాల్యమున నజ్ఞానోపహతులు, యౌవనమున వనితోపహతులు, వార్ధక్యమున కళత్రచింతోపహతులు నై ఈ మూఢులు బాధపడుచున్నారు. వారేమి చేయుటకై నను విరామ మెక్కడిది ? సత్పదార్థమునకు శిరస్సున నభావ మును, రమ్యవస్తు శిరమున నరమ్యత్వమును, సుఖము ల మూర్ధమున దుఃఖములు కలవు. ఇక నే నాశ్రయింపదగిన దేది ? తమ, నిమేషోన్మేషముల వలన జగత్తునకు ప్రళయోదయములు కలుగజేయు మహాపురుషులు కలరు. ఈ స్థితిలో మా బోంట్ల గణన మెక్కడ యుండును ? మహావిచిత్రములైన వీ సంపదలు, అవి యుండియు చిత్తసమ్మతములు కావు. అయ్యో ! మహా

రంభములు సైతము మహాపదలుగా పరిణమించుచున్నవి. ఆపదలు కూడ మహావిచిత్రములుగా నున్నవి. అవియు మనస్సునకు సమ్మతించుటలేదు. సంపద ననుభవించు సమయమున సంతోష ప్రదములుగనే యుండును. సకల దుఃఖములకు నీ సంసారమే సీమాంత మందురు. దానికి నడుమనున్నవానికి సుఖ మెట్లు లంభించును ? సహస్ర సంఖ్యలో నంకురములు, శాఖలు, ఫల, పల్లవములు గల నీ సంసార మహావృక్షమునకు మనస్సే మూల మగుచున్నది. ఆ మనస్సు సంకల్ప శీలమైనది. సంకల్ప నాశము వలన సంసార వృక్షము శుష్కించుచున్నది. ఆత్మను దోచుకొను చోరుడు 'మనస్సు' అని ఈనాడు కదా తెలుసుకొంటిని ! ఈ మనస్సు చిరకాలము నుండి నన్ను వేధించుచున్నది. ఇపుడు దానిని నేను వేధించుచున్నాను. ఈ మనోముక్తాఫల మింతవరకు విద్ధము కాలేదు. ఇపుడు విద్ధమై గుణగ్రహణ యోగ్యమైనది (ఇచట 'విద్ధము' అనగా మనస్సు పక్షమున సంస్కారమైన దనియు, ముత్యము పక్షమున బెజ్జము వేయబడిన దనియు తెలియ వలెను). పండితులు, సాధువులు, సిద్ధులు మున్నగువారు బాగుగ ప్రబోధింప, పరమానంద సాధకమైన పరమాత్మ ననుసరింతును. ఈ 'నేను' ఈ వ్యాప్తమైనది 'నాది' అను నభిమానమును బలాత్కారముగ హృదయ నుండి తొలగించి, మిక్కిలి బలవంతు డగు మనస్సు అను శత్రువును వధించి ప్రశాంతినందుదునుగాక ! వివేకమా ! నీకు నమస్కారము" అని వశిష్ఠుడు వివరించి మరియు నిట్లు వచింప నారంభించెను: "ఈవిధముగ జనకు డాలోచించి యూరకుండెను. చిత్తచాంచల్య మడగినవా డగుటవలన లిపి కర్మా ర్పితునివలె నుండెను.

జనజీవను డగు జనక మహారాజు చిరకాల మిట్లు నిశ్చేష్టితుడై యుండి, తిరిగి యొకనాడు తెలివిని పొంది, ప్రశాంత మనస్కుడై ఇట్లు తలపోసెను: 'ఈ ప్రపంచమున గ్రహింప దగిన వస్తు వే మున్నది ? యత్నపూర్వకముగ దేనిని సాధింప వలయును ?

పరిశుద్ధము, స్థిరత్వము గల చిత్తముగల నాకు సంకల్పము లేమి యుండును ? ప్రాప్తించని దానిని వాంఛించుట లేదు. ప్రాప్తించిన దానిని మాత్ర మనుభవించుచున్నాను. స్వచ్ఛమగు నాత్మ పదార్థమున వశింతును. జరుగవలసినది జరిగి తీరును కదా !" అని వశిష్ఠుడు మరియు నిట్లనెను : " జనక మహారాజట్లు ఆలోచించి యథాప్రాప్త క్రియాకరణశీలుడై పగటిని కలుగజేయు భాస్కరునివలె నిస్సంగుడై యుండెను. భవిష్యత్తును గూర్చి యాలోచింపడు. అతీతమును గూర్చి విచారింపడు. వర్తమానమును మాత్రము ఆనందముతో ననుసరించును. ఇట్లా జనక మహారాజు ఆత్మవిచారపరుడై, ప్రాప్తమును మాత్రమే యనుభవించు చుండెను. వేరొక దానిని వాంఛించుట లేదు. సుందరమగు తన బుద్ధిచేతను, సహచరివంటి ప్రజ్ఞతోడను పరమ పదమును పొందెను. తదన్యముచే మాత్రము కాదు. బాహ్యార్థ ప్రయోజనముల నార్జించుటకై ప్రజలు చేయు ప్రయత్నము ప్రజ్ఞాభివృద్ధికై మొదట యత్నింప వలయును. సర్వ దుఃఖములకు సీమాంతమైనది, ఆపదలకు మూలమైనది, సంసార వృక్షమునకు బీజమైనది యగు ప్రజ్ఞా మాంద్యమును నాశ మొనరింప వలయును. వివేకి హృత్కోశ మందున్న ఈ ప్రజ్ఞ చింతామణి వంటిది. కల్పలతవలె సర్వార్థ సిద్ధి ప్రదమైనది. వివేకవంతుడు, నసంమూఢుడు నగు ప్రాజ్ఞుడు, ఆశాభూతావేశము లగు దోషములు కవచధారిని బాణములు బాధింపని విధముగ నేమియు జేయ జాలవు. పరమాత్మ అను భాస్కరుని గప్పి, అసితమై వ్యాపించిన జడాత్మకమను నహంకారాంబుదము, ప్రజ్ఞావాతహతమై తొలగి పోవును. ఫలము నభిలషించు కర్షకుడు ముందుగ భూమిని దున్నునట్లు అసాధారణమగు బ్రహ్మ పదవిని పొందగోరువాడు ముందుగ మనస్సును లాలింపవలయును.

## 2. పుణ్యపావనోపాఖ్యానము

జనకోపాఖ్యానమున 'నాకాశము నుండి ఫల పతన రీతిని ఆకస్మికముగ సిద్ధ గీతాకర్ణనము వలనే జనకునకు జిత్తోపశాంతి కలిగిన'దని యభివర్ణింపబడినది. ప్రస్తుతము వ్యతీత జన్మ స్మరణంబు వలన నాత్మజ్ఞానము కలిగి అందుమూలమున చిత్తోపశాంతి కలుగునని వివరింప దలచి వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు పుణ్యపావనోపాఖ్యానము నీవిధముగ వచించెను :

"పరమాత్మ సందర్శనము వలన మోహబీజములకు ముష్టులును, వివిధాపదలకు ద్రష్టులు నగు కుదృష్టులు నశించును. నిత్యము నంతరంగమున నాత్మ విచారము జేయుచు నీ జగత్తు చంచల మని భాసించువానికి, కాలక్రమమున జనకునకువలె పరమాత్మ స్వరూపము స్వయముగా సుప్రసన్న మగును. భవభీతాత్ములకు స్వప్రయత్నమున కంటె వేరొక దైవముగాని, కర్మగాని, ధనము గాని, బంధువులు గాని లేరు. 'ఈ శరీరమే తాను' అను భావము నశింపగా, సకల భువన వ్యాపి యగు పరమాత్మ గోచరించును. ఉపదేశమును గ్రహించుట హేయి వస్తు పరిత్యాగము నను భావము మనస్సునకు బంధముగా నెరుంగుము. మరియేదియుగాదు. హేయ వస్తువులయందు ఖేదము, నుపాదేయము లందనాసక్తియు, హేయోపాదేయము లందు సమదృష్టియు కలవాడవై స్థిరత్వము నందుము.

సమద్రష్ట లక్షణము : నిరాశత్వము, నిర్భయత్వము, నిత్యత్వము, ప్రజ్ఞాత్వము, నిరీహత్వము, నిష్క్రియత్వము, సౌమ్యత్వము, నిర్వికల్పత్వము, ధృతి, మైత్రి, మనస్తుష్టి, మృదుత్వము, మృదు భాషిత్వము, హేయ, అపాదేయనిర్ముక్తత్వము లను నవి సమదృష్టికల జ్ఞానియందు వాసనా రహితంబుగ నుండును. చింతా తంతువులచే నల్లబడి సంసారమను జలమున విడువబడిన,

ఆశా మత్స్యమును గ్రహించు వాసనా జాలమును తీక్ష్ణమగుబుద్ధి శలాకతో వాయువు మేఘ జాలమును ఛేదించిన విధముగ ఛేదించి, పరమ పదమును పొంది వెంటనే స్థిరుడవు కమ్ము. నిలుచుచు, నడచుచు, నిద్రించుచు, మేల్కొనుచు, పడుచునే పనిచేయుచున్నను, నీ సంసారము అసద్రూపమని భావించి దానియందుగల ఆసక్తిని విడువుము. మనస్సు సహజముగా జడమైనదయ్యు, మాంస లోకమున మార్జారము సింహాహత గజమునకై పరుగిడునట్లు చిత్తత్వము ననుసరించు చున్నది. ఈ మనస్సు సింహాహత మృగమాంస భక్షణార్థమై యనుసరించు జంబుకాదుల విధమున విజ్ఞాన వీర్యము వలన ప్రాప్తించిన దృశ్యము ననుభవించుచున్నది. నీవు నీ దృశ్యము నాశ్రయించితి వేని, చిత్తవంతుడ వగుట వలన బద్ధుడ వగుచున్నావు. ఆ దృశ్యమును పరిత్యజించినచో మోక్షము నంద గలవు. నీవు నిశ్చలుడవై దేహ భ్రాంతిని విడచి, అనంతాకాశసదృశహృదయుడవై, పరమాత్మ యందు స్థిరబుద్ధిగలవాడవై యుండుము. ఆత్మ, జగత్తుల మధ్య దర్శిష్ట దృశ్య దశాంతరమగు దృశ్యాఖ్యమందు నీ ఆత్మను సర్వదా భావించుచుండుము. స్వాద్యాస్వాదకములను విడచినది, స్వాద్యాస్వాదకముల మధ్య నున్నది, స్వాదనాంతస్థితము నైన దానిని నిత్యము నాత్మమయుడవై ధ్యానించుచుండుము. రాగానుభవనీయుడగు ననుభవవస్తునకు మధ్య నిరాలంబమును అవలంబించి దాని మధ్య స్థిరుడవై యుండుము. 'దేహభ్రాంతి లేకుండుట' అను శలాకతో నపవిత్రమగు నీ దేహభ్రాంతిని ఛేదించి, సకలభూత భీతిని విడచి, సంసారమున కవ్వలి యొడ్డున, అనగా స్వభావములకు భావ్యమైన దానిని జేరుకొనుము" అన, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను:

"మహాత్మా! తమ రహంకార తృష్ణను పరిత్యజింపుమని చెప్పుచున్న ఈ వాక్యము మహాగంభీరమైనది. ప్రభూ! ఈ యహంకారమును పరిత్యజించినచో దేహనామమగు నీ సన్నివేశమునే నిశ్శేషముగ పరిత్యజించినట్లగును. అహంకారము క్షయము కాగా, దేహము

మొదలు నరకిన మహావృక్షమువలె నశించుచున్నదికదా!" అనగా వశిష్ఠ మహర్షి ఈవిధముగా వివరింప దొడగెను :

"శ్రీరామచంద్రా! వాసనా పరిత్యాగము 'ధ్యేయము, జ్ఞేయము' నని రెండు విధములుగా నుండునని బ్రహ్మవిదులు పేర్కొనిరి. 'నేను ఈ దేహ పదార్థములకు సంబంధముకలవాడను, ఇవియే నా జీవితాధరములు, ఇవి లేకుండ నేను లేను, నేను లేకుండ నివియు లేవు' అను నంతర్నిర్ణయమును వీడి, మనసా విచారణ మొనరించి, 'నే నీ పదార్థములకు సంబంధుడనుగాను, ఇవి నా జీవితాధారములు కావు' అని భావించుచు, అంతశ్శీతల బుద్ధితో విలాసముగ కర్మల నాచరించుచు, వాసనా త్యాగము జేయుటయే నిశ్చయముగా 'ధ్యేయము' అనునది.

సర్వసమత్వబుద్ధితో వాసనలను త్యజించి, దేహాభ్రాంతి లేకుండుట యనెడి వాసనా క్షయమును 'జ్ఞేయము' అందురు. 'అహంకార' మను చెలికత్తెను విడచి, విలాసముగ వాసనా క్షయ మొనరించుకొని, ధ్యేయమును విడచినవాడు' జీవన్ముక్తు'డనబడును. వినాశ హేతువులగు సంకల్పములు కలిగించు వాసనను విడచి జ్ఞేయ మను రెండవ వాసనను విడచినవాడు 'విదేహ ముక్తు' డనబడును. రామచంద్రా! 'ధ్యేయ,' 'జ్ఞేయము'లను రెండు వాసనలు పరిత్యాజ్యములై సమానమోక్షప్రదము లగును. ఈ రెండిటిని విడచినవారును, జీవన్ముక్త విదేహ ముక్తు లనువారును సంతాప రహితులునై బ్రహ్మత్వము నందుదురు.

జీవన్ముక్త లక్షణము : ఆపదలందు, సుఖదుఃఖములందు మోద విషాదములు పొందనివాడు 'జీవన్ముక్తుడు.' అతడు ఈప్సితానీప్సితవస్తుప్రాప్తియందు నిష్టానిష్టములను ప్రకటింపక, సుషుప్తునివలె చరించును. 'హర్షము, నమర్షము, భయము, క్రోధము, కామము, కార్పణ్యము' లచే స్పృశింపబడని యంతఃకరణముకలవాడై యుండును. జాగ్రదవస్థయందు సుషుప్తుని

వలె శాంతి నందిన భావవృత్తులు కలవాడై షోడశకళాపరిపూర్ణుడైన చంద్రునివలె సంతోష సంభరితుడై యుండును" అని చెప్పి వశిష్ఠుడు మరియు నిట్లు ప్రవచించెను! "బాహ్యవాసనల వలన నుద్భవించిన తృష్ణ 'బద్ధ' యనియు, సర్వార్థవాసనోన్ముక్త మగు తృష్ణ 'ముక్త' అనియు చెప్పబడును.

తృష్ణా స్వరూపము: శ్రీరామచంద్రా! 'ఈ వస్తువు నాకు గావలయును' అనెడి భావము బంధహేతువగు సంకల్పమైన తృష్ణ అను దానినిగా నెరుగుము. మిగిలిన భావము లన్నియు నున్నను, లేకున్నను నీ తృష్ణ యను దానిని విడచి, బుద్ధిమంతు డగువాడు బ్రహ్మపద మొందుచున్నాడు. బంధమునం దాసక్తిని, మోక్షాసక్తిని, సుఖ దుఃఖ దశను, సదసత్తులయం దాసక్తిని పరిత్యజించి, అక్షోభిత మహాసముద్రము విధమున నుండుము. రామచంద్రా! మరి యొకటి వినుము. మనస్సునందు నాత్మ విచారపరుడగు వానికి స్వాహంకారములగు చతుర్విధ నిశ్చయములు కలుగుచున్నవి.

చతుర్విధాహంకారములు: 1. 'నే నాపాదమస్తకము మాతా పితరులచే సృజింప బడితిని' అను నిశ్చయము అజ్ఞాన విలసిత మగుట ప్రథమ నిశ్చయ మగు నహంకారము.

2. 'సర్వ భావములకు నతీతుడను, కేశాగ్రమున కంటె సూక్ష్మతరుడను' అనునది రెండవ నిశ్చయ మగు నహంకారము. ఇది సత్పురుషులకు మోక్షప్రద మగును.

3. 'నేను ఈ జగజ్జాల పదార్థాత్మకుడను, అక్షయమగు సర్వపదార్థమును నేనే' అనునది తృతీయ నిశ్చయమగు నహంకారము. ఇది మోక్షదాయకమైనది.

4. 'అసద్రూపమగు నీ జగత్తు శూన్యము, ఇది సర్వదా శూన్యమగు నాకాశ సదృశము' అనునది చతుర్థ నిశ్చయ మగు నహంకారము. ఇది మోక్షసిద్ధికి సాధకము.

వీటిలో ప్రథమ నిశ్చయము బంధయోగ్య మగు తృష్ణతో గూడినది. కాన, బంధహేతువు. మిగిలినవి మూడును స్వచ్ఛములు, శుద్ధములు నగుట జీవన్ముక్తుల యందు మాత్రము ప్రకాశించును బుద్ధిమంతుడా! 'నేను పరమాత్మ స్వరూపుడను' అను నిశ్చయము పై వానిలో మూడవదిగ జెప్పబడినది. దానిని నీవు గ్రహించితివేని నీ చిత్తము విషాదము నందదు.

ఆత్మస్వరూప నిర్ణయము : ఈ ప్రకృతి శూన్య మగు మాయ యనునది, బ్రహ్మజ్ఞానము, శివుడు, పురుషుడు, ఈశ్వరుడును నిత్యము నాత్మ యని చెప్పబడుచున్నవి. అనగా, నివి ఆత్మకు పర్యాయ పదములు. పరమాత్మ సంబంధమగు శక్తి అద్వైతమైనదై, ద్వైతాద్వైతభావ భేదములతో జగన్నిర్మాణ విలాసమున విజృంభించుచున్నది. రామచంద్రా! నీ వెల్లపుడును నాత్మీయమునందుగాని, పరకీయమునందుగాని, ఈ సమస్తము నందుగాని, నష్టమైనదానియందుగాని, ఉపచిత కార్యములందు గాని సుఖదుఃఖములను గ్రహింప వలదు. సర్వాతీతమైన పరమాత్మ పదము నవలంబించినవాడు చల్లని యాశయములు కలవాడై సంసారమున బాధల నందడు. అతడు పూర్ణచంద్రుని విధమున ప్రశాంతముగ మెలగుచు నుద్వేగవంతుడు, సంతోషవంతుడునై యుండును. శత్రు మిత్రుల యందు సమభావము కలిగి, దయా దాక్షిణ్యములు కలవాడై, ప్రాప్తకర్మకరణశీలుడై యుండును. ఒకరి నభినందించుటయు, వేరొకరిని ద్వేషించుటయు, దుఃఖించుటయు, వాంఛించుటయు లేక సంకల్ప, వికల్ప విరహితుడై యుండును. అందరకు నభిమతముగా, మృదువుగా భాషించువాడును, సర్వభూతాశయముల నెరిగినవాడునై యుండును, ధ్యేయ త్యాగ విలాసిని యగు పరిపూర్ణ దృష్టి నవలంబించి, జీవన్ముక్తత్వముతో లోకమున స్వస్థుడవై చరింపుము. సమస్తాశాపరిత్యాగ మొనరించి వీతరాగుడవు. విహాసనుడవు నై

యంతరంగమున మెలగుచు, బాహ్యమునకు సర్వసమాచారములు కలవాడవై విహరింపుము. బాహ్యమునకు కృత్రిమ సంరంభము కలవాడవై, యంతరంగమున నా సంరంభ విరహితుడవై, బహిరంగమునకు కర్తగను, అంతరంగమున నకర్తగను వ్యవహరింపుము. అహంకారసంత్యక్తుడవై, అనుప్తమతివై, ఆకాశ విశదుడవై, అగృహీతకలంకాంకుడవై మెలగుచుండుము. ఉదార పేశలములగు నాచారములు కలిగి, సర్వాచారములను నాచరించుచున్న వానివలె వ్యవహరింపుము. అంతరంగమున నైరాశ్యము విరాజిల్లుచుండ, బహిరంగమున నాశానుకూల వ్యాపారపరుడవై మెలగుచుండుము. బహిరంగమునకు తప్తుడవై యుండి, యంతరంగమున శీతలుడవై యుండుము. 'ఇతడు బంధుడు, ఇతడు పరుడు, ఇతడు నేను, అతడు నీవు' అను భేద దృష్టులు నీలో నశించుగాక! 'ఇతడు బంధు వనియు, నితడు పరు' డను భావము లఘు బుద్ధులకు గాని, ఉదాత్త బుద్ధుల కుండదు. వారు భూమండల మంతటినీ తమ కుటుంబమునుగానే భావింతురు. వేనాలవేలుగ వివిధజీవులు పరిభ్రమించుచున్న నీ జగత్తులో 'వీడు నా బంధువు, అతడు పరుడు' అను భేద భావము భ్రమ వలన జనించినది. యథార్థమునకు నీ ముల్లోకములవారు బంధులు, పరులు నగుచున్నారు. ఇందునకు పురాతన మగు నొక ఇతిహాసమును జెప్పుచున్నాను, సావధాన చిత్తుడవై యాలింపుము. ఇది గంగాతీరమున నున్న మునిపుత్రులగు సహోదరుల సంవాద రూపము.

జంబూ ద్వీపమున నొక్కచో నొక 'ది' క్కను నికుంజమున వన వ్యూహములతో ప్రకాశించు 'మహేంద్ర' మను పర్వతము కలదు. దానికొక వైపున మనోహరమైన రత్నసానువునందు జ్ఞానవంతుడు, తపోవంతుడు, బుద్ధిమంతుడు నగు 'దీర్ఘతపుడు' అను నొక మునీంద్రుడు కలడు. అతడాకారము ధరించిన తపస్సువలె నుండెను. అతనికి శశాంక సమాన సుందరులగు నిరువురు కుమారులు కలరు.

వారిలో జ్యేష్ఠుడు పుణ్యుడు, రెండవవాడు పావనుడు. బృహస్పతికి నిరువురు కచులు జన్మించిన విధముగ నా దీర్ఘతపున కా పుత్రులు జన్మించిరి. చాలకాల మా పుత్రద్వయముతో నాతడు గడపెను.

జ్యేష్ఠుడగు పుణ్యుడు జ్ఞానవంతుడు, గుణవంతుడునై సార్థక నామునిగ వెలుగొందుచుండెను. రెండవవాడు పావనుడు ప్రాత స్సంధ్యా సమయమందలి పద్మమువలె నర్ధప్రబుద్ధుడై యుండెను. అతడు మౌర్ఖ్యమును వీడినవాడుగాని, బ్రహ్మానందమునందినవాడుగాని కాక యుండెను. జనన మరణాది కార్యములతో గూడిన నీ కాలము గతించుచుండ జరాజర్జరిత దేహుడగు దీర్ఘతపుడు సంసార సంబంధమైన యాసక్తిని విడచి, 'అహంకార' మను పక్షి తన గూటిని విడచిన విధమున తన గేహమును, దేహమును భారవాహకుడు తన బరువును దించుకొనినయట్లు ఒక పర్వతమున విడచి గతించెను. సంకల్ప రహితు డగుట వలన పుష్పసౌరభ మాకాశము నలముకొను పగిది పరమపదము నందెను.

తండ్రియగు దీర్ఘతపుడు మరణింప గుణజ్యేష్ఠుడగు జ్యేష్ఠుడు పుణ్యనామకుడు తండ్రికి నూర్ధ్వదైహికక్రియ లాచరించి యవ్యగ్రుడై యుండ, నర్ధప్రబోధుడగు పావనుడు పితృవియోగవ్యథాకులితమానసుడై యుండెను. శోకోపహత చిత్తుడై, యతడు నానావనవీథుల బట్టి తిరుగుచు, నన్నపానాదులు ముట్టక విలపించుచుండెను. ఒకనాడు సహోదరుడగు పుణ్యు డాతనికడ కరుదెంచి యిట్లనెను: 'సోదరా! అజ్ఞానివలె శోకము నందెదవేల? జ్ఞానవిదాంవరిష్ఠుడగు తండ్రి మోక్షమార్గము ననుసరించినాడు. సహజ స్థితి నందిన ఆయనను గూర్చి దుఃఖింతు వేల? ఇప్పటికి నీకు నెంతోమంది తల్లిదండ్రులు గతించినారు. ప్రతిజన్మమునందు బంధువర్గమువార తేర్పడుచుందురు. తల్లిదండ్రులను గూర్చియు, పుత్రపుత్రికాదులను, బంధువర్గమువారలను గూర్చియు విలపింపవలసి యున్నచో గత జన్మములందు గతించిన

వారల నందరను గురించి శోకించుట ధర్మము. అట్లయిన మనకీ జన్మము లన్నియు ఏలపించుటకే చాలవు కదా! కాన, వారిని గురించిన విలాపమును మానుము. అజ్ఞాన విస్తీర్ణమైన మరు ప్రదేశమున, తన వాసనా రూపమగు మరీచిక యుద్భవించును. ఆ జలమందు శుభా శుభ సంకల్ప రూపములగు తరంగములు అనంత ములుగా ప్రకాశించుచుండును. బంధువులు, స్నేహితులు, పుత్రులు, మరియు స్నేహము, ద్వేషము, మోహము అను దశలతో గూడిన ప్రపంచము తన నామమున కనుగుణముగా విస్తరించుచున్నది. 'బంధువు' అని భావించినంత బంధువుగను, 'పరు' డని భావింప పరుడు నగుచున్నాడు. విషామృతదశలవలె నీ స్థితి భావ నింబంధమై యుండును. సమస్తమును వ్యాపించి యొక్కడై భాసించు వానికి నితడు బంధువు, నితడు పరుడు నను భేద భావ మెట్లంకురించినది? రక్తమాంస సంఘాతమగు దేహ మస్థిపంజరము తో గూడినది. 'ఇది దేహముగాని ఆత్మకాదు, నే నెవడను?' అని నీ చిత్తమున నాలోచింపుము. పారమార్థిక దృష్టితో నీవు నీవుకాదు. నేను నేనుకాదు. ఇది మిథ్యా జ్ఞానము. 'నేను పుణ్యుడను నీవు పావనుడవు' ననుట యెంతయు భ్రాంతి. మన పూర్వ బంధువులగువా రనేకులు పుణ్యస్థలముల యందును, మృగజన్మల యందును జన్మించిరి. వారిని గూర్చి శోకింపనేల? సింహములుగ, పర్వతశిఖరములుగ కొంద రుండిరి. దశార్ణ దేశములందు నల్లని వనవానరములుగను, తుషార దేశము లందు రాజపుత్రులుగను, పౌండ్రక దేశమునందు వనవాయస ములుగను, హైహాయ దేశములందు సామంతులుగను, త్రిగర్తము లందు గార్దభములుగను, సాల్వ దేశములందు తేనెటీగలుగను, సరళ దుర్గమమున పక్షిగ, నింక ననేకవిధములుగ ననేక జన్మము లందు ననేక యోనులయందు జన్మించి తుదకీ జంబూ ద్వీపమున జన్మించిరి. వారిలో నీవు దీర్ఘతపుని ద్వితీయ పుత్రునిగ జన్మించితివి. అనేకవేలమంది తల్లులు, దండ్రులు గతించిరి. వీరందరును

సంసారమందున్న వారికి అరణ్యమునందలి మహావృక్షమునకు పత్రములవంటివారు. అవి పండి, ఎండి రాలిపోవుట లేదా! భావాభావ వినిర్ముక్తమై, జరామరణ వర్జితమైనదగు నాత్మ స్వరూపమును భావింపుము. మూఢ బుద్ధివై విలపింపకుము. ఈషణ త్రయ కళంకము లేని స్వచ్ఛమగు నాత్మభావవిలసితమగు మహాజ్ఞానముతో హృదయకమలమునందున్న యాత్మను గుర్తిం పుము. మాలిన్యమగు సంభ్రమమును వీడుము" అని చెప్పి వశిష్ఠ మహర్షి మరియు నిట్లనెను: "ఆ పుణ్యునిచే పావను డీ విధముగ ప్రబోధితుడై, ప్రభాత సమయమున భూమండలము ప్రకాశవంతమగునటుల జ్ఞానప్రభాసురు డయ్యెను. జ్ఞాన విజ్ఞానపారగులగు నా పుణ్య పావను లిరువురును జ్ఞానసిద్ధిని పొంది, ఆ వనమున విహరించుచుండిరి. శ్రీరామచంద్రా! ఇదివర కనుభవించిన జన్మములయం దనంతముగ బంధు సంబంధము లుండును. వారిని గూర్చి యాశలు పెంచుకొనవలయునా లేక పరిత్యజింపవలయునా? కట్టెలు వడవైచిన కొలది యగ్ని ప్రజ్వలించు విధమున నాలోచించిన కొలది, చింతలు వృద్ధి యగుచుండును. కట్టెలు వేయకున్న అగ్ని చల్లారు విధముగ నాలోచించుట మానివేసినచో చింతలు నశించును. ధ్యేయవస్తు పరిత్యాగ మను రథము నధిరోహించి కరుణోదార దృష్టితో దీనమగు నీ లోకమును విలోకింపుము. జీవన్ముక్తి కుద్యమింపుము. ఇదియే బ్రాహ్మీ స్థితి. ఇది స్వస్థతమైనది. నిష్కామమైనది. ఉపద్రవ రహితమైనది. దీని నాశ్రయించినవాడు మూఢుడైనను మోహము నందడు. 'వివేక' మను స్నేహితు నొకనిని, 'బుద్ధి' యను ప్రౌఢసఖ నొకదానిని మాత్రము గ్రహించి విహరించువాడు సంకల్పములయందు మోహము జెందడు. సర్వ ప్రయోజనములను నివారించుట, బంధు భావమును తొలగించుట అను ధైర్యముకంటె సంసారమను సంకటమునుండి విడువడు సాధన మింకొకటి లేదు. వైరాగ్యముచే గాని, శాస్త్రపరిజ్ఞానముచేగాని

మహత్త్వాది గుణములచే గాని, ప్రయత్నముచే గాని సంసార మను ఆపదనుండి తప్పించుకొనుటకు తన మనస్సును సంసిద్ధ మొనర్పవలయును. త్రిభువనైశ్వర్యమువలన గాని, రత్నాగారములవలనగాని నేమియు ఫలము లేదు. మహత్త్వాదిగుణ సంశోభితమైన చిత్తము మూలమున నెంతటి ఫలమునైన పొంద వచ్చును. మనస్సు పూర్ణమై యుండగా, జగత్తంతయు నమృత పరిప్లావితమైనట్లుండును. పాదరక్షలు ధరించిన వానికి భూమండల మంతయు జర్మావృతమైనటుండును కదా! వైరాగ్యము వలన మనస్సు పూర్ణత్వము నందును అప్పుడాకాశవశము కాదు. శరత్కాల మందలి సరోవరజలమువలె పూర్ణమైన మనస్సు భాసించుచుండును. నిరాశా హృదయము శూన్యత్వము నంది, అగస్త్యునిచే పానము చేయబడిన సముద్రము విధమున నుండును. ఆశారహితమైన మనస్సువలె పూర్ణచంద్రుడు గాని, క్షీరసాగరము గాని, లక్ష్మి వదనము గాని స్పృహణీయముగా, మనోహరముగా ప్రకాశింపవు. చంద్రుని మేఘ శకలమువలె, సుధానులిపిత కుడ్యమున్నకు మసి బూసిన విధమున మానవుని హృదయమును నాశాపిశాచము దూషితుని జేయును. శ్రీరామచంద్రా! సమస్తములగు నీషణముల నుపశమింపజేసి, ముక్తచిత్తుడవై భవబంధమును ఛేదింపుము. మనస్సున కాశాపాశములే బంధనములు, కాన, నవి తొలగి పోయినచో ముక్తుడు కానివా డెవడు?

## 3. బల్యుపాఖ్యానము

"జీవులకు గతించిన అనేక జన్మ పరంపరలను సంస్మరించుట వలన, స్వరూప జ్ఞానమువలన చిత్తోపశాంతి కలుగు" నని పుణ్యా పావనోపాఖ్యానమున నిరూపింపబడినది. ఇపుడు పుణ్యాధిక్యము వలన చిత్తోపశాంతికై విషయ సుఖము సాధన మగునని చెప్పదలచి వశిష్ఠుడు శ్రీరామచంద్రునకు బల్యుపాఖ్యానము నుపదేశించెను.

"శ్రీరామచంద్రా! బలిచక్రవర్తివలె బుద్ధి భేదముతో నిర్మలమగు జ్ఞానమును పొందుము" అని వశిష్ఠుడు వచింప శ్రీరాముడు, "మహామునీ! నా జ్ఞానాభివృద్ధికి బలిచక్రవర్తి జ్ఞానమును పొందిన విధమును ప్రబోధింపుము. సజ్జనులు తమ శిష్యులకు బోధించుటను కష్టమని భావింపరుకదా!" అన, వశిష్ఠు డీవిధముగ జెప్ప నారంభించెను: "ఈ జగత్కోశమునకు క్రింది భాగమున 'పాతాళము' అని ప్రసిద్ధి పొందిన లోకము కలదు. రాక్షసుల భుజస్తంభములచే ధరింపబడుచున్న రాజ్యభారము కల ఆ లోకమును విరోచన చక్రవర్తి కుమారుడగు 'బలి' అను రాజు పాలించుచుండెను. ఆయన చతుర్దశభువనములను విలాసముగ జయించి, దైత్య రాజ్యమును పదికోట్ల సంవత్సరములు నిర్విశంకముగ పరిపాలించెను. కృతాదియుగ చతుష్టయము, కాలసాగరమున ననేక పర్యాయములు సుడుల విధమున దిరుగుచుండ, దేవాసుర జాలములు వృద్ధిక్షయములు పొందుచుండగా, త్రైలోక్య సంపదలు, భోగములు నిరంతరము నా బలిచక్రవర్తి యనుభవించెను.

ఒకనా డా బలిచక్రవర్తి ప్రాసాదోపరిభాగమున గూర్చుండి యిట్లు తలపోసెను: 'త్రైలోక్యాద్భుతావహములగు నీ మహారాజ్య భోగానుభవము వలన ప్రయోజనమేమి? ఇది ఆపాతమాత్ర మధురమైనదయ్యు, తప్పక నెప్పుడో యొకప్పుడు నశించిపోవును. ఈ భోగోపభోగమాత్రమైనది నా కెంత మాత్రమును సుఖావహము కాదు. మాటిమాటికి కొంత యాలింగన మొనరించును. మరల మరల భోగింపబడును. ఈ శిశుజనక్రీడ మహాత్ములకు లజ్జాహేతువు. అనుభవించిన దానిని తిరిగి తిరిగి యనుభవించుట విరసముగా నున్నది. ప్రతిదిన మీ విధముగ నాచరించుచు ప్రాజ్ఞు డేల లజ్జితుడుకాడు? పగలు గతించిన తరువాత రాత్రి వచ్చుచునే యున్నది. చేసిన కార్యములే మరల చేయబడుచున్నవి. ఇట్టి యాచరణము ప్రాజ్ఞున కసహ్యాకరమని భావించుచున్నాను. చేసిన కార్యమునే నిత్యము నీ

విధముగా జేయుట వలన ప్రయోజనమేమి? ఇంతకు మించి మరి యొక కృత్యములేదుకదా! ఈ భోగములకు వేరైనదియు, శాశ్వతమైనదియు నగు కృత్య మేదైన నున్నచో దాని నాచరించెద గాక!' అని బలిచక్రవర్తి కృతనిశ్చయుడై యుండెను. అంతలోనే 'ఆహా! ఎంతటి యదృష్టము! గుర్తునకు వచ్చినది!" అని యా రాక్షస చక్రవర్తి తన మనస్సులో తా నాలోచించిన విషయము నెరిగినవాడై భ్రూ భంగము జేసి, ఆ విషయము నాత్మయందే యుంచుకొనెను. పూర్వము అతని తండ్రియగు విరోచను నీ విధముగ నే నడిగితిని 'తండ్రీ! ఈ సమస్త దుఃఖములకు, నీ సర్వ భ్రమలకు బరమావధియగు వస్తువు నెరిగింపుము. ఈ మనోమోహ మేవిధముగ శాంతించును? ఈ ఈషణము లెట్లు లయించును? రాగ రహితత్వ మెచట కలదు? విశ్రాంతి ఎచట లభించును? నిరంత రానంద మెచట లభించును? దయతో నా కెరిగింపుము" అని యార్తితో ప్రార్థించెను. అపుడు తండ్రియగు విరోచనుడు, 'కుమారా! మిగుల విస్తారమగు దేశ మొకటి కలదు. ముల్లోక సహస్రము లా దేశమున నొక కోణ భాగముననే కలవు అచట భూమి గాని, ఆకాశముగాని, సముద్రములు గాని, పర్వతములు గాని, వనములు తీర్థములు గాని, నదులు సరస్సులు గాని లేవు. అచట మహాతేజోవంతుడగు మహారాజు మాత్ర ముండెను. అతడు సర్వత్ర వ్యాపించి యుండును. అన్నిపనులను జేయగలడు. అంతయు నతడే యయ్యు నూరక యుండును. ఆతనిచే సంకల్పితుడైన మంత్రి మంత్రాంగము నెరపును. అత డఘటనఘటనాసమర్థుడు. ఇచట దేశ మనునది మోక్షము. రాజు-ఆత్మ, మంత్రి-మనస్సు, రాజు మంత్రిని సంకల్పించుట యనగా 'లోకములను నేను సృజింతునను సృష్టిసంకల్పమున ఆత్మ మనస్సును కల్పించె' ననుట, కాని, ఆమంత్రి పుంగవుడు ఏమియు ననుభవింప సమర్థుడు కాడు. ఏమియు నెరుగడు కాని, తన ప్రభువు సర్వకార్యములను నిరంతరము సాధించుచుండును. ఆ మహారాజ కార్యముల నా మంత్రి పుంగవు డొక్కడే చేయగలడు.

రాజు మాత్రం మేకాంతమున స్వస్థుడై యుండును ' అని చెప్పగా విని, బలి తన తండ్రితో నిట్లనెను: ' మహామతీ ! ఆధి వ్యాధి విరహిత మైన ఆ దేశమేది ? దాని జేరు నుపాయమేది ? ఇదివర కెవ్వరైన నచటికి వెళ్ళియుండిరా ? ఆవిధమగు మంత్రి యుండునా ? బల శాలియగు రాజుమాత్రం ముండునా ? విలాసముగ సమస్త జగముల జయించిన ఆతడు మాచేత గూడ విజితుడుకాడా ? ఈ విషయము లను వివరింపవలసినదిగ కోరుచున్నాను ' అనగా, విరోచను డిట్లనెను : ' పుత్రా ! ఆ మంత్రి మహాబలసంపన్నుడు. దేవాసురు లేకమైనను ఆతని జయింప జాలరు. ఇంతియకాదు. ముసలము, పాశము, వజ్రము, చక్రము, గద మున్నగు నాయుధములు పై తము నాతనిపై మొక్కవోవును. ఆతని శరీర మయోమయ సదృశము. అతని ప్రభువును జయించినచో నతడు జయింపబడును. అట్లుకానిచో నచంచలుడై, యజేయుడై యుండును. ఉపాయ మును గ్రహించి ప్రయోగించినచో క్షణములో వశ్యుడగును. యుక్తిలేకున్న దెబ్బతిన్న కాలనాగువలె దహింప జేయును. కుమారా ! ఆ దేశమును గూర్చి చెప్పుచున్నాను, వినుము. సకల దుఃఖములను నాశము జేయు మోక్షమనునది ఆదేశము పేరు. సకల పదార్థముల కతీతుడగు పరమాత్మ రాజు, ఆయన మంత్రి ప్రాజ్ఞమగు మనస్సు. ఇక యుక్తి యనగా సర్వవిషయముల యందు వాంఛ లేకుండుట. ఇదియే శ్రేష్ఠమగు యుక్తి. దీనిచే మనస్సు అను మదమత్త మాతంగమును జయింప వీలగును.

చిత్తజయోపాయము : చిత్త, భోగములలో రెండు భాగములు. శాస్త్ర విచారముతో నొక భాగమును, గురు శుశ్రూషతో నొక భాగము, చొప్పున భాగములను క్రమముగ పూరింప వలయును. ఏమాత్రమైన జ్ఞానము కలవాడగునేని ఒక భాగము భోగములతోడను, గురు శుశ్రూషతో రెండు భాగములు, శాస్త్ర జ్ఞానముతో నొక భాగమును పూరింప వలయును. జ్ఞానవంతు డగునేని అధ్యాత్మ విచారణ అనగా శాస్త్రజ్ఞానముతో రెండు

భాగములును, ధ్యాన గురు పూజలతో రెండు భాగములును పూరింప వలెను. భోగములు పరిత్యాజ్యములు గాన విడువ వలయును. కుమారా! ప్రజ్ఞా విచార వశమున చిత్తశాంతి కలుగును. ఆత్మా లోకనము, తృష్ణా సంత్యాగము సాధింప వలయును. భోగములను గర్హించుట వలన నాత్మ విచారమును, ఆత్మ విచారము వలన భోగ విగర్హణమును నన్యోన్యాశ్రయములై సముద్రము వలన మేఘములు, మేఘముల వలన సముద్రము సంపూర్ణమైన విధమున పరిపూర్ణ మగును. దేశాచారము ననుసరించి స్వల్పదోషముగల విధానము నాశ్రయించియైనను ధనము నార్జింపుము. ఆ ధనముచే సాధుజన సమారాధన మొనరింపుము. సజ్జన సమారాధనము వలన విషయ వైరాగ్యము జనించును. దానివలన నాత్మ విచారము కలుగును. ఆత్మ విచార సంపదచే పరమాత్మ సందర్శన మగును' అన, బలిచక్రవర్తి ఇట్లు భావించెను: 'నా తండ్రి ఆలోచనాపరుడు. ఆయన నాకు పూర్వవిధముగ ప్రబోధించెను. ఇపుడు దైవ యోగమున స్మరించితిని. అందుచే జ్ఞానోదయమైనది. ఇప్పుడు నాకు విషయ భోగముల యందు నిశ్చయముగా విరక్తి జనించినది. దైవయోగమున నమృత శీతలమును, నాత్మ నిష్ఠను, ప్రశాంతి సౌఖ్యమును పొందుచున్నాను. శీతలాంతర మగు నీ ప్రశాంత స్థితి యెంతో రమణీయముగ నున్నది. సుఖ దుఃఖ దృక్కు లన్నియు సమానముగ నీ ప్రశాంతి యందు లీన మగుచున్నవి. 'నేను అనున దెవరు? ఈ ఆత్మ యననేమి అను నాత్మావలోకమున నజ్ఞాన మడగుటకు ప్రశ్నింతును' అని సంకల్పించి బలవంతుడగు నా బలి, నిమీలితాక్షుడై నా కమలపత్రాక్షుడు. ఆకాశమందిరుడగు, శుక్రుని ధ్యానించెను. సర్వగతమై, అనంత చిదాత్మాకారుం డగు శుక్రాచార్యుడు తన శరీరమును బలిచక్రవర్తి భవన రత్న గవాక్ష సమీపమునకు జేర్చెను. అపుడు బలిచక్రవర్తి రత్నములతో నర్ఘ్య ప్రదానమును సమర్పించుటచే మందారపుష్ప పూజనమున, పాదాభివందనముతో శుక్రు నర్చించెను. అనంతరము, 'ఆచార్యా!

సూర్యకాంతి కార్యకరణమునకు ప్రేరేపించు విధమున నీ యను
గ్రహ విశేషమున జనించిన ఈ ప్రథ, అనగా ప్రజ్ఞ నిన్నొక
విషయము నడుగుటకై ప్రేరేపించుచున్నది' అని యిట్లు ప్రశ్నించెను:
'ఇచట నున్నది ఏది? ఇది యెంత పరిమాణము కలది? ఇది
యే రూపము కలది? నే నెవ్వడను? తమ రెవరు? ఈ లోకము
లేమి? నాకు జెప్పవలయును' అనగా, శుక్రుడీవిధముగ
బ్రత్యుత్తర మెచ్చెను: 'దానవరాజతిలక! అధికముగా జెప్పుట
వలన ప్రయోజన మేమి? నేను ఆకాశ మార్గమున సంచరించు
వాడను. నీ వడిగిన దానికి సంక్షేపముగా సమాధానము జెప్పుదును,
వినుము. ఇది నీ ప్రశ్నలకు సమాధాన సారము. ఇచ్చట నున్నది
చిత్పదార్థము. ఇది యంతయు జిన్మాత్రము. చిన్మయము. నీవు
చిత్తు, నేను చిత్తు, ఈ లోకము లన్నియు చిత్పదార్థములే
యగును. ఇది సంగ్రహముగా వేదాంత సారము. నీవు
పవిత్రుడవైనచో ఈ నిశ్చయ జ్ఞానము వలన సర్వమును పొంద
గలవు. ఇంతకుమించి నే నెంత యధికముగ జెప్పినను, 'నీవు'
అను భస్మము నందు హోమ మొనరింపబడిన 'హవిస్సు'వలె వ్యర్థ
మగును. ఈ చిత్తు దృశ్యముతో గూడి 'బంధ' మనియు, దాని
నుండి విడువడినదై 'ముక్తి' యనియు జెప్పబడును. చిత్తు దృశ్య
రహితమై 'ఆత్మ' అనబడును. ఇది సర్వ సిద్ధాంత సంగ్రహము. ఈ
విధమగు నిశ్చయ జ్ఞానము కలిగి ప్రకాశించు బుద్ధితో నాత్మను
దర్శింపుము. ఇందువలన స్వయముగ ఆత్మతో నాత్మను అనగా
అనంతపదమగు బ్రహ్మను పొందగలవు. ఇపుడు నే నాకాశ
మార్గమునకు బోవుచున్నాను. అచట సప్తర్షుల సమావేశము
జరుగును. ఒకానొక దేవకార్యము ననుసరించి నే నచటనుండ
వలసి యున్నది' అని శుక్ర మహర్షి నభ స్థల మధిరోహించెను.
బలిచక్రవర్తి చిదాత్మకమైన ఈ జగత్తును గూర్చి విచారించు
చుండెను. కొంతవడికి ఆ బలిచక్రవర్తి ఇట్లనెను: 'శుక్రాచార్యుడు
చక్కగ వివరించినాడు. ఈ ముజ్జగములు చిత్పదార్థము. నేను

చిత్తు, ఈ లోకములు చిత్తు. ఈ దిక్కులు, క్రియలు, సమస్తము చిద్విలాసము. దృశ్యదర్శన నిర్ముక్తుడై కేవల నిర్మల రూపవంతుడు సర్వదా ప్రకాశించుచుండును. అతడు నిరాభాసుడు, సర్వద్రష్టయు నగు పరమేశ్వరునిగా నగుచున్నాడు. దృశ్య సంబంధ నిర్ముక్తమగు చిద్రూపము కలదియు, బహిరంతరముల వ్యాపించినదియు, సమస్త విషయవాసనల నడంగిన సంవేద్యమగు జ్ఞాన స్వరూపమునగు చున్నాడు' అని ఆలోచించుచు, బలిచక్రవర్తి ప్రణవ మాత్రార్థమును భావించి ధ్యానమగ్నుడయ్యెను. అతడు సర్వ సంకల్ప విరహితుడై, ప్రశాంతచిత్తుడై, సందేహ రహితముగ బుద్ధితో చేత్యమును (దృశ్యమును), చింతకుడు, చింతనమును; ఈ మూడిటిని వీడినవాడై ధ్యాతృ, ధ్యేయ, ధ్యానహీనుడై, మనోదోషరహితుడై, వాసనాదూరుడై, నివాతదీపసదృశుడై బలిచక్రవర్తి బ్రహ్మపద మందెను. ఈషణత్రయ రహితమును. పరిపూర్ణమును, మననదోష వర్జితమును అగు నీ నిర్మల సద్రూప ముతో శరత్కాలమున మేఘ విరహితమై స్వచ్ఛముగ ప్రకాశించు ఆకాశమువలె బలిచక్రవర్తి ప్రకాశించెను. ఈ విధముగ నిర్వికల్ప సమాధినిష్ఠుడగు బలిచక్రవర్తి భృత్యులగు రాక్షసులు స్ఫటికమణి వినిర్మితమగు నా రాజ ప్రాసాదమును క్షణకాలములో నధిరోహించిరి. బహుకాల మిట్లు సమాధినిష్ఠుడై యున్న బుద్ధిమంతుడగు బలిచక్రవర్తి తన పరివారమగు రాక్షసులు వచ్చుటతోడనే తెలివి నొందినవాడై ధ్యేయ, త్యాగ మయమగు నాత్మతో మనస్సుచేతనే సకల రాజకార్యములను నిర్వర్తించెను. ఆపదను, సంపదను సమదృష్టితో సందర్శించెను. కాన సుఖదుఃఖములయందు నాతని ప్రజ్ఞ అస్తమించుటయు, నుదయించుటయు లేక యుండెను. వేలకొలది ఊహాపోహలను, భావావేశ శతములను బలిచక్రవర్తి చూచెను. అయినను నతడు ఆశ్వాసమునందలేదు. లోకవ్యాపారములందు యథేచ్ఛగా పరువు లెత్తెడి మనస్సును హృదయ కోటరమున బంధించి, ఆత్మను

సంధానము జేయు దానినిగా నియోగించుము. మనస్సు అను బాలుని, మునుగుచున్న ప్రదేశములనుండి యుద్ధరించి, తత్త్వాను సంధానమునందు నియోగింపుము. ఈవిధమగు నభ్యాసమువలన మత్తమాతంగమువంటి మనస్సును, సన్నివిధముల బంధించినచో పరమపురుషార్థము లభించును.

## 4. ప్రహ్లాదోపాఖ్యానము

'పుణ్యాతిశయ విశేషమున విషయ సుఖము కూడ నొకానొకచో జిత్తోపశాంతికి హేతువగుచున్నది.' అని బల్యుపాఖ్యానమున నభివర్ణింపబడినది. ఇపుడు 'ఈశ్వరానుగ్రహముచే నాత్మజ్ఞానము కలుగు' నని ఈ ప్రహ్లాదోపాఖ్యానమున వశిష్ఠుడు నిరూపించెను.

"శ్రీరామచంద్రా! శ్రేష్ఠమగు విజ్ఞానాధిగమక్రమమగు నీ విషయము నాలకింపుము. రాక్షసరాజును, సిద్ధుడునగు ప్రహ్లాదుడు స్వయముగ మోక్షమును పొందెను. దేవ సముదాయమునకు విరోధియగు హిరణ్యకశ్యపుడు వధింపబడగా, శోకసంవిగ్నమానసుడగు ప్రహ్లాదు డిట్లు చింతించెను: 'మా తండ్రి మొదలుగాగల రాక్షసు లందరు మహావిష్ణువుచే నిహతులైరి. వారు కల్పాంత ఝంఝామారుతమున కూకటి వ్రేళ్ళతో గూలిన కులాచలములవలె గూలిరి. మా పితామహాదులతో భయంకర యుద్ధ సంరంభము లనేకములు సంభవించినవి. ఒకరిపై నొకరు పర్వతములను విసరుకొనిరి. ఈ మహాయుద్ధములకు మహావిష్ణువే కారకుడు. ఆ మహాభయంకరములగు యుద్ధములకు భయ మందని మహావిష్ణువు, ఇపుడు మాత్రము భయపడునని యెట్లు చెప్పనగును? కాన మహాపరాక్రమ సంపన్నుడగు విష్ణుమూర్తికి వ్యతిరేకములగు ప్రతిక్రియలు వ్యర్థములని పరిస్ఫుట మగుచున్నది. సర్వాత్మనా, సర్వవిధముల నా విష్ణుమూర్తియే శరణ్యము. ఇది తప్పదు. ఇంతకుమించి గత్యంతరము లేదు. ఈ క్షణము మొదలు నజుడగు నారాయణుని

ప్రసన్నము జేసుకొందునుగాక! అంతట వ్యాపించిన ఆ నారాయణు డను నేను. 'నమో నారాయణాయ' అను మహామంత్రము సర్వార్థ సాధకము. ఆకాశమునుండి వాయువువలె నా హృదయ కోశము నుండి ఈ మంత్రము తొలగి పోవుటలేదు. విష్ణువు కానివాడు విష్ణువును పూజించి పూజాఫలము నందలేడు. నేను విష్ణువునై, విష్ణువుగానే యుండి, విష్ణుమూర్తిని పూజింతునుగాక !' అని ప్రహ్లాదుడు విష్ణు పూజాతత్పరు డయ్యెను " అని వశిష్ఠుడు చెప్పి మరియు నిట్లనెను :

"ప్రహ్లాదు డీ విధముగ నాలోచించి నారాయణ సంబంధమైన శరీరమును ధరించి రాక్షస శత్రువగు విష్ణుమూర్తిని పూజించుటకై మరల నిట్లు చింతించెను : 'విష్ణు సంబంధమగు నీ శరీరమునుండి వాయు స్వరూపమగు పరమాత్మ, ప్రాణ ప్రవాహముతో వెలుపలికి వచ్చియున్న ఈ యపర విష్ణువును, సకలపరివారసమన్వితుని, సర్వసంభార రమ్యమైన మనోమయ సపర్యతో వెంటనే పూజింతును గాక !' అని అన్నివిధముల లక్ష్మినాథుని మానసికముగ పూజించెను. రత్ననిర్మితమైన యర్ఘ్యపాత్రమును గొని, చందనాది లేపనముల సమర్పించి, ధూప దీపములను వెలిగించి, పవిత్రము లగు నానావిధభూషణాంబరముల నలంకరించి పూజించెను. అటు తరువాత బాహ్యార్థ పరిపూర్ణమగు పూజతో నా ప్రహ్లాదుడు దేవతాగృహమున జనార్దనుని పూజించెను. ఆనాడు మొదలు ప్రతి నిత్యము ప్రహ్లాదుడు పరమేశ్వరుని పరిపూర్ణ భక్తి భావముతో పూజించుచుండెను. అదిమొదలు నా పట్టణ మందలి రాక్షసు లందరును వైష్ణవులైరి. ప్రజల యాచార వ్యవహారములు రాజునుబట్టియే ఉండును కదా ! విష్ణుమూర్తిపట్లగల ద్వేషమును విడచి, రాక్షసులు భక్తియుక్తులై పూజించుచున్నారను వార్త దేవలోకమున వ్యాపించెను. ఈ వార్త విని ఇంద్రాదిదేవత లాశ్చర్య నిమగ్నులైరి. రాక్షసులు వైష్ణవ భక్తియుక్తులయి నందున ఖిన్నులైనవారై, క్షీరసాగరమున, శేషశయనుడయి

యున్న విష్ణుమూర్తిని దర్శించి: 'భగవానుడా! ఇది యేమి చిత్రము! రాక్షసులు యుద్ధప్రసక్తిని విడచి, నిరంతరము తమ పూజాపరులై యున్నాడు. ఇది మాకు నత్యంతాశ్చర్యజనక ముగ నున్నది. అపరిమిత దుర్వృత్తులు కల రాక్షసు లెక్కడ, అనేక జనానాంతర సంస్కారములతో పొందదగిన విష్ణుభక్తి ఎక్కడ! పామరుడు గుణవంతుడైన విధముగ, అకాలమున పుష్పము వికసించిన విధమున, మాకీ విషయము దుఃఖము, నాశ్చర్యము కలిగించుచున్నది. అధముడు, పామరుడు, ఆరంభ హీనుడు, దురాచారపరుడు, హీనుడు నగు దానవుడు ఎక్కడ, విష్ణుభక్తి ఎక్కడ? విచిత్రముగ నున్నది' అని దేవతలు వాపోయిరి. విష్ణుమూర్తి వారి మాటలను విని 'దేవతలారా! ప్రహ్లాదుడు భక్తియుక్తచేతస్కుడైనాడని బాధ నందకుడు. ఇది యాతనికి కడపటి జన్మము. ఇతడు మోక్షార్హుడు. గుణవంతుడు దుర్గుణ వంతుడైనచో ననర్థము, కాని, నిర్గుణుడు గుణవంతు డగుచో శుభావహమని పండితుల యభిప్రాయము కాన, విచిత్రములగు మీ మీ లోకములకు పొండు. ప్రహ్లాదాది సంబంధములైన మీ ఆలోచనములు శుభప్రదములు కావు' అని విష్ణుమూర్తి దేవతల కుపదేశించి పూలగుత్తులవంటి క్షీరసాగర తరంగములలో నంతర్హితు డయ్యెను దేవతాబృందము ను విష్ణుమూర్తి నానతి ననుసరించి తమ తమ లోకముల కరిగిరి. వారు ప్రహ్లాదుని గుణగణమును కీర్తించుచు స్నేహభావముతో మెలగుచుండిరి.

ప్రహ్లాదుడు త్రికరణశుద్ధిగ, ననగా మనస్సు, వాక్కు, కర్మలతో దేవదేవుడగు విష్ణుమూర్తిని ప్రతినిత్యము నర్చించును. పూజాపరుడైన యాతనికి, మెట్టతామర చందమున భోగము లన్నియు నశింపగ వైరాగ్యము జనించినది. భోగాసక్తి నశించినది. బ్రహ్మపదమునందు మనస్సు సుస్థిరత్వము నందక, డోలాయ మానముగ నూగుచుండెను. క్షీరసాగరమందిరాంతరమున నున్న

మహావిష్ణువును ప్రహ్లాదుడు స్మరించెను. ఆయన సర్వవ్యాప్తమై, మనోహర బుద్ధితో నతని ననుగ్రహించెను.

ప్రహ్లాదుని పూజా విధులకు సంతృప్తుడై శ్రీమహావిష్ణువు సపరివారముగ పాతాళమున కేగి, అందు నతని పూజా గృహమున ప్రవేశించెను. తన గృహమున కరుదెంచిన భగవానుని గుర్తించి ద్విగుణీకృతమగు భక్తితో నర్చించెను. అనంతర మీవిధముగ సంస్తుతించెను :

'త్రిభువనాభిరామకోశమగు వాడును; సకలార్తి పరిహర్తయు, ప్రకాశమానుడు, అశరణశరణ్యుడు, నీశ్వరుడు, విష్ణుమూర్తి, యజుడు, నచ్యుతుడు నగు వానికి నమస్కరించుచున్నాను.

కలువరేకుల కొండవలె నున్నవాడును, శరత్కాలాకాశ సన్నిభమైనవాడును, భ్రమరతిమిరకజ్జలాంజనాభుండును, పద్మ చక్రగదాధరు డగు వానికి నభివాదనములు.

నిర్మలమగు వానికి, భ్రమరసముదాయ సన్నిభగాత్రునికి, తెలిదమ్మిమొగ్గవంటి శంఖము ధరించిన వానికి, శ్రుతులచే ప్రతి ధ్వనింపజేయు విరించి చంచరీకుడగు వానికి, సహృదయ పద్మ జలాశయుడైన వానికి నతు లర్పించుచున్నాను.

సితతర నఖ నక్షత్రవ్యాప్తమైనదియు, చిరునగవుచే తెల్లనగు మొగ మను నిండుచందురుని బింబము కలదియు, హృదయ మందలి మణిమరీచికాజాలము లను నాకాశగంగ కలదియు నగు హరి శరదంబరమును శరణు పొందుచున్నాను.

స్ఫుటతరాకారుడును, చిదాత్మతత్త్వస్వరూపుడును, జగ ద్ధార్తిహరుడగు హరిని స్మరించుచున్నాను

నవవికసితకమలకింజల్కసమానవర్ణయగు లక్ష్మీదేవి శరీరముచే నలంకరింపబడిన వక్షస్థలము గలవాడును, సంధ్యారాగసదృశ అరుణాంగరాగుడును, కనకనిభాంబరసుందరగాత్రుని శరణు పొందుచున్నాను.

నిరంతరము విలాసముగ విశ్వసృష్టి జేయువాడును, పుట్టుక లేనివాడును, వృద్ధి లేనివాడును, యుగయుగాంతరముల నుండి ముదిమి జెందిన దేహము కలవాడును, తరుదళశాయి యగు నర్భకుని ప్రార్థించుచున్నాను.

దితి సుతులను, తామరరేకులకు మంచువంటి వాడును, దేవతా పద్మములకు సహస్రకిరణుడైన వాడును, కమలజలనళినీ జలావపూరకుడైన వాడును, హృదయమందు నళినీ నిలయుడైన వానిని శరణు జొచ్చుచున్నాను'

అని గుణ బహుళములగు వాక్ప్రసూనములతో నభ్యర్చితుడైన హరి ప్రహ్లాదునికి సంతోష జనకముగ నిట్లు పలికెను : 'దైత్యకులాలంకారుడవైన బుద్ధిమంతుడా! పునర్జన్మము లేని విధముగ నభీప్సితమగు వరము నర్థింపుము' అన ప్రహ్లాదుడు, 'మహాత్మా! సర్వసంకల్పప్రదాతవు. సర్వలోకాంతరస్థుడవు. సర్వహృదంతరుడవు నీవు శ్రేష్ఠ మని భావించిన దానిని నాకు ప్రసాదింపుము' అనగా భగవంతుడగు విష్ణుమూర్తి, 'ప్రహ్లాదా! సర్వవిధ భ్రాంతులు నశించుటకు, పరమపదప్రాప్తికి, బ్రహ్మ యందు విశ్రాంతి నొందు వరకు నుండెడి యాత్మ విచారము నీకు లభించుగాక !' అని వచించి విష్ణుమూర్తి యంతర్హితు డయ్యెను" అని వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు వివరించి మరియు నిట్లనెను :

"విష్ణుమూర్తి యంతర్ధానము నందిన యనంతరము ప్రహ్లాదుడు పునః పూజార్థము మణిరత్నసంభరిత పుష్పాంజలిని సమర్పించి పద్మాసనాసీనుడై సంతోషాంతరంగముతో స్తోత్ర మొనరించి ఇట్లు దలంచెను : 'శ్రీ మహావిష్ణువు దయాంతరంగుడై భవదోషాపహమగు తత్త్వ విచార సంపన్నుడ వగుదువు గాక అని యాశీర్వదించెను. కాన, అంతరంగమున నాత్మ విచారము జేయుదును గాక ! ఈ లోకాడంబరమున నున్న నే నెవండను ?

అడగుచున్నాను, నడచుచున్నాను, నిలచుచున్నాను, యత్నించుచున్నాను, విహరించుచున్నాను-ఈవిధముగ జేయుచున్న నేనెవడను? నే నీ జగత్తును కాను. వృక్ష తరు గుల్మాదులుకలది జగత్తు. కేవలమై, బాహ్యమై, జడమైన ఈ జగత్తును నే నెట్లగుదును? యథార్థమునకు లేనిదియై, మూగదియై గాలిచే కదలుచు, నల్పకాలములో లయించునదై, అచేతన మగు నీ దేహమును నేను గాను. అచేతన మగు కర్ణశష్కులి (చకిలము వంటి చెవి) చే కల్పితమై, క్షణములో లయించెడి శూన్యాకృతియు, శూన్యమున బుట్టినదియు, నచేతనము నగు శబ్దమును నేను గాను, క్షణకాలమున నశించు త్వగింద్రియమును పొంది, మరియొక విధముగా నప్రాప్యమైన చిత్ప్రసాదోపలబ్ధమగు నచేతనమైన స్పర్శను గాను, చంచలమై క్షణకాలమాత్రముండు తుచ్ఛమైన నాలుకచే లబ్ధాత్మమై, స్వల్పస్పందమై, ద్రవ్యనిష్ఠమైన నచేతనమగు రసమును గాను. క్షణక్షణ వినాశనలక్షణముగలదై, దృశ్యదర్శనము లందు లీనమైనదై, కేవలము ద్రష్టయందు క్షీణరూపమై, నచేతన మగు రూపమును గాను. అప్రకాశమానమై, నశ్వరమగు నాసికచే పరికల్పితమై, పేలవమగు చంచలాకారము కలిగి యచేతనమైన గంధమునుగాను. నేను నిర్మలుడను,మనన రహితుడను, శాంతుడను, పంచేంద్రియ భ్రమ విరహితుడను, సంకల్ప వికల్పములు లేనివాడను. పరిశుద్ధ చేతనా స్వరూపుడను, దృశ్యవర్జితచిన్మాత్రరూపుడను. బాహ్యాభ్యంతర వ్యాపకుడను. ఇది యథార్థము. ఇపుడు సత్యము నంతను తెలుసు కొంటిని. నిర్వికల్ప చిదాభాసమై సర్వాంతర్యామి యగు నాత్మ నగుచున్నాను. 'నేను' అను చేతనాశక్తిచే నీ ఘట పటాదులు సూర్య పర్యంతము, కాంతివంతమగు దీపముచే వస్తుజాలము దృశ్యములగు విధమున కన్పించుచున్నవి. నాచే విచిత్రేంద్రియ వ్యాపారములుకల వన్నియు నంతఃప్రకాశముకల తేజస్సుచే మిణుగురు పురుగులు ప్రకాశించునట్లు ప్రకాశించుచున్నవి. బ్రహ్మ పదమునకు పరమున కల్పాంతము నందును, స్థిరమగు రూపమున

ప్రకాశించుచునే యుండును. ఎన్నడును మరలిపోదు, ఇది దేశ కాలావచ్ఛిన్నముగాన, సర్వత్రవ్యాప్తమై యుండును. నిరవలంబమై 'నేను' అను నీ స్వరూపము పరమాత్మకంటె భిన్నమైన దానినిగా భావించుట యవివేకము. అనంతమైన యానందము ననుభవించునదియు, ఘరోపశమ స్వభావముగల పరిశుద్ధమగు నీ చిన్మయ దృష్టి, సమస్త దృష్టులను జయించుచున్నది. నేను సర్వభావాంతరస్థుడను, దృశ్యమును వీడిన చిదాత్మ స్వరూపుడను, జీవాత్మ స్వరూపుడను, నగు నాకు నేను నమస్కరించుకొనుచున్నాను. స్వస్థమయమగు నిర్వికారత్వమున శక్తులు విచిత్రములుగా నుండును. సంకల్ప వికల్పరూపమైన పరమగు చిత్తుచే నవి నిర్మింపబడు చున్నవి. భావి భూత వర్తమానములను కాలత్రయము నుపేక్షించినదియు, దృశ్య బంధనములు లేనిదియు నగుచిత్తు, పరిపూర్ణమై శేషించుచున్నది. అది వాగతీతమైనదగుట వలన, శాశ్వతమగు ననదూప్రమ్ము నందినది వలె, నాత్మరాహిత్యమైన అనగా శూన్యమైన రూపము నొందు చున్నది. ఇష్టానిష్ట సంకల్పరూపములను మనోదోషములతో గూడిన చిత్తు, తాంటితో గట్టబడిన పక్షి ఎగిరెడి శక్తిని కోల్పోయిన విధమున. పరిపూర్ణ రూపము నొందుట కసమర్థమై యున్నది. అవిచ్ఛిన్నచిదాత్మ స్వరూపుడను, ఆత్మ స్వరూపుడనైన నాకు నమస్కారము.

ఆహా! లోకము నాలోచించుట కుపయోగించు దేవా! చాల కాలమునకు లభించితివి. నీవు శ్రుతులు, గురు వాక్యముల చేతను వివరింపబడితివి. వికల్పములనుండి యుద్ధరింపబడితివి. అచిర కాలమున గుర్తింపబడితివి. నీకు నమస్కారము. 'నేను' అను రూపమునకు, నీకును, అనంతరూపునకు, 'నీవు, నేను' అను శుభప్రదమైన రూపమునకు దేవాధిదేవుడవు, పరుడవు, పరమాత్ముడవు నగు నీకు నమస్కారము. మబ్బులను విడిచిన పూర్ణచంద్రబింబము వంటిది, సంకల్పములు నశించుటచే పరిశుద్ధ స్వరూపమైనది, అంతట వ్యాపించినది, స్వయముగ తనలో నిండి, తన శరీరముతో

సంతోషించునది. తనంత తాను జనించి, తన వశమందున్న దానికి నమస్కారము. కూర్చుండియు గూర్చుండని వాడను, నడచుచు నడువని వాడను, ప్రశాంతుడనయ్యు వ్యవహారస్థుడనైన వాడను, కార్యాచరణపరుడ నయ్యు నందు జోరబడనివాడను నగుచున్నాను. వాయువు జిగురు టాకులను వలె నీ యాత్మ బుద్ధి, మనస్సులను క్షోభపెట్టుచున్నది. సారథి యశ్వ చోదనము జేయునటుల బాహ్యేంద్రియముల నది నడుపుచున్నది. ఇది ధ్యానింప దగినది' స్తుత్యమైనది, వెదుక దగినదియు నగును. అట్లయిన జరామరణ సమ్మోహ రూపమగు సంసారమును తరింప వచ్చును. 'శరీరము' అను పద్మకోశమున భ్రమరము పగిది నున్న ఈ ఆత్మ మిక్కిలి సులభసాధ్యమైనది. ఆప్తబంధువునువలె చక్కగ తెలియదగినది. నాకు భోగములయందు వాంఛ లేదు. వానిని విడచుట యందు తలంపును లేదు. ఏవి వచ్చినను రానిమ్ము. మరలి పోయినచో పోవనిమ్ము. ఈ యజ్ఞాన మను శత్రువు ఇప్పటివరకు నా వివేక సంపత్తిని దోచుకొనినాడు. మనస్సుతో మనస్సు నందలి వాసనలు ఛేదింపబడగా, అహంకారము నశింపగా, ద్వైతభావము కరగిపోగా స్వస్థుడనై యున్నాను. భావహీనత, నిరహంకారము, అమనస్కత, వాంఛా రాహిత్యము కలిగి నా శరీరము కేవలము, స్పంద రహితమై శుద్ధాత్మమునందు వసించుచున్నది. తృష్ణ లను రజ్జు గణములను ఛేదించినదై నా శరీర పంజరమునుండి దురహంకారమను పతంగము ఎచ్చటి కెగిరి పోయినదో తెలియబడదు. వస్తుసంపద యంతయు నున్నను, నీవు లేనిచో నది యేమియు నుండదు స్త్రీ లావణ్య స్వరూప మంధునకు గన్పింపదు కదా! బ్రహ్మాండ స్వరూపమైన ఓ ఆత్మా! నీకు జయమగుగాక! శాంతిపరాయణా! నీకు విజయమగుగాక! సర్వాగమాతీత! నీకు జయాభిజయము! సర్వాగమాస్పద! విజయీభవ!' అని ప్రహ్లాదుడు, ధ్యానపరుడయ్యె" నని వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రున కెరిగించెను. మరియు నిట్లు తరువాత విషయము నభివర్ణించెను: "శత్రు

దమనుడగు ప్రహ్లాదుడు, ఈవిధముగ నాలోచించుచు నిర్వికల్ప సమాధి నిమగ్నుడయ్యెను. చిత్రార్పితుని విధమున నట్లు అయిదు వేల సంవత్సరములు లా సమాధియం దుండెను. ఇంతలో నా రసాతలమున మాత్స్యన్యాయముగా అనగా పెద్దచేప చిన్నచేపను మ్రింగు విధముగ తీవ్రమగు నరాజకము ప్రబలి బలవంతుడు బలహీనుని బాధించి, వధించుచుండెను. అఖిల జగజ్జాలమును వర్ణాశ్రమధర్మ సంరక్షణము జేయుటకు దేహధారియు, ముల్లోకములను పద్మములను వికసింపజేయుటకు భాస్కరుడును, నగు క్షీరసాగరశయనుడైన విష్ణుమూర్తి ఇట్లు చింతించెను: 'ప్రహ్లాదుడు యోగసమాధి నిష్ఠుడయినందున పాతాళము నాథుడు లేని రాజ్యమై యరాజకత్వము ప్రబలి రాక్షస రహితమైనది. ఈ సృష్టి యెంత దుర్భరమైనది! దైత్యాభావమున దేవతాగణము జయేచ్ఛ విడచి, విరోధభావ ముజ్జగించి ద్వంద్వదోషరహితమైన మోక్షపదమందును. దేవత లిట్లు మోక్షము నందినచో భూలోకమున యజ్ఞ తపో విధానములు నశించును. అవి నశించుటవలన భూలోకమే యంతరించును. ఈ కర్మభూమి నశించినచో లోకము లన్నియు నశించును. అందుచే సూర్య చంద్రాదులు కాంతు లుడిగి శూన్యులై పోదురు. దానిచే నేనును చిత్తశాంతినంది బ్రహ్మ పదమున శాంతి నందుదును. ఈవిధముగ కాలముగాని కాలమున లోకములు శమించుట శ్రేయస్కరముకాదు. కాన రాక్షసులు బ్రదికి యుండుట శుభోదర్కమని భావింతును. దైత్యులగు వారు జీవించినచో దేవతలు, యజ్ఞ యాగాది క్రియాకలాపములు నుద్ధరింపబడినట్లగును. దేవతలకు వారిని జయింపవలయునను నభిలాషము జనించును. దానిచే ధర్మమును, దానిచే లోక స్థితియు పోషింపబడును కాన విలయము శ్రేయముకాదు. ఈ దేహముతోనే ప్రహ్లాదు డాకల్పాంత ముండును గాక! ఈవిధమగు నిశ్చయమును, నిర్ణయమును దేవి, పరమేశ్వరి నియమము చేసినది' అని యాలోచించి సర్వాత్ముడగు

పరమేశ్వరుడు క్షీరసాగరమునుండి వెలువడివచ్చి, ప్రహ్లాదు డుండెడి నగరమున ప్రవేశించెను. వెంటనే యతని భవనమును జేరెను. గరుడవాహనారూఢుడైన ఆ మహావిష్ణువునకు లక్ష్మీదేవి వింజామర వీచుచుండెను. తన యాయుధములు, పరివారగణము, దేవర్షులు చుట్టుముట్టి స్తోత్రము లొనరించుచుండిరి. ప్రహ్లాదుడు నిశ్చల సమాధిమగ్నమానసుడై యుండెను ఆ సమయమున విష్ణుమూర్తి : 'మహాత్మా! మేల్కొనుము' అని పలుకుచు దిక్కులు పిక్కటిలునట్లు పాంచజన్యమును పూరించెను. ఆ మహాశబ్దమును విని ప్రహ్లాదుడు కనులు దెరచెను. అతని ప్రాణశక్తి బ్రహ్మరంధ్రమునుండి కదిలి, మెల్లగా నాడుల ద్వారా సర్వతోముఖమై వ్యాపించెను. రంధ్రవక్త్రములగు ప్రాణములు తమతమ వ్యాపార పరాయణము లయ్యెను. ప్రాణదర్పణ ప్రతిబింబితమైన చిచ్ఛక్తి యభిముఖ మయ్యెను.

రామచంద్రా! విషయాభిముఖమైన చిత్తు దృశ్యంబువలెనై... చిత్తు, జడము లను రెండిటి రూపము లగు మనోహర రూపమును ధరించును. ముఖసంపద దర్పణమున ప్రతిబింబితమై ద్విత్వము నొందుచున్నది కదా! ఇట్లు చిత్తము సూక్ష్మముగ నంకురించిన దగుచో నేత్రములు వికసించును. కనుక నా ప్రహ్లాదునకు క్రమక్రమముగ ప్రాతఃకాలమునందలి నల్లగలువలవలె నేత్రములు ప్రకాశించినవి. ప్రాణాపానములచే జాగరితమైన నాడీ వివర సంపద వాయుహత పద్మముభాతి, నతనిలో స్పందనము కలిగించెను. ఒక్కక్షణమాత్రములో నతని మనస్సు శక్తివంతమైనది. మనోనేత్ర, ప్రాణములు, శరీరము వికసించినవి. పూర్వస్మృతులు కల ప్రహ్లాదుని గాంచి మహావిష్ణువు మేఘగంభీరస్వరముతో నిట్లనెను : 'సజ్జనుడా! నీ సంపదను, ఆకృతిని స్మరింపుము. అకాలమున నీవు దేహ పరిత్యాగము జేయుట పనికి రాదు. ఉపాదేయములగు సంకల్పములు లేనివాడవగు నీకు శరీరగతము

లగు భావముల వలన ననర్థము కలుగునదేది ? కాన నీ విపుడు లెమ్ము. నీవు జీవన్ముక్తుడవై ఈ రాజ్యమును పాలింపుము. నీ శరీరము కల్పాంతము వరకు నిలువవలయును. ద్వాదశాదిత్యులు నుదయింపలేదు. కులపర్వతములు విలీనములు కాలేదు. జగత్తు జ్వాలనము కాలేదు. వ్యర్థముగ నీవు తనుత్యాగ మొనరింతువేమి? కృషించినవాడు, పరమ దుఃఖితుడు, మూఢుడు నను వారలును; ఇంక నితరములగు దుర్భావనలు కలవారును; ధైర్యహీనులును మరణింప నర్హులు. ఆశాపాశబద్ధుడై, చంచల మనోవృత్తి కలవాడు మరణించుట భావ్యము. దేహాదులయం దహంకారభావ విలసితుడు కానివాడు, దేనియందును బుద్ధి నిమగ్నము కానీయనివాడు, సర్వ భూతసమదృష్టి కలవాడు జీవించుట వలన ప్రయోజన మున్నది. రాగద్వేష విహీనమైన అంతశ్శీతల బుద్ధితో నీ జగత్తును సాక్షి మాత్రముగ భావించి జీవించువాని జీవితము శోభస్కరము. మంచి పరిజ్ఞానము కలవాడై, హేయోపాధేయములను వర్జించి, చిత్ప్రదార్థమునందు చిత్తము నర్పించిన వాని జీవితము కల్యాణ ప్రదము. గ్రాహ్యాగ్రాహక సంబంధము క్షీణింపగ, శాంతి యుదయించును. అట్టు లుదయించిన రాగద్వేషాది విరహితమైన స్థితిని పొందిన శాంతిని మోక్షమందురు కాన, అసురాధీశ్వర! లెమ్ము. సింహాసన మధిష్ఠింపుము. నీకు నేను స్వయముగ నభిషేకము జేయుదును. నా పాంచజన్య రవము నాలించి వీర లంద రేతెంచిరి. ఈ సిద్ధులు, సాధ్యులు మున్నగు దేవగణ మంతయు నీకు మంగళా శాసనము లు పలుకుదురు' అని యచటి కరుదెంచిన దేవతాగణముతో క్షీరాది మహాసముద్రముల నుండియు, గంగాది మహానదుల నుండియు సర్వ తీర్థజలములను తెప్పించి, దేవతలు, రాక్షసులు స్తుతించుచుండగా ప్రహ్లాదు నభిషేకించెను. ఆసమయమున మహావిష్ణువు ప్రహ్లాదునితో నిట్లనెను : 'కుమారా ! మేరుపర్వతముండునంతవరకు, సూర్య చంద్రులు ప్రకాశించుచుండునంత వరకు, నిరంతరము సర్వజనులచే శ్లాఘింపబడుచున్నవాడవగుచు రాజ్యము నేలుచుందువుగాత !'

అని యాశీర్వదించెను. శ్రీ మహావిష్ణు వంతర్హితు డైనంతనే సిద్ధ సాధ్యాది దేవతాగణము లాయన వెనుక మరియొక సంహారమువలె నంతర్ధాన మొందిరి. "పరమపదమున సుప్రతిష్ఠితమైన యా ప్రహ్లాదుని మనస్సు పాంచజన్యధ్వని నాలించి మేల్కొన్న విధము నెరిగింపు" మని శ్రీరామచంద్రుఁడర్థింప వశిష్ఠ మహర్షి ఈవిధముగ నభివర్ణించెను:

"శ్రీరామచంద్రా! బీజము నశించిన విత్తనముల వంటిది, పునర్జన్మరాహిత్యమైనదియు నగు, పరిశుద్ధవాసన జీవన్ముక్తుల హృదయమున నుండును. అది పవిత్రమైనది. పరమోదారమైనది. శుద్ధసత్త్వస్వరూపము ననుసరించునది. ఆత్మధ్యానమయమైనది. నిత్యము సుషుప్తినందినవానియం దుండుస్థితి కలదియునై యుండును. వేయి సంవత్సరముల కైనను నా పరిశుద్ధ వాసన యలవడినచో ప్రబుద్ధు లగుచున్నారు. అనగా మేల్కొనినవార లగుచున్నారు" అని వశిష్ఠ మహర్షి ప్రవచించెను.

## 5. గాధ్యుపాఖ్యానము

'ఈశ్వరానుగ్రహముననే ఆత్మజ్ఞాన మావిర్భవించు' నని ప్రహ్లాదోపాఖ్యానమున నభివర్ణింపబడినది. ప్రస్తుత మీ గాధ్యుపాఖ్యానమున, 'మనస్సును జయింపక జగద్రూపమగు మాయ తొలగిపోదు' అని వివరింప దలచినవాడయి మాయా విడంబనమును నిరూపించెడి ఈ యుపాఖ్యానమును వశిష్ఠుడు చెప్ప నారంభించెను: "శ్రీరామచంద్రా! సంసార మను మాయ అంతము లేనిది. చిత్త జయము చేతనే ఈ మాయ వశ్యమగును గాని, మరియొక విధమగు నుపాయముచే జయింపరానిది. జగద్రూపమైన నీ మాయాప్రపంచ వైచిత్ర్యము నెరిగించుటకై నీ కొక ఇతిహాసము నెరిగించుచున్నాను, వినుము.

భూమండలమున కోసలయను మండలము కలదు. అందు 'గాధి' అను సద్గుణసంపన్నుడగు బ్రాహ్మణు డుండెను. అతడు

తన మనస్సున నేదియో కోరి, ఆత్మబంధువర్గమును విడచి తప మొనరించుటకై యడవి కేగెను. అతని కా వనమున నొకచోట తామరపుష్పాలంకృతమైన సరస్సు కన్పించెను. అందు కంఠ దఘ్నముగా నుండి యా బ్రాహ్మణుడు తప మారంభించెను. ఎనిమిది మాసములు గతించినంత నతని తపమునకు సంతసించి శ్రీమహావిష్ణువు ప్రత్యక్ష మయ్యెను. 'బ్రాహ్మణోత్తమా! నీ తపస్సునకు సంతుష్టుడనైతిని. ఇచ్చవచ్చిన వరము నభ్యర్థింపుము' అనెను. మహావిష్ణువు మాటలను విని గాధి ముని కనులను దెరచి 'జగత్తునందలి జీవహృదయకమలాధివాసుడవైన మధురిపూ! నీకు నమస్కారము. పరమాత్మకు సంబంధించినదై యాశ్చర్యమును కలిగించు 'సంసారము' అను పేరుగల మాయను జూడగోరుచున్నాను' అని వర మర్థించెను. వెంటనే విష్ణుమూర్తి 'నీవు మాయను చూడగలవు. అనంతరము దానిని విస్మృతి నందగలవు. ఇది నీ యభీష్టముపై నాధారపడి యుండును' అని చెప్పి గంధర్వ నగరమువలె నంతర్ధానము నందెను. గాధి మునియు జలనిర్గతుడై పరమాత్మ సందర్శనమున సంతుష్టాంతరంగుడై యుండెను. ఈవిధముగ కొంతకాలము గతించినది.

ఒకనాడు గాధి ముని ఒక పద్మాకరమున స్నాన మాచరించుచుండ విష్ణుమూర్తి వాక్యములు స్మరణమునకు వచ్చెను. వెంటనే తాను ధ్యానము జేయుచున్న మంత్రమును మరచి పోయెను. తన గృహమున తాను మరణించినట్లు భావించెను. బంధువర్గమువారు చుట్టును జేరి విలపించుచుండిరి. తన భార్య పాదములపై వ్రాలి శోకించుచుండెను. తల్లి మాటిమాటికి గడ్డము నంటి దురపిల్లుచుండెను. కొంతవడికి ఆ మృతశరీరమును బంధువులు స్మశానమునకు గొంపోయిరి. అచట దహనాదిక్రియల నాచరించి గృహమునకు మరలివచ్చిరి.

గాధి ముని జీవము ఒక హూణ మండలమున వసించు చండాల స్త్రీ గర్భమున ప్రవేశించెను. కొంతకాలమున కా చండాల

కాంత శ్యామల దేహకాంతి విరాజితు డగు నొక కుమారుని ప్రసవించెను. ఈ పుత్రుడు మాతా పితరులకు ప్రేమాస్పదుడై చంద్రకళల ననుసరించుచు దినదినాభివృద్ధి నంది ద్వాదశ వర్ష ప్రాయు డయ్యెను. అనంతరము షోడశ వర్షములు వచ్చెను. పరిపూర్ణ యౌవనుడైన ఆ కుమారున కనురూప యౌవన గుణ విలాసాన్విత యగు నొక కన్యతో వివాహ మొనరించిరి. అతడు తన భార్యతో గిరి కాంతార ప్రాంతములందు విహరించుచు కొంత కాలమునకు పుత్రికను గాంచెను. ఇట్లు కళత్రవంతుడు, పుత్రివంతుడనై, తన యౌవన మంతయు గతించి పోగా, నా యరణ్యమున దూరముగ నొక ప్రశాంత ప్రదేశమున పర్ణశాలను నిర్మించుకొని మౌని విధమున వసించుచుండెను. కాలాంతరమున భార్యా పుత్రులు కాలముచే గ్రసింపబడిరి. ఈ కుహనా గాధి జన్మాంతరము నందిన గాధి బంధువియోగవ్యథితాంతరంగుడై దేశదేశముల వెంట నవ్యవస్థిత చిత్తుడై తిరుగు చుండెను.

ఒకనాడు కీర మండలమున సిరి సంపదలచే దులదూగుచున్న నొక పట్టణమును జేరుకొనెను. ఆ పట్టణమున సామంతరాజుల తోడను, సుందరవనితాగణముతోడను, నాగరులు మున్నగు శ్రీమంతులతో నిరంతరము ప్రకాశించు సంకుల ప్రదేశములను దిలకించెను. మణి వినిర్మిత భవన ద్వారములతో నా పట్టణము అమరావతిని బోలి యుండెను.

ఆ పట్టణమున గాధి రాజమార్గము వెంటనంటి పోవుచుండెను. ఆ పట్టణమును పరిపాలించు రాజు మృతు డగుట వలన మరియొక రాజునకై ప్రజ లన్వేషించు చుండిరి. ఒక భద్ర గజము తొండమున కొక పూలమాల నిచ్చి, అది ఎవని మెడలో వేయునో అతనిని రాజుగా స్వీకరించుటకు నిర్ణయించుకొనిరి. ఆ సమయమున రాజ మార్గమున బోవుచున్న గాధి మెడలో నా పూలమాల వచ్చి పడినది. దేవ దుందుభులు మ్రోగినవి. నగర నివాసు లానంద తరంగి

తాంతరంగులైరి. గాధి మహారాజయ్యెను. రాజ ప్రాసాదమునకు గొని పోయిరి. వరాంగనలు వచ్చి యలంకరించిరి.

ఈవిధముగ చండాల జన్మ నందిన గాధి, పూర్వజన్మ సుకృత విశేషమున కీరదేశాధిపతి యయ్యెను. అచటి ప్రజల కారాధనీయుడై యంతఃపురస్త్రీలచే సేవింపబడుచు మహారాజ భోగముల ననుభవించు చుండెను. అతని క్షాత్రతేజము సర్వత్ర వ్యాపించెను. అచిరకాలముననే రాజ ధర్మము, దేశ వ్యవహారములు నవగతము లయ్యెను. 'గవలుడు' అను నామమును ధరించి రాజ్య భారమును వహించు విషయమున మంత్రిపుంగవుల సహాయము నర్థించుచు సమర్థవంతముగ పాలించుచుండెను.

ఒకనాడు గవలుడు రాజ లాంఛనముల నన్నిటిని విడచి దైవయోగమున పూర్వాకృతికలవాడై, నగరు వెలుపల శ్యామలాకారులగు కొందరు చండాలురు జేరి కిన్నెర మీటుచుండుటను జూచెను. ఆ సమూహమునుండి రక్తనేత్రములుగల యొక ముదుసలి చండాలుడు గవలుని జూచి, 'ఓరీ, కటంజకా! ఇకృడ నుంటివేమి? చాలకాలమునకు నా అదృష్టవశమున కన్పించితివి. నాకు చిరకాల బంధుడ వగుట పరమానంద మనుభవించుచున్నాను. ఇంతకాల మే వనమున సంచరించుచుంటివి? వివరముల నన్నిటిని చెప్పుమురా!' అని పలుకరించెను. ఈ దృశ్యమును రాజ ప్రాసాదమునుండి రాజ కర్మచారులు, నంతఃపురము నుండి రాణీవాసపు స్త్రీలు జూచిరి. వాని మాటల నాలకించిరి. ఆ దినము మొదలు వారా గవలుని పూర్వమువలె గౌరవాదరములతో జూడజాలరైరి. శవమును స్పృశించిన భ్రాతనిని స్పృశించు చుండిరి. ధన విహీనుడైన పాంథుడు దేశాంతరమున నున్న విధముగ, నాదర శూన్యుడైన గవలుడు ఆ పరివారజన మధ్యమున నిస్సహాయుడై, నిరుపాయుడై యుండెను. అచ్చటివార లందరు, 'ఆహా! మనము చాలకాలము క్రిందటి నుండియు నీ శ్వపచుని

సంసర్గమున దూషితులమై యుంటిమి. అగ్నిప్రవేశ మొనరించి పరిశుద్ధులమగుదుముగాక !' యని నిశ్చయించుకొని, ఆ నగరమున నున్న నాగరులు, మంత్రులు, తమ తమ బంధువర్గముల వారితో గూడ నగ్నిప్రవేశ మొనరించిరి. 'నావలనగదా ఈ దేశమున కిట్టి యనర్థము ప్రాప్తించినది ? ఇక నేను జీవించి మాత్రము ప్రయోజనమేమి ? మరణించుటయే కర్తవ్యము' అని గవలుడు నిర్ణయించుకొని ప్రజ్వలించుచున్న ఆ అగ్నికుండమున శలభము మాడ్కి దుమికి తన శరీరము నాహుతి నొనర్చెను. ఇంతలో నా యగ్నివలన కలుగు సంక్షోభమువలన నా గాధి మునికి తెలివి వచ్చెను" అని వశిష్ఠ మహర్షి వివరించి మరియు నిట్లనెను :

"ఒక రెండు ముహూర్తములలో నా గాధి ముని నావరించిన భ్రమ తొలగిపోయినది. వెంటనే 'నే నెవ్వడను ? ఏమి చూచుచున్నాను ? ఏ మాచరించితిని ?' అని ఆలోచించుచు నా యుదక మధ్యము నుండి వెలికి వచ్చి, 'దేహధారుల చిత్తములు నిరంతరము ననంత భ్రమ దృష్టులతో పరిభ్రమించుచుండును గదా!' అని చిత్త మోహమును వీడి, కొన్నిదినములు తన యాశ్రమమునందే గడపెను. ఇట్లుండ నొకనాడు గాధి యాశ్రమమునకు ఒక యతిథి ప్రియతరుడై యరుదెంచెను. పరమాదరమున ఫల పుష్ప రసములచే నాతని దృప్తు నొనరించెను. సాంధ్యకాలమైనంతనే జప తపాదులను నిర్వర్తించుకొని, యా యిరువురును పవిత్ర కథలను వచించుకొనుచుండిరి. ప్రసంగవశమున గాధి అ యతిథిని జూచి, 'బ్రాహ్మణోత్తమా ! నీ విట్లు కృశించి యుంటి వేమి ? చాంద్రాయణ వ్రతాచరణముల మూలముననా, లేక ఏదేని మరి యితర కారణముననా, ఎరిగింపుము' అన, నాత డిట్లు సమాధాన మిచ్చెను : 'ఈ భూ మండలమున నుత్తర దిశా కుంజమున 'కీర' మను ప్రసిద్ధి పొందిన శ్రీమంత మగు జనపద మొకటి కలదు. అచట నేను ప్రజలచే బూజింపబడుచు నచట నొక మాసము దినములు గడిపితిని. ఇట్లుండగ నొకనాడు, ఒక జానపదుడు

ప్రస్తావ వశమున నిల్లు వచించెను : 'విప్రోత్తమా ! ఈ దేశమున కొక చండాలుడు పరిపాలకుడై ఎనిమిది సంవత్సరములు పాలన మొనరించెను. తుద కాతని నిజ వృత్తాంతము వెల్లడి కాగా, అగ్ని ప్రవేశ మొనరించెను. ఈ విషయము నెరిగిన పలువురు బ్రాహ్మణు లపవిత్రులమైతి మను భావమున వారును, నగ్ని ప్రవేశ మొనరించి భస్మీభూతులైరి ' అని యాతడు చెప్పగా విని, యా దేశమును పరిత్యజించి, ప్రయాగ తీర్థమున కేగి యచట స్నాన జపాదులు, ప్రాయశ్చిత్తము జేసికొనినవాడనై మూడు చాంద్రాయణ వ్రతముల నాచరించి పారణ చేసి, ఇపు డిచటి కేతెంచితిని. అదు వలన కృశించి బడలిక నందితిని' అని యా యతిథి బ్రాహ్మణుడు వచింపగా విని, యాశ్చర్యావిష్టమానసుడై గాధి : ' ఇది నా వృత్తాంతము వలె నున్నది' అని యాలోచింప దొడగెను. తరువాత తాను చండాల జన్మము నందిన దేశమును జూడ దలచి బయలు వెడలెను. అనేక దేశములను సందర్శించుచు హూణ దేశమున కేగెను. తాను చండాల రూపమున వసించిన గృహమును జూచెను. ఇంకను తాను పూర్వము భ్రాంతుడై చూచిన వాటి నన్నింటిని దర్శించెను. అప్పటి సంగతులను, సన్నివేశము లను స్మృతికి దెచ్చుకొని, ఆశ్చర్యమగ్నమానసుడై విధి విలాసమును ప్రశంసించెను.

ఆ హూణ మండలమునుండి కీర మండలమున కేగెను. తాను పరిపాలించిన నగరమున కేగి, తా ననుభవించిన విషయములను, క్రీడించిన ప్రదేశములను గుర్తించెను. తన వృత్తాంతము నంతయు నచటి ప్రజ లభివర్ణింపగా నాకర్ణించెను. ఈ మాయనే పూర్వము విష్ణుమూర్తి నాకు వచించిన విధముగ ననుభవమునకు వచ్చినది. దాని నఖండితముగ స్మరించుచున్నాను ' అని యాలోచించి యా గాధి ముని అచటినుండి మరలివచ్చి, గిరి గహ్వరము నాశ్రయించిన సింహమువలె తన నివాస స్థానమున కరుదెంచెను. ఒక పురిసెడు మాత్రము జలపానమున జీవనయాత్ర గడపుచు,

పదునెనిమిది మాసములు విష్ణుమూర్తి సంతృప్తికై తప మాచరించెను. అతడు వసించుచున్న పర్వత కందరమున నొకనాడు పయోధరము పగిది నీలదేహచ్ఛవి వెదజల్లుచు విష్ణుమూర్తి యధిష్ఠించి, 'బ్రాహ్మణోత్తమా! మహోత్కృష్టమగు నా మాయను దర్శించితివి. ఇప్పుడే ఫల మాసించి యీ తప మాచరించుచుంటివి?' అని ప్రశ్నించెను. ఆ గాధి ముని ప్రబోధితుడై అర్ఘ్యపాద్యాదులు సమర్పించి ప్రదక్షిణ నమస్కారాదులతో నర్చించి నీలజలధరమును గాంచిన చాతకము పగిది, విష్ణుమూర్తిని సందర్శించి యిట్లనెను: 'దేవాదిదేవా! నీవు మాయను దర్శింపజేసితివి. అది మహాతమోమయమైనది. దాని రహస్యము నెరుగనైతిని. అది భ్రమకదా! అది యథార్థ మెట్లయ్యెను' అనగా నా భగవానుడు, 'భూసురోత్తమా! ఈ పృథివి మొదలు సమస్తమును, అనగా జగమంతయు చిత్తమున నున్నది. కాని దానికి వెలిగా మాత్ర మెన్నడును లేదు. స్వప్నభ్రమ పదార్థముల యందు నందరు ననుభవించుచున్నారు. అనంతమగు జగజ్జాలము గల ఆ మనస్సుచే శ్వపచత్వము ప్రకటింపబడినది. ఇందుల కాశ్చర్య మొందవలసినదేమున్నది? ప్రాతిభాసికవశము శ్వపచత్వము నొందినట్లు భావించితివి. కాన నట్లే భ్రాంతి వశమున నతిథి యరుదెంచినట్లును భావించితివి. అట్లనే హూణ మండలమున ప్రవేశించిన విధమునను, కటంజకుని గృహమును జేరుకొనినట్లును, కీర నగర ప్రయాణము, నచట శ్వపచరాజత్వము ననునవి యన్నియు భ్రమమూలకములు. నీయందు శ్వపచత్వము దృశ్యమానమైన విధమున హూణ, కీరదేశవాసుల కందరకు ప్రతిబింబ రూపమున ప్రదర్శితమైనది. ఇది కాకతాళీయము. ఒకప్పు డొకే ప్రతిభ పలువురులో కాకతాళీయ స్థితివలె కలుగుచున్నది. మనోగతి విచిత్రమైనది కదా! హూణ మండలమున నీ కటంజకుడను శ్వపచుని రూపముగలవాడ నైతినను భ్రమచే పూర్వ మా రూపము

సిద్ధించినది. అట్లే విధి వశమున కళత్ర వియోగ మేర్పడినది. దేశాంతరయాన మొనర్చి కీర మండలాధిపతివై యనంతర మగ్ని ప్రవేశ మొనరించితివి. అప్పుడు స్వసంబంధమగు ప్రతిభ, కటంజాచార స్థితిని కేవలము చిత్తమునసే కల్పించినది. ఆత్మ జ్ఞాన శూన్యుడు, 'ఇతడు-అతడు, నేను-నీవు, ఇది, అది, నాది' అను భేద భావనలలో మునుగుచున్నాడు. తత్త్వ జ్ఞాని, 'ఈ సర్వము నేనే' అను భావము కలిగియుండుట వలన పరితాపము నందుట లేదు. బ్రాహ్మణశ్రేష్ఠా! ఈ సంసార మనునది అంతము లేనిది. ఆత్మ చింతనచే నిది క్షయించును. తత్త్వజ్ఞుడు పద పదార్థముల యందు భేదబుద్ధియను ననర్థ భావమును భావింపడు. అందువలన మనోభ్రమను నివారింప లేకున్నావు. కాన, క్షణములో దానిచే తిరిగి యాక్రమింప బడుచున్నావు. ఈ జగద్రూపమైన మాయా చక్రమున కంతటికిని చిత్తము నాభిస్థాన మగును. ఆ చిత్తమును నిరోధించినచో నేమియు బాధింపదు లెమ్ము! నిర్బాధామనస్కుడవై ఈ గిరికుంజమున పది సంవత్సరములు తప మాచరింపుము. అనంతరము అనంతమైన జ్ఞానమును పొందగలవు' అని ప్రబోధించి విష్ణుమూర్తి మాయమయ్యెను. వివేకజనిత వైరాగ్యమును గాధి పొందినవా డయ్యెను. కరుణార్ద్రాత్ముడై నియమ మవలంబించి వేరొక పర్వతమునకు బోయి, తన సంకల్ప సంచయమును పరిత్యజించి, దశ వర్షములు తీవ్ర తప మాచరించి కడ కాత్మజ్ఞాన సంపన్నుడాయెను. మహానుభావుడగు గాధి, ఆత్మజ్ఞానవంతుడై సంసార సంబంధమైన శోకమును విడచి, భోగ భూమియం దిచ్ఛ లేనివాడై, జీవన్ముక్తరూపము ధరించి ప్రశాంత మనస్కుడై సకలకళాపరిపూర్ణుడైన చంద్రుని విధమున ఆత్మయందు నానంద మందు చుండెను.

## 6. ఉద్దాలకోపాఖ్యానము

చిత్తశాంతికై మాయావైచిత్ర్యమును గూర్చి గాధ్యుపా ఖ్యానమున నభివర్ణితమైనది. ఇపుడు 'దృఢయోగాభ్యాసము వలన

చిత్తచాంచల్యము కలిగినను, శాంతి లభించును' అని నిరూపింప దలచినవాడై వశిష్ఠ మహర్షి ఈ ఉద్దాలకోపాఖ్యానమును వచించినాడు.

"శ్రీరామచంద్రా! అతి విస్తృతమై, దురవగాహమై, మహామోహజనకమై, విషమమగు పరమాత్మ సంబంధమైన మాయ ఈవిధముగ ప్రవర్తించుచున్నది. కాన, ప్రతిదినమును విషమ మగు నిది, సావధాన మనస్కుడు కాని వానిని ప్రమాదములో పడవేయుచున్నది. చిత్తమును నిరోధించుట యను నౌషధము కంటె నీ సంసార రోగమును నివారించు నుపాయ మింకొకటిలేదు. క్రమాగతమైన వర్తమానమును క్షణకాలము బాహ్యబుద్ధితో ననుభవింపుము. భూత, భవిష్యత్తులను గూర్చి విచారింపని చిత్తము నిర్వికల్పత్వము నందును. సంకల్పమును, ఆశను, అను సంధానమును ప్రతిక్షణము వర్జించినచో పవిత్రమైన ఆ నిర్వికల్ప త్వము వర్జించినచో పవిత్రమైన ఆనిర్వికల్పత్వము నందగలవు.

ప్రత్యగాత్మ స్వరూపము : నిర్వికల్పమైన చిత్తము 'ప్రత్యగాత్మ' అనబడును. నిర్మనస్క-స్వభావ మగుటవలవ నచట 'అజ్ఞానము' అను మల ముండదు. అదియే సత్యత్వము. అది శుభత్వము. ఇది పై వాటి కన్నిటికి మూలము మానసికోద్యమ నిశ్చయము చేతను అవివేకమును తొలగించి శాస్త్రములు, సత్పురుషులు మున్నగువాటితో బలాత్కారముగ ననుసంధానము జేయవలెను.

ఆత్మానుసంధానక్రమము : ప్రలాపించుచు, విడచుచు, గ్రహించుచు, కనులు మూయుచు, తెరయుచు సంకల్ప రహితమగు ఆ అనంత పరమాత్మయందు జ్ఞానమాత్రపరుడవై యుండుము. 'ఇది నాది, వా డతడు, నే నితడు' అనువాసనలు పరిత్యజింపబడవలయును. ఏకనిష్ఠుడవై అంతరంగమందున్న జ్ఞానమాత్రపరుడవు కమ్మా. అజ్ఞానమును గుర్తించి, దానిని పరిత్యజించి, మనస్సును నిర్మల మొనరించుకొనుచు, ఆశాపాశానలమును ఛేదించి స్వప్రజ్ఞామయుడవు

కమ్ము. రామచంద్రా! శుభాశుభకర్మ విచక్షణ దూరుడవు, ఆశా విషూచికాంత మొనరించిన వాడవు. ఇష్టాయిష్ట దృష్టి నశింపజేసు కొనినవాడవు, విజ్ఞానసారపరుడవు కమ్ము. 'నేను-నీవు' అను భావమును విడచి. ప్రపంచ స్థితియందు నేవిధమైన భావములేని వాడవై పరమాత్మను ధ్యానించుచు, యజ్ఞస్తంభమువలె స్థిరుడవై యుండుము. ఈ సంసారభ్రమకు హేతువైన మోహ మపుడు తొలగిపోవును. నిర్మలము, నాశరహితమునగు నాత్మయందు స్థిరత్వము కలుగును. ఆత్మ స్వరూపమును సాక్షాత్కరింపజేసుకొని ఆనందమయ స్వరూపుడై యున్నవానికి, మధుర రసాయనముగూడ ప్రతికూలమగు విషయమువలె భాసించును కారుమబ్బులు క్రమ్ము కొనగా గాఢాంధకార మలముకొనినట్లు, వాసనలతో చిత్తము ప్రబలము కాగా, ఆత్మజ్ఞానము దూరముగ తొలగిపోవును. అనాత్మ యందు నాత్మ భావనచే, దేహమాత్రమునందుగల స్థిరబుద్ధిచే దారాపు త్రాది కుటుంబాభిమానముచేతను చిత్తము ప్రబల మగుచున్నది. ఇంతియేకాదు. అహంకార వికారము చేతను, మమత్వభావనము మూలముననుం, మమతారూపమగు మలిన విలాసము చేతను, శారీరక మానసిక వ్యాధి విలాసముచేతను, సంసారము నందలి విశ్వాసము చేతను, హేయాదేయ విభాగము చేతను, స్నేహము మూలముననుం, ధన లోభము వలనను, మణియోషితా లాభముననుం, అతిరమణీయ సౌఖ్యముల మూలముననుం, దురాశాక్షీరపానము వలనను మనస్సు స్థౌల్యము నందును. కాన, శ్రీరామచంద్రా! ఉద్దాలకునివలె పంచభూతములను జయించి, ధైర్య బుద్ధితో నంతరంగమున జరింపుము" అని వశిష్ఠుడు వచింప శ్రీరామచంద్రు డిట్లనెను: "మహానుభావా! ఉద్దాలకు డెట్లు పంచభూతోన్మాదమునుండి తొల గెను? ఆ విధ మెరిగింపుము" అన, నీవిధముగ వశిష్ఠుడు వివరించెను.

" రామచంద్రా! ఉద్దాలకుడు పంచభూతములను జయించి ఆత్మజ్ఞానము వందిన విధము నభివర్ణించుచున్నాను.

సావధానుడవై యాలకింపుము. పుష్పసమాకీర్ణమై, కర్పూర ద్రుమ ధూసరమైన గంధమాదనశైలేంద్ర సమీపమున నొక ప్రదేశము కలదు. ఫల పుష్ప వృక్ష సమృద్ధమైన అచట నొకచరియ యందు కఠిన తపశ్శాలియగు 'ఉద్దాలకుడు' అను మహర్షి కలడు. ఆతడు మొదట అల్ప ప్రజ్ఞ కలవాడయ్యె. నిరంత రాలోచనా పరత్వమునను, తపస్సు మూలమునను, శాస్త్రార్థ చర్చలతోడను, నియమముల మూలమునను క్రమముగ వివేకవంతు డయ్యెను. మానవుడు దుఃఖజాలములో జిక్కుకొనకుండు నుపాయ మెద్ది అని యాలోచించెను. 'సంకల్పరహితమైన పరమపావన పదమున మేరుపర్వతశిఖరాగ్రమున పయోదము రీతి చిరకాలము నేను విశ్రాంతినందుదునుగాక ! నాలోని భోగవాసనలు శాంతించునుగాక! అది, ఇది చేయవలయును అని హృదయము చంచలమై యున్నది. ఈ కల్లోలభరితమైన నావను, పరమప్రజ్ఞతో నాశా సముద్రతరంగ ముల నుండి ఎట్లు తరింపజేతును ? ఇచ్ఛానిచ్ఛలులేనివాడనై హేయోపాదేయములను వర్జించి, బ్రహ్మపదమును జేరి నే నెపుడు శుభముల నందగలను ? సంకల్పము లుపశాంతి బొందినవాడనై, ఈ పర్వతగుహాయందు, నిర్వికల్ప సమాధినిష్ఠుడనై, మూకత్వము నందియున్న, నా శిరమున నడవి పక్షులు గూళ్ళు నిర్మించుకొని యెపుడు వసించునోకదా!' అని ఆ వనమందు చింతాపరుడైన యుద్దా లకుడు మాటిమాటికి గూర్చుండుచు, లేచుచు, ధ్యానాభ్యాసము జేయు చుండెను. మర్కటమువలె చంచలమైన చిత్తము, విషయాకర్షిత మగుచుండగా, సంతోషప్రదమగు సమాధియందు స్థిరత్వము నందజాలకపోయెను. బాహ్యసంస్పర్శలను విడువగా నాతని చిత్త మర్కటము అంతస్స్పర్శసంచయముల నందుచుండెను. ఆ అంతరంగ విషయములను విడువగా బాహ్యవిషయముల నాశ్ర యించును. మరి యొకప్పుడు బెదరిపోయిన పక్షివలె నెగిరిపోవును. ఒకప్పు డుదయించు సూర్యకాంతికలదియై విస్తరించిన తేజస్సు కలదగును. మరియొకప్పుడు, కేవ లాకాశమువలె నుండును.

ఇంకొకప్పుడు, గాఢాంధకారమయమై యుండును. ఇట్లు పర్యాకులస్వాంతుడైన ఆ యుద్దాలకుడు ధ్యాన వ్యాపారముల యందు మిక్కిలి యుత్సుకతగల మనస్సు గలవాడై, విరాగముతో నా పర్వతమున విహరించుచుండెను.

ఒకనాడు జన దుష్ప్రాప్యమగు నా గిరి గహ్వరమున, పుష్ప గుచ్ఛయుక్తమైన పత్రములతో నొక యాసనమును కల్పించు కొనెను. దానిపై మృదు మృగాజినమును పరచి, అందు గూర్చుండి మనస్సును కృశింపజేయుచుండెను. ఉత్తరాభిముఖుడై, పద్మాసనమును దృఢముగ బంధించి, పాదమూలమున వృషణ ముల నదిమి యుంచి, బ్రహ్మసంబంధమైన యంజలిని ధరించి, మనోమృగమును వాసనలనుండి పైకి లేవనెత్తి, నిర్వికల్పసమాధి కొరకై యాలోచనజేసెను: 'ఓమూర్ఖచిత్తమా! ఈ సాంసారిక వ్యాపారముల వలన ప్రయోజనమేమి? బుద్ధిమంతులు దుఃఖ ప్రదమగు నీ కృత్యము నెన్నడు నాచరింపరు. శాంతిరసాయన మును విడచి, భోగముల వెంట పరుగులిడువాడు, మందార వనమును వీడి విషవృక్షము నాశ్రయించినట్లగును. పాతాళ మున కేగినను, బ్రహ్మలోకమున కేగినను ఉపశమనా మృతము లేకుండ సుఖ మొందలేవు. భావాభావమయాత్మకములగు నీ విచిత్రము లయిన కల్పనలు దుఃఖములను కలిగించును గాని ఎన్నడును సుఖప్రదములు గావు. మూఢ మానసుమా! హతప్రవృత్తులు కల నీ శబ్దాది విషయములను పొందెడివానితో నేమి ప్రయోజనము? ప్రయోజనవంతము, ప్రశాంతము, నాత్మానందసంధాయకము నగు దానిని గూర్చి యారాటము జెందవేల? వ్యర్థముగ నుపబృంహిత మగు శ్రోత్రత్వమును పొంది, శబ్దానుసారి యగు బుద్ధితో మృగమువలె పరుగిడుచున్నావు. దీనివలన వినాశము ప్రాప్తించును. స్పర్శ ప్రధానమగు చర్మేంద్రియత్వమును పొంది దుఃఖమునకై

సంభోగాసక్త గజేంద్రమువలె బంధ ప్రాప్తి నందకుము. రసనా భావము నంది, నీచమగు నన్న రసము ననుభవింప దలచి గాలమున జిక్కుకొన్న మత్స్యశాబకము విధమున వినాశ మందకుము. కాంతి రూప సముదాయోన్ముఖమైన చాక్షుష వ్యాపారము నాశ్రయించి, కాంతి లుబ్ధమైన శలభము చందమున భస్మము గాకుము. శరీర మను పద్మాగార గంధోన్ముఖమైన వాంఛతో ఘ్రాణ మార్గము నాశ్రయించి, తుమ్మెదవలె బంధప్రాప్తి నందకుము. కురంగము, తుమ్మెద, మిడుత, ఏనుగు, చేప యనునవి యొక్కొకటి ఒకొక్కదాని కాశించి యనర్థముల పాలయ్యెను. ఇక సుఖ మెచ్చట గలదు? చిత్తమా! ఈ వాసనాజాలమంతయు బంధప్రాప్తికే యగును. దానిని విడచి, శాంతి నందితి వేని నీ కనంత విజయము ప్రాప్తించును. నిన్ని విధముగ నేల యనుసరించుచుంటి ననగా, విచారవంతు డగు పురుషునకు చిత్తత్వమే లేదు కదా! అనంతమగు నాత్మతత్త్వమునకు మనస్సునందుండుట యన, బిల్వఫల మందు మత్తేభము వసించుట వంటిది. పాదాంగుష్ఠము మొదలు శిరము వరకు ప్రతికణమును గూర్చి విచారించినను, 'నేను' అనునది లభింపదు. కాగా, ఈ 'నేను' అనునది ఎట్టిది? ముల్లోకముల యందును, దశదిశావ్యాప్తమై, సర్వత్ర వ్యాప్తమై, సంవేద్యాసంవేద్య మైన దానినొకదానినే చూచుచున్నాను. ఇది నామ రూప రహిత మైనది ఏకత్వ, నానాత్వములు, స్థూలత్వ అణుత్వములు లేనిది. జ్ఞానరూపుడ వగుట వలన సంవేద్యుడ నగు నాయందు నీవు దుఃఖ కారణుడవు. వివేక జనిత జ్ఞానముచే నీవు నాచే హతుడ వగు చున్నావు. ఇది మాంసము, ఇది రక్తము. ఈ దేహమునందే యుండునవి యగు నివి ఎముకలు. ఇవి శ్వాసకోశములు. ఇక 'నేను' అను వారలెవ్వ రున్నారు? మాంసము వేరు. రక్తము వేరు. ఎముకలు వేరు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు వేని కవి వేరు వేరుగ నుండును కదా! ఈ చలనము వేరు. ఇక 'నేను'

అనుదానికి స్థాన మేది ? ఇది ఘ్రాణేంద్రియము. ఇది జిహ్వా. ఇది చర్మము. ఇది శ్రవణేంద్రియము. ఇది చక్షువు, ఇది స్పందము. ఇచట 'నేను' అనున దెచ్చట కలదు ? 'ఈ జగత్తంతయు నేను. నేను కాని దేదియు లేదు' అను భావము కలిగియుండుట సత్యదృష్టి. దీనికి వేరైన దేదియు లేదు. 'అజ్ఞానము' అను మదించిన తోడేలుచే నడవియందలి యావు దూడ విధముగ నేను చిరకాలము హింసింప బడితిని. ఈ అజ్ఞాన చోరుడు, ఈనాడు దైవయోగమున నాకు లభించినాడు. స్వరూపాపహారియగు నీతనిని మరల నాశియింపను. చక్షురాది ఇంద్రియములు స్వయముగా వాసనా రాహిత్యమును పొంది బయట ప్రవర్తించు చున్నవి. స్వార్థమున కీ వాసనలు కారణములు కావు కాన, మూర్ఖములగు నింద్రియములారా! సహజములగు నంతర్వాసనలను పరిత్యజించి కర్మాచరణమునకు గడంగుడు. ఏవిధము లగు దుఃఖము లంద కుందురు గాక ! మీ నుండి యుద్భవించి, మిమ్ములనే బంధించు ఆశలచే తనలో నుండి బుట్టి తననే బంధించు పట్టుపురుగులలోని దారముల విధమున వినాశము కావలదు. సర్వేంద్రియ కోశములయం దుండెడి చిత్తమా ! విధిగా సర్వేంద్రియైక్యము నొంది, నిన్ను అసత్స్వరూపముగ భావించి, నిర్మలమగు మోక్ష స్వరూపముగ నుండుము. అనంతమగు, విషయరూపమగు విష విషూచిక నిపుణ మైనది. దాని యహంకార వాసనను, వాంఛాపరిహారమాత్రమను నుపాయముతో దొలగించి, భయముతో శరీర రహితుడవై, భగవద్వైభవమునందుము' అని, మరియు నా యుద్దాలకు డిట్లు తలపోసెను :

'సంకల్పవృక్షమును, ఆశాలతను, మనోవనమును ఛేదించి, విస్తీర్ణమైన ప్రదేశమును పొంది సుఖముగ విహరింతును. అటు తరువాత బ్రహ్మపదమున కేగెదను. నేను కేవలుడను. విజయము నందుదును. నిర్వాణము నేనే, నిరంకుశుడను, నిష్కాముడను,

నిరిప్సితుడను. స్వచ్ఛత్వమువలన సంపాదింపబడినది, హృద్యమైనది, సత్యత్వమైనది యగు ఆనందమున నుపశమింప జేయబడినది, సత్తాత్మకమైనది, గౌరవింపబడినది, ఆనందోదితమైనది, పూర్ణత్వము నైనదియు నగు నాత్మయందు రతిగల నాకు, సమాధి మగ్నము కాని సమయమందు హృదయవల్లభల విధమున నిత్యము నానందింప జేయుచున్నవి" అని చెప్పి వశిష్ఠుడు మరియు నిట్లనెను:

"ఉద్దాలక మహర్షి స్వచ్ఛమైన బుద్ధితో నిట్లు నిర్ణయించుకొని పద్మాసనాసీనుడై, అర్ధోన్మీలితలోచను డయ్యెను. బ్రహ్మరంధ్రమునుండి తార స్వరమున ప్రణవము నుచ్చరించు చుండెను. ఊర్ధ్వముఖుడైన యాతని నుండి వెలువడు 'మ' కారాత్మకమైన మొదటి ధ్వని అత్యుబ్ధమైన ప్రాణవాయువు కలదై శరీరమున ప్రతిధ్వనించెను. (రేచకమను ప్రాణము వెలికివచ్చు మార్గము. అనగా శరీరములోపలినుండు వాయువును, నాసికాపుటముల నుండి వెలికి రప్పించుట) అగస్త్యుడు జలమును ద్రావి సాగరమును శూన్యమొనరించిన, విధమున ఈ రేచక విధానమున నా యుద్దాలకుడు శరీరమును శూన్యము గావించెను. చిద్రసముచే నిండిన ఆ శ్వాసమునందు ప్రాణవాయు వుండెను. హృదయాగ్ని రేచకవాయు జ్వలితమై మలిన శరీరమును దహించెను. ప్రాణాయామమునకు ప్రథమ సోపానమునందు రేచక రూపమగు నీ యవస్థ ఇచ్ఛామాత్రమే గాని, హఠయోగమునందువలె బలవంతమైనదికాదు. హఠయోగము దుఃఖప్రదముకదా! ఈవిధముగ నాకాశమునందు ప్రాణవాయువు నిరోధించిన చిత్తమునకు సమస్థితి కలుగుటకు ప్రణవముయొక్క రెండవ భాగమగు 'ఉ' కారము నుచ్చరించు సమయమున, నా యుద్దాలకుడు కుంభక, ప్రాణాయామ మవలంబించెను. శరీరమునకు వెలుపలగాని, లోపలగాని, పైనగాని, క్రిందగాని ప్రాణములు చర్మపు తిత్తియందు నిరోధింపబడియుండు విధమున చలించనివాడై యుండెను. దేహమను,

పురమును దహించిన యగ్ని, క్షణకాలములో పిడుగువలె శాంతించెను. శరీరము తెల్లని మంచు విధముగ, భస్మము వగిది కనిపించెను శరీర మందలి ఎముకలు కర్పూరశయ్యపై శయనించుచున్నట్లుండెను. ఆ భస్మము చండమారుతాహతమై మింటి కెగసి, శరత్కాల పయోదము భాతి ప్రకాశించి, క్షణ కాలములో మాయ మయ్యెను. ఇట్లు ప్రణవము యొక్క రెండవ భాగమగు 'ఉ' కారము నుచ్ఛరించు నప్పుడు కుంభకము ఇచ్ఛా మాత్రము గాని హఠయోగము నందువలె బలవంతము కాదు. అనంతరము ప్రణవముయొక్క మూడవ భాగ మగు 'మ' కా రము నుచ్ఛరించునప్పుడు ప్రాణాయామాంగమగు పూరకమున నుండెను. ఈ సమయమున ప్రాణములు చేతనమునను అమృత మధ్యవర్తులై మంచును స్పృశించిన విధముగా నతి శీతలముగ నుండును. క్రమముగ నాకాశ మధ్య మందున్న ధూమములు చల్లని మేఘ రూపము ధరించినట్లు, ప్రాణవాయువులు చంద్రమండల రూపము నాశ్రయించెను. ఆ చంద్రమండలమున షోడశకళా పరిపూర్ణత్వము లగుటవలన రసాయన మహాధారా సంపన్నము లయ్యెను. పూర్వము శంభుని శిరము నుండి పుడమిపై బడిన గంగా ప్రవాహమువలె భూమిపై మిగిలియున్న శారీరక భస్మము నందు నా రసాయన మహాధారలు వర్షించెను. అంత నా యుద్దాలకుని శరీరము చంద్రబింబమువలె ప్రకాశించుచు, నాలుగు భుజములు కలిగి నారాయణ స్వరూపమై భాసించెను. రసాయన మయములగు ప్రాణము లా శరీరమును పూరించెను. అనంతరము శరీరగతమైన కుండలినీ శక్తిని నింపెను. ఈ విషయమును వివరించుట వలన రేచక, కుంభక, పూరకముల ద్వారా శరీరమును శోషింప జేయుట, దహించుట, శుద్ధి జేయుట అను యోగము వివరింపబడినది.

ఆ యుద్దాలకుడు తన దేహమును పద్మాసనమున నిలిపిన వాడై, పంచేంద్రియములను స్తంభమునకు గట్టిన ఏనుగును వలె బంధించి, తుమ్మెదవలె చల స్వభావము గల చిత్తమును హృదయాబ్జ

మున సేతువు జలమును నిరోధించిన విధముగ నిరోధించెను. సంధ్యా కాలమందలి కమలములవలె ప్రకాశించు నేత్రముల నర్ధనిమీలితలు గావించి, మౌనముద్రాలంకారుడై ప్రాణాపాన వేగమును ముఖమున నిరోధించి, ఇంద్రియములను వాని విషయములనుండి బలవంతముగా మరలించెను. బాహ్య స్పర్శలను నిశ్శేషముగ విడచెను. అంతర విషయములలో లీనమయ్యెను. నవద్వారములను బంధించెను. ఇట్లు ధీరుడగు నా యుద్దాలకుడు ఆత్మరత్నప్రకాశముచే నొప్పుచుండు పుష్పమాలికాలంకృతమైన తన కంఠమును మేరుపర్వత శిఖరము వలె సమముగ నుంచెను. తనలో నుండి యుద్భవించుచున్న భ్రాంతు లన్నిటిని మనస్సుచే ఛేదించెను. అపుడు వివేక మను భాస్కరుని గప్పియున్న అజ్ఞానాంధకారము తొలగి పోయెను. హృద్గతమగు నజ్ఞానాంధ్యము విడిపోయినది. కమనీయతేజఃపుంజము గోచరించెను, కొంతసేపటికి నా తేజఃపుంజము గూడ దూరమయ్యెను. ఇపుడు చలచిత్తుడగు నా మునికి ప్రశాంతి లభించినది. సుఖనిద్ర ననుభవించి, మరల మేల్కాంచెను. ఆకాశమున సంవిత్తు అనగా సూర్యుడు ఉదయించెను. దానిని కూడ నా మహాముని తొలగించెను. తమోనిద్రా మోహము నాశ్రయించెను. అటుతరువాత నదియు పరివర్జితమై నిర్వికల్ప సమాధిని క్షణకాల మాశ్రయించెను. సేతువుచే నరికట్టబడిన జలము స్వస్థానమును జేరుకొనిన విధముగ నాతని మనస్సు వెంటనే విశ్రాంతిని పొంది, సర్వాత్మకమైన చైతన్యము నందెను. చిరకాలము స్వరూప చైతన్యము నను సంధించుట వలన నాతడు చిద్రూపత్వమును పొందెను. అతని చిత్తము చిత్తత్వమును వీడి, సహజమగు చిద్రూపమైనది. దృశ్యమును వీడి, చిన్మాత్ర మయ్యెను. వాసనారహితమై వ్యాపకమగు చిదాకాశ మయ్యెను. అందు దృశ్య దర్శన రహితమై యుత్తమాస్వాద్యంబగు నపరిమితానందము నందెను. జీవ భావ పరిత్యక్తుడై చిదాకాశమున చాలకాలమువరకు నుండి, వ్యోమగాములగు సిద్ధులను, దేవతలను ననేకమందిని దర్శించెను. వారిని జూచియు, వారు తన

దరికి జేరినను ఆసక్తి లేనివా డయ్యెను. ఈవిధమగు నుదాసీన భావముతో సూర్యు డుత్తరాయణమున నుండు విధమున నా పర్వత కూటమున, ఆనంద మందిరమున నారు మాసముల వరకు వసించెను. సిద్ధులు, సాధ్యులు, బ్రహ్మాదులు పొందదగిన జీవన్ముక్తపదము నాతడు పొందెను. ఏవిధమగు చిత్త విపరిణామము లేనివాడై ఆనంద సాగరమున మునుగుచు, దేలుచు కడ కానందస్వరూపుడై భాసించెను. అది జీవన్ముక్తిపదము. అది శాశ్వతమైనది, శ్రేయస్కరమైనది. సాధువు లీ పదవిని క్షణకాలములోగాని, వర్షశతములోగాని పొంది పునర్జన్మహేతువగు ప్రపంచవాసను పొందరు.

ఈ యుద్దాలక మహర్షి సిద్ధులను, దేవతలను దూరముగ విడచి ఆరు నెలలుండి, కనులు దెరచి పూర్ణచంద్రనిభాంగులగు సిద్ధులను దర్శించెను. తమతమ స్త్రీపరివారములతో గూడి విహరించుచున్న విద్యాధరులను దర్శించెను. వారు నాయనను తిలకించి : 'మహామునీ ! మా వందనము లందుకొనుము. మమ్మను గ్రహ దృష్టితో జూడుము. ఈ దివ్యవిమానము నధిరోహించి స్వర్గమునకు దయచేయుము. సర్వలోకగతములగు భోగముల కన్నిటికి నదియే పరమావధి. అచట కల్పాంతము వరకు వాంఛితామరభోగము లనుభవింపుము' అనిరి. ఉద్దాలకుడు వారి మాటల నాలించి గౌరవపురస్సరముగ పూజించి, భ్రాంతి విడచి, స్వర్గ సౌఖ్యములపట్ల ననాదరము జూపుచు : 'సిద్ధులారా! మీరు మీ మీ వాస స్థానముల కేగుడు' అని పలికి తన వ్యాపార నిమగ్నుడయ్యెను. భోగవిరక్తుడై, స్వకర్మపరాయణుడైన యాతని నా సిద్ధులు కొన్నిదినములు సేవించి, స్వస్థానముల కేగిరి. జీవన్ముక్తుడగు నా మునియు నా వనములయందు, ఋష్యాశ్రమములందు యథా సుఖముగ విహరించుచు, ధ్యాననిష్ఠుడై యొకప్పు డొకదినమును, మరియొకప్పుడు మాసము దినములును, నింకొకప్పు డొక సంవత్సరమును, వేరొకప్పుడు కొన్ని సంవత్సరములును కాలము గడపెను. జీవన్ముక్తిపదము

నంది, జన్మపాశములనుండి విడువడి సందేహరహితుడై, శాంత మనస్కుడై, నిర్మలమగు చిదూపుడై యా యుద్దాలకుడు మోక్షము నందె" నని వశిష్ఠ మహర్షి వర్ణింప, శ్రీరామచంద్రు డిట్లనెను :

<u>సత్తా సామాన్య లక్షణము</u> : "ఆత్మజ్ఞానమను సహస్సునకు సూర్యునివంటివాడవు, నా సందేహము లను తృణముల కగ్ని హోత్రుడవు, అజ్ఞాన దాహమునకు శీతమయూఖుడవు నగు నో మునీంద్రా ! ఇపుడు నాకు సత్తా సామాన్యము నెరిగింపుము" అని శ్రీ రా మ చం ద్రు డు ప్రార్థింప వశిష్ఠు డీవిధముగ ప్రబోధించెను :

"శ్రీరామచంద్రా ! ఈ దృశ్యము యథార్థముకాదు. అనుభావోదయమువలన చిత్తము లయించును. అపుడు చిత్తు యొక్క సామాన్య రూపమునకు సత్తా సామాన్య రూపము సిద్ధించును. బాహ్యము, నాభ్యంతరము సమస్తము లేదని నిశ్చ య్యించి చిత్తము ఆత్మయందు వసింపగా. సత్తా సామాన్య రూపము కలుగును. కూర్మము తన యవయవములను తనయందు లయింప జేసికొను విధమున, దృశ్యములు తనయందు లయ మొందు నేని, ఆత్మకు సత్తా సామాన్య రూపము సంభవించును. తుర్యా తీతపదమను పేరుగల శ్రేష్ఠమగు నీ స్థితి, దేహ దేహుల కిరువురకు సిద్ధించుచున్నది. 'జాగ్రత, స్వప్నము, సుషుప్తి' అను మూడింటి లోను ననువర్తించు సాక్షి చైతన్యమును 'తురీయ'మందురు. దీనికి నతీతమైనది తుర్యాతీతము. ఈ జ్ఞానదృష్టి, సమాధినిష్ఠుడగు జ్ఞానికి మాత్రమే కలుగును. కాని, అజ్ఞానికి కలుగదు. ఈ దృష్టి కలవారమగు నస్మాదృశులు, నారదాదులు తుర్యాతీతము నాశ్రయింతుము. బ్రహ్మ, విష్ణు, ఈశ్వరాదులును సమస్తభయ వినాశినియగు నీ జ్ఞానదృష్టి కలిగి యుందురు. ఉద్దాలకుడును. తన ఇచ్ఛానుసారము నీ జగత్తు ననుగ్రహమున నున్నవాడై, కొంత

కాలమునకు దేహపరిత్యాగము నొనరించి విదేహ కైవల్యము నొందుదును గాక !' అని స్థిరబుద్ధికలవా డయ్యెను. ఆ కొండ గుహాయందు జిగురు టాకుల యాసనమునందు, పద్మాసనాసీనుడై అర్ధోన్మీలితలోచనుడై యుండెను. నవరంధ్రములను బంధించి, ఇంద్రియములను తమతమ విషయములనుండి మరలించి, ఖేచరీ ముద్రా విధానమున తాలు మూలముల నడుమ నాలుకను వర్తింప జేయుచు వెలుపలకు, లోపలకు; క్రిందకు, మీదికి దృష్టులు ప్రసరింపనినాడై, దంతములు కదులనీయక, ప్రాణవాయువును నిరోధించి, తేజోవంతమైన ముఖము కలవాడై, స్వరూపచైతన్య సాక్షాత్కారమున రోమాంచము కలిగి, అనుసన్యాతమగు చిన్మాత్రరూపము నాశ్రయించి యుండెను. దీనివలన నుత్త మానందప్రాప్తి యయ్యెను. ఆ యానందానుభవమున, చిత్సా మ్యములు నశించినవి. పరిపూర్ణము, నపరిచ్ఛిన్నము నగు సత్తా సామాన్యమును పొందెను. అప్పు డుత్కృష్టమగు విశ్రాంతి లభించినది. నిర్వికారు డయ్యెను ఇట్లుండ కొంతకాలమునకు నిర్మలమగు నిజరూపములో లీనమయ్యెను.

## 7. సురఘూపాఖ్యానము

ఉద్దాలకోపాఖ్యానమున 'యోగాభ్యాసము దృఢమైనచో చిత్త విశ్రాంతి కలుగుననియు, నది సమాధి కన్న నుత్తమావస్థ' యనియు ప్రవచింపబడినది. ఇపుడు 'చిత్త విశ్రాంతియే జీవన్ముక్తి పరమావధి'యని ఈ సురఘూపాఖ్యానమున ప్రతిపాదింపబడుచున్నది.

"శ్రీరామచంద్రా ! సురఘుడు, పరిఘుడు నను నిరువురు జ్ఞానులు కలరు. వార లీ జగత్క్రమమును బాగుగ విచారించి పరస్పరము పూజించుకొనుచు సంతుష్టులై, తమ తమ వ్యాపారము లలో మగ్నులగుచుండిరి. నిత్యము నధ్యాత్మ విచారపరుడు, అంతర్ముఖుడు, చిదనుసంధానుడు, సుఖవంతుడు నై యుండును.

అత డెన్నడును శోకము ననుభవింపడు. ఈ సంసారార్ణవము నుత్తరించుటకు మహానుభావుల సాంగత్య మత్యావశ్యకము. సంసార మగ్నుడైన వానిని ధనములు గాని, మిత్రులు గాని, శాస్త్రములు గాని, బంధువులు గాని ఎవ్వరును నుద్ధరింప జాలరు. సర్వకాల సర్వావస్థలయందును తనను విడువక, అనుసరించి యుండు 'మనస్సు' అను స్నేహితునితో గూడి ఆలోచన మొనరించి ఆత్మను సంసారమునుండి యుద్ధరింపుము.

శ్రీరామచంద్రా! ఉద్దాలకునివలె నీవు విచారించుకొని, బ్రహ్మపదమునందు విశ్రాంతి నందుము. ఈ దృశ్యము లన్నియు నసత్యము లను భావము సతతాభ్యాసము వలనను, గురూపదేశము మూలముననను, శాస్త్రచింతనచేతను నలవడును. వీనివలన వైరాగ్యము సిద్ధించును. దీనివలన బ్రహ్మపదము కరతలామలక మగును, ఇట్టి సాధన సంపత్తి లేక బ్రహ్మపదము లభింపదు" అనగా, శ్రీరామచంద్రుడు, "త్రికాలవేదివగు మహానుభావా! ఒకడు సమాధినిష్ఠుడై యుండి, మేల్కొనిన తరువాత వ్యవహారపరుడయ్యు నాత్మయందు విశ్రాంతి నందుచున్నాడు. వేరొకడు నిర్జనప్రదేశ మున నిరంతర సమాధినిష్ఠుడై యుండును. ఈ యిరువురలో నెవడు శ్రేష్ఠుడో ఆనతీయ వలయును" అని ప్రశ్నించెను. అంత వశిష్ఠ మహర్షి ఇట్లు వివరించెను:

"రామచంద్రా! 'సమాధి' యనగా ఈ దృశ్యమాన ప్రపంచము సత్యము, శాశ్వతము కాదని భావించి చరించుట. దీని వలన నంతశ్శీతలత జనించును. ఈ అంతశ్శీతలత అనంతతపఃఫలము. ఇట్టి భావము కలిగియుండువాడు వ్యవహారపరుడైనను, లేక నిరంతర ధ్యాననిష్ఠుడైనను సుఖ మనుభవించును. సమాధినిష్ఠుడగు వాని మనస్సు, హర్ష విషాదముల వలన చంచలమైనచో నట్టి సమాధి వలన ప్రయోజనము లేదు. ఉన్మత్తతాండవ మాడువాడు వాసనా పరిత్యాగ మొనరించినచో ప్రాజ్ఞ సమాధి వంతుడే యగును. జ్ఞానియై

వ్యవహారపరుడైనవాడు గాని, అడవియందు సమాధినిష్ఠుడై యున్నవాడు గాని యిరువురును సమానులే యగుదురు. వీర లిరువురు నాత్మతత్త్వము నెరిగినవారలే యగుదురు. వాసనా రహితమగు మనస్సు, దూరమునందున్న వాని మనస్సు సమీప వర్తియగువాని విషయము గుర్తించని విధముగ తాను జేయు పనులకు కర్తకానేరదు. వాసనాయుక్తుడగు వాడు కర్త కాకపోయినను, స్వప్నగత భీతివలన దేహము కంపించు విధమున కర్తయే యగుచున్నాడు. కాన, చిత్తము కర్తగాకుండుటయే యుత్తమ సమాధి. అదియేపరమానందము, కైవల్యము నగుచున్నది. మనస్సు నిశ్చలమైనచో ధ్యానదృష్టికిని, చంచలమైనచో భావదృష్టి కిని కారణమగును. కాన దానిని వాసనా రహితము జేయవలయును. వాసనా రహితమై స్థిరమగు మనస్సు 'ధ్యాన'మని చెప్పబడినది. కైవల్యము, శాంతత్త్వము కూడ నదియే యగును. అట్టి మనస్సు అత్యున్నతపద మందుటకు సమర్థ మగును. వాసనాయుక్తమగుచో కర్తృత్వభావన కలిగి, సర్వవిధముల దుఃఖప్రదమగుచున్నది. సర్వ భావాత్మ భావనను మనస్సు నుండి దూర మొనర్చి, పర్వతమందు గాని, గృహమందు గాని యుండుము. చిత్త పరిశుద్ధిగలవారికి, నహంకారదోషవర్జితులకు గృహమే. నిర్జన వన మగును. వీధిలో సంచరించువారు తమ కార్యము లన్నిటిని చక్కబరచుకొనుచు నితరుల ప్రమేయమును బట్టించుకొనని విధమున జ్ఞానికి గ్రామము, నిర్జన వనము నొక్కటిగనే యుండును. అంతశ్శీతలత వలన జగత్తు శీతలముగ నుండును. తృష్ణోపతప్తులకు దావాగ్నివలె తోచును. అంతరంగమున భాసించు భావమే బహిరంగమున ప్రతిఫలించు చుండునుకదా! స్వర్గ, మర్త్యాది లోకములు, భూమ్యాకాశాదులు, అంతరంగ పరివర్తనములు తాను సర్వకర్మల నాచరించువాడైనను ఆత్మనిష్ఠుడగుచో, హర్షామర్షములకు లోనుగాకున్నచో, నతడు సమాహితచిత్తు డనబడును సర్వభూతములను తనవలె భావించుచు, పరధనమును మృత్తిక విధమున నెంచువాడు బ్రహ్మను దర్శించు చున్నాడు. 'మరణము నెప్పుడైన రానిమ్ము, భయ మందను' అను

భావముతో పంకమగ్నమైనను సువర్ణమునకు మలిన మంటని విధమున నుండువాడు దోషముల కెన్నడును లోనుగాడు. సత్వము ప్రణవ స్వరూపమై భాసించుచున్నదేగాని, వేరుకాదు. ఇందుకు కిరాత రాజైన సురఘుని జీవితమే యుదాహరణము" అని వశిష్ఠు డన, శ్రీరామచంద్రు డాతని వృత్తాంతమును జెప్పుమనెను. అంత వశిష్ఠు డీవిధముగ జెప్ప నారంభించెను :

"హిమాలయ శిఖరములలో 'కైలాస' మను శిఖర మొక్కటి కలదు. దానికి దిగువ భాగమున 'హేమ జటము' అను నొక కిరాత దేశము గలదు. ఆ దేశమును 'సురఘుడు' అను నతడు పరిపాలించుచుండెను. అతడు మిక్కిలి బలముకలవాడు. 'పర పురంజయు'డని ఖ్యాతి వహించెను. నిగ్రహానుగ్రహ క్రమములో రాజ్యపాలనము సాగుచుండెను.

ఒకనాడు తన కార్య నిర్వహణము వలన జనించిన సుఖ దుఃఖముల మూలమున సురఘునకు విరక్తి జనించినది. 'నువ్వు లను గానుగ పీడించునట్లు ప్రజలను నేను బాధించుచున్నాను. నా మూలమున ప్రజలకు సుఖము లభించుటలేదు. ఇది నాకు మరింత బాధాకరముగ నున్నది. కొలనులేక జలము నిలువని రీతి నిగ్రహము లేక ప్రజలు సక్రమమార్గ ప్రవర్తనులు కానేరరు కదా !' అని పరిపరి విధముల నాలోచించి డోలాందోళిత మనస్కుడై ఆ సురఘుడు ప్రశాంతి లేనివాడయ్యెను.

ఒకనాడు దైవయోగమున మాండవ్య ముని యాతని భవనమున కరుదెంచెను. అర్ఘ్యపాద్యాదులచే నతనిని సురఘుడు పూజించి : 'మునీంద్రా ! తమ రాకచే నేను పరమానంద సంభ రితుడనైతిని. నా జీవితము ధన్యము, సఫలము నయ్యెను. తమరు సర్వధర్మ మర్మజ్ఞులు, నా కొక్క సందియము కలిగి చిరకాలము నుండి హృదయమును బాధించుచున్నది. దానిని ఛేదించి

ఆత్మప్రశాంతిని కలిగింపుడు. మహాత్ముల సాంగత్యమున సర్వ దుఃఖములు నుపశమించునందురు కదా ! పండితులు సంశయములనే దుఃఖము లని నిర్వచించిరి. నా భృత్యులపట్ల నేను జూపు నిగ్రహా ను గ్రహములు, సింహనఖములు మత్తేభమును బాధించునట్లు వేధించుచున్నవి. సర్వగమైన సూర్యకిరణము భాతి, నాకు సమత్వ మెట్లు సిద్ధించును ? ఈ సందియము విడువడనిదిగ నుండి బాధించు చున్నది. దీనిని నివారింపజేయుగలవారు తమకంటె నెవ్వరును లేరు' అని యభ్యర్థించెను. మాండవ్యు డాతని పలుకల నాలించి ముదితాంతరంగుడై యిట్లనెను : మహారాజా ! మనోగతమైన దైన్యము వైరాగ్య, త్యాగము లను స్వప్రయత్నములచేతను; శ్రవణ, మననము లను నాత్మోపాయములచేతను మంచువలె కరగి పోవును. ఆత్మవిచారణోపాయముతో మనో మలము సులభముగ వెంటనే యుపశమించును. 'నే నెవ్వడను ? ఇది యంతయు నేమి ? ఈ జనన మరణము లెట్లు సంభవించుచున్నవి ?' అని నీ యంత రంగమున నాలోచింపుము. అపుడు మహాత్త్వమును పొంద గలవు. మనస్సు లయించి బ్రహ్మస్వరూపము నందగలవు. మనస్సు నీచాతి నీచమైనది. గోష్పదప్రమాణ జలమందును మశకము జీర్ణాంగ మైనట్లు నీచకార్యమునందు సైతము మనస్సు లగ్నమగుచున్నది. సర్వపదార్థ జాతమును పరిత్యజింపగా మిగులునది పరమాత్మ స్వరూపము. ఆత్మేతర వస్తు పరిత్యాగ మొనరింపకుండ ఉండునంత వరకు నా యాత్మ లభింపదు. ఆత్మావలోకనార్థమై సర్వమును పరిత్యజింప వలయును. అపుడు మిగులునది బ్రహ్మపదార్థము' అని యా మాండవ్యు డుపదేశించి తన మండలమును గూర్చి వెడలి పోయె'' నని వశిష్ఠ మహర్షి చెప్ప, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను. : "మహాముని ! మాండవ్యుడు వెడలినంత సురఘుడు ఎట్లుండెను ?" అన నా మునీంద్రు డిట్లు చెప్ప నారంభించెను :

"శ్రీరామచంద్రా ! మాండవ్యు డేగిన యంత నా సురఘు డేకాంత ప్రదేశమున కేగి, 'నే నెవ్వడను ?' అని స్వబుద్ధితో

విమర్శింప దొడగెను. హస్తపాదాదులు గల దేహ వ్రాతమును
నేను అని భావించుచున్నాను. ఇపు డీ దేహమును గూర్చి
విచారింతునుగాక ! ఈ శరీరమునందున్న మాంసము, నస్థులు
నచేతనము లగుట నేను కాదు. ఈ కర్మేంద్రియములు నేను
కాదు. వీనికిని, నాకును సంబంధము లేదు. జ్ఞానేంద్రియములు
జడములు, నసద్రూపములు నగుట నేను కాదు. ఇక మిగిలిన
దానిని గూర్చి యాలోచింతును. వికల్ప రహితమై మిగిలినది
పరిశుద్ధమైన చిత్తు. అదియే నేను. ఇది బ్రహ్మ యందు, నింద్రుని
యందు, యముని యందు, సర్వభూతగణము నందు, ముత్యముల
యందు దారమువలె ప్రకాశించుచున్నది దృశ్య దోష వివర్జితమైన
ఈ చిచ్ఛక్తి నిర్మలమైనది. దశదిశా వ్యాప్తమైనది. భయంక
రాకారము కలది. సూక్ష్మాతిసూక్ష్మ రూపమై సర్వభావములను
వ్యాపించినది. సర్వశక్తిసమన్వితమైనది. సర్వజగత్తు యందు నీ
చిచ్ఛక్తి వ్యాప్తమై యున్నది. నేను వాస రహితుడను. కాన
నన్ను విషయము లావరింపవు. సంసార భ్రాంతి లేనివాడను.
కాన వాంఛారహితుడను. గాఢ సుషుప్తి దశనందినవాడను.
కాన, ఆత్మయందు నిలచి యుండుదును ' అని హేమజటాధీశ్వరుడు
భావించి, విశ్వామిత్రుడు బ్రాహ్మణ్యమును పొందినట్లుగ, వివేక
నిర్ణయముచే బ్రహ్మపద మందెను. నిర్దయుడైనను, సదయుడై
నను, అద్వంద్వియైనను, మత్సరుడు కాని వాడైనను, బుద్ధిమంతు
డైనను, బుద్ధిహీనుడైనను, అర్థియైనను సుషుప్తినందిన వాని
వలె నిర్వికారచిత్తవృత్తి గలిగి యా రాజు ప్రకాశించెను.
ఇట్లుండ నొకనాడు ఆ మహారాజునకు, పర్ణాదు డను రాజర్షికి నీ
విధమగు సంభాషణము జరిగెను :

<u>సురఘు పర్ణాద సంవాదము</u> : పారశీక దేశమున కధిపతియు
నరివీరభయంకరుడు నగు 'పరిఘు' డను రాజు కలడు. ఒకమారాతని
రాజ్యమున ద్వాదశవర్ష క్షామము సంభవించినది. ప్రజలలో హాహా
కారములు చెలరేగినవి. రాజు వారి దురవస్థల నవలోకించి, జాలిపడి

తగిన ప్రతీకారోపాయము తోచక దిగులు చెందుచుండెను. ఇట్లుండ నొకనా డాతనికి తప మాచరించి భగవంతుని యనుగ్రహమునకు పాత్రుడై యీ యాపదనుండి ప్రజల నుద్ధరించ వలయునను నాలోచనము కలిగినది. వెంటనే రాజ్యమును విడచి యరణ్యమున కేగెను. అచట ప్రశాంత మనస్కుడై శుష్క పర్ణ భక్షణ మొనరించుచు దప మొనరించుచుండెను. పర్ణ భక్షణము జేయుటవలన 'పర్ణాదుడు' అను పేరు సార్థక మయ్యెను.

ఈవిధముగ నొక వేయి సంవత్సరములు దారుణ తప మాచరించెను. మనోనైర్మల్యముచే నతనికి నాత్మజ్ఞాన ముదయించి, ద్వంద్వదోష రహితుడై సమదృష్టి కలిగి ఇచ్ఛానుసారముగ విహరించు చుండెను. ఒకమా రా పరిఘుడు విహరించుచు సురఘుని గృహమున కేతెంచెను. ప్రాక్తన మిత్రులగు నా ఇరువురు నన్యోన్య సందర్శనము వలన పరమానంద సంభరితులైరి తమ సుకృతములు సఫలములైనట్లు భావించిరి. పరిఘుడు సురఘుని జూచి, మిత్రమా! నేను జ్ఞానము నార్జించిన విధముగనే నీవును నార్జించి యుందువు. శుభకార్యముల నాచరించుచుంటివి కదా! నీ శరీరము అధి వ్యాధి విరహితమై ఆరోగ్యవంతముగ నున్నదికదా! ఆపాతరమణీయ ములగు సుఖభోగముల నభిలషించుట లేదుకదా! పరమ విశ్రామాస్పదమైన సంకల్ప రహిత స్థితి ననుభవించుచుంటివా? ఉపశమముతో గూడిన సమాధి స్థితి నందుచుంటివా?' అని ప్రశ్నించెను.

అంత నా సురఘుడు ఈవిధముగ వచించెను:

సమాధి లక్షణము: 'మహాత్మా! అజ్ఞాని యూరకున్నను, వ్యవహారశీలుడైనను సమాహిత చిత్తుడు కాజాలడు. నిత్య ప్రబుద్ధచిత్తు డగువాడు లౌకిక కార్యము లాచరించుచున్నను, ఆత్మ తత్త్వమునందే నిష్ఠుడై యుండును. పద్మాసనము ధరించినను, బ్రహ్మాంజలి జేయుచున్నను చిత్త విశ్రాంతి లేనివానికి సమాధి యెట్లు లభించును? ఆత్మజ్ఞానము ఆశల కన్నిటికి నగ్నిహోత్రము

వంటిది. ఈ జ్ఞానమే 'సమాధి' యనబడును. సంక్షోభ రహితమై, అహంకార దూరమై, ద్వంద్వ దోష విరహితమై యుండి మేరువు కంటె సుస్థిరమై భానంచునదీ సమాధి స్థితి. చింతా రహితమై, వాంఛా విసర్జితమై, హేయోపాదేయ శూన్యమై పరిపూర్ణమైన మనోగతిని 'సమాధి' యందురు. ఈ కాలము, క్షణములు, నిమిషములు మున్నగు విభాగముల నెన్నడును విస్మరింపడు. అట్లే ప్రాజ్ఞుడును తన ఆత్మను మరవ జాలడు. వాయువు తన సదాగతిని విడువనట్లు, ప్రాజ్ఞుడు చిన్మాత్రమును విస్మరింపడు. మహాత్ములు నిత్యము సమాహిత హితులై, సమదృష్టి కలిగి, కార్యపరిణామ విభాగము క్తులై యుందురు. అసమాహితులు, సమాహితులు నను భేద కల్పనము యథార్థము కాదు' అని సురఘుడు చెప్ప, పర్ణాదు డిట్లనెను : 'రాజా ! నీవు యథార్థముగ జ్ఞానవంతుడవు. బ్రహ్మపదము నందితివి. శీతలాంతఃకరణుడవు. గంభీరమైన నాశయములు కలవాడవు. పరిపూర్ణుడవు. బహు వాక్కు లేల ? మనస్సు సరసమై యాత్మానందమునందు సంతృప్తి నందుటయే 'జీవన్ముక్తి' యందురు. దానిని నీవు పొందితివి' అనెను.

## 8. భాస విలాసోపాఖ్యానము

'జీవన్ముక్తికి చిత్తవిశ్రాంతి ముఖ్యా' మని సురఘూపాఖ్యానమున నిరూపింపబడినది. ' చిత్తవిశ్రాంతి లేకున్నచో ననేకవిధము లగు కష్ట నష్టములు సంభవించు' నని ఈ భాస విలాసోపాఖ్యానమున నభివర్ణింపబడు చున్నది.

"రామచంద్రా ! సురఘు, పర్ఘు లిరువురు జగత్తు స్థితిని గూర్చి విచారించుకొనుచు, జ్ఞానవంతు లగుట వలన పరస్పరము పూజించుకొనుచు తమ తమ వ్యాపారములయందు నిమగ్నులైరి. అధ్యాత్మవిచారపరుడు, నంతర్ముఖుడునైనవాడు సర్వకాల సర్వా వస్థలయందును సుఖమునే యనుభవించును. ఈ జీవు డొక వృషభము. ఇది ఆశాపాశముచే బంధింపబడినది. భోగము లను తృణములను

భక్షించును, దుఃఖ భారమును, వహించుచుండును. మోహ పంకమున మగ్నమై రోగదంశావళీదష్టమై పీడిత మగుచుండును. సంసారవన సంచారియై, విశ్రాంతి లేక పిపాసా బాధితమై వ్యథనందుచుండును. దీనిని సంసార పల్వలము నుండి బలాత్కారముగ నుద్ధరింప వలయును.

సంసారార్ణవమును తరించుటకు సజ్జనసాంగత్య లబ్ధ యోగనౌక యాధార మగును. ఆత్మజ్ఞుడగు సజ్జనుడు లేని దేశము మరు ప్రదేశము వంటిది. ఆ దేశమున బుద్ధిమంతులు వసింపరాదు. సంసార సాగర నిమగ్నమైన వానిని ధనములు, మిత్రులు, శాస్త్రములు, బంధువులు నుద్ధరింప జాలరు. మనోమాత్ర స్నేహితునితో గూడి ఆత్మ విచారము జేయుచున్నచో నత డుద్ధరింపబడును. దేహమును కాష్ఠ లోష్టముగ భావించు వానికి పరమాత్మస్వరూప మవగత మగును. పరిపూర్ణార్ణవ సదృశుడగు నీ పరమాత్మ వాచామగోచరుడు. ఉపమాన రహితుడు, అహంకారమును జయించిన తోడనే పరమానంద రూపమై, చిత్ప్రకాశాంశ కలితమై, స్థిరమగు తురీయ దృష్టి ఆ పరమాత్మతో నుపమింప బడుచున్నది. సమీపమందున్న దృష్టిగల సుషుప్త్యవస్థతో గొంతవరకు పోల్చ వచ్చును. యోగమువలన సిద్ధించునది, సుషుప్తికి సమీపస్థమైనదియు నగు పరమాత్మ వాచామగోచరమై హృదయమునందే యనుభవింపబడును. ఈ జగత్త్రంతయు నాత్మతత్త్వ స్వరూప మగును. చిత్తము బాహ్య విషయములను విడచి, ప్రత్యగాత్మయందు స్థిరపడియుండ నీ విషయ మనుభవమునకు వచ్చును. ఈ దశ ననుభవించుట తోడనే వాసనలు విసర్జింపబడును. ఆత్మ ప్రస్ఫుటముగ ప్రకాశించును సమత్వభావము వలన స్వరూపమందు నచింత్యమగు బ్రహ్మభావ ముదయించును. మనస్సుతో మనస్సును ఛేదించి, ఆత్మావలోకనము జేయకున్నచో జగద్దుఃఖము నశింపదు. ఆత్మావలోకనమువలన నానందము సిద్ధించును " అని చెప్పి వశిష్ఠ మహర్షి 'భాస విలాసోపాఖ్యానము' నిట్లు వివరించెను :

పూర్వము సహ్యా పర్వత చరియలందు భాస, విలాసు లను నిరువురు మిత్రులు కలరు. వారిలో వారికి జరిగిన సంవాదమును వినినచో నాత్మావలోకనము వలన కలిగెడి యానందము బోధపడును. సహ్యా పర్వతమున ననేక సిద్ధులు, సాధ్యులు వసించు చుందురు. అత్రి మహర్షియు నచటనే యాశ్రమమును నిర్మించు కొని వసించు చుండెను. ఆ యాశ్రమమునందు నంతరిక్షమున గురు, శుక్రులు ప్రకాశించు విధమున భాసుడు, విలాసుడు నను నిరువురు తాపసులు నివసించుచుండిరి. ఆ యిరువురు నచటి మునిదంపతుల సంతానములు. వా రన్యోన్యానురాగముతో నిరువురు వ్యక్తులయి నను, నేక దేహునివలె నేకభావముతో మెలగుచుండిరి. కొంత కాలమునకు వారికి మాతా పితృ వియోగము సంప్రాప్తించెను. భక్తిపూర్వకముగ పితృ దేవతలకు నౌర్ధ్వదైహికక్రియలు నిర్వర్తించి ఆ సహోదరు లిరువురును, ఆత్మవిచారణము జేయ సాగిరి. కొంతకాలము వారు విరాగులై విడివిడిగ నా యరణ్యమున తపస్సు జేయ దొడగిరి. ఈవిధముగ దినములు, వారములు, మాసములు, క్రమముగ సంవత్సరములు గతించినవి.

ఒకానొకనాడు విలాసుడు భాసుని జూచి, ఇట్లనెను ! 'జీవితమునకు నీవు ఫలమవు. హృదయాశ్వాసనమున కమృత ప్రాయుడవు. ఈ జగమున మహాబంధుడవు. నీకు స్వాగతము. మద్వియోగమునందు నీ వెచట, నెన్ని దినములు గడపితివి? నీ తపము ఫలవంత మాయెనా? బుద్ధి సంతాప రహితముగ నున్నదా? ఆత్మజ్ఞానము వడసితివా? విద్యలు ఫలించెనా? కుశలముగ నుంటివా?' అని ప్రశ్నించెను. అంత భాసుడు : 'సజ్జనుడా! స్వాగతము. అదృష్టయోగమున నీ దర్శనమైనది. సంసారమందున్న మనకు కుశల మెట్లుండును? జ్ఞేయ వస్తు మవగతము కానంత వరకు 'చిత్తజములు నశింపనంతవరకు, సంసార సాగరమును తరింపనంతవరకు' మనకు క్షేమ మెట్లు కలుగును? ఆశాపాశమును మొదలంట ఛేదింప వలయును. అపుడుగాని క్షేమము కలుగదు.

జ్ఞానము కలుగనంతవరకు (సమత్వభావ ముదయింపనంతవరకు), అపరోక్షానుభవము కలుగనంతవరకు కుశల మెక్కడిది ? సోదరా ! ఆత్మలాభము లేక, జ్ఞానౌషధమును సేవింపకున్న నీ దుష్ట సంసార విషూచిక మరల మరల నుదయించుచునే యున్నది. సుఖ దుఃఖ మధ్య పతితుడనై జరా మరణ దుఃఖముల ననుభవించుచు, జగ దుదర గిరిపై బొరలుచు శుష్కపత్రము రీతి జర్జరత్వము నందుచున్నాడు ' అనెను.

## 9. వీతహవ్యోపాఖ్యానము

భాస విలాసోపాఖ్యానమున 'చిత్తవిశ్రాంతి లేకున్న బహు భంగుల కష్ట నష్టములు దాపురించు ' నని ప్రబోధింపబడినది. ఇపుడు 'సంగ త్యాగము, ప్రాణ నిరోధము, సమాధి అనునవి చిత్త విశ్రాంతికి నావశ్యకము ' లని వివరింప దలచి వశిష్ఠ మహర్షి వీతహవ్యోపాఖ్యానమును ప్రారంభించెను.

ఆ భాస విలాసు లిరువురు. పరస్పర కుశల ప్రశ్నలతో కాలక్షేపము జేయుచు, గొంతకాలమునకు నిర్మల జ్ఞానము నార్జించి మోక్షమును బొందిరి. మోక్షమునకు జ్ఞానమును మించిన మార్గ మింకొకటిలేదు. ఈ సంసారార్ణవము నుత్తరించుటకు సంగ బద్ధుడైనవాని కదియే మార్గము. నిర్మలమై, అసంగముకల చిత్తము సంసార నిష్ఠమైనను ముక్తి నందును. సంగయుక్త చిత్తము దానిని పొందుటకు దీర్ఘతపశ్చర్య కూడ ప్రతిబంధకమగును. అంత రంగమున సంగ నిర్ముక్తుడై మధుర ప్రవృత్తికల జీవుడు, బహిరంగ ముగ కార్యాచరణశీలుడైనను కర్తయు, భోక్తయును కాడు " అనగా, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను : " గురూత్తమా ! ఎట్టి సంగము మానవునకు బంధహేతు వగును ? మోక్షమున కే సంగ ముపకరించును ? బంధహేతువైన సంగమున కే చికిత్స జేయ వలయునో వివరింపుడు " అనగా వశిష్ఠు డిట్లు వివరింప దొడగెను : " దేహ, దేహి విభాగమును పరిత్యజించుట వలన

బంధము క్తియు, నట్లు పరిత్యజింపక భావించుటవలన ననగా దేహమాత్రమునందు విశ్వాసము కలిగియుండుట బంధార్హమగు సంగమనియు జెప్పబడును. దేశ కాలాద్యవచ్ఛిన్నమగు నాత్మ తత్త్వము దేహమాత్రపరిమితమైనదను నిశ్చయము కలిగిన సుఖార్థిత్వము బంధహేతువగు సంగ మగును. ఈ సమస్తము నాత్మమయము. 'నేను దేనిని గ్రహింపవలయును, దేనిని పరిత్యజింపవలయును అను భావ 'మసంగము'. ఇది జీవన్ముక్తులకు మాత్రమే యుండును. 'నేను నేను కాను, ఇతరమును కాదు. దీని నుండనిమ్ము, దాని నుండనీయ వలదు' అను భావన అంతరంగమున కలిగి యుండుట అసంగము, ఈ భావము వలన నరుడు మోక్షము నందుచున్నాడు. కర్మాచరణము నభినందింపక, దానియందాసక్తి లేక, ఫలము నాసింపక, వాని యన్నిటియందు సమభావము కలవాడు 'అసంసక్తుడు' అనబడును. సర్వకర్మఫలములను కర్మచే గాక, మనస్సుచే చేయు నిపుణమగు పరిత్యాగము 'నసంసక్త' మనబడును.

సంగ రాహిత్యము వలన ననేక విధములగు విజృంభణ చేష్టలన్నియు జికిత్స చేయబడి, కైవల్యప్రాప్తి యగును. జనులు క్రిమికీటకములుగ జన్మించి మరణించి, మరల జన్మించుచు, మరణించుచు నిట్లు జనన మరణ చక్రమున బడుట 'సంగ విలాసము'. సముద్రమున సమున్నత తరంగములు జనించుచు, లయించుచున్న విధమున ననంతములగు భూతములు పుట్టుచు, చచ్చుచుండుటయు సంగలీలా విలాసమే యగును.

ఈ సంగము 'వంధ్య' యని, 'వంద్య' యని రెండు విధములు. వంధ్య యనునది మూఢులకును, వంద్య యనునది తత్త్వజ్ఞులకు నేర్పడును. వంధ్య యనునది ఆత్మతత్త్వజ్ఞాన విరహితమైనది. దేహాది వస్తుజన్యమైనది. పౌనః పున్య సంసారప్రదము, దృఢము నైనది. వంద్య యనునది, ఆత్మతత్త్వజ్ఞానమున

సత్యభూతమై, వివేకమువలన కలిగి సంసార రాహిత్యమును కలుగ జేయును. ఇది శంఖ, చక్ర, గదలు హస్తములందు ధరించిన యాకారము కలది. అనేక కృత్యములచే నిది జగత్త్రయమును పాలించుచున్నది. విజ్ఞానవంతులగు సిద్ధులు, లోకపాలకులు లోకములయందు దీనితోగూడి యుందురు. గృధ్రము మాంస మున కాశించిన విధమున మనస్సు భోగముల కాశించి పతనమగు చున్నది. వ్యర్థమగు రమణీయతకు వంధ్య మోహపడుచున్నది. దీనితో గూడిన వారికి 'నంతఃపురములు, భోగములు, రౌరవము, అవీచి'యను నరకములు నిర్మింపబడినవి. ఇది దుఃఖమయము. మానవులను మండుచున్న మంటలకు సమిధలనుగా జేయుచున్నది. బ్రహ్మవిద్యావిషయ ప్రబోధము నంది, ప్రపంచవిషయమున సంసక్తి లేని చిత్తముతో నుండువాడు ముక్తు డనబడును. జ్ఞానవంతుడు సర్వకాలసర్వావస్థలయందుండును. అతడు తన కర్తవ్యమును గుర్తించి, ఆ యా కార్యములందు గాని, ఆలోచనయందు గాని సంసక్తుడుగాక యుండును. ఆకాశము, ఊర్ధ్వభాగము. నధో భాగము, దిక్కులు మున్నగువానియందు నసంసక్తుడై ఆత్మ యందు మాత్రము లీనమై యుండును. ఇట్లు ఆత్మనిష్ఠుడైనవాడు లోకవ్యవహారము లాచరించుచుండియు నాచరింపకయు జీవన్ముక్తి నందును. ఆకాశమునకు, మేఘములకు సంబంధము లేనట్లు, అతనికి కృత్యాకృత్యములతో సంబంధ ముండదు. ఈ విధముగ జగత్సంబంధ మును వీడి నిర్వికారుడై, ఆత్మనిష్ఠుడై మణివలె ప్రకాశించును. ఇట్టివారు, బాహ్యేంద్రియ వ్యాపారములయందు పింఛాగ్రతరళ మనస్కులై యుందురు. అంతరంగమున మాత్రము మేరునగ ధీరులు వీరికి వాసనా రాహిత్యమువలన జాగ్రత్తు స్వైతము సుషుప్తిగ భాసించును. ఈ స్థితి అభ్యాస వశమున దృఢమై, తత్త్వజ్ఞులచే 'తురీయావస్థ' అని కీర్తింపబడినది.

<u>జీవన్ముక్తవిదేహుల విశేషము :</u> **జీవన్ముక్తుడు** నాశములేని తురీయావస్థ ననుభవించి బ్రహ్మానందము నందుచు నవస్థాత్రయ మును సంస్మరించును. అవస్థాత్రయ సంస్మరణమువలన జీవన్ముక్తు నకు మహానందమను తుర్యత్వము లభించును. ఇక విదేహ ముక్తునకు, అవస్థాత్రయ విస్మృతివలన, తుర్యాతీత పదమును పొంది విదేహత్వమునుండి విముక్తుడగును. పునర్జన్మ హేతువులగు సమస్తకర్మలను పరిత్యజించి అజ్ఞాన జనితమగు దేహాద్యభిమాన విరహితుడైన మహాత్ముడు జలమందలి లవణము విధమున పరమాత్మయందు లయమగుచున్నాడు. జడ, అజడ దృశ్యముల మధ్యనుండునది యగు పారమార్థిక తత్త్వము 'బృహదారణ్యకము' మున్నగు నుపనిషత్తుల యందు నభివర్ణింపబడినది. దృశ్య, దర్శనముల యందుగల సంబంధమును, అనుభూతిమయమైన పారమార్థిక సుఖ మందురు. అనగా దాని సారమును 'బ్రహ్మము' అందురు. ఇదియే దృశ్య సంబంధ రహిత మగుటవలన 'ముక్తి' యనబడును. దీని యనుభవము నవలంబించి సుషుప్తి సంబంధ మగు స్థితిని పొందము. శ్రీరామచంద్రా! ఇదియే తురీయ స్థితి. ఆత్మ స్థూలరూపముగాని, అణురూపము గాని, ప్రత్యక్షము గాని, అప్రత్యక్షము గాని కాదు. అది చేతనము గాని, అచేతనము గాని, సత్తు గాని, అసత్తు గాని కాదు, నేను గాని, పరుడు గాని, ఒకడు గాని, బహుమంది గాని కాదు. ఈ షడింద్రియాశ్రయమై మనకు గోచరించు జగత్తున కతీతమై ఆత్మ యుండును. అది దేనితో నుపమింప వీలుకానిదై యుండును. మోక్షము, స్వర్గమునందు గాని, పాతాళమునందు గాని, భూతలమందు గాని లేదు. ఆశలు నశింపగా, చిత్తము క్షయమంది మోక్ష మనబడినది. 'నాకు మోక్షము లభించు గాక!' అను భావము అంతరంగమున నంకురించి నచో సంకల్పము కలిగిన ట్లగుచుండును. మనస్సు సంకల్ప సహితము కాగా, సంసార బంధము దృఢ మగును. ఆత్మ వీని కన్నిటికి నతీతమైనది. కాన, సంకల్పములను నాశము జేయ

వలయును. సంకల్పరహితుడగువాడు దేనిని వాంఛింపడు. కాన, నిరతిశయానందప్రదమగు నాశారాహిత్యమును పొందును. దీని వలన భూమండలము గోష్పదముగను; మేరువు స్థాణువుగను; దిక్కులు, త్రిభువనములు తృణప్రాయములు నగును. ఆత్మ శరీరము కంటె వేరైనదగ భావించువానికి, తన యవయవములను ఖండించి నను కించిత్తుగూడ వ్యథ యుండదు. మధురమగు గుడమును భక్షించుచుండగా, శారీరకతాపాదులా మాధుర్యమును పోగొట్ట జాలని విధమున, తత్త్వాలోకనము శరీరతాపాదులవలన మార్పు జెందదు. పరపురుషసంగ వ్యసనియగు కాంత గృహకృత్యము లలో వ్యగ్రురాలైనను, తన ననుభవించిన విటునియం దభిలాష కలదియై యాతని పొందునే యాసించుచుండును. అట్లే పరతత్త్వ విచారధీరుడైనవాడు లౌకికవ్యవహారమగ్నుడైనను, తద్బ్రహ్మాను భూతినే కోరుచుండును. పదార్థములతో సంబంధము పెట్టుకొనక ప్రశాంతముగ నుండుట విముక్తత్వము. ఇది దేహమున్నను, లేకున్నను సంభవించును. అనాసక్తిగలవాడు జీవన్ముక్తుడు. ఆసక్తిగలవాడు బద్ధుడు. జీవన్ముక్తుడు భావి నపేక్షింపడు అతీత మును విచారింపడు. వర్తమానమునందు మాత్ర మాసక్తిగల వాడై యుండును. బంధువర్గముపట్ల అనాసక్త మనస్కుడై యుండును. భక్తులకు భక్తుడుగ, శఠులకు శఠునిగ నుండును. బాలులకు బాలుడుగ, వృద్ధులకు వృద్ధుడుగ, ధీరులకు ధీరుడుగ, యువకులకు యువకునిగ, దుఃఖార్తులకు దుఃఖార్తునిగ ప్రవర్తించును. ప్రాజ్ఞుడు దైన్య రహితుడై భాస్కరుడు శీతకరుడైనను, శీతకరుడు చండమయూఖుడైనను, అగ్నిహోత్రు డధోజ్వలితుడైనను దీనిని చిద్విలాసమని భావించి ఆశ్చర్యమును ప్రకటించడు. నీరు కదలుటవలన సుడులు, వర్తులా వర్తము లేర్పడును. ఆవిధముగనే చిత్తస్పందనమువలన జగత్తు దృశ్య మవుచున్నది. ఈ చిత్తస్పందనమే జగద్భ్రాంతికి మూలము" అన, శ్రీరామచంద్రు డిట్లనెను: "మహాముని! ఈ చిత్తస్పందనకు

కారణ మేమి? ఈ స్పందన మే యుపాయమున నశించును?" అని ప్రశ్నింప, వశిష్ఠు డిట్లనెను: "రామచంద్రా! హిమమందు శుక్లత, తిలలందు తైలము నిక్షిప్తమై యున్నట్లు చిత్తము నందు చంచలత్వము ప్రతిష్ఠితమై యున్నది. యోగము, జ్ఞానము చిత్త నాశనమునకు కారణములు. యోగ మనగా చిత్తవృత్తి నిరోధము. జ్ఞాన మనగా సత్యము నెరుగుట. శాస్త్రజ్ఞులు ప్రాణ స్పందనమును చిత్త సంచలనమునుగా జెప్పిరి. కాన, ప్రాణమును నిరోధించినచో మనస్సు నిరోధింప బడును. మనో నిరోధమువలన ఈ లోక మే శాంతించును. అనగా అడగిపోవును" అన, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను: "మహాత్మా! దేహ, గేహమున తెలిసి కొనుటకు వీలుగాని విధముగ నిరంతరము సంచరించు ప్రాణాది వాయు స్పందన మే విధముగ నిరోధింప వీలగును?" అన, వశిష్ఠ మహర్షి ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను:

"శాస్త్రజ్ఞానము, సజ్జన సాంగత్యము, వైరాగ్యము, సమాధినిష్ఠ, అనాసక్తి స్థిరపడగా, లౌకిక వ్యవహారములందు విరక్తి కలుగును. అప్పు డేకాంత ప్రదేశమున వాంఛితాను సారము ధ్యానము జేయుచున్నచో నభ్యాసము దృఢమై, ప్రాణస్పంద నిరోధము సిద్ధించును. పూరకాది అనిలాయామమువలన, ననా యాసమగు దృఢాభ్యాసమువలన, నేకాంత ధ్యానయోగమువలన ప్రాణస్పంద నిరోధము సిద్ధించును. ఓంకారోచ్చారణ ప్రాంత మందలి శబ్దతత్త్వాను భావమువలన, సుషుప్త్యవస్థ కలిగి ప్రాణ స్పందము నిరోధింపబడును కొండనాలుకను, పెద్దనాలుకతో నాక్రమించి సుషుమ్నానాడికి నూర్ధ్వ ముఖమున కపాలకుహరమున, ప్రాణవాయువును జేర్పగా స్పందనము నిరోధింపబడును. ఇది లంబికాయోగము. నాసాగ్రమునకు పండ్రెండంగుళ పర్యంతము చిదాకాశ ముండును. దానియందువృత్తిజ్ఞానమును లయింప జేయగా ప్రాణస్పంద నిరోధము జరుగును. యోగశాస్త్రమున వివరించిన

వాయు నిరోధాభ్యాసమువలన, సుషుమ్నానాడీ ద్వారమున, తాలు స్థానమున, పదునాలుగు రేకులుగల విశుద్ధచక్రమునగాని, బ్రహ్మరంధ్రమునగాని, పండ్రెండు రేకులుగల అనాహతచక్రమునగాని, ప్రాణవాయువు చేరి బహిర్ముఖ జ్ఞానమును వీడి, స్పంద నిరోధము నందుచున్నది. భ్రూమధ్యమున చిర కాలము దృష్టి నిరోధింపబడి, జిహ్వాగ్రము ఊర్ధ్వ రంధ్రముద్వారా ద్వాదశాంతము పండ్రెండు రేకులుగల అనాహతమును పొందియు, భ్రూమధ్యమందున్న పరమేశ్వరు నాత్మగ భావించినచో ప్రాణస్పందన నిరోధము జరుగును. ఆత్మజ్ఞాన ముదయించి, అది దృఢమైన వెంటనే వికల్పరహితము కాగా, ప్రాణస్పంద నిరోధ మేర్పడును. చిరకాలము హృదయమునందు వాసనా రహితమగు మనస్సును నిలిపియుంచుటవలన మునికి ప్రాణస్పందనము అగిపోవును. వెనుక జెప్పిన యుపాయములవలనను, అనేకవిధములగు సంకల్పములచే గల్పింపబడిన వాటిచేతను, నానా విధాచార్య నిగదితోపాయముల మూలముననను, ప్రాణస్పంద నిరోధము నవలంబింపవచ్చును. ఈ యోగసాధవలు అభ్యాస వశమున నిర్బాధకము లగుచున్నవి అవిధమున గాక స్వయముగ సాధింప యత్నించినచో రోగాది బాధాహేతువు లగును. అభ్యాస వశమున ప్రాణ పరిస్పందనము నిరోధము కాగా, మనస్సు ప్రశాంతిగ నుండును. అపుడు కైవల్యరూపమగు నాత్మతత్త్వము మిగులును'' అన, శ్రీరామచంద్రుడు ఈ విధముగ ప్రశ్నించెను : '' యోగయుక్తచిత్తునకు ప్రశాంతి కలుగు విధమును నిరూపించితివి. దయతో నిపుడు సమ్యక్ జ్ఞానమును గూర్చి వివరింపుడు'' అనగా, వశిష్ఠు డీవిధముగ ప్రారంభించెను :

సమజ్ఞానము : జగమంతయు నాత్మస్వరూపమును పరిపూర్ణరూపమును, పరమార్థ స్వరూపమునని చెప్పుదురు. అభ్యాస వశమున దృఢపడి వైరాగ్య పరిలాంఛితమైన వాసనారహితమగు ప్రాణాయామము సఫలమైనది. ప్రాణికి వికల్పములు నశింపగా,

శేషించునది పరబ్రహ్మపదము. దీనిని సమగ్రకల్పనలతో గూడిన వేదవాక్కులు నిర్వచింపజాలకపోయినవి. 'ఘట పటాకారాది పదార్థ సహస్రములు నాత్మస్వరూపములేగాని మరియొకటి కాదు' అను నిశ్చయము దృఢజ్ఞాన మగును. ఈ లోకమున ననాద్యంతా భాషాత్మకమైన పరమాత్మ యున్నది' అను నిర్ణయమును 'సమ్యగ్జ్ఞాన' మందురు. ఈ దృశ్యమాన జగమంతయు పరమాత్మ యని నిర్దేశింపగా నిక భావాభావము లెక్కడ నుండును? బంధ మోక్షము లెచట నుండును? శోకింపనేల? ఆత్మకంటె వేరైన చిత్తముగాని, చైత్యముగాని లేదు. బ్రహ్మయే ప్రకాశించు చున్నది. ఈ సమస్తమును ఒకటి పరబ్రహ్మమే యైయున్నది. ఇక మోక్షము, బంధము లెక్కడ? బ్రహ్మమే విస్తరించి ఈ భూ పర్వతాదుల రూపధారణ మొనరించుచున్నది. ఇవి యొకదానికంటె మరియొకటి యున్నతమై యున్నవి. నీవు ద్వైతభావమును పరిత్యజించి ఆత్మస్వరూపుడవై యుండుము. కాష్ఠ, పాషాణ, వస్త్రముల రూపములను బాగుగ విమర్శింపగా నేమాత్రమును విభేదము కన్పింపదు. ఇక సంకల్పోన్ముఖ మెక్కడ? ఇది ఆద్యంతములయందు నాశములేని ప్రశాంత స్వరూపము. సర్వవస్తుగతమై భాసించుచున్నది. నీవును తన్మయుడవు కమ్ము. జరామరణ విభ్రమములు, ద్వైతాద్వైత సముద్భూతములు తరంగములచే ప్రకాశించు సముద్రమువలె నాత్మ, చిత్తములచే నాత్మయే ప్రకాశించుచున్నది. అంతర్ముఖ బుద్ధితో నిత్యము పరిశుద్ధమగు నాత్మను ఆలింగన మొనరించి, తానే ఆత్మనుగ భావించు వానిని భోగజాలములు బంధింప జాలవు. ఆత్మవిచారము గలవారికి భోగములు శత్రువులు. మందానిలములు పర్వతమును జలింపచేయలేని విధమున భోగము లాతని నేమియు జేయ జాలవు. నానా విధములగు సరస్సులందు జలము లొక్కటివలె, వికల్ప బుద్ధుల యందుండు వస్తువు నొకటియేగాని, వేరు కాదని నిర్ణయముకల

పురుషుడు విముక్తుఁ డనబడును. ఈ విషయము నీకు బాగుగ దృఢపడుటకై 'వీతహవ్యోపాఖ్యానము' వివరింతును, వినుము.

వింధ్యపర్వతప్రాంత కాననమున 'వీతహవ్యు'డను నొక ముని కలడు. ఆతడు క్రియాపరాయణుడై చిరకాల మచట నివసించి ఘోరసంసారభ్రమ జనకము లగు తన క్రియాక్రమములనుండి, ఆధివ్యాధిమయాకారము లగుటవలన, విసువు జనించినవాడై యుండెను. కొంతకాలమునకు నిర్వికల్పసమాధికై సకల కార్యకలాపములను విసర్జించి, అరటి స్తంభములతో నలంకరింప బడిన తన పర్ణశాలాభ్యంతరమున ప్రవేశించెను. అచట నొక సమతల ప్రదేశమున పరిశుద్ధముగా పరచిన కృష్ణాజినమున, తొడల నడుమ నిరికించిన హస్తయుగముకలవాడై, పద్మాసనమును బంధించి కూర్చుండి యుండెను. బాహ్యాభ్యంతర విషయములను విస్మరించెను. దిగ్వికీర్ణమైన మనస్సును మెల్లగా కూడదీసుకొని, దానిని స్థిరముగ నుంచుకొనుటకై అభిలషించి తనలో నిట్లు వితర్కించుకొనెను :

'ఆహా! మన స్సెంత చంచలమైనది! క్షణములో గూడ దీయబడి, తరంగమధ్యమందలి పత్రము భాతి, స్థైర్యము నందు కున్నది. ఘటమునుండి పటమునకు, పటమునుండి శకటమునకు నీ మనస్సు, వృక్షమున కెగ్రాకు మర్కటమువలె పరుగు లిడు చున్నది. మనస్సునకు చక్షురాదీంద్రియములు ద్వారము లగును. అనేకవిషయముల నెరిగినను అనాత్మము లగుటచే నివి యేమియు దెలియని వగుచున్నవి. స్వర్గ పాతాళములకు సంబంధము లేనటుల ఆత్మకును, వీటికిని సంబంధము లేదు. ఇవి చతుర్దిక్కులు తిరిగి భిక్షాటన మొనరించును. నాస్తిక సిద్ధాంతములను ప్రచార మొనరించు చుండును. చిత్తమా! నీ వట్టివాని నాశ్రయించి వ్యర్థముగ ఖేదపడుచు, విహరింపకుము. 'నేను చేతనమును' అను భావను సత్యముకాదు. చిత్తునకు, మనస్సునకు నత్యంత విభేదము కలదు.

వ్యర్థమగు నహంకారము వలన దుర్మతివై 'నేను జీవుడను' అని తలంచుచున్నావు. అది అసత్యము. ఈ భావము నీకు దుఃఖ ప్రదము కాన వెంటనే పరిత్యజింపుము. అవిచార వశమున కలిగిన నీ రూపము, విచారణముచే ప్రకాశము సోకుటతో నంధకారము నశించిన రీతిగ మాయమగుచున్నది. పూర్వము లేని దానివి, వర్తమానమున నుండని దానివి, భవిష్యత్తున మాత్ర మెట్లుందువు? అయినను నీవు నిత్యము నుండుదాన వగుచున్నావు. నీకు శుభమగు గాక! నేను స్వాత్మయందు లీనమై యుండి, దైవయోగమున దుఃఖరహితుడనై ప్రశాంతి నందుచున్నాను చిదాత్మయగు భగవంతుడు సమస్తమును సాక్షిభూతముగా జేయు చున్నాడు. అయ్యో, ఇంద్రియగణములారా! మీరు నిరర్థక ముగా వ్యాకుల మందుచుంటిరేల? సర్ప భయమున పాంథుడు, చాండాల భయమున విప్రుడు దూరముగ తొలగిపోవుచుండు నటుల నానందరూపమగు చిన్మాత్రము ఇంద్రియములకు దూరముగ నున్నది. సంకల్పాభిముఖమైన ఆ చిత్తము దుఃఖప్రదము. జ్ఞానవంతుని స్మృతి సంకల్పరహితమైన దగుచు దైవమునందును; దేహము నందును; మనస్సు, జడముల యందును కల్పనలు లేనందున చిత్సారభూత మగుచున్నది. కాని తద్వ్యతిరేకము కాదు. అని వీతహవ్యుడు నిర్ణయించుకొని, వాసనా రహితుడై బలాత్కార ముగ చిత్తమును నిగ్రహించి స్పందన రహితములైన ఇంద్రియ ములు కలవాడై యుండెను. ప్రాణ సముదాయము క్రమముగ నంతరంగమునందు జ్వాలాజాలపరిస్పందనము, దగ్ధేంధనానలము వలె ప్రశాంతి నందెను. నాసాగ్రమునుండి స్వల్పమై, సమమైన కాంతిగల నేత్రములు అర్ధవికసితపద్మములవలె సమాన శోభ నాశ్రయించెను. ఆ మహామతి సమకాయ శిరోగ్రీవకంధరుడై, పర్వతరూపుడైన విధమున చిత్రార్పితునివలె నుండెను. ఆ వింధ్య పర్వత ప్రాంతమున నీవిధముగ ధ్యాన నిష్ఠుడై యుండగా,

మూడు వందల సంవత్సరములు నొక ముహూర్తముగ గడచెను. ఆ మహాముని శరీరము ఒకానొక కాలమున మట్టితో గ్రమ్మబడి భూమిలోనికి కృంగిపోయెను. అయినను తెలివిని కోల్పోవలేదు. కాని, పైకి మాత్రము రాజాలడు. శరీరము భూపరిపీడితమై యుండెను. ప్రాణమయస్పందము సంయమనము లేకుండ నాగదుకదా! నవరంధ్రములును నిరోధింపబడి యున్నందున స్పందనము లేకుండెను. హృదయాంతరమున నుత్పత్తి ప్రౌఢిని పొంది, మనోరూపమై యాతని హృదయమున నీ క్రింది యనుభూతుల ననుభవించెను.

కైలాస వనమున కదంబ వృక్షము క్రింద జీవన్ముక్తాత్మ నిర్మలుడై మునిత్వమునంది నూరేండ్లు వసించెను. రోగ రహితమైన విద్యాధరత్వమునందియొక నూరు సంవత్సరము లుండెను. సుర చారణ వందితమైన ఇంద్రియత్వము నంది, పంచ యుగము లుండెను. దేవగణవంద్యమానుడై రుద్రగణత్వము నంది యొక యుగమును, తన ప్రతిభావశమున నీ యనుభూతుల నందె యుండెను. అనంతర మా వీతహవ్యుడు, అనంతాత్మయగు మనస్సుతో దన ప్రాగ్జన్మల నెరుగ దలచెను. గతములో నశించిపోయిన అతని దేహములను పెక్కింటిని జూచెను. ప్రస్తుతము నష్టముగాక నిలిచిన నీ వీతహవ్యుడు అను శరీరమును జూచెను. 'ఈ శరీరము పంకపీడితమై యున్నది. దీని నుద్ధరించుటకై నేను సూర్యప్రవేశము జేయుచున్నాను. ఆ సూర్యుని పారిపార్శ్వకుడగు పింగళకుడు దీని నుద్ధరించును' అని నిశ్చయించి, వాయు రూపమును ధరించి, ఆదిత్యునిలో ప్రవేశించెను. ఆతడు పుర్యష్టక రూపమును ధరించి, వాయువు తోలుతిత్తిలో ప్రవేశించిన విధమున రవిలో ప్రవేశించెను.

సూర్యభగవానుడు తనలో ప్రవేశించిన వీతహవ్యుని జూచి, యతని యాగమన హేతువు నెరిగి, ఎదురుగా నున్న పింగళకుని

కార్యవేత్త యగుటవలన నా రవి యాజ్ఞాపించెను, తన యజమాని యానతిని పొంది వింధ్య కందరమునకు పింగళకుడు సపరివారముగ నరుదెంచెను. వారు వీతహావ్యుని శరీరమును భూమి నుండి త్రవ్వి పైకి దీసెను. పుర్యష్టక రూపమున నున్న ముని ప్రాణము శరీరములో ప్రవేశించినది. పింగళకుడు నాకాశ మార్గమున తన నిలయమునకు పోగా, వీతహావ్యుడు నిర్మల సరోవరమున కేగెను. స్నాన మాచరించి, జపతపాదులను, సూర్యో పాసనమును ముగించి ప్రకాశమానుడై యథాపూర్వముగ శరీరముతో ప్రకాశించెను. మైత్రి, సమత్వము, పరమశక్తి, సత్ప్రజ్ఞ, సంతోషము, కృప, సర్వసంగపరిత్యాగము కల మనస్సు కలవాడై యనేక దినములు వింధ్య పర్వత ప్రాంత మందలి నదీతీరమున నాత్మయం దానందించెను" అని వశిష్ఠుడు శ్రీరామచంద్రున కెరింగించెను.

"శ్రీరామచంద్రా! ఆ వీతహావ్యుడు పరలోక సందర్శన మొనరించియు ప్రశాంతికై యీావిధముగ విమర్శించుకొనెను: 'ఇదివరకు నింద్రియ సముదాయమును సంపూర్ణముగ జయించితిని. ఇక నిపుడు చింతించి పొందవలసిన దేమున్నది? 'అస్తి నాస్తి' అను భేద భావమును మృదులతను ఛేదించిన విధముగ నుత్తరించి, పర్వత శిఖరమువలె మిగిలిన చిన్మాత్రమునందు, ననుసంధానము కలవాడనై యుందును. ఉదయించి యస్తంగతుడైన వానివలెను, అస్తంగతుడై యుదయించినవాని విధముగను, సమత్వమున సమరసాభాసుడనై స్వచ్ఛ గమనము గలవాడనై యుందును. ప్రబుద్ధుడనైనను సుషుప్తుడను, సుషుప్తుడనైనను ప్రబుద్ధుడనునై, తుర్యము నవలంబించి, స్తంభిత స్థితితో శరీరాంతరమున నుందునుగాక !' అని యాలోచించి యారు దినములు మరల నాత్మానుసంధానమున గడపెను. అనంతరము బాటసారి యలసట నంది యొక క్షణము విశ్రాంతి నందిన విధముగ ప్రబోధమును పొంది యుండెను. కొంత

కాలమున కా మహాతపస్వియగు నా వీతహావ్యుడు సిద్ధి పొంది, జీవన్ముక్తునిగ జాలకాల ముండెను. హేయాదేయములపట్ల సమభావము కలవాడై, త్యాగ దాన దృక్కులు నశింప నాతని మనస్సు ఇచ్ఛానిచ్ఛలు లేనిదై ప్రకాశించెను. జనన మరణము లకు పరమావధి యగునది, సంసార సంగములను సంపూర్ణముగ విడచినది యగు విదేహ కైవల్యము నందుటకు, తీవ్రముగ నాలోచించెను. ఒకనా డా ముని గిరి కందరమున ప్రవేశించి, పద్మాసనాసీనుడై తనలో నిట్లు తలపోసెను :

వీతహావ్యుడు విదేహ కైవల్యము నందుట : 'రాగమా! నీవు వైరాగ్యము నందుము. ద్వేషమా! విద్వేషత్వము నొందుము. మీతో చాలకాలమునుండి నిచట క్రీడించితిని. భోగములారా! మీకు నమస్కారము. బాలకుని బాలకులు లాలించునట్లు, కోటి జన్మములనుండి మీచే లాలింపబడితిని. పరమపవిత్రమైన నిర్వాణ పదమును గూడ మరచునట్లు చేసితిరి. దుఃఖమా! నీ పరితాపమును భరింప జాలక ఆత్మపదార్థము నన్వేషించితిని. ఈ కార్యకరణము నకు నీవే కారణము. కాన, ఉపదేష్టవు, నీకు నమస్కారము. కార్యమిత్రమా! నీవు చిరకాల మిత్రుడవు. అయినను నిన్ను పరిత్యజించుచున్నాను. నా ఆత్మ విజ్ఞానమునకు కారణభూతుడవై కడకు నశించితివి. తల్లీ, ఆశాదేవీ! నీవు దుఃఖింపకుము, నమస్కారము. నేను ముక్తినందుటచే నీ వేకాకిని వైతివి. శుష్కించితివి. కామమా! నన్ను క్షమింపుము. నీకు విరుద్ధము లగు ననేక అపరాధముల నొనరించితిని. నేను కైవల్యమున కేగుచున్నాను. ఆశీర్వదింపుము. సుకృతమా! నమస్కారము. నీవు నన్ను నరకములనుండి సముద్ధరించి స్వర్గయాత్రకు సహాయ పడితివి. రాగాదులగు మీర లందరును నాకు సహజముగ లభించిన ప్రాక్తన సుహృత్తులు. మిమ్ము పరిత్యజించి ప్రాణములు క్రమముగ నుత్క్రమించుచున్నవి. మీకు శుభమగుగాక! నేను వెడలు

చున్నాను' అని వీతహవ్యుడు సంకల్పరహితుడై ఈషణత్రయము లను వర్జించి, తరింపజేయు ప్రణవమును బిగ్గరగ నుచ్చరించుచు, యోగభూమికలను పొంది, బాహ్యాభ్యంతర భావములగు సూక్ష్మ ములు, స్థూలములు నైన వాటిని, సంకల్పైక వికల్పితములగు త్రైలోక్యసంభవ భావములను విడచి, ప్రణవపర్యంత దీర్ఘముగల నిశ్వసన తంతువుతో నింద్రియ తన్మాత్ర జాలమును, వాయువు గంధమును వలె విడచెను. ఆకాశమున ప్రకాశముచే నంధకారము విడిపోవునట్లు, ప్రాజ్ఞుడు కోపమును పరిత్యజించు పగిది వీతహవ్యుడు శరీర పరిత్యాగ మొనరించెను. ఒక్క నిమేష మాత్రము ప్రకాశించు తేజస్సును గూర్చి యాలోచించి దానిని గూడ విసర్జించెను. ఇపు డంధకారముగాని, తేజస్సుగాని యేమియు లేదు. వీతహవ్యు డిట్టి స్థితిని పొంది, అర్ధనిమేష కాలములో నా జ్ఞానదశను గూడ నధిగ మించెను. పశ్యంతీ పదమును పొంది తురీయ రూపము నందెను. నిరానందుడైనను సానందుడై, అసత్తైనను సత్పదార్థమై, అచిన్మయు డయ్యు చిన్మయుడై, 'నేతి-నేతి' అనబడు రూపముగలవాడై యుండెను. ఆటుతరువాత వా గతీతుడు, శూన్యవాదులకు శూన్యుడు, బ్రహ్మవాదులకు బ్రహ్మముగ, విజ్ఞానవాదులకు విజ్ఞాన మాత్రుడుగ, సాంఖ్యులకు పురుషుడుగ, యోగవాదుల కీశ్వరుడుగ, శైవులకు శివునిగ, కాలవాదులకు కాలముగ, నాత్మజ్ఞులకు నాత్మగ, అనాత్మజ్ఞుల కనాత్మగ, మాధ్యమికులకు మధ్యమునిగ, సమచిత్తు లకు సమునిగ నాతడు బ్రహ్మస్వరూపు డయ్యెను. సర్వశాస్త్ర సిద్ధమును, సర్వహృదయానుగము, సర్వాత్మకము, సర్వవ్యాపకము, సర్వసంబంధము, అత్యంత నిశ్చలము, తేజస్సును ప్రకాశింపజేయునది, సాంజనము, నిరంజనము, ననిర్వచనీయము నగు పరబ్రహ్మ రూపమై యుండెను. జనన మరణ వివర్జితమై, ఆద్యంతరహితమై, సకల నిష్కలరూపద్వయమగు నాకారము ధరించుటవలన నిర్మలమగు నీశ్వరత్వమునంది యాకసమున నుండెను. శ్రీరామచంద్రా!

ఆ వీతహవ్యుడు ముప్పదివేల సంవత్సరములు యథాసుఖముగ నుండి పునర్జన్మరహితుడై శాంతి నందెను.

## 10. జీవన్ముక్తున కాకాశగమనాభావము

వీతహవోపాఖ్యానమున 'చిత్త విశ్రాంతికై సంగ త్యాగము ప్రాణ నిరోధము, సమాధి అభ్యాసము, హేతువు' లని నిరూపింప బడినది. ప్రస్తుతము 'జీవన్ముక్తునకు ఆకాశగమనాదులద్వారా చిత్తశాంతి లభింప నేరదు' అని వశిష్ఠ మహర్షి నిరూపింప దలచి యీవిధముగ ప్రబోధింప మొదలిడెను :

"ఆత్మజ్ఞానము లేనివాడు జీవన్ముక్తుడు కాకపోయినను రసాయన ద్రవ్యములు మంత్ర క్రియా కాల శక్త్యాదులచే నాకాశ గమనాదులు చేయుచున్నాడు. ఆత్మజ్ఞానికి విషయముల గూర్చి యాసక్తి జనింపదు. అత డాత్మ ద్రష్టయై యుండును. ఆత్మ యం దాత్మ ననుసంధానము జేసి, సంతృప్తుడై అవిద్యానిలయము లైన ఆకాశగమనాదుల నపేక్షింపడు. అతడు సమస్తమున కతీతుడై ఈషణత్రయములను వీడి ఆత్మయందే సంతృప్తుడై ఇతరమును వాంఛింపక, ఆచరింపక యుండును. జగత్సంబంధము లగు పదార్థము లన్నియు విద్యామయములు. ఆత్మజ్ఞు లేల నా పదార్థముల కాశింతురు ? ఆత్మజ్ఞాన విరహితులై, సిద్ధజాలమును వాంఛించువారు తత్సంబంధసిద్ధి సాధనములను క్రమముగ సాధించు కొందురు. ద్రవ్య,మంత్ర, క్రియా,కాల శక్తులు ఆ సిద్ధికి సాధనములు. అవి పరమాత్మప్రాప్తి కెంతమాత్రము నుపకరింపవు. సంపూర్ణ మగు నాత్మజ్ఞానము కలవార లీ సిద్ధులను సాధించుటను వాంఛింపరు అసంపూర్ణమగు నాత్మజ్ఞానము కలవారికి మాత్రమే ఈ యభిలాష కలుగుచుండును. ఇచ్ఛాజాలము లన్నియు నుపశమింప నాత్మ లాభము చేకూరును. సిద్ధివాంఛామగ్నచిత్తున కేల నీ యాత్మ లాభప్రాప్తి యగును" అనగా శ్రీరామచంద్రు డిట్లు

ప్రశ్నించెను : "మునీంద్రా! యోగనిష్ఠులగువారు చిరకాల జీవులగుటకు కారణమేమి? ఈ సంశయమును నివారింపుడు, అనగా వశిష్ఠు డిట్లు ప్రవచించెను :

<u>చిరజీవత్వ కారణము</u> : "రామచంద్రా! ప్రాణ స్పందనము వలన దేహ స్పందనము కలుగును. ఆ స్పందనము లేకున్నచో నీ దేహము శిలాసదృశము. కాన యోగులు యోగనిష్ఠకల వారలై, ప్రాణనిరోధాభ్యాసపరులై నశింపకున్నారు. చిత్తజమగు వాయు స్పందనము, బాహ్యాభ్యంతర స్పందనము లేనివారికి జరా మరణములు దూరము అగును. చిత్త స్పందనము, బాహ్యాభ్యంతర స్పందనము, ప్రాణాది వాయు స్పందనము శాంతింప, దేహమందలి ధాతువులు తమ సుస్థితి నెన్నటికిని విడువవు. తత్త్వజ్ఞాన సంపన్నులు, వీతరాగులు, మహామతులు, విచ్ఛిన్న బ్రహ్మాది గ్రంథులు కలవారు నగు యోగనిష్ఠులు శరీర త్యాగము జేయుటకు, యథాస్థితిగ నుంచుటకు సమర్థులు, స్వతంత్రులు నగుదురు" అని చెప్ప, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను : "తాపసోత్తమా! వివేకోదయమువలన చిత్తస్వరూపము లయించును. అందువలన మైత్ర్యాది గుణములు యోగుల కెట్లు లభించును?" అనగా వశిష్ఠు డిట్లు వివరించెను :

<u>ద్వివిధ చిత్తనాశ లక్షణము</u> : "రఘుకులతిలకా! చిత్త నాశము రెండు విధములు : 1 సరూపము, 2 అరూపము నని. ప్రాతిభాసికమగు మనస్సు 'సరూప' మనియు, ప్రతిభా సమానమైన మనస్సు 'అరూప' మనియు చెప్పబడును. సరూపము జీవన్ముక్తునిలో నుండ, విదేహముక్తునిలో నరూప ముండును. చిత్త స్థితి దుఃఖదము. చిత్త నాశము సుఖప్రదము. చిత్త స్థితిని క్షయ మొందించి, చిత్త నాశమును పొందవలెను. 'గుణసంభార మంతయు నాది' అని భావించు చిత్తము, తత్త్వజ్ఞానము లేనిదై దుఃఖభాజనమని చెప్పబడును. సుఖ దుఃఖాదుల నాశ్రయించి, తదనుభూతి నందు

మనస్సు సంసార వృక్షమునకు దోహద క్రియ జేయుచున్నది. రామచంద్రా! ఇంతవరకు చిత్త సత్త్వము వర్ణింపబడినది. ఇక దాని నాశమును గూర్చి చెప్పుచున్నాను, వినుము.

సుఖ దుఃఖములపట్ల విముఖుడైనవాని చిత్తము నాశమైనట్లు భావింపుము. నిశ్వాసములు పర్వతములను జలింపజేయని విధమున నవి వాని చిత్తమును చలింపజేయ జాలవు. ఆపదలు, కార్పణ్యము, ఉత్సాహము, మదము, మాంద్యము, మహోత్సవము మున్నగునవి సంభవించినప్పుడు వికారము జెందక యుండు చిత్తము నష్టమైనదని తెలియుము. రామచంద్రా! చిత్త స్థితియే మూఢత్వము. ఈ మూఢత్వము నశింపగా, చిత్తము నశించి జ్ఞానోదయ మగును. జీవన్ముక్తుని పరిశుద్ధ చిత్తము మైత్ర్యాది గుణములు కలదియై, మంచి వాసనలను పొంది, పునర్జన్మ రాహిత్యమును ప్రసాదించును. ఇది సరూపమగు మనోనాశ మనబడును. వసంతకాలమున పుష్ప గుచ్ఛములు ప్రకాశించు విధముగ, నిది జీవన్ముక్తుని యందు నూతన శోభను వెలుగొంద జేయును. వెనుక నభివర్ణింపబడిన అరూప మను మనోనాశము నిష్కళాత్మక మగుటవలన విదేహ ముక్తునియందు మాత్రము భాసించుచుండును. సమగ్రములగు మైత్ర్యాది గుణముల కాధారమగు సత్త్వము పవిత్రమగు విదేహ ముక్తి రూపమునందు లయించును. కాన, విదేహముక్తి విషయమున, సత్త్వ క్షయ రూపమగు చిత్త లయమందు గుణాగుణములు గాని, సంధ్యారాత్రులుగాని, సంపదాపదలుగాని, ఉదయాస్తమయములుగాని, హర్షామర్షములుగాని ఏవియు నుండవు. సంసారాడంబరము కల బుద్ధికి నివి దరిజేర్చునవియై, ఆకాశము వాయువునకు విశ్రాంతి నిచ్చు విధమున విదేహ కైవల్య సాధకము లగుచున్నవి. శాంత దుఃఖములు, అజడాత్మకము. సుప్త నిష్ఠము, బ్రహ్మానందాది సంపత్తికల విదేహ కైవల్యమునందు చిత్తనాశము నందినవారు మాత్రమే వసింపగలరు.

<u>సంసార బీజ పరంపర</u> : వశిష్ఠ మహర్షి ప్రసంగము నాలించిన శ్రీరామచంద్రుడు, "మహానుభావా! సంసార మను మృదువగు ద్రాక్షలతకు బీజమేది? ఆ బీజమునకు బీజమేది? దానికిని బీజ మేదియో తెలియజేయ వేడుకొనుచున్నాను" అన, వశిష్ఠ మహర్షి ఈవిధముగ నభివర్ణించెను :

"అంతరంగమందు విలీనమై, శుభాశుభము లను నంకురములు గల శరీరము సంసార మను తీవకు బీజము. భావాభావదశా కోశమును, దుఃఖరత్నములకు సంపుటము నగు ఆశకు వశమై చిత్త మా శరీరము నకు బీజ మగుచున్నది. ఈ చిత్తము వలన 'సత్తు నసత్తు' లను అవయవ సమష్టి రూపమగు శరీరము సంభవించుచున్నది. స్వప్న సంభ్రమము లందు స్వయముగ నీ ప్రయోజనము నందుచున్నది. చిత్తవృక్షమునకు రెండు బీజములు కలవు అవి, 'ప్రాణ స్పందనము', 'దృఢవాసన' అనునవి. ప్రాణ స్పందనము వలన నాడీసంస్పర్శనోద్యతమైన వృత్తి, జ్ఞానరూప మగు చిత్తము వెంటనే కలుగును. ఈ వృత్తి, జ్ఞానము సర్వగతమై క్షోభము నందును. ప్రాణ నిరోధముచే వృత్తి, జ్ఞాన నిరోధ మేర్పడి మోక్షము కలుగును. చిత్త విక్షోభము వలన బాహ్య విషయానురాగము జనించుచున్నది. విషయానురాగము వలన ననంతములగు దుఃఖములు సంభవించుచున్నవి. బాహ్య విషయముల గూర్చి సుషుప్త్యవస్థను పొంది, ఆత్మ జ్ఞానమునకై యత్నించినచో బ్రహ్మ పదవి లభించును. కాన, ప్రాణ పరిస్పందనల చేతను, వాసనా ప్రేరణముల చేతను మనస్సును బహిర్ముఖము జేయనిచో జననాది సర్వ వికారములు ప్రాప్తించును. చిత్త విక్షోభమే చిత్తము. దానిచే నీ వ్యాపకమగు నర్థ జాలములు కల జీవ సంసారము వృద్ధి యగుచున్నది. యోగులు చిత్తశాంతికై ప్రాణ నిరోధము నొనరించుచున్నారు. ప్రాణ నిరోధము ప్రాణాయామము, ధ్యానము చేతను; యోగ శాస్త్రమున వివరింప బడిన యుక్తుల మూలమున జరుగుచున్నది. ప్రాణ సంరోధనము

చిత్తశాంతిని, సామ్యావస్థను, చిత్త స్వాస్థ్యమును కలుగజేయును. జ్ఞానవంతులు తా మనుభవించి ప్రకటించిన వాసనా జనితమగు రెండవ చిత్తోత్పత్తిని వివరించుచున్నాను, వినుము.

దృఢ భావనచే పూర్వాపర విచారమును విడచి, పదార్థమును శీఘ్రముగ గ్రహించు శక్తిగల వాసన చిత్తోత్పత్తికి రెండవ కారణము. తీవ్ర సంవేగమువలన అనగా దృఢాభ్యాసమువలన చిత్త మొక వస్తువును భావించుచు నితరమగు స్మృతిని వీడినచో నత డా వస్తురూపమే యగుచున్నాడు. వాసనా వివశుడై ఆ వస్తు రూపమును పొందిన పురుషుడు, దానిని సద్వస్తువుగా భావించి మోహమున మునుగుచున్నాడు. వాసనావేగ వైవశ్యము వలన వస్తు సహజ రూపమును వీడుచున్నాడు. ఈ దుర్మార్గపు దృష్టి సర్వమును మైకములో ముంచి భ్రమింప జేయుచున్నది. సమ్యగ్దర్శనము లేకపోవుట వలన అనాత్మను ఆత్మ యనియు, న్నవస్తువును వస్తు వనియు భావించు దానిని చిత్తముగా నెరుంగుము. దృఢాభ్యాస పదార్థైక్యము వలన నతి చంచలమగు నీ చిత్తము జనన మరణ కారణ మగుచున్నది. హేయ మగు నుపాదేయ వస్తు స్వరూపమును భావింపక, సర్వమును విడచి యున్నచో చిత్త ముండదు. నిరంతరము వాసనా రహితముగ దేనిని సంకల్పింపక యున్నపుడు అమనస్కత యుదయించును. కాన, నంతరంగమున వస్తువును వాస్తవమని తలంచునదియే చిత్త మని నా యభిప్రాయము. భావరహితముగ మెలగుచు, నభావమును భావించుట చిత్త రాహిత్య మనబడును. విషయాసక్తిలేని వాసన బీజ నాశనమైన విత్తనము విధమున పునర్జన్మను విడచి యుండును. దీనిని 'జీవన్ముక్తత్వ' మందురు. సత్త్వ రూపమును పొందిన జీవన్ముక్తులు చిత్త రహితులై యుందురు. దీనివలన దేహాంతరమున చిదాకాశరూపు లగుచున్నారు. 'ప్రాణ స్పందనము, వాసన' అను నీ రెండును చిత్తమునకు బీజము లగుచున్నవి. ఈ రెండిటిలో

నొకటి నశించినచో రెండవది కూడ నశించును. వాసనా వశమున ప్రాణ స్పందన మగు చున్నది. దీనివలన వాసన యంకురించు చున్నది. ఈ వాసన వలన చిత్తమునకు బీజాంకుర మేర్పడు చున్నది. 'వాసన, ప్రాణ స్పందనము' అను నీ రెండును దృశ్యము వలన ప్రవర్తించు చున్నవి. కాన, వీటికి దృశ్యము బీజమగు చున్నది. దృశ్యమును పరిత్యజించినచో వాసన, ప్రాణ స్పందనములు రెండును మొదలు నరుకబడిన వృక్షముల విధమున సమూలముగ నశించును. తిలలులేక తైలము లభింపని విధమున దృక్కులేక దృశ్యము నుండదు. కాన, దృశ్యమునకు దృక్కు బీజ మగుచున్నది. స్వప్న సమయమున తన మరణమును స్వయముగ జూచుచున్నాడు. దేశాంతర గమనము నీక్షించుచున్నాడు. అట్లే దృక్చమత్కారమున జాగృతి యందును దృశ్యమును చూచు చున్నాడు. గతములో తాను చూచినదైనను, చూడనిదైనను, దృక్సాన్నిధ్యమున భాసించు వస్తువును, ప్రజ్ఞావంతుడు ప్రయత్న పూర్వకముగ తొలగించు కొనవలెను. అట్లు దృశ్యమును మరచుట 'మోక్ష'మనియు, మరువకుండుట 'మహాసంసార' మనియు పండితులు ప్రవచించిరి. ఈ దృశ్యానుసంధాన మనంతమైన సంసారరూప దుఃఖమునకు హేతువు. దాని ననుసంధానము జేయకుండుట జాడ్యరహిత మగు జన్మ రాహిత్యమునకు హేతువు. కాన, నీవు జాడ్యరహితుడవు, పరిపూర్ణానంద స్వరూపుడవు, ప్రకాశమాన పరమాత్మ స్వరూపుడవు నగుము" అనగా శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను : "మునీంద్రా! జాడ్యరహిత మన నేమి? అచేతనము లందు జాడ్యము దృశ్యాను బంధ రాహిత్యముగ తోచుచున్నది గదా! ఆ అసంవిత్తి యందు జాడ్య మెట్లు తొలగునో వివరింపుము" అన, వశిష్ఠు డిట్లనెను :

"ఏ విషయమునందు నాసక్తి లేనివాడై, దృశ్యమున విశ్రమింపక, జీవుడు దేనిని పట్టించుకొననిచో 'అసంవిదు' డనబడును. అతడజుడు. కార్యకరణ శీలుడైనను చిత్తరహితుడు. చిద్రూపుడుగ

ప్రకాశించుచుండును. ఇతడు జీవన్ముక్తుడు. వాసనా పరిత్యాగ మొనరించి నిర్వికల్ప సమాధియం దున్నవాడు. ఆనంద మనుభవించు చున్నాడు. నడచుచు, నిలచుచు స్పృశించుచు, నాఘ్రాణించుచు చున్నను అతడు పరిపూర్ణానందుడై యుండును. ప్రాణాయామాది పరిశ్రమము వలన నపార దుఃఖసాగరము నుత్తరింప వలయును.

స్వరూప సత్తకు రెండు రూపములు కలవు. నానాకృతులు కలది యొకటి యగుచో, రెండవది ఏకాకృతి కలది. ఘట పటాది రూపములతో గూడినది నానాకృతి విశేషమును విడచి సన్మాత్రమై, దోషరహితమగు సద్రూపము ఏకాకృతి. రామచంద్రా! కాల సత్త ఘట పటాది వస్తు సత్తాదులను విడచి సన్మాత్ర రూపుడవుకమ్ము. ఇందు వలన పరిపూర్ణ పరానందము ననుభవించు పరిపూర్ణస్వరూపుడ వగుదువు. అపుడు నీ దుఃఖములు దూరము లగును" అని వివరింప శ్రీరాముడు, "మునివర్యా! సంసార బీజములను గూర్చి వివరించితిరి. ఇపుడు ఇన్నింటికి మూలకారణమైన ఆత్మపదము శీఘ్రముగ నే యుపాయమున లభించునో తెలియ జేయుడు" అనగా, వశిష్ఠ మహా ముని యిట్లు ప్రబోధింప ప్రారంభించెను: "శ్రీరామచంద్రా! దుఃఖబీజముల కాదికారణమగుదాని నుత్తరోత్తరము భావించుట వలన నాత్మపదము లభించును. వాసనలను బలాత్కారముగ పరిత్యజించి; తత్పదార్థైక్యమును శోధించి, అఖండము సచ్చిదానంద రూపము నగు పదమున చిత్తమును నిశ్చలముగ నిలిపితివేని, ఆ క్షణము నందే బ్రహ్మపదవి లభించుచున్నది. కేవల సంవేద్యమునందు సంధానము సంభవింపదు. ఇది సంవేద్యము కంటె ముందుగ ప్రకాశించు సంవిత్తును మూయుటకు సమర్థవంతమైనది కాదు. అట్లు దానిని మూసినచో సంవేద్యమే ప్రకాశించును. వాసనా పరిత్యాగ ప్రయత్న మొనరించినచో నది వెంటనే శిథిలమగుచున్నది. దీని వలన సమస్త వ్యాధులు నశించును. పూర్వము వివరింపబడిన సాధనము లన్నిటి కంటె నిది బహుకష్టము. ఇది మేరుపర్వతోన్మూలనమున కంటెను

దుష్కరమైనది. మనస్సు లయింపనంతవరకు వాసనా క్షయము కానేరదు. వాసనా క్షయము కానంతవరకు, చిత్తము శాంతింపదు. తత్త్వజ్ఞానము కలుగునంతవరకు చిత్తశాంతి లభింపదు. 'తత్త్వ జ్ఞానము, మనోనాశము, వాసనా క్షయము' అనునవి పరస్పర కారణములై దుస్సాధ్యము లగుచున్నవి. కాన, రామచంద్రా! పురుషప్రయత్నమున వివేకముతో భోగేచ్ఛను పరిత్యజించి పై మూడింటిని ఆశ్రయింపుము. వీని నభ్యసింపనంతవరకు తత్త్వజ్ఞాన మెంత కాలమునకు లభ్యము కాదు. వీటిని సమానముగ సాధన జేసిన యప్పుడే మోక్షము లభించును. వీనిలో నొక్కదానిని సేవించి నందు వలన ప్రయోజనము లేదు. మూటిని సేవింపవలయును. అందుచే హృద్గతములగు సంశయగ్రంథు లన్నియు ఛేదింపబడును. రామచంద్రా! ఈ సంసార స్థితి జన్మజన్మాంతర శతముల నుండి యేర్పడినది. చిరకాలాభ్యసనాదులచేగాని ఇందు వాసనా త్యాగము కాదు. వాసనా త్యాగమునకు ప్రాణ నిరోధముతో సమానమైన యుపాయముకంటె మించి వేరొకటిలేదు. వాసనా పరిత్యాగము వలనను, ప్రాణ నిరోధమువలనను చిత్తక్షయ మగును. వీనిలో నీ కిచ్ఛ వచ్చిన యుపాయము నవలంబింపుము. ప్రాణాయామము దృఢా భ్యాసము కలదైనచో ప్రాణస్పందము నిరోధింప వీలగును. ఇదియు యోగాభ్యాసపరుడగు గురువు ఉపదేశించిన యుపాయము ననుస రించి ఆసన, అశన యోగమున సాధ్య మగును. నిస్సంగ వ్యవహారము వలన (భవభావనా పరిత్యాగము వలన), శరీరనాశ దర్శిత్వము వలన వాసనా క్షయ మగు. వాసనలు నశించుటతోడనే చిత్తచలన మాగి పోవును. నివాత సమయమున నంబరతలమందు పరాగము వ్యాపింపజాలదుకదా! ప్రాణవాయుచలన మనినను, చిత్తస్పందన మనినను రెండూ నేకార్థకములు. బుద్ధిమంతుడు ప్రాణస్పంద నిరోధ మునకై మాటిమాటికి కూర్చుండుచు, లేచుచు బహు ప్రయాసమున ప్రయత్నమున నేకాగ్రచిత్తుడై సాధింప వలయును. అంకుశము లేకుండ మత్తేభము స్వాధీనము కాదుకదా! అట్లే నిర్మలమగు

యోగము లేకుండా మనోజయము (ప్రాణస్పంద నిరోధము) సాధ్యము కాదు. 'ఆధ్యాత్మికవిద్యాధిగమత్వము, సజ్జనసాంగత్యము, వాసనా పరిత్యాగము, ప్రాణస్పంద నిరోధము' ననునవి చిత్త జయోపాయములు. ఇన్ని యుపాయములను విడచి కొందరు హఠయోగము నాశ్రయించు చున్నారు. ఈ విధానము కారుచీకటిని బాపుటకు దీపమును వీడి కాటుక నాశ్రయించుట వంటిది. ఈ యోగము వలన చిత్త జయము సాధ్యము కాకపోగా, వ్యాధులు కోరి తెచ్చుకొనుట యగును. ఇది బిస తంతు సంతతులచే మదగజమును బంధించుటకు యత్నించుట వంటిది. కాన, రామచంద్రా! దుర్దృష్టిని విడనాడి, పరిశుద్ధమగు జ్ఞానము నాశ్రయించి, వీతరాగుడవై స్థిరముగ నుండుము నిర్వికారుడవై, వాసనా రహితుడవై బ్రహ్మ పదమును బొందుము. జీవన్ముక్త లక్షణములను సాధించి, అకర్తృ పదము నాశ్రయించి యుండుము. చిత్త నిగ్రహము కలవాడు జన్మ సాఫల్యము నందును. విచారాంకురము స్వల్పమైనదైనను, అభ్యాస వశమున శతశాఖాత్మకమై మహావృక్షముగ వరిధవిల్లును. కాండము దృఢముగ పాదుకొనని వృక్షమును వాయువులు కదలింప గలిగిన విధముగ, దృఢముగ పాదుకొన్న వృక్షమును కదుపలేవు కదా! అట్లే చలచిత్తుని చలింపజేయ కలిగినట్లు, చింతలు స్థిర చిత్తుని కదుప జాలవు. నడచుచు, నిలచుచు, మేల్కొనుచున్నను చిత్తము విచారపరము కాకపోయినచో నాతడు మృతప్రాయు డనబడును. 'ఈ జగత్తు అననేమి? నే నెవ్వడను?' అని నిదానముగ నాలోచించుకొనుము. సజ్జనుల గూడి ఆధ్యాత్మిక విషయములను విమర్శించుకొనుము. ఇదియే జ్ఞాన మని పండితు లభివర్ణించిరి. క్షీరము నందు మాధుర్యమున్న విధముగ జ్ఞానమునందే జ్ఞేయ మున్నది. మద్యపానమున మాదకత జనించు విధమున, నుత్తమ జ్ఞాన దృష్టి వలన బ్రహ్మానంద జనిత మ్మాదకత్త ఆవరించును. సమము, నిర్మలము నగు బ్రహ్మ పదార్థమును 'జ్ఞేయము' అందురు. జ్ఞానమును పొందిన మాత్రమున నవిద్య

దాని విలాసములు నశించును. అపవిత్రము, అపరిశుద్ధము, విషసిక్తములను, కడకు మలాదులను గూడ జ్ఞానవంతుడు పవిత్ర పదార్థమును వలె భుజించును. దానిని జీర్ణ మొనరించుకొన గలడు. బుద్ధి పూర్వకముగా ప్రసిద్ధినందిన బింబఫలము, ప్రతివిషము, కషాయము, క్షీరము, ఇక్షురసము, అన్నము మున్నగువానిని జ్ఞానవంతు డనాసక్త బుద్ధితో, సమభావముతో భుజించును. ప్రాణాంతకుడగువానిని, ప్రాణదాతయగువానిని సమత్వ మమత్వములుకల ప్రసాద మాధుర్య దృష్టితో చూచును. తత్త్వడు కానివాడు ప్రశాంతహీనుడై లేజివుళ్ళను మృగములు మెసవునట్లు ఆత్మయందు నిలుకడలేక ఇంద్రియములచే భక్షింపబడుచున్నాడు. పదార్థములకు సంగమే కారణము. సంసారమునకు గూడ నదియే కారణ మగుచున్నది. ఆశకు, నాపదలకు నా సంగమే హేతువు. దీనిని పరిత్యజించినచో మోక్షము, జన్మ రాహిత్యము లభించును. కాన, సంగ వర్జితుడవై జీవన్ముక్తుడ వగుము" అని వశిష్ఠ మహర్షి ప్రబోధింప శ్రీరామచంద్రుడు, "సంగమనగా నేమి? వివరింపు" మని ప్రార్థించెను

**సంగ స్వరూపము**: "రామచంద్రా! భావాభావ పదార్థముల యందు హర్షామర్ష వికారాదులు చెందుట అపవిత్రమగు వాసన. దీనినే 'సంగ' మని ప్రాజ్ఞు లందురు. జీవన్ముక్తులకు పునర్జన్మ యుండదు. హర్షామర్షాదులను పరిత్యజించుట శుద్ధవాసన. జీవన్ముక్తులు కాని వారలకు సంసార సంబంధమగు పవిత్రమైన వాసన ఏర్పడును. అందుచే వారు దీనులు, మూఢచిత్తులునై చరించుచున్నారు. రామచంద్రా! నీవు హర్షామర్షాలు విసర్జించి, వీతరాగభయ క్రోధుడవై, ముక్తసంగుడవై ప్రవర్తించినచో జీవన్ముక్తుడ వగుదువు. అపుడు కష్టములకు, దుఃఖములకు, సుఖమునకు, సంతోషమునకు ఆయాసపడక, మోదము నొందక యుందువు.

ఆశావైవశ్యుడవు గాక సంగమును పరిత్యజింపుము. సంపదాపదల యందు సమచిత్తుడ వగుము. ప్రాప్తానువర్తుడవై మెలగుము. అపుడ సంగత్వము సిద్ధించును. సమస్త వస్తుజాలము నందును సర్వదా, సర్వథా సమభావయుక్తుడవై, ధీరుడవై, శాంతుడవై సంచరింపుము" అని వశిష్ఠ మహర్షి ప్రబోధించెను.

# నిర్వాణ ప్రకరణము

మునివరిష్ఠుడగు వశిష్ఠ మహర్షి ఉపశమ ప్రకరణమును శ్రీరామ చంద్రునకు ప్రబోధించి, ఇపుడు నిర్వాణ ప్రకరణమును ప్రవచింప నారంభించెను. ఇందు 'భుశుండోపాఖ్యానము', 'దేవపూజోపాఖ్యానము', 'బిల్వఫలోపాఖ్యానము', 'మహాశిలోపాఖ్యానము', 'అర్జునోపాఖ్యానము', 'శతరుద్రోపాఖ్యానము', 'భేతాళోపాఖ్యానము', 'భగీరథోపాఖ్యానము', 'శిఖిధ్వజోపాఖ్యానము', 'కచోపాఖ్యానము', 'మిథ్యాపురుషోపాఖ్యానము', 'భృంగీశోపాఖ్యానము', 'ఇక్ష్వాకూపాఖ్యానము', 'మునివ్యాధోపాఖ్యానము', 'సప్తభూమికోపాఖ్యానము' నను పదునైదు ఉపాఖ్యానము లభివర్ణింపబడినవి.

ఈ యుపాఖ్యానములయందు 'ప్రాణాయామమునకు సంబంధించిన విషయము లభివర్ణితములై నందున చిత్తప్రశాంతి కలిగి, దానిచే నిర్వాణము ప్రాప్తించు'నని యీ ప్రకరణమున ప్రథమముగ నభివర్ణింపబడిన 'భుశుండోపాఖ్యానము' నందు వివరింపబడినది. ఈ విధమగు మోక్షోపాయిమును శ్రీరామచంద్రునకు నుపదేశింప దలచినవాడై వశిష్ఠ మహర్షి ఈవిధముగ ప్రారంభించెను :

"శ్రీరామచంద్రా ! దిక్కాలాద్యనవచ్ఛిన్నమై, ఆద్యంత రహితమై, చిన్మాత్రమగు 'అహంబ్రహ్మాస్మి' అని భావించి, ఇతరము నుగానని నిర్ణయించుకొని, అంతర్ముఖుడవై, ఏకరూప ప్రశాంతాత్ముడ వగుచు మౌనివై ఆత్మసుఖము ననుభవింపుము.

<u>చిత్తవికల్పనానివృత్త్యుపాయము :</u> అజ్ఞానబంధ ముండునంత వరకు ననగా బ్రహ్మాభావము లేనంతవరకు జగజ్జాలమునం దాసక్తి

యుండునంతవరకు 'చిత్తము, జీవుడు, అవిద్య' అను కల్పన లుండును. రామచంద్రా! యథార్థమునకు చిత్తముగాని, జీవుడుగాని, అవిద్యగాని లేవు. ఈ కల్పన లన్నియు బ్రహ్మపదార్థము నుండియే కలుగుచున్నవి. ఆద్యంత రహితమైన బ్రహ్మ యొక్కటియే సముద్రము వలె విజృంభించుచున్నది. దేహమున అహంభావ ముండునంతవరకు, ఈ దృశ్యమునందు ఆత్మతాభావ ముండునంతవరకు, 'ఇది నాది' అను నాసక్తియుండునంతవరకు చిత్తాది విభ్రాంతి యుండును.

అంతర్ముఖత్వ లక్షణము. అంతర్ముఖత్వముతో సమస్తమగు ప్రపంచమును తృణముగ భావించి, చిదగ్నియందు హోమము జేయువానికి అంతరంగము నుండి చిత్తాది విభ్రమములు తొలగిపోవును. 'నేను చిదాత్మను, పారావార వివర్జితమైన నిరంశను' అను రూపమును స్మరింపుము. నీ నిజ స్వరూపమును విస్మరింపుము. అపుడంతర్ముఖుడ వగుదువు. తనను తాను పరమ శత్రువుగా భావించుకొనుచు వెంటనే జయించుట కుద్యమించువానిని, సహజ మిత్రునిగా భావించువాడు ఆత్మను సందర్శించుచున్నాడు. తీరస్థమగు వృక్షమును కూలంకషము సమూలముగ గూల్చివేయునట్లు, హర్షామర్ష దోషములను, మత్సరమును నశింప జేయువాడు 'రాగద్వేష రహితుడు' అనబడును. అధ్యాత్మశాస్త్ర మాత్రముచే 'ఆశ' అను విషూచికా వ్యాధి, శరత్కాలమందు మంచు నశించునట్లు అంతరించుచున్నది. స్వబుద్ధితో నుపాదేయ వాక్యత్వమును భావించినచో నది తప్త క్షేత్రమున జలము ప్రవేశించిన విధముగ లోతునకు ప్రవేశించును

కృపణ లక్షణము: అధ్యాత్మ శాస్త్రము నధ్యయనము జేయనివారును, స్వరూప జ్ఞానశూన్యు లయినవారును నగు మూఢ బుద్ధులు, చేతనోన్మత్త తృణములువలె చలించుచున్నారు.

సమస్త ప్రాణులకు నీ చిత్తు స్వరూపమై యున్నది. అనాది యగు నవిద్య వలన, నా స్వరూప చిత్తు నెరుంగక కృపణత్వము నందు చున్నాడు. వింటి నారి నుండి తర్జన గర్జనలు వెలువడు విధమున, మూఢుని నుండి, చిద్బోధాపరివర్జితములైన ధ్వనులు వినాశనమునకై శ్రవణ గోచరము లగుచున్నవి. అధమున కీయబడిన ధనమును, బురదయందు విడువబడినదియు సమానము. అట్టివారితో జేయు సంభాషణము ఆకసమును జూచి కుక్కలు మొరగుట వంటిది. అజ్ఞానము సర్వాపదలకు మూలము. అజ్ఞానికి సంభవింపని యాపద లేవియు నుండవు. ఈ సంసార సరణి అజ్ఞానుల ననుగ్రహించుటకు ప్రవర్తిల్లుచున్నది. జ్ఞాని యగువాని బుద్ధికి నిస్సార మగు నీ జగత్తు గోష్పదము రీతిగ భాసించును. ఆ జగత్తే అజ్ఞానియగు వానికి అనంతమై, దుస్తరమైనదిగ తోచును. ఆత్మతత్త్వము విషయ సంసర్గము లేనిది. అది శాంతమై, సర్వాత్మకమై, సచ్చిదానందమయమై, నిష్కళంకమై భాసించుచుండును.

ప్రకృతి స్వరూపము : ఆ పరబ్రహ్మ స్వరూపమునుండి స్వయముగ అవిద్య ఉత్పన్నమైనది. అది 'సూక్ష్మము, మధ్యము, స్థూలము' అను త్రివిధములగు భేదములను పొందుచున్నది. ఈ సూక్ష్మాది భేదములు గల అవిద్య 'సత్త్వ, రజ, స్తమము'లను గుణములు కలదై 'ప్రకృతి' అనబడుచున్నది. ఇది జీవునకు బంధహేతు వగుచున్నది. దీని నధిగమించుటయే పరమ పదము.

ఈ ప్రకృతియందు సత్త్వ, రజ, స్తమోగుణములు మూడును కలవని చెప్పబడినది. వానిలో నొక్కొక్కటి మూడు విభాగము లగుచున్నది. అవి యన్నియు గలసి తొమ్మిది యగును. అనగా అవిద్య తొమ్మిది విధములుగ నుండునని భావము. రఘురామా! మంత్రద్రష్టలగు విశ్వామిత్ర, వశిష్ఠాది మహర్షులు, మునులు, సిద్ధులు, నాగులు, విద్యాధరులు, దేవతలు నీ యవిద్యా విభాగమగు సాత్త్వికము నుగా నెరుగుము. ఈ సాత్త్విక విభాగములో నాగ, విద్యాధరులు

తమో విభాగము; మునులు, సిద్ధులు రజో విభాగము; రుద్రాదిదేవతలు సత్త్వస్వరూప విభాగము నగుదురు. అవిద్యా విభాగములు తొమ్మిదింటిలో సాత్త్వికవిభాగ, సాత్త్వికాంశమును విద్య అందురు. అవిద్యయొక్క శుద్ధసత్త్వస్వరూపమే విద్య. రాజస తామస గుణములు రెండును, ఒకొక్కటి మూడు విధము లగుచున్నది. మానవు లందరు రాజసులు కాగా, వారిలో జ్ఞానవంతులగువారు సత్త్వాంశమును; యుద్ధాదివృత్తులు స్వీకరించినవారు అనగా క్షత్రియాదులు రాజసాంశమును; మోహవంతులగు సచ్ఛూద్రాదులు తామసాంశముగ నభివర్ణింపబడిరి. తిర్యగ్జంతువులు తామస సృష్టికి సంబంధించినవి. పిండీభూతమగు జ్ఞానరూపమైన స్థావరాది సృష్టి తామస సృష్టికి ప్రధానభూతమైనది" అని వివరింప, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను : "మహాముని! దృఢముగ ఘనీభవించిన అజ్ఞానము స్థావరాది రూపము ధరించి ఎట్లున్నదో వివరింపుము" అన, వశిష్ఠు డిట్లు చెప్పదొడగెను :

"రామచంద్రా! 'అమనస్త్వము, అసంప్రాప్తము, మనోలయము' నను లక్షణములను పొందనదేయైనను, మనన యోగ్యలక్షణముకల మనోధర్మమును వీడి, తటస్థమగు రూపము నాశ్రయించి, స్థావరము లందు చిత్తు ప్రకాశించుచున్నది" అనగా, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను : "వేదవిదాంవర ! ఈ చిత్పదార్థము స్థావరములయందు మనోధర్మమునుండి తొలగి యున్నచో వాటికి మోక్షము సమీపము ననే యున్నట్లు భావించుచున్నాను" అన, వశిష్ఠు డిట్లు ప్రబోధించెను:

"వేద్యవిదాంవర ! స్థావరములకు మోక్షము దూరస్థమై యుండును. ఎందువలన ననగా, చిత్తు సుప్తపుర్యష్టమై యున్నచోట దుఃఖప్రదమై యుండును. మూక, అంధ, జడులవలె నా స్థావరము లందు సత్తా మాత్రముగ నుండును" అన, శ్రీరామచంద్రు డిట్లనెను : "స్థావరాదులయందు చిత్పదార్థము కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ వ్యాపార రహితమై సత్తా మాత్ర

రూపమున నున్నచో ముక్తి సమీపముగ నున్నట్లే కదా !" అనెను. అప్పుడు వశిష్ఠ మహర్షి ఇట్లు వివరించెను :

<u>మోక్ష స్వరూపము</u> : "ఈ సృష్టిని గూర్చి యథాశాస్త్రముగ బుద్ధిపూర్వకముగ నాలోచించినచో సత్తా సామాన్య బోధము పునర్జన్మ రహితమగు 'మోక్ష'మని యవగత మగును. ఆత్మ తత్త్వము నెరిగి, వాసనా పరిత్యాగ మొనరించిన నుత్తమ మగు సత్తా సామాన్య రూపమును 'కైవల్యరూప' మందురు. అధ్యాత్మ భావనచే నార్యులతో గూడి శాస్త్ర పర్యాలోకనము జేసిన సత్తా సామాన్యనిష్ఠత్వమును 'పరబ్రహ్మ' మందురు. బీజమునం దంకురము వలె వాసన లంతస్సుప్తములై యుండును. కాన, ఆ స్థితి పునర్జన్మ ప్రదమని యెరుంగుము. అంతస్సంలీన మననము గలిగి, సర్వతో సుప్త వాసనలు కలదగు సుషుప్తి జడ ధర్మము కలదగుట వలన ననేక దుఃఖములను కలుగ జేయుచున్నది. ఈ స్థావరాదు లన్నియు జడ ధర్మము కలవి. సుషుప్త పద మధిష్ఠించినవి. కాన, పునర్జన్మ యోగ్యము లగుచున్నవి. బీజము లందు పుష్పము లున్నట్లు, మట్టిలో ఘటాదుల విధమున స్థావరము లందు స్వ వాసన లుండును. ఈ వాసనలు, వాటి బీజమగు నజ్ఞానము నుండుట వలన నది సుషుప్తమేగాని, తుర్యము మాత్రము కాదు. నిర్జీవమగు వాసన తుర్యమై మోక్షప్రద మగును. 'వాసనలు, అగ్ని, ఋణము, వ్యాధి, శత్రువులు, స్నేహము, వైరము, విషము' అనునవి ఎంతమాత్రము శేషించి యున్నను బాధించును. కాన, వానిని నిశ్శేషముగ రూపుమాప వలయును. పూర్తిగ నశింప జేయబడిన వాసనా బీజము గలవాడైన సత్తా సామాన్యరూపుడు సదేహుడైనను, విదేహుడైనను పునర్జన్మ దుఃఖముల ననుభవింపడు.

<u>అవిద్యా లక్షణము</u> : వాసనా బీజరూపము సకలజీవుల చిచ్ఛక్తి, అజ్ఞానము అనబడును. దీనిని గుర్తింపకుండుటను 'అవిద్య' యందురు.

<u>విద్యావిద్యా స్వరూపము :</u> ఈ 'సృష్టి బ్రహ్మ కాదు' అను నిర్ణయమును 'అవిద్య' అనియును; 'బ్రహ్మము' అను నిశ్చయమును 'విద్య' అనియు నందురు. ఇది యవిద్యను నాశనము జేయును. హరిహరాదుల యొక్కయు, నారదాది మహర్షుల యొక్కయు నిశ్చయమును మనస్సునందు వదిలపరచుకొని యుండుటను విద్యయందురు. ఈ విద్య నీ హృదయమునందు స్థిరముగనుండుగాక!" అనగా, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను : "బ్రహ్మస్వరూపా! మహాబుద్ధిమంతులగు నీ ధీరులు ఏ నిశ్చయముచే దుఃఖరహితులై యుందురో దాని తత్త్వము నుపదేశింపుము" అన, వశిష్ఠ మహర్షి ఈవిధముగ వివరించెను :

"'విస్తరించిన ఈ జగజ్జాలమంతయు బ్రహ్మమయము' అను నిశ్చయము వలన వారు దుఃఖరహితు లగుచున్నారు. చిత్తు బ్రహ్మము. ఈలోకము భూతపరంపర. 'నేను, నా శత్రువు, మిత్రులు, బంధువులు నందరు, నన్నివస్తువులును బ్రహ్మమే' యను నిశ్చయము కలవారలై యున్నారు. అంధునకు జగమంతయు నంధకారమయముగను, సుభదృష్టికలవానికి ప్రకాశవంతముగను భాసించు విధమున; నజ్ఞానికి దుఃఖమయముగను, జ్ఞానవంతున కానందమయముగను గనుపించును. సర్వమును బ్రహ్మముగా భావించువారు బ్రహ్మస్వరూపమే యగుచున్నారు, అమృతపాన మొనరించువాడమృత స్వరూపుడేకదా! ఆభాసమాత్రమై, నిర్మలమై, సర్వభూతావబోధకమై, సర్వవ్యాపకమై, ప్రశాంతమగు చిత్తు బ్రహ్మముగా భావింపబడుచున్నది. మనస్సు అన్యథాయత్తమై ఎదుటనున్నవానిని జూడ జాలదు. దూరదేశమున నున్నదియై, విషయ సంస్పర్శములేని చిన్మాత్రప్రతీకమగు బ్రహ్మమే నేనగుచున్నాను. సర్వసంకల్పఫలప్రదాతయై, తేజస్సుల కన్నింటికిని ప్రకాశము నిచ్చునదై, సర్వోపాదేయములకు సీమాంతమైన చిదాత్మ నుపాసించుచున్నాను. సర్వ సంకల్పములు ప్రశాంతించినదై

సమస్త కుతూహలము నశించినవారై, క్రోధ విరహితమైన చిదాత్మ నుపాసించుచున్నాను అను నిశ్చయములు కలవారలై మహాత్ము లగువారు సత్యమును, ప్రశాంతము, సమము నగు బ్రహ్మమందు సుఖముగ వసించుచున్నారు. ఈవిధమగు పరిపూర్ణబుద్ధి విలసితులగు నా ధీరులు, హర్షామర్షములు లేనివారలై జీవితము నభినందింపక, మరణమును నిందింపక మెలగుచున్నారు" అన. శ్రీరామచంద్రుడు, "బ్రహ్మజ్ఞా! సమ్యగ్జ్ఞాన విలాసమున వాసనా విలయము నందగా, నిశ్చయముగ నేను జీవన్ముక్త పదమందు విశ్రాంతి నందితిని. ప్రాణ స్పంద నిరోధమువలన వాసనాలయము కాగా, జీవన్ముక్త పదమునం దెట్లు విశ్రమింపదగును?" అని ప్రశ్నింప, వశిష్ఠు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "సంసారార్ణవము నుత్తరించుటకగునుపాయమును 'యోగ' మందురు. 'ఆత్మజ్ఞాన రూపమును, ప్రాణాయామ రూపము' నని ఈ యోగము రెండు విధములుగ చెప్పబడినది. అయినను ప్రాణా యామమునందే ఇది రూఢమైనది. ఒకనికి యోగ మసాధ్యముకాగా, మరియొకనికి జ్ఞాన నిశ్చయ మసాధ్య మగును. అందువలన పరమే శ్వరుడు 'యోగము, జ్ఞానము'నను రెండుగ విభజించి యుపదేశించెను.

<u>భుశుండోపాఖ్యానము</u> : శ్రీరామచంద్రా! ఇప్పటివరకు నీకు జ్ఞాన మార్గము నభివర్ణించితిని. ఇప్పుడు యోగ మార్గమును వివరించుచున్నాను, సావధానుడవై యాలకింపుము. ఇది పరమాద్భుతావహమైన విషయము. ఒకమారు నేను కాలాంతర మున స్వర్గమున కేగి, దేవేంద్రుని యాస్థానమున నుంటిని. ఆ సమయమున నారదాది మహర్షులు చిరకాలజీవులగు వారి చరిత్రములను గూర్చి చర్చించుచుండగా నాలించితిని. ప్రసంగ వశమున 'శాతాతపుడు' అను మునిపుంగవుడు, 'మహర్షులారా! మేరు పర్వతమున కీశాన్య దిగ్భాగమున, పద్మరాగమణిమండిత మనోహర శిఖరమున శ్రీమంతమగు కల్పతరు వొకటి కలదు. దానికి పై భాగమున సౌవర్ణరాజితకల్పలతాపరివేష్టితదక్షిణస్కంధ

కోటరమున నొక విహంగాలయము కలదు. అందు పద్మాసనమున భాసించు చతురాననుని విధమున 'భుసుండు' అను వాయసశ్రేష్ఠుడు వసించు చుండెను. అతడు వీతరాగుడు. అతనివలె చిరకాలజీవి యగువాడీ జగత్తులో నెవ్వడును లేడు. ఈ లోకమున నేగాదు, స్వర్గమునందును లేడు. వాని బోలువాడిక భవిష్యత్తులో గూడ జన్మింపబోడు. చిరంజీవి యగుటయేగాక రోగరహితుడై, శోభాయుక్తుడై, మహామతిమంతుడై, ప్రశాంతచిత్తుడై, కాలకోవిదుడై వెలయుచున్నాడు' అని ప్రశంసించెను. అతని మాటల నాలకించిన మునీంద్రులు మరల మరల ప్రశ్నించిరి. ఆ మహర్షి ఆ దేవదేవుల సభ యందు 'ఇది యంతయు యథార్థము. కాని, అతిశయోక్తి యెంతమాత్రము కాదు' అని దృఢముగా నాత్మవిశ్వాసపూర్ణముగ వచించెను. అంతటితో నా ప్రస్తావనము ముగిసినది. కొంతసేపటి కా దేవసభయు ముగిసినది సభికు లందరు తమతమ నెలవులకు జనిరి. నేను మాత్రము మా భుసుండు మహాత్ముని దర్శింప గుతూహలము జనించినవాడనై మేరు పర్వత దిశగా బయనించితిని. కొంతదూర మా వియన్మార్గమున పయనించి మేరు పర్వతమును జేరుకొంటిని. దాని శిఖరాగ్రమున చక్రములవలె గుండ్రముగా నున్న శాఖలు గల కల్పవృక్షమును దర్శించితిని. అందలి గూండ్లను, పొదరిండ్లను, లతా పత్రములను, కోటరములను భుసుండుని కొరకై యన్వేషించుచు, ననేక విధములగు విహగముల నవలోకించితిని. ఆ పతత్రి గణములో కొన్ని చంద్రికశాఖండ సదృశములు. అవి తామరతూండ్ల నారగించు చున్నవి. సామవేదమును గాన మొనరించునవి కొన్ని గలవు. అవి విరించి రథవాహనములైన రాజహంసల సంతానములు. స్వాహాకార నిభస్వనములు గల మంత్ర సముదాయముల నుచ్చరించు శుక, పిక, శారికముల, నింక నితరములగు ఖగ సంతతులను దర్శించితిని. అవి గౌరీకబరసన్నిభములగు పింఛములు కలవియు, కుమారస్వామి యుపన్యసించిన శైవ విజ్ఞాన సర్వస్వము నెరిగిన కుమార వాహన

మయూరములు విలోకించుచు నొకచోట నొక కోటరమున నేకాంతమున నొక సభ యందు అపరిక్షుభితాకారములై యున్న వాయస గణమును పొడగంటిని. వాటి మధ్య నున్నతాకారము కలిగి శోభావంతుడైన భుసుండుని కనుగొంటిని. అతడు పరిపూర్ణ చిత్తుడు. సర్వాంగ సుందరుడు. మౌని. సమభావ విరాజితుడు. ప్రాణస్పంద నిరోధము కలవాడు కాన నిత్యము నంతర్ముఖుడై సుఖముగా నుండును. ప్రసన్న గంభీర మనస్కుడై, మృదువచన విలాసితుడై యుండెను. దేదీప్యమాన శరీరముకల యాతని సమ్ముఖమునకు నేను జేరుకొంటిని.

నీలోత్పలసరస్సమానమగు నా వాయస మండలము సంచలించినది. అనంతర మా భుసుండుడు వచ్చి తలవని తలంపుగా నరుదెంచిన నన్ను జూచి యాశ్చర్యము వెలిబుచ్చుచు, 'వశిష్ఠ దేగుదెంచెను' అని పలుకుచు, తానున్న పత్రపుంజమునుండి, పర్వతము నుండి లేచు మేఘశాబకము పగిది లేచి, 'వశిష్ఠ మునీ! స్వాగతము' అని స్నిగ్ధమధురాక్షర సంబద్ధ వాక్యములతో ప్రశ్నించెను. సంకల్ప మాత్ర సంజనిత హస్తములతో మేఘము హిమమును వర్షించు నటుల పుష్పాంజలిని సమర్పించెను. 'ఈ ఆసనము నధిష్ఠింపుడు' అని నూతన కల్పతరుచ్ఛదమును జూపెను. ఆ ఖగ బృందము లన్నియు దర్శనోన్ముఖదృష్టులై యుండ నే నా కల్పలతా పుంజమున నాసీనుడనైతిని. సంతుష్టమానసుడైన భుసుండు, అర్ఘ్యపాద్యాదులతో న న్నర్చించి సౌహార్దమధురాక్షరములతో నిట్లనెను :

'మహాత్మా! చిరకాలమునకు తాము దర్శన మొసంగితిరి. తమ దర్శనామృత మేఘమున, మాదృశ పక్షి సముదాయమున కమృతాభిషేచనమైనది. తమ రే కారణమున నిట కరుదెంచి గమనాయాసము ననుభవించితిరి? తమ వచస్సుధామృతపానము నొనరింప నా శ్రవణ ముఖము లాతురపాటు నందుచున్నవి. తమ

పాద సంస్పర్శన మాత్రమున తా మరుదెంచిన కారణ మంతయు నా కవగతమైనది. చిరకాలజీవుల చర్చలచే మేము స్మరింపబడితిమి. భవదాగమన కారణము నెరింగియు నేల ప్రశ్నించుచుంటి ననగా, భవద్వ్యాఖ్యామృతాస్వాదనవాంఛ నన్నిట్లు ప్రేరేపించినది' అని త్రికాలవేదియు, చిరంజీవియు నగు నా భుసుండు పలుక నే నిట్లు ప్రత్యుత్తరము నిచ్చితిని : 'విహంగమ మహారాజా ! నీవు వాక్రుచ్చిన దంతయు యథార్థము. చిరంజీవివగు నిన్ను దర్శింప దలచి వచ్చితిని. నా సంశయ విచ్ఛేద మొనరింపుము. నీవు తత్త్వజ్ఞుడవు. నీ జన్మించిన కులమేది? జ్ఞాతృజ్ఞేయుడ వెట్లయితివి? నీ వయస్సెంత? గత వృత్తము స్మృతియందున్నదా? దీర్ఘదర్శివగు నీకీ నివాసము ఏల నిర్దిష్టమైనది?' అని ప్రశ్నించితిని. అపు డా భుసుండుడు ప్రహృష్టాంతరంగుడు గాని, అపహృష్టుడుగాని కాలేదు. 'మునిచంద్రమా ! తమ వంటి మహాత్ముల ఆజ్ఞ నతిక్రమింప సమర్థు డెవ్వడుండును ?' అని ఆ భుసుండు డిట్లు ప్రత్యుత్తరము నీయ నారంభించెను :

'స్వర్గ నివాసులలో శ్రేష్ఠుడును, దేవాదిదేవాభినందితుడగు హారుడు అను దేవు డుండెను. శిరఃఖురులు, ఖురకరులు, కరదంత ముఖోదరులు, భల్లూక, ఉష్ట్రి, అజ, అహివక్త్రు లగు ప్రమథులు, ఆ హారునకు క్రీడాసహాయులై యుండిరి. వారలకువలె నితరపుఁగు మాతృకా పరివారము వారలు ప్రవర్తించుచుండిరి. వీరును, భూత గణములును హారుని సన్నిధిని నృత్యము జేయుచుందురు.

ఈ మాతృకలు గిరికూటములు, ఆకాశము, లోకాంతరములు, జలము, శ్మశానములు, దేహుల శరీరములయందు నివసింతురు. 'జయ, విజయ, జయంతి, అపరాజిత, సిద్ధ, రక్త, అలంబుస, ఉత్పల' అను నీ యెనమండుగురు సమస్త మాతృకలకు నాయికలై యుందురు. వీరల ననుసరించుచు నితర మాతృకలును, వారల ననుసరించుచు మరికొందరు మాతృకలు నుందురు. మునినాయకా ! పూజ్యులగు నా మాతృకలలో అలంబుస విఖ్యాతి వహించిన నాయిక,

వైష్ణవ శక్తికి గరుడుడు వాహనమైనట్లు, వజ్రసదృశచంచుడు, ఇంద్రనీలాచలోపముడునగు 'చండుడు' అను కాక మా మాతృకకు వాహనమై యుండును. ఈవిధముగ నష్టైశ్వర్యయుక్తలగు రౌద్ర చేష్టితలైన యా మాతృకలు, ఒకానొక కారణమున నొకప్పుడు వియత్తలమున సమావేశమైరి. పరమార్థప్రకాశకమైన నొక యుత్సవమును ఆచరించిరి. ఆ సమయమున నవ్వుచు, నాట్య మాడుచు, పానము జేయుచు, గాన మాలపించుచు వారు మైమరచి యుండిరి.

ఈ యుత్సవ మీ విధముగ కొనసాగుచుండ, నష్ట మాతృకల యుత్తమ వాహనములును, తమ తమ యధిపతుల ననుకరించుచు నవ్వుచు,నాట్య మాడుచు, మద్యపాన మదోన్మత్తములై యుండెను. అంత నొకచోట నాకసమున మద్యపానమదోన్మత్తలై బ్రాహ్మీ రథవాహనలైన హంసలును, అలంబుస వాహనమైన చండాఖ్య కాకమును గూడ నాట్య మాడుచుండిరి. మదమత్త మదన పరవశ లగు హంసాంగనలు, చండాఖ్య కాకముతో క్రీడించినవి. అవి రతితోషితలై గర్భము ధరించినవి. దేవమాతృకలు, సిద్ధ, విద్యా ధరాదులు నాట్యమాడి మద ప్రశాంతినంది తమ తమ నిలయముల కరిగిరి.

మునీంద్రా ! గర్భిణులగు నా బ్రాహ్మ్యవాహంసాంగనలు, జరిగిన వృత్తాంతము నంతయు తమ యదినేత్రియగు బ్రాహ్మీ దేవతకు విన్నవించుకొనిరి. ఆ విషయము నాలించిన యా దేవి, 'బిడ్డలారా ! గర్భధారిణులగు మీరు, నా వాహన కృత్యము నెరప సమర్థులు కారు. కాన, మీరు స్వేచ్ఛగ విశ్రాంతి ననుభ వింపుడు.' గర్భాలస లయిన హంసాంగనలపై దయాంతరంగయై, సరస్వతి వచించి నిర్వికల్ప సమాధి నిమగ్నయై సుఖముగ నుండెను.

కాలాంతరమున గర్భపరిపక్వము నొందిన ఆ హంసాంగనలు బ్రహ్మసరోవరమున నివసించుచు, నిరువదియొక్కమంది పుత్రులను

ప్రసవించెను. మహామునీ! చండతనయుల మగు మే మిరువది యొక్కమంది సహోదరులము నిట్లు హంసల వలన జనించితిమి. మేము మా మాతృదేవతలతోగూడి, పూజ్యురాలగు గిర్దేవి నారాధించితిమి. చాలకాలమున కామె సమాధినుండి మేల్కాంచి, మ మ్మనుగ్రహించినది. ఆమె యనుగ్రహ విశేషమున మేము జీవన్ముక్తులమైతిమి. మానసికసంతృప్తియు, ప్రశాంతియుగల మేము, ఏకాంతముగ ధ్యాన నిష్ఠులమై యుందుముగాక!' అని సంకల్పించుకొని మా జనకాంతికమున కేగితిమి ఆయనకును, అధిదేవత యగు నలంబుసకు వందనాదికము లాచరించి వారి యనుగ్రహమునకు బాత్రులమైతిమి. 'తండ్రీ! బ్రాహ్మీమాత కరుణాకటాక్ష వీక్షణము లవలన జ్ఞేయ జ్ఞానమును సంపూర్ణముగ బడయ గలిగితిమి. ఇక నిపు డేకాంతముగ మా జీవితములను గడపుటకై యుత్తమ స్థానము నభిలషించుచున్నాము' అని మే మభ్యర్థించుటతోడనే సర్వజ్ఞుడగు మా పితృదేవుడు 'కల్పవృక్షము నివాసయోగ్యము, నిర్బాధకము' నని యెరిగించెను. అనంతర మాయనకు నతు లర్పించి, యచటనుండి కల్పవృక్షము నరయుచు వచ్చి యిచట కనుగొని, దీనియందు నిశ్చింతముగా కాలము గడపుచున్నాము.

మునిశ్రేష్ఠా! చిరకాలార్జితమైన నా తపమునకు ఫల మీనాడు లభించినది. మహామహిమాన్వితుడవైన నిన్ను నిరాటంకముగ దర్శించుచున్నాను. రసాయనమయమై, పరిశాంతమై, పరమానంద ప్రదమైన సజ్జన సాంగత్య మను చంద్రిక ఎవరి కాహ్లాదకరము కాదు? దీనిని మించిన శ్రేయ మింకొకటి లేదు అని భావించు చున్నాను. సజ్జనులు సర్వేషణలను జయించిన వారుకదా! పరమాత్మతత్త్వము నెరిగినవాడనే యయ్యినను, తమ సందర్శన భాగ్యము వలన నా దుష్కృతములు నశించి, జన్మ సాఫల్యము నందెను. సజ్జన సాంగత్యము సకల భయాపహము కదా!' అని భుసుండుడు తన జన్మ వృత్తాంతమును సవివరముగ

జెప్ప, వశిష్ఠ మహాముని ఆ విషయమును శ్రీరామచంద్రున కెరిగించెనని వాల్మీకి భరద్వాజునకు జెప్పెను.

రామచంద్రా! ఆ భుసుండుడు తిరిగి నాకు నర్ఘ్య పాద్యాదులు సమర్పించి, సమర్చించి నంతనే నిట్లు ప్రశ్నించితిని: 'విహగరాజమా! మీర లిరువదియొక్క మంది సహోదరుల మని వక్కాణించితివి కదా! నీ వొక్కడివే కనుబడుచున్నా వేమి? నీతో సమానులు, మహాబుద్ధిమంతులు నగు నీ సహోదరు లెచట వసించుచున్నారు?' అన, భుసుండుడు ఇట్లు వివరింప నారంభించెను: 'మునీంద్రా! మా సోదరుల మందరము గలసి యిచట కాలము గడపుచుండగా ననేక యుగములు, కల్పములు నెన్నియో గతించి పోయినవి. ఇంతలో నా సహోదరు లందరును, శరీరములను తృణప్రాయములుగ భావించి, శివైక్య మందిరి. దీర్ఘాయుష్మంతులైనను, మహాత్ములైనను, పండితులైనను, బలశాలురైనను, ఎంతటివారలైనను దయాదాక్షిణ్యముల నెరుగని ఈ కాలముచే నేదో నొకనాడు భక్షింపబడవలసినవారలే కదా!' అన, నే నిట్లంటిని: 'మహాబుద్ధీ! కల్పాంతరములందు ద్వాదశాదిత్యులు నెండలు గాయుచుండ, సప్త వాయువులు ప్రచండముగా వీచుచుండ, కాలాగ్ని శిలలను సైతము దహించుచుండ, ఏకార్ణవముగ జల మలముకొనుచుండ నీవు నిర్బాధముగ నెట్లు మనగలిగితివో వివరింపుము' అనగా, భుసుండు డిట్లు వివరింప దొడగెను:

'కల్పాంతమున జగద్గతమగు వ్యవహార మంతయు నశించును. అప్పుడు కృతఘ్నుడు సన్మిత్రుని పరిత్యజించునట్లు నేను నా ఈ గూటిని విడచి వేయుదును సర్వాంగములు నిశ్చలములైనవాడనై, వాసనా రహితమగు మనస్సుతో కల్పనల నన్నిటిని విడచి, ఆకాశమునందు వసింతును. ద్వాదశాదిత్యులు తపింప జేయునప్పుడు, ఆకాశ ప్రాంగణము నందున్న నేను వరుణ సంబంధమైన ధారణ నవలంబించి, ధీరబుద్ధి

కలవాడనై యుందును. ప్రళయకాల ప్రభంజనములు చెలరేగు నపుడు పర్వత సంబంధమైన భావన నాశ్రయించి నిశ్చలుడనై యుందును. ఏకార్ణవమును జేయు జల ప్రవాహము విజృంభించి నప్పుడు వాయురూపమైన భావమును స్థిరపరచుకొని యుందును. బ్రహ్మాండమునకు వెలుపల భాగమున, పృథివ్యాది ప్రకృత్యంతము లగు తత్త్వముల కన్నిటికి నంతమగు నాత్మ తత్త్వము నందు నిశ్చల సమాధి నిష్ఠుడనై యుందును. కమలగర్భుడు మరల సృష్టి కర్మ నారంభించి నంతనే బహ్మాండములో ప్రవేశించి, ఈ నా విహాగాలయము నందు నివసింతును. ప్రతికల్పము నందును నా సంకల్పము వలననే ఈ పర్వత శిఖరము, దీనిపై నీ కల్పవృక్షము మున్నగున దంతయు నీ విధముగనే నెలకొని యుండును' అని చెప్ప వశిష్ఠ మహాముని యిట్లు ప్రశ్నించెను: 'పక్షీంద్రా! అఖండితములగు ధారణలతో కల్పాంతము లందు నీ వున్న విధముగా మిగిలిన యోగులు కూడ నేల నుండ జాలరు? వివరింపు' మన భుసుండు డిట్లనెను : 'బ్రహ్మవేత్తా! పరమేశ్వర సంబంధమైన నియమము లనుల్లంఘనీయములు. ఇతర యోగుల విధముగా నేను నుండవలయును. కాని, కాగల కార్యమును తప్పింప నెవ్వరికిని శక్యము కాదు. జరుగవలసి యున్నది జరిగి తీరును. అది తప్పదు. ఇది స్వభావ నిర్ణయము' అన, వశిష్ఠు డిట్లు ప్రశ్నించెను: 'నీవు జ్ఞాన, విజ్ఞానవంతుడవు యోగయోగ్య మగు మనోగమనము కలవాడవు. ఈ ముజ్జగములయందు గతించిన కల్యాణ చిత్రములు నీకు గుర్తునం దున్నంతవరకు నెరిగింపుము' అన, భుసుండు డిట్లు చెప్పసాగెను : 'మహామునీ! ఒకానొక కల్పమున నీ భూమండలమందు మహాశిలలు గాని, వృక్షములు గాని లేవు. తృణములు గాని, లతలు గాని అంకురింప లేదు పర్వతములు గాని, మహారణ్యములు గాని లేనట్లుగనే జ్ఞప్తి యందున్నది. వేరొక కల్పమున పదివేల పదివందల సంవత్సరములు, అనగా పదునొకండు వేల సంవత్సరముల పర్యంతము నీ భూమి

భస్మావృతమై యుండుట జూచితిని. ఇంకొక కల్పమున నాలుగు యుగముల వరకు మహావృక్షములచే దట్టముగ వ్యాపించి యుండుటను, మరినాలుగుయుగములు పర్వతాకీర్ణమై యుండుటను, అగస్త్యమహర్షి లేనందున వింధ్య పర్వతము పుడమి నాక్రమించి యొక నాలుగు యుగము లుండుటను జూచితిని. మద్యపానాసక్తులైన బ్రాహ్మణులును, దానిని విసర్జించిన శూద్రులును కలిగి స్త్రీలు స్వేచ్ఛా విహారిణులై యున్న సృష్టి నొక దానిని దర్శించితిని. సూర్యచంద్రుల జననములను, ఇంద్రోపేంద్రుల వ్యవస్థను, హిరణ్యాక్షుడు భూమి నపహరించుటయు, వరాహము దాని నుద్ధరించుటయు, రాజులను సృష్టించుటయు, వేదములను దెచ్చుటయు, మందరాద్రిని పెకలించుటయు, నమృత సంపాదనార్థము క్షీరాబ్ధిని మథించుటయు, రెక్కలు రాని గరుత్మంతుని, సాగరముల పుట్టుక మున్నగు విషయములు కొలదికాలము క్రిందటనే జరిగినవి. ఇవి బాలకులు గూడ నెరుగుదురు. ఇట్టివానియం దేమి విశేష మున్నది? ఈ జగత్తు నందు యుష్మదాదులగు భరద్వాజ, పులస్త్య, అత్రి, నారద, ఇంద్ర, మరీచులు; సనత్కుమార, భృగు, ఈశ, స్కంద, విఘ్నేశ్వరాదులు; గౌరి, సరస్వతి, లక్ష్మి, గాయత్ర్యాదులు జన్మించుటయు జూచియున్న నాకు నద్యతన సృష్టులను గూర్చిన యాలోచన మేమి యుండును?

మునీంద్రా! బ్రహ్మమానసపుత్రుడవైన నీ కిది ఎనిమిదియవ జన్మముకదా! అనగా నెనిమిదవ సృష్టియందు నన్ను గలసుకొంటివి. ఒకప్పు డాకసము నుండి జన్మించితివి. మరియొకప్పుడు జలము నుండి ప్రభవించితివి. ఇంకొకప్పుడు పర్వతములనుండి సంభవించితివి. వేరొకప్పుడు అగ్నినుండి యుద్భవించితివి. సముద్రగర్భమున నంతర్థానము నొందిన ఈ ధరాతలమును, మహాకూర్మమై దుమారు లుద్ధరించుటయు, పండ్రెండు పర్యాయములు పాలకడలిని మథించుటయు, హిరణ్యాక్షుడు మూడు మారులు భూమిని పాతాళమునకు గొనిపోవుటయు, రేణుకా గర్భమునుండి శ్రీహరి

పరశురామావతారమున నారుమారులు జన్మించుటయు, నూరు కలియుగములందు విష్ణుమూర్తి బుద్ధావతారుడై యవత రించుటయు, త్రిపుర సంహారము ముప్పదిమార్లు జరుగుటయు, దక్షాధ్వర ధ్వంసము రెండు పర్యాయములు చేయబడుటయు, పది మారులు మహేశ్వరుడు మహేంద్రుని దండించుటయు, బాణాసుర యుద్ధము ఎనిమిది పర్యాయములు ఘటిల్లుటయు, మున్నూరు యజ్ఞ హారణములు సంభవించుటయు స్మృతి పథమున మెరయు చున్నవి.

మహామతీ! పురుష బుద్ధులు యుగానుసారముగ న్యూనా ధిక్యతలు కలవై యుండును వాని ననుసరించి నిర్మితములైన క్రియాంగపారవై చిత్రియుక్తములగు వేదముల నెరుగుదును. ఏకార్థకములై, సమగ్రములై, బహుపాఠములు కలిగి, యుగ ధర్మముల ననుసరించి ప్రవర్తిల్లుచు, ఆ యుగాంతములయందు నివృత్తి నందెడి పురాణములు జ్ఞప్తియం దున్నవి. మహాశ్చర్య కరమైన ఇతిహాసము కల వేరొక 'రామాయణ' మను పేరు గల, వాశిష్ఠ రామాయణము, లక్షగ్రంథ పరిమితమైన జ్ఞాన శాస్త్రము నెరుగుదును. ఇది 'వాల్మీకి' అను జీవునిచే పడ్రెండు మారులు రచింపబడుట నెరుగుదును కాని దీనిని వాల్మీకి రచించెనో లేక యితరులెవ్వరైన రచించిరో స్పష్టముగ స్మృతి యందులేదు. ప్రాచీనుడగు వ్యాసునిచే రచింపబడినది యగు దీనితో సమానమైన మహాభారత మను మహాగ్రంథము నెరుగుదును. దీనిని జగత్తు విస్మరించినది. పదవమారు వ్యాసు డను వ్యక్తియో, మరి యెవ్వరో ఈ భారతమును మరల రచించిరి. ఈ విషయమును జెప్ప మరచితిని, రాక్షస సంహారణార్థమై విష్ణుమూర్తి పదునోకండవ పర్యాయము శ్రీరామచంద్ర నామముతో నవతరింపగలడు, భూ భార నివృత్తికై వసుదేవ సదనమున శ్రీకృష్ణమూర్తి రూపముతో పదునారవమారు అవతరించును. జగన్మయమగు నీ భ్రాంతి నా కెన్నడును లేదు.

ఒకప్పు డీ జగము జల బుద్బుద స్థితిని పొంది యున్నది. ఆత్మ యందున్న సంవిత్తు దృశ్య భ్రాంతి యగుచున్నది. ఇది జలమందు క్షణములో బుట్టి, నశించు వీచికవలె ననిత్యమైనది. పూర్వ మీ యుత్తరపు దిక్కనియు, దక్షిణపు దిక్కనియు దిగ్విభాగము లేదు. ఈ మేరు పర్వత మీ దిశయందు గాక, వేరొకచోట నుండెడిది అర్కాది గ్రహసంచార వశమున, మేర్వాది పర్వతముల స్థితి ననుసరించియు నీ దిగ్విభాగ మేర్పడినది వాని గతులు మారినచో దిశలు కూడ మారుచుండును. కలియుగమున కృత యుగాచారములు ; కృతయుగమున కలియుగాచారములు ; త్రేతా, ద్వాపరములయందు ధర్మ విపర్యాసము జరుగుట నెరుగుదును' అని భుసుండుడు వచింప విని, మరియు వశిష్ఠ మహర్షి యిట్లు ప్రశ్నించెను : ' విహగరాజేంద్రా ! ఈ జగత్కోశమున వ్యవహార వంతులై చరించుచున్నవారి దేహములను మృత్యువు బాధింపకుండ నుండు విధము నెరిగింపుము' అన నా భుసుండు డిట్లు వచించెను !

' సర్వజ్ఞా ! నీవు సర్వము నెరిగియు నన్నడుగుచుంటివి. ప్రభువులు నిత్యము భృత్యుని వాగించుచుందురుకదా ! అయినను తమరు ప్రశ్నించుచున్నారు కాన ప్రకటించుట నా ధర్మము. సజ్జనుల యాజ్ఞ ననుసరించుటయే ప్రధానమని పండితులు ప్రవచించిరి.

చిరజీవిత్వ హేతువు : 'వాసన'లను తంతువులతో 'దోషము'లను ముత్యములు గ్రుచ్చబడిన హారములు ధరింపనివారిని మృత్యువు సంహరింపజాలదు. విశ్వాస మహాతరువులకు రంపములును, దేహలతలకు జీడపురుగులును నగు 'అధులు' అనగా మానసిక వ్యాధులు బాధింపనివారిని మృత్యువు వధింపదు. 'శరీరము' లను వృక్షకోటరములయందుండు సర్పసముదాయము 'చింతలు' అను ఫణములు కలవై యుండును. వాటిలో ' ఆశ ' అను విష ముండును.

అ విష దష్టులుకానివారి దరికి మృత్యువు రాజాలదు. రాగద్వేష విషముచే నుద్రిక్తమై, తన మనోబలమందుండు 'లోభ' మను సర్పము దరిజేరనివారికి మృత్యు భయము లేదు. వివేక జలమును సంపూర్ణముగ పానమొనరించినదియు, శరీరసాగరమందున్న 'బాడబ' మను కోపము లేనివానిని మృత్యు వేమియు జేయ జాలదు. కఠినమగు యంత్రము తిలరాశిని పీడించెడి విధమున ననంగ పీడాదూరుడైన వానిని మృత్యువు జంపలేదు. చిత్త మేకాగ్రావస్థితి నందియుండువారిని మృత్యువు సమీపింప జాలదు. నిర్మలము, పావనము నగు బ్రహ్మపదమునందు విశ్రాంతి నందినవారిని మృత్యువు వధింపలేదు. బ్రహ్మజ్ఞుడా! సంసార వ్యాధి హేతువు లగు మహాదోషములు సమాధినిష్ఠమగు చిత్తమును బాధింప జాలవు. మహాభ్రమలచే నాధి, వ్యాధి రూపములై చరించు దుఃఖములు సమాధినిష్ఠ చిత్తమును సమీపింపలేవు. దురర్థములు, దురారంభములు, దుర్గుణములు, దురుదాహృతములు, దుష్ప్రక్రమ ములు నగునవి సమాధి మగ్నచిత్తుని బాధింపజాలవు. ఉత్తర కాలమున మేలు గూర్చునదియు; సత్యమై, ఉపాధి లేనిదై, భ్రాంతిరహితమై, దుస్సంకల్ప వివర్జితమైన దగు పరబ్రహ్మమునందు మనస్సును లగ్న మొనరింప వలయును. ఆత్మచింతనము సమస్త చింతలను నాశము జేయును. అది యుష్మదాదులకు సుప్రాప్యము, నస్మదాదులకు దుష్ప్రాప్యము నై యుండును. సమస్త సంకల్పముల కతీతమైన పరమపదము సామాన్యుల కెట్లు లభించును? మహాత్మా! ఆత్మ చింతనముతో సమానమైన అనేక ఆత్మచింతావయస్యల నడుమ నుండి ఒకటియై, సర్వదుఃఖక్షయంకరమై, సర్వసౌభాగ్యవివర్ధకమై ఇంతవరకు జీవించి యుండుటకు హేతుభూతమైన ప్రాణచింత నాశ్రయించుచున్నాను' అని భుసుండుడు వచించుచుండ, వశిష్ఠు డిట్లు ప్రశ్నించెను! 'పతత్రిసత్తమా! సర్వసంశయములను విచ్ఛేదము జేయువాడవు, చిరకాలజీవనుడవైన సాధువా! ప్రాణచింతను ఆశ్రయించుచుంటి నంటివి. దాని పరమార్థ మేమో వివరింప గోరుచున్నాను' అన, భుసుండు డిట్లు వచించెను:

'భగవానుడా! ప్రాణచింతను వివరించుచున్నాను, వినుము. మనోహర దేహము ప్రాణమునకు గేహము. దీనికి ఊర్ధ్వముగను, అధోముఖముగను రెండు వాయువులు సంచరించుచుండును. దేహ మధ్యమున హృదయ పద్మము కలదు. దానియందు రెండు వాయువు లుండును. ఊర్ధ్వముగ ప్రసరించు వాయువును 'ప్రాణ' మనియు, నధోముఖముగ ప్రసరించు వాయువును 'అపాన'మనియు నందురు. ఈ రెండు వాయువుల ననుసరించి నేను నిత్యగమనము కలవాడనై యుంటిని. ఇవి క్రమముగనుష్ణము, శీతమునగు రూపములు కలవగును. నిత్యము నాకసమున సంచరించుచుండును ఎంతమాత్ర మును 'శ్రమ' అను దాని నెరుగక 'శరీరము' అను మహాయంత్ర మును మోయుచున్నవి. అవి హృదయాకాశమున సూర్యచంద్రుల వంటివి. అగ్నిష్టోమ రూపములు, ప్రాణాపానాభిధానములు కలిగి, అవిచ్ఛిన్నములైన శారీరక వాయుగతుల ననుసరించు నాకు. జాగ్రత్స్వప్నసుషుప్తులయందు సమరూపములు కలవియై, సుషుప్తి యందున్నవాని విధముగ దినములు గతించుచున్నవి. ఇవి సహస్రధా ఛిన్నములైన బిసతంతు సంతతుల లవమాత్రముకంటె సూక్ష్మ తరములైనను అస్తిత్వము కలిగి దుర్లక్ష్యములై యున్నవి.

వీనిలో 'ప్రాణ' మనునది నిరంతరము సంచరించు స్పందశక్తి కలదై, దేహమున బాహ్యాభ్యంతరములందు పండ్రెండంగుళముల వరకు వ్యాపించి యుండును. 'అపాన'మను నిరంతర చలనశక్తి కలదై, దేహ బాహ్యాభ్యంతరముల వ్యాపించి యధోముఖమై యుండును. జాగ్రదవస్థయందు గాని, నిద్రావస్థయందు గాని ప్రాణాయామ మెరిగినవానికి నుత్తమమగు నే ప్రాణాయామము ప్రవర్తించునో వివరించుచున్నాను, వినుము. హృత్పర్ణకోటరము నుండి, ప్రాణములు బాహ్యోన్ముఖ మగుట కప్రియత్నముగ నుపకరించు దానిని 'అంతస్థరేచకము' అందురు. ద్వాదశాంగుళ పర్యంతము బాహ్యప్రదేశము నాక్రమించు ప్రాణముల కంగ స్పర్శక మైనది 'పూరకము' అనబడును. బాహ్యప్రదేశము నుండి వాయువు

లోన బ్రవేశించుచుండగ, నాసాగ్రము మొదలు మూర్ధమువరకును మూర్ధము మొదలు నాసాగ్రము వరకును యత్నమగు స్పర్శను 'అంతర పూరక' మందురు. అపానవాయువు నశింపగా, హృదయము నందు ప్రాణ వాయువు ఉదయించనంతవరకు నుండు నిశ్చలవాయు స్థితిని 'అంతస్థ కుంభక' మని యోగు లనుభవించి యభివర్ణించిరి. 'రేచకము, పూరకము, కుంభకము' నని మట్టిలోనుండి యవతరించిన ఘటమువలె బాహ్యస్థితి కలదై యుండును. ద్వాదశాంగుళ పర్యంతముగ, నాసాగ్ర సమముగ నెదుట ఆకాశమునందు నిత్యము నపాన వాయు కుంభక ముండునని పండితులు వచించిరి. బాహ్యమున నభిముఖముగ నాసికాగ్రావధియగు గతికల వాయువును 'బాహ్య పూరక' మని యోగవిదులు నిర్వచించిరి నాసాగ్రమునుండి వెలువడి ద్వాదశాంగుళ ప్రమాణావధిగల, గమనముకల వాయువు మరియొక బాహ్యపూరక మని చెప్పిరి బాహ్యప్రదేశమున ప్రాణ వాయు వస్తమింపగా, అపానవాయువు ఉదయింపనంతవరకు లోపల నుండు వాయువును, 'బాహ్యకుంభకము' అందురు. అపానోదయ రూపకమైన వాయువు అంతర్ముఖత్వముగ నుండిన దానిని 'బాహ్య రేచకము' అందురు. దీని నభ్యసించినవారికి ముక్తి లభించును. ద్వాదశాంతము మొదలు, నాసాగ్రమువరకు అపానరూపాంతరమును మరియొక బాహ్యపూరక మందురు బాహ్యాభ్యంతరములైన కుంభకాదులను, నిరంతరము ప్రాణాపానముల స్వభావములను నిరోధించువాడు పునర్జన్మ నొందడు. బాహ్యపూరకములు మూడు, అంతర పూరకములు మూడు, కుంభక ద్వయము మొత్తము ఎనిమిది విధముల వాయువుల స్వభావమును, రేయంబవళ్ళు స్మరించుచుండుటవలన ముక్తిలభించును. ఇచట వేరుగ చెప్పబడిన రేచక పూరకములను గూడ కలుపుకొనిన మొత్తము పది యగును. అయినను కుంభకము ప్రధానమైన దగుటవలన, దాని విశేష భేదములను గ్రహించుటచే నెనిమిది యయినవి.

'ప్రాణచింతన' మను నీ వ్యాపారమున నవ్యగ్రుడవై, బాహ్యమును విసర్జించిన, మనస్సు కొలది దినములలోనే, కైవల్యమును పొందును. దీని నభ్యసించు పురుషుని చిత్తము బాహ్య విషయములందు, శ్వానచర్మ నిర్మితమగు సంచియందు, బ్రాహ్మణున కాసక్తి లేని విధమున, వాంఛ గలిగి యుండదు. స్థిరబుద్ధులగు వార లీ దృష్టి నవలంబించి యున్నచో పొందదగిన వస్తువును పొంది, దుఃఖరహితు లగుచున్నారు. నిలుచుండినను, నడచుచుండినను, మేల్కొనినను, నిద్రించుచున్నను, నిత్యము సర్వకాల సర్వావస్థల యందును ఈవిధమగు ప్రాణచింతనను జేయుచున్నచో సంసార బంధము నందడు. హృదయమందలి పద్మాకారనాడీ చక్రము నుండి ప్రాణ ముదయించుచున్నది. ఈ ప్రాణము వెలుపల (నాసాగ్రమునకు) ద్వాదశాంగుళ పర్యంతమున, న స్తమించు చున్నది. అపానము బాహ్యమున గల ద్వాదశాంతమునుండి వెడలి హృదయ పద్మము నడుమ న స్తమించుచున్నది. అపానము చంద్రరూపమై దేహమును బాహ్యము నుండి తృప్తి పొందించును. ప్రాణము సూర్య లేక అగ్ని రూపమై అంతరము నుండి ఈ శరీరమును పాకము జేయుచున్నది.

ఇంతవరకు ప్రాణాపానముల గతిని, ప్రాణాయామ రూపమును అనుసంధానము జేయు విధము నభివర్ణించి, ఇపుడు ప్రాణగతి ననుసంధానము జేయుట ద్వారా ఆత్మానుసంధానము జేయు విధము నభివర్ణించుచున్నాడు.

అపాన రూపమున గల చంద్రునిలోని కళ, 'ప్రాణ'మను సూర్యునిచే గ్రసింపబడిన తత్త్వము ననుసంధానము జేయుటవలన జన్మరాహిత్యము నందుచున్నాడు. ప్రాణ మను సూర్యునిలో గల 'అపాన'మను చంద్రునిచే గ్రస్తమగు పదము ననుసంధానము జేసినను జన్మరాహిత్యము నందును. శుభములు ప్రాప్తించినపుడు సంతసింపక, అశుభములు సంభవించినపుడు దుఃఖింపక నా మనస్సు

సమభావము కలిగియుండ, ననామయుడనై జీవించుచున్నాను. పరమత్యాగము (వైరాగ్యము) నవలంబించి జీవితమును మొదలు సర్వస్వమును పరిత్యక్త మొనరించి, నిరోగినై జీవించుచున్నాను. నా మనస్సు చలన రహితమై, వీతశోకమై, వాంఛా పరిత్యాగ మొనరించి ఉపశాంతిని పొందినది. కాన, నిరోగినై జీవించు చున్నాను. 'ఇతడు బంధుడు, ఇతడు శత్రుడు; ఇతడు నావాడు, ఇతడు పెరవాడు' అను భేదము నెరుగనివాడనై చిరకాల జీవినై యున్నాను. ఆశా పరవశమైన చిత్తవృత్తికి, సమాహితు డనై సంస్పర్శము నీయకున్నాను. కాన, రోగరహితుడనై యుంటిని. ప్రాణికోటి కంతటికి మిత్రుడనై, వారుసుఖములందుచుండ, నేనును సుఖము లనుభవించుచున్నవాని విధముగను; వారు దుఃఖితు లగు చుండ నేనును దుఃఖము ననుభవించువాడనై నిరోగినై జీవించుచు న్నాను. ఆపదలందు నగధీరుడనై, సంపదలందు జగన్మిత్రుడనై భావా భావములందు భేద భావమునొందక, అనామయుడనై జీవించుచుంటిని. బ్రహ్మవేత్తా! ఇంతవరకు నేను చిరంజీవినైన విధమును వివరించితిని. ఇది యంతయు తమ యాజ్ఞ నవజ్ఞ జేయలేక వచించితిని. కాని, ఆత్మోత్కర్షమును ప్రకటించుకొనుచుంటినని భావింపకుందువుగాక !' అన, వశిష్ఠ మహర్షి ఇట్లు పలికెను: 'ఖగరాజా! కర్ణాభరణమైన విచిత్ర వృత్తాంతము నభివర్ణించితివి. ఇది నీ ఆత్మవృత్తాంతమే యగునుగాక! మిగుల నాశ్చర్యకరముగ నున్నది. నీకు శుభమగు గాక! శుభప్రదమైన ఆత్మగుహా ప్రవేశ మొనరించి సుఖముగ విశ్ర మింపుము. మధ్యాహ్నసమయమైనది. ఇపుడు నేను సుర మందిర మున కరుగవలయును. నన్ననుగమించెడి యాయాసము ననుభ వింపకుము' అని చెప్పుచు పత్రాసనము నుండి లేచి యాకసమునకు వివిష్కరము చందమున నెగసి వెడలతిని. ఆ భుసుండుడు వలదన్నను వినక యొక యోజన మాత్రము నన్ననుగమించుచు వచ్చి, నివా రింపగా, నతికష్టమున మరలిపోయెను. సజ్జన సాంగత్యము విడువ రానిదికదా! కృతయుగాది గడచిన తరువాత, మరల నా

భుసుండుని మేరునగ శిఖరమున దర్శించితిని. రామచంద్రా ! కృత యుగము గతించి యిపుడు త్రేతాయుగము మధ్యకాలమున నీవు జన్మించితివి. మరల నెనిమిది సంవత్సరముల క్రిందట నా మేరు పర్వత శిఖరముననే అజరామరరూపుడైన భుసుండు నవలోకించితిని. ఈవిధముగ విచిత్రమగు భుసుండోపాఖ్యానము నీకు వినిపించితిని. ఇందలి విషయములను అంతరంగమున బాగుగ నవగాహన మొనరించుకొని యుక్తరీతిని నాచరింపు' మని వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రున కెరిగించెనని వాల్మీకి భరద్వాజున కభివర్ణించి చెప్పెను.

## 2. దేవపూజోపాఖ్యానము

భుసుండోపాఖ్యానమున 'ప్రాణాయామము జేయుట వలన మోక్షము ప్రాప్తించు' నని యభివర్ణింపబడినది. ప్రస్తుతము' దేవపూజ వలన చిత్త విశ్రాంతియు, దానివలన సౌఖ్యము కలుగు నని ప్రబోధింపబడుచున్నది. సమస్త మోక్షోపాయములకు దేహాభిమానము ప్రతిబంధక మగుచున్నది. కాన నది తొలగుటకై ముందుగ హితము నుపదేశించుచున్నాను, సావధానచిత్తుడవగుదువుగాక !

"రామచంద్రా ! ఈ శరీరము యథార్థమున కసద్రూపము. అభాసమాత్రము. కాని 'ఇతడు, నేను' అను విభేదములచే, నభేదములచే నభిమానము అంతఃకరణమున ప్రకాశించుచున్నది. మాంసాదులచే నిర్మితమైన దేహమును 'నేను' అనుట భ్రాంతి కాని వేరు కాదు. ఆ భావమును పరిత్యజింపుము. ఈవిధములగు సంకల్పములచే నిర్మితములగు దేహములు వేనకువేలు గలవు. సుఖతల్పశయానుడవై, స్వప్నదేహముతో దిక్తటములందు విహరించుచుందువు. ఆ దేహ మెక్కడ నున్నదో చెప్పగలవా ? జాగ్రదవస్థయందు మనోరాజ్యమున స్వర్గమును గాని, పట్టణాంతరమును గాని, మేరువునుగూర్చి గాని పరిభ్రమించుచున్నావు. ఈ దేహ మెక్కడ నున్నదో చెప్పగలుగుదువా ? రఘునందనా ! ఈ సంసారమును

దీర్ఘ స్వప్నముగా తలంపుము. లేదా దీర్ఘమగు చిత్త విభ్రమమునుగా గాని, దీర్ఘమగు మనో రాజ్యమునుగా గాని భావింపుము. ఈ 'జగత్త్రియము సద్రూపము గాని, అసద్రూపము గాని కాదు. కేవల మాభాస మాత్రము అను భేదభావ కల్పనమును పరిత్యజించుటయే 'సమ్యగా లోకనము' అందురు. 'మరణము తప్పదు' అని నిర్ణయ ముండగా మరణ ప్రాప్తి యందు వ్యర్థముగ పరితపించు టేల? జన్మించినవాడు ఏమాత్రమైనను సంపదాదు లనుభవించుట నిశ్చయమై యుండగా, నర్థ లాభములందు పురుషు డేల గర్వపడవలయును? పదార్థ వర్గ సముదాయ రూపమగు నీ ప్రపంచమునందు భేద బుద్ధిని పరిత్యజించి, ఆభాస మాత్రము కావున నంతట ననువర్తించు చిన్మాత్రమును దర్శింపుము. అభాస మాత్రమైన ఈ జగత్తు, చిత్త సంబంధమున కళంకిత మగు చున్నది. కాన, నిరాభాసుడవై అభాస మాత్రము విడచి యుండుము. రాగ ద్వేషములు రెండును సర్ప సదృశములు. ఇవి మనోబిలమున నివాస మేర్పరచుకొని యుండును. ఇవి లేనివాడు కల్పవృక్షము వంటివాడు. అట్టివాని సన్నిధానమున లభ్యముకాని దేదియు లేదు. సర్వశాస్త్ర పరిజ్ఞానము కలిగి ప్రజ్ఞాగర్వముగలవారలై, రాగ ద్వేష భూయిష్ఠు లగుచో వారు మాన్యములగు గర్దభములు. వారిని స్పృశింపరాదు. జనన మరణ ప్రవాహరూపమగు నీ సంసార చక్రము నకు సంకల్పాత్మకమగు చిత్తము నాభి స్థానము. దానిని నిరోధించి నచో సంసారము నిరోధింప బడును. 'మనస్సు' అను నాభి చలించు చుండగా, సంసార చక్రము తిరుగుచుండును. ఉత్కృష్టమగు పౌరు షమును, బలమును ప్రజ్ఞ నాశ్రయించి, సంసారచక్రనాభియగు చిత్తమును నిరోధింప వలయును. ప్రజ్ఞాసౌజన్యయుక్తమగు శాస్త్ర జ్ఞానముతో గూడిన పౌరుషము వలన, పొందరాని పదార్థ మేదియు నుండదు. భయప్రదము, నశుభప్రదము, ధైర్యాపహారము నగు మనస్సు అను పిశాచమును విడచి, సత్త్వస్వరూపుడవై స్థిరముగ నుండుము. 'చిత్తము' అను భూతము పట్టిన వానిని శాస్త్రములు,

బంధువులు, గురువులు నెవ్వరును రక్షింప సమర్థులు కారు. ఈ భూతము వదలిపోయినచో గురువులు, శాస్త్రములు, బంధువులు స్వల్పమగు బురదలో బడినమృగశాబకమునువలె నుద్ధరింప సమర్థులగుదురు. భోగాభోగములను బహిష్కరించ వలయును. ఆర్యుల మార్గము ననుసరింప వలయును మహావాక్యార్థమును విచారించి, ఒక్కటియే యగు పరమాత్మ నాశ్రయింప వలయును. ఈ విషయమున మహామోహాది వినాశకరమైన మరియొక యుపాయమును జెప్పుచున్నాను. వినుము. దీనిని పూర్వము కైలాస పర్వతమందున్న శంకరుని ప్రార్థింప నతడు సంసార దుఃఖ నివృత్తికై చెప్పెను.

చంద్రకిరణ సందోహ భాసురమై, సర్వమునకంటె శ్రేష్ఠమును, పార్వతీదేవికి క్రీడామందిరము నగు కైలాస మను పర్వతోత్తమము కలదు. అచట చంద్రకళాధరుడైన శంకరుడు నివసించుచుండెను. పూర్వ మా మహాదేవుని బూజించుచు నా పర్వతమున గల గంగా తటమున నాశ్రమమును నిర్మించుకొని కొంతకాల ముంటిని. సిద్ధ సంఘములు చుట్టియుండ శాస్త్ర చర్చలు జరిపితిని. పుష్పములను సంగ్రహించి, ఆ ఈశ్వరు నర్చించుచుంటిని. విశిష్ట గుణ సంభరితమగు కైలాస వన నికుంజమున తపస్సు చేయుచుండగా కొంతకాలము గడచెను.

ఒకప్పుడు శ్రావణమాస బహుళపక్ష అష్టమి దినమున ప్రదోషకాలము గడచిన తరువాత, దిక్కులు ప్రశాంతములై కాష్ఠ మౌన స్థితి నందియుండ నడవులు, పొదరిండ్లును గాఢాంధకారమున మునిగి యుండెను. ప్రథమ యామార్థము గతించిన తరువాత నేను సమాధిని విడచి బాహ్యదృష్టి కలిగి యుంటిని. ఇంతలో నా యరణ్యమున తెల్లని వర్ణము కలిగి, ప్రకాశించు చంద్ర సమూహమును బోలిన కాంతి యుద్భవించినది. అది దిగంతముల వరకు వ్యాప్తమై, అంతఃప్రకాశత్వము కలిగి యున్నది. బుద్ధి,

దృష్టివంతుడ నగు నేను దానిని జూచి యాశ్చర్యమగ్నుడ నైతిని. ఆ తేజమును గూర్చి నేను విమర్శించుకొనుచుండగా, పార్వతీ హస్తమునందు తన హస్తము నర్పించి, నందీశ్వరునిచే తరుమ బడుచున్న పరివారముకల పరమేశ్వరుడు ప్రత్యక్ష మయ్యెను. ఈ విషయమును (శంకరు డరుదెంచుచున్నాడను విషయమును) నా శిష్యగణము ముందుగ నా కెరిగించిరి. నేను శ్రద్ధా పూర్వకముగ నర్ఘ్యపాద్యములనుగొని ఎదురుగ నేగితిని. ఆ పరమేశ్వరుని పవిత్ర దృష్టి పాతములచే పవిత్రుడ నైతిని. దూరము నుండియే ఆయనకు పుష్పాంజలి సమర్పించితిని. సమీపింపగనే అర్ఘ్యపాద్యముల నొసగి వందన మాచరించి మనసార నర్చించితిని. అనంతర మాపరమేశ్వరుడు చంద్రప్రభా సహచరి యగు శీతల దృష్టితో న న్ననుగ్రహించెను. ఆ దృష్టి సర్వార్తిహారమైనది. త్రిలోక సాక్షియు, పుష్పసానూప విష్టుడు నగు నా పరమేశ్వరుని తిరిగి యర్ఘ్య పాద్యాదుల చేతను, మందార పుష్పముల తోడను, నానావిధ నమస్కారోపచారముల తోడను సమీపమున కేగి యర్చించితిని. అట్లే పార్వతీదేవిని గూడ పూజించితిని. పూజావసానమున మహేశ్వరుడు పూర్ణచంద్ర కిరణ శీతల మగు వాక్కులతో నిట్లనెను :

'బ్రాహ్మణోత్తమా! ప్రశాంతితో గూడి, శుభప్రదమై, పరమపదము నాశ్రయించిన నీ జ్ఞానము సుస్థిరమై చెలగుచున్నదా? నీ తపము నిరాటంకముగ కొనసాగుచున్నదా? అది శుభంకరముగ నున్నదా? ప్రాప్యవస్తు ప్రాప్తి యగుచున్నదా? భయములు తొలగుచున్నవి కదా!' అని సర్వలోకైక కారణుడగు పరమేశ్వరుడు పరామర్శించెను. అనునయశాలినై నే నిట్లు వచించితిని: మహేశ్వర! నిన్ను స్మరించు పవిత్రాత్ములకు పొందరాని దీ జగమున నేది యుండును? ఏవిధములగు భయములు నన్ను జెనకుట లేదు. నీ సంస్మరణానందచేతస్కులగు వారల కీ జగత్కోశమున వందన మాచరింపనివారు లేరు. నీ సంస్మర

నై కాయత్తచిత్తులగువార లుండు దేశములే దేశములు. అవియే గ్రామములు. అవియే పర్వతములు. వారు వసించు ప్రదేశమున వసించు జనులే జనులు. నీ సంస్మరణము, గతమం దాచరించిన దానికి పుణ్యమునకు ఫలమును, వర్తమానమున నాచరించుచున్న దానికి సేచనమును, భవిష్యత్తున జేయబోవు దానికి బీజమునై విస్తరించుచున్నది. నీ స్మరణ మొక జ్ఞానామృత కలశము. ధైర్య మను వెన్నెల వెదజల్లు సుధాంశువు మోక్ష మార్గమునకు ద్వారము. అట్టి చింతామణిగల నేను సమస్తాపదల నధఃకరించితిని' అని పలుక, ప్రసన్నవదనుడై నన్నవలోకించుచున్న మహేశ్వరునకు ప్రణతులు సమర్పించి, ఇట్లు లభ్యర్థించితిని: ' అష్టైశ్వర్యసంపన్నుడా ! నీ యనుగ్రహ విశేషమున నన్ని రంగముల యందును పరిపూర్ణ ప్రజ్ఞావంతుడనై యుంటిని. ఇక నాకు గావలసిన దేమియు లేదు. ఇప్పు డేమని యభ్యర్థింతును ? అయినను నొక్క విషయమును మాత్ర మభ్యర్థింతును. సర్వపాపహారమై, సర్వశుభాశుభవివర్ధనమై, సకలోద్వేగముల శాంతిపరచునదై, ఆరోగ్యప్రదమై యలరారు దేవార్చనా విధానము గూర్చి ప్రసన్న బుద్ధితో వివరింప నర్థించు చున్నాను.' అని వేడితిని.

దేవ పూజా విధానము : అప్పుడు పార్వతీరమణుడు దేవ పూజా విధానము నిట్లభివర్ణించెను : ' బ్రహ్మవిదాంవర ! అత్యుత్తమమైన దేవ పూజా విధానమును వివరించుచున్నాను, వినుము. దేవు డనగా పుండరీకాక్షుడు గాని, త్రిలోచనడు గాని, పద్మసంభవుడు గాని, దేహరూపుడు గాని, చిత్తరూపుడు గాని కాడు. అకృత్రిమము, అనాద్యంతము నైన దేవనమును జ్ఞానమును దేవు డందురు. ఆకారాది పరిచ్ఛిన్నమై, పరిమితవస్తువునందు దేవత్వ మెట్లుండును ? దేవత్వము కృత్రిమము, ననాద్యంతమగు జ్ఞాన స్వరూపము. ఇపుడు ' దేవు డెవడు ' అనుదానికి నిర్వచనము జెప్పబడినది. ఈ దేవ శబ్దముచే నభివర్ణింపబడిన దానిని

పూజింప వలయును. యోజనముల దూరమున నున్నదని చెప్పినచో భయపడువానికి క్రోసుల దూరమున నున్నదని చెప్పినట్లు, అజ్ఞాత శివతత్త్వములకు ఆకారము కల్పించి అర్చనము విధింపబడినది. పారావార వివర్జితమై, సర్వత్ర అసంభవమగు చిత్తసంబంధమై కల్పాంతము లందును నిలచునదగు చిదాకాశము కలదు కదా! 'తత్త్వజ్ఞానము, సమభావము, శమము' ననునవి ఆ చిద్రూపుడగు శివునకు పూజార్హములగు పుష్పములు పూజావిధులు. వీనితో నిర్మలుడు, చిన్మాత్రుడు నగు శివుని పూజింప వలయునని నిర్దేశించిరి. శమ, జ్ఞానాది పుష్పములతో నాత్మరూపుడగు దేవుని పూజించుటయే దేవార్చన మగును గాని, ఆకారము నర్చించుట అర్చనము కాదని భావింపుము. అకృత్రిమమై, అనాద్యంతమై, అద్వితీయమై, అఖండమై, బాహ్యసాధనాసాధ్యము కాని సుఖ మా దేవతార్చనము వలన లభించును. సంవిత్తు 'జ్ఞానము' సకల సంకల్పముల కతీతమైనది. సర్వభావాంతరస్థమైనది. సదసత్తుల మధ్య నిత్యము భాసించును. సత్తా సామాన్య రూపమును ధరించినది. మహాసత్తాత్మను పొందినది అధిదేవ శబ్దవాచ్యమైనది. చిత్తు వికల్పములతో గూడి దృశ్యమును భావించుచు, క్రమముగ చిత్స్వరూపము నుండి తొలగి జాడ్యమును భావించుచు కల్పనా స్పద మగుచున్నది. దేశకాలాదిశక్తుల యుల్లాసములచే క్రమముగ నావరింపబడినదై జీవత్వము పొంది, బుద్ధిగా మార్పుజెంది, తరువాత నహంకారమై, యనంతరము మన స్సగుచున్నది. ఇట్లు మనస్త్వమును పొందినతరువాత సంసారము నవలంబించుచున్నది. బ్రాహ్మణుడు 'నేను చండాలుడను' అని మననము జేయుట వలన చండాలత్వము నందుచున్నాడు కదా! 'ఇది నేను' అని భావించుటవలన, దేహస్థమై మోహపంక నిమగ్నమై, దుఃఖము నుండి మరియొక దుఃఖము నాశ్రయించుచున్నది ఈ దుఃఖము సంకల్పమాత్రమున పరిపుష్టమై బాధించుచున్నది. సంకల్ప

రాహిత్యమువలన నా దుఃఖము క్షయ మగుచున్నది. సంసార దుఃఖము నధిగమించుటలో గష్టమేమి కలదు ?

మానవున కేమాత్రము సంకల్పము జనించినను దుఃఖమున మునుగుచున్నాడు. సంకల్పరహితుడగుట వలన నవ్యయమగు సుఖము నందుచున్నాడు. స్వవివేకానిల సంఘాతముచే సంకల్ప జలదముల నంతరింపజేయ వలయును. అపుడు శర దంబరము చంద మున శ్రేష్ఠమగు నిర్మలత్వము నొందుదువు. నీ అంతరంగమునుండి సంకల్పకాలుష్యమును తొలగించి శ్రేష్ఠమగు నైర్మల్యమును పొంది పరమానందము ననుభవింపుము. ఆత్మ సర్వశక్తిమయము. ఈ శక్తి మండల తాండవములతో సంసారమును, దాని నివృత్తిని సమస్తము నాసాదింప జేయు చున్నది. సమ చిన్మాత్రరూపము సమస్తమునైన ఈ ఆత్మ, ఆకృతి రహితమైనదైనను 'ఇచ్ఛాశక్తి, వ్యోమశక్తి, కాలశక్తి, నియతిశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, కర్తృత్వశక్తి, అకర్తృత్వశక్తి' అను నీ మొదలగు శక్తుల రూపము కల దగు చున్నది. ఈ పరమాత్మశక్తుల కంతము లేదు. ఉల్లాసశక్తితో నీ సంసారమునం దంతట ప్రవర్తించుచున్నది. నిరోధశక్తితో నీ సంసార మును నిశ్శేషముగ నశింప జేయుచున్నది. సమస్త పూజాక్రమము లందును, దేహ గేహము పవిత్రమైనది. అయినను దానిని విడువ వలయును. దేహావబోధాత్మ పవిత్రమైనది. ప్రయత్న పూర్వకముగ దానిని గ్రహింపవలయును. సజ్జనుల కందరకు నీ దేవుడే పూజ్యుడు. ఇతడు పరమశ్రేష్ఠుడు. అంతరంగ ధ్యాన మీతని పూజా విధానము. ఇంతకంటె వేరు పూజా విధానము లేదు. కావున ఆ త్రిభువనా ధారము చిద్రూపము, లక్షసూర్యాభము, సమస్తభాస, భాస మానము, అంతస్థ చిత్ప్రకాశము, అహంకార సారభూతము నగు పరమాత్మను ధ్యానముచే పూజింపవలయును.

అపార పరమాశయమువలె విపులాభోగ కంధరుడు, అనంతా కాశపాదయుగళుడు, అఖిలదిక్తట భుజామండలుడు, నానావిధమహా

లోకాయుధుడు, హృతోత్కళకోణభాగపరిమిత బ్రహ్మాండ సముదాయపరంపరుడు, ప్రకాశమాన పరమాకాశాంత స్థానంతాకారుడు, దశదిశావ్యాప్తాఖిల దేవముఖేంద్ర, బ్రహ్మ హరి హరేశ్వరాది దేవతా విభూషితుడు, సర్వభూత సంపద్గ్రామ సముదాయ విరాజితగాత్రుడు నగు దేవుని పూజింప వలయును. వివిధారంభకారిణులు, జగత్త్రియ యంత్రరజ్జువులు నగు ఇచ్ఛాదిశక్తులు నా దేవునకు శరీరగతలుగ భావింప వలయును. అతడు చిన్మాత్రుడు, అనుభూత ఆత్మస్వరూపుడు, సర్వవ్యాపకుడు, సర్వాశ్రయుడు, సత్తామాత్రైకగోచరుడు, పరాధారుడు, అనంతుడు, వివర్తిత జగజ్జాలుడు నగు దేవుడు పూజనీయుడు. కాలపురుషు డీయనకు ద్వారపాలకుడు. సర్వత్ర ఈక్షణ శక్తియుక్తుడు, సర్వత్ర ఘ్రాణశక్తి సముపేతుడు, సర్వత్ర స్పర్శశక్తి సమన్వితుడు, సర్వత్ర రసశక్తి సంయుతుడు, సర్వత్ర శ్రవణాకీర్ణుడు, సర్వత్ర మననాన్వితుడు, సర్వత్ర మననాతీతుడు, సర్వత్ర పరమశివుడు' అను చింతన కలవాడై యథాశాస్త్రముగ నా దేవేశుని అర్చింప వలయును. స్వాత్మరూపుడగు నీదేవుడు బాహ్యోపహారములచే బూజింపబడడు. నిత్యము నక్లేశ లభ్యము. శీతలము, నవినాశినియు, నేకము, నమృతము నగు తన జ్ఞానమాత్రముచే బూజింప బడును. ఇదియే శ్రేష్ఠమగు ధ్యానము. ఇదియే యుత్కృష్టమగు పూజావిధానము. ఇది యనారతము, నంతస్థమునైన శుద్ధ చిన్మాత్రము. చూచుచు, వినుచు, స్పృశించుచు, నాఘ్రాణించుచు, భుజించుచు, నడచుచు, శయనించుచు, నిట్టూర్చుచు, భాషించుచు, విడచుచు, గ్రహించుచు, సర్వదా సర్వకాల సర్వావస్థల యందును పరిశుద్ధ జ్ఞానస్వరూపుడనని భావింప వలయును. ఈ ఆత్మ ధ్యానోపహారము ఆ ధ్యానమే దీని కర్చనము. ఇది తప్ప నితరమగు నుపాయముచే నీ యాత్మ మనకు లభింపదు.

బుద్ధిమంతుడా! ఈ ధ్యానముచే మూఢుడైనను పదమూడు నిమిషములపాటు ఈశ్వరుని పూజించినచో గోదాన ఫలము లభించును. శత నిమేషముల కాలము బూజించినచో నశ్వమేధ యాగ ఫలము నందును. స్వాత్మస్థుడగు దేవుని అరగడియ కాలము పూజించిన అశ్వమేధ సహస్ర ఫలము ప్రాప్తించును. ధ్యాన బల్యువహారముతో గడియ పాటు పూజించిన రాజసూయయాగ ఫలమును పొందును. మధ్యాహ్నము వరకు పూజించిన లక్ష రాజసూయ యాగముల ఫలము లంభించును. ఒక్క దినము, అనగా పవలు మాత్రము పూజించిన పరమపదము నందును. ఇది పరమోత్కృష్టమైన యోగము. ఇది పరమమగు ప్రక్రియ. ఆత్మ సంబంధమైన యుత్తమమగు బాహ్యాపూజన క్రమమును గూర్చి ఇంతవరకు వివరించితిని. ఇక నిప్పు డాంతరిక పూజా విధానమును గూర్చి అభివర్ణింతును.

ఆంతర పూజన విధానము: శరీరనిష్ఠుడగు జీవుని పరమశివునిగా భావించి శయనించుచున్నను, ఉత్థితు డగుచున్నను, నడచుచున్నను, కూర్చొనుచున్నను నిత్యము ధ్యానించుచుండ వలయును. స్పృశ్యుని స్పృశించుచు, త్యాజ్యుని పరిత్యజించుచు, ననుభవించుటచే వృద్ధిపొందు భోగములను అనుభవించువారిని విడచుచు, ప్రవాహపతితార్థస్థుడై ఆత్మజ్ఞాన స్నానమున పరిశుద్ధుడై, నిత్యావబోధార్ఘ్యణమున జ్ఞాన లింగమును పూజింప వలయును. మనోమననమునందుండి, ప్రాణాపానాంతరములనుండి యుదయించిన హృత్కంఠతాలు మధ్యస్థమై, భ్రూ నాసా పుట పీఠమున నున్న షట్త్రింశత్పదకోటిస్థమగు ఉన్మన్యంతమగు దశ కతీతమైన బోధ లింగము నర్చింప వలయును. హస్తములు, పాదావయవములు, కేశ నఖ దంతములు కలదగు తన దేహమునందు చిదాభాసమగు దేవు డిత డని భావింప వలయును. అనేకాచారములు కల మనోదృశ్యముల విచిత్రశక్తు లనేకములు. ఉత్తముడగు భర్తను భార్యలు సేవించు విధమున నుపాసించుచున్నవి. జగత్త్రయముల

వృత్తాంతమును నివేదించునదైన ఈ నా చిత్తము నా ద్వారపాలకుడు. శుద్ధస్వరూపిణియై ద్వారమందున్న ప్రతీహారి ఈ నా చింత. ఈ చిత్ర విచిత్రము లయిన జ్ఞానములు అవయవములందు ప్రకాశించు ఆభరణములు. జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు ద్వారములు. వ్యవచ్ఛేదమై, ఉజ్జితాకారముకల ఈ అనంతాత్మను నేను. ఆత్మ పరిపూర్ణుడనై, సర్వావయవ పూరకుడనై యున్నాను. సమరసాచారము, సమము, సమాభాసము, సమాకృతి కల నేను అవ్యయమగు నాత్మ నారాధించి జీవన్ముక్తుడ నగుచున్నాను. సమము, పరిపూర్ణమునైన బుద్ధితో దైవజ్ఞానమగు చిన్మాత్రమును సముచితము, ప్రాప్తము నగు పదార్థముతో నర్చింపవలెను. ఈ పూజార్థ మపూర్వవస్తు సంగ్రహమునకై యత్న మొనరింపరాదు. ఇష్టవస్తు నివేదనముచే శివునర్చింపవలెను. భక్ష్య భోజ్య అన్నపానాది నానావిధైశ్వర్య యుక్తములగు పదార్థములతోడను, శయనాసనాది యథాప్రాప్తములగు వస్తువులతోడను పూజింపవలయును. కాంతాన్నపానాది సంభోగ సంభార విలాసములగు సర్వవిధ సుఖములతో నాత్మను సంబోధించి యర్చింప వలయును. మోహ సంరంభ యుక్తమగు ఆధివ్యాధి పరీతుడై, సర్వోపద్రవ దుఃఖములను పొందుటచే పూజింప వలయును. ఇచట పూజా సంబంధమగు బుద్ధి యుండ వలయును గాని, ఇతర విషయములను గూర్చిన యాలోచనముండరాదు అని భావము. దరిద్రస్థితియందున్నను, రాజభోగము ననుభవించుచున్నను, వాసనా ప్రవాహపతితాత్ముడైనను, విచిత్రచేష్టా పుష్పములు కలవాడైనను శుద్ధాత్ముని అర్చింప వలయును. నిషిద్ధ, అనిషిద్ధ భోగముల నన్నిటిని పరిత్యజించి, యనురాగభరితుడై యర్చింప వలయును. అతీతము నుపేక్షించి ప్రాప్యమును గ్రహింప వలయును. అర్చనమునకు నిర్వికారప్రవృత్తి యుండవలయును. ఆపాత రమణీయ మైనను, ఆపాత దుస్సహ మైనను, సర్వము నాత్మ

మయముగ భావించ వలయును. సర్వకాలసర్వావస్థల యందును, అన్ని రూపములతో నంతట వ్యాపించియున్నవానిని 'సర్వంబ్రహ్మ' అని నిర్ణయించుకొన వలయును. తా నేదియు కోరక, పరిత్యజింపక, జ్ఞానమువలన ప్రాప్తించిన వానిని సముద్రుడు తనను సమీపించిన నదుల ననుభవించు రీతిని భోగముల ననుభవింప వలయును. తుచ్ఛాతుచ్ఛవస్తుదృష్టులయందు నుద్వేగము నొందక, చిత్ర విచిత్ర పదార్థములయందు, పతితాపతితులయందు మనోవికారము నందరాదు. ఈ ఆత్మార్చనా విధానమునందు చెప్పబడిన ద్రవ్య సంపదలు చిత్ర రసములతో గూడినవైనను, కాకపోయినను శమ యను రస మొక్కటి దానితో సమముగ భావింపబడినవి. ఆమ్లములైనను; చేదు, కటు కషాయములైనను మధురములే యగుచున్నవి. సమతా రూపమును మధురముగనే యుండును. ఆస్వాదనీయమగు రసశక్తి అతీంద్రియమైనది. దానిచే భావింపబడిన పదార్థ మంతయు తత్క్షణములో నమృతోప మగును. ఇది చంద్రపరిచ్యుతమైనదానివలె నుండును. పూర్ణచంద్రునివలె పరిపూర్ణతతో, సమ సమ ప్రకాశముతో పరిశుద్ధమైన బ్రహ్మముతో గూడి, పాషాణ రూపమగు జ్ఞానముతో నిండి, నిర్వికారుడై యుండవలయును. దేశకాల కర్మక్రమమున గలిగిన, సర్వవస్తు సుఖ దుఃఖ విలాసములతో నిత్యము నాత్మ నర్చించుచు, ఇచ్ఛారహితుడై యుండవలెను' అని వివరించి మరియు నీశ్వరు డిట్లు ప్రవచించెను : 'శ్రేష్ఠుడగువాడు శ్రేష్ఠమగు జ్ఞానముతో నవిద్యను క్షాళనమును జేయుచునే యుండును. అతడు మలమును మలముతో బోగొట్టు ఉపాయవంతుడగు రజకుడు అవిద్యాంశలు కారణములు గాకపోయినను, కారణత్వమును పొంది శ్రేష్ఠములగుచున్నవి. క్రమముగా గురూపదేశాదులు ఆత్మ జ్ఞాన సిద్ధిదము లగుచున్నవి. గురూపదేశక్రమమున శిష్యప్రబోధము ప్రవర్తిలు చుండగా ననిర్దేశ్యము, నదృశ్యము నైన ఆత్మ

స్వరూపము స్వయముగ ప్రసాదన మందుచున్నది. శాస్త్రార్థములచే గాని, గురుప్రబోధములచేగాని ఆత్మ జ్ఞానవంతము కాదు. స్వబోధ వశమున, స్వయముగ జ్ఞానవంత మగుచున్నది. గురూప దేశ శాస్త్రార్థములులేక ఆత్మ తెలియ బడదు. వీటి అన్నింటి సంయోగమువలన నాత్మజ్ఞానము ప్రకాశించును. గురు శాస్త్రార్థ శిష్యుల చిర సంయోగ వశమున పగటియందు జన సంచారమువలె ఆత్మజ్ఞానము ప్రవర్తించును. మునినాయక! ఈవిధముగ జ్ఞానవంతుడు నిత్యమును దేవతార్చనము జేయుచు, నస్మదాదులు సైతము భృత్యులుగ వ్యవహరించు బ్రహ్మపదమును పొందు చున్నాడు. ఈ జగము లేనిదియేయైనను ఉన్నదివలె భాసించుచున్నది. ఇది యంతయు నాభాస మాత్రమే కాని తదన్యము కాదు. ఈ బ్రహ్మాది శబ్దార్థమును శుద్ధమగు జ్ఞానముగా తెలియుము. అది వేద్యమువలె నరుగుచు 'చిత్తు' అను యోగ్యతను పొందుచున్నది. పురుషు డాత్మ భావనమున స్వప్నమందు మద మాతంగమైన విధమున చిత్తు దృశ్యమును భావించుటవలన క్షణములో నహంకార రూపమును ధరించును. అపుడు దీనికి శూన్య రూపములగు ననేక దేశకాలాది శక్తులు సహాయము లగుచున్నవి. వానితో గూడి జీవరూపము ధరించి బుద్ధిత్వము నందుచున్నది. అది నిశ్చయ రూపముతో ప్రకాశించుచు 'శబ్ద శక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి' అను వానితో ననుగమించుచున్నది. దీనిచే స్మరణశక్తిని కల్పించుకొని, సంకల్ప వృక్షమునకు శుద్ధాత్మబీజమగు మనస్సగు చున్నది. దీనిని సూక్ష్మదేహ మందురు. పరామర్శైక రూపములు గల అనేకశక్తులా మనస్సునకు గలవు. ఇట్టి శక్తులుగల మనస్సు ఆకాశాది రూపములను పొంది, నానావిధములగు జగత్తుగా ప్రకాశించు చున్నది. శూన్యము భేతాళుని కల్పించిన రీతి చిద్వాసన జగద్రూప ముగ నుదయించినది. వాసన లంతరించినచో జగద్భావము నశించి కైవల్యము లభించును. అహంకారము జగ మను మరు మరీచిక యందు జలము కలదని యథార్థ భావన కలిగించును. కాని అందు

జల ముండదు. ఇట్టి భావము కలవాడు బ్రహ్మవిదోప్యపదేశమున కర్హుడు కాడు. వివేకవంతునకే బ్రహ్మవిదులు ఈ విద్యను బోధించు చున్నారు. బాలులకు, భ్రాంతి యుక్తులకు, ఆర్యజన పరిత్యక్తులకు బోధింపరు. అజ్ఞాని కీ విద్యను ప్రబోధించినచో నాతనికి స్వప్నమున ర్శన మిచ్చిన పురుషునకు కనకాభరణ భూషిత యగు కన్యను సమర్పించుచున్నాడు. (స్వప్న దర్శిత పురుషునకు కన్యాదానము, నవివేకికి జేసిన జ్ఞానోపదేశము నొక్కటియే యని భావము)' అని వివరించి మరియు నీశ్వరు డీవిధముగ జెప్ప నారంభించెను: 'మునీంద్రా! నీ వడిగిన దానికి సమాధానము జెప్పితివి. నీకు శుభంబగు గాక!' అని 'పార్వతీ! అభిమత దేశమున కేగుదము రమ్ము' అని నీలకంఠుడు పుష్పాంజలిని సమర్పించుచుండగా, సపరి వారుడై అంబర కోటరమును తరించెను. అది మొదలు మహేశ్వ రోక్త విధానమున నాత్మార్చనము గావించుచు, నిప్పటికి నవ్యగ్ర చిత్తుడనై యుంటిని. రామచంద్రా! నే నీ యర్చా విధానము చేతనే వాసనల నన్నిటిని విడిచి, దుఃఖ రహితుడనై యుంటిని. యథాప్రాప్త కర్మాచార కుసుమములతో నాత్మార్చన మాచరింప వలయును. రేయింబవళ్లు అవిచ్ఛిన్నములైనను, వ్యవచ్ఛిన్నము లైనను నా కొక్క విధముగనే యున్నవి. జీవులకన్నిటికిని గ్రాహ్య గ్రాహక సంబంధ మొక విధముగనే యుండును. యోగు లంత ర్ముఖులై పూర్వోక్తమగు నాత్మార్చనమును జేయుచున్నారు. రఘురామా! ఈ దృష్టితో నిస్సంగమగు బుద్ధితో సంసార మను మహారణ్యమున సంచరించుచున్నను బాధింప బడవు' అన, శ్రీరామ చంద్రు డిట్లనెను: "బ్రహ్మజ్ఞానావతంసమా! ఇప్పుడు నా సంశయము లన్నియు నశించినవి. జ్ఞాతవస్తు విజ్ఞానము కలిగినది. సహజమగు నానందము ప్రాప్తించినది. సంసారసాగరమున నితరులకు దుర్భేద్య మగు 'ఆశ' అను మదేభమును జయించగల ధీరత్వమును పొందితిని. నా మనస్సు వికల్ప రహితమైనది. వాంఛలు నశించినవి. దైన్యము

దూరమైనది. ముల్లోకములయందు ప్రసన్న రూపమైన జ్ఞానము లభించినది. మహదానందము నందితిని" అనెను.

## 3. బిల్వఫలోపాఖ్యానము

శ్రీరామచంద్రుడు వశిష్ఠ మహర్షిని ఇట్లు ప్రశ్నించెను ; "మహానుభావా! నీ వాక్యామృతాస్వాదన మెంత యొనరించినను తనివి తీరక యున్నది. తత్త్వజ్ఞాన ప్రబోధకమగు నేదేని మరియొక కథను వినిపింపుము" అన, వశిష్ఠు డిట్లు చెప్ప నారంభించెను :

"దేవపూజనోపాఖ్యానమున 'చిత్తమునకు అంతర్ముఖత్వమును, దానివలన నిర్వాణము నభివర్ణింపబడినది.' ఇపు డీ బిల్వఫలోపాఖ్యానమున 'బ్రహ్మము సర్వపదార్థములలో నంతర్వ్యాప్తమై యుండును' అని నిరూపింప బడుచున్నది.

శ్రీరామచంద్రా! మన కోకవస్తువు సంప్రాప్తించిన క్షణము నందున్న సంతృప్తి, ఆతరువాత ఉండదు. ఆ వస్తువును వాంఛించు నపు డుండెడి సంతుష్టి, ఆ వాంఛలేని సమయమునం దుండదు. ఆ క్షణిక సుఖమునకు బాలు డాసక్తి జెందుచున్నాడు కాని, ధీమంతుడు చెందుటలేదు. ఆ క్షణిక సుఖమునకు కారణము వాంఛ అగుచున్నది. ఆ సంతుష్టి అసంతుష్టికి పర్యవసానము. కాన. వాంఛను పరిత్యజింపుము. ఆశ నిరాశత్వము నందుగాక! భావన అభావము నందుగాక! మనస్సు అమనస్త్వము నొందుగాక! నీ వసంగుడ వగుదువుగాక! వాసనా రహితములైన ఇంద్రియములతో కర్మ నాచరించువాడైనను, క్షోభ శతముచే వికారము నొందని యాకాశము విధమున వికారము నొందలేవు. చిత్తోన్మేషనిమేషముల వలన సంసారమునకు ప్రళయోదయములు కలుగుచున్నవి. కాన, ఆ ప్రాణమును అభ్యాస యోగములచే నున్మేష రహితముగ జేయుము. మూర్ఖత్వ ఆవిర్భావ, తిరోభావముల వలన కర్మల ప్రళయోదయములు సంభవించుచున్నవి. కాన, గురు శాస్త్రార్థ

సంయమములచే బలాత్కారముగ నా మూర్ఖత్వమును లయ మొందింపుము. అజ్ఞాన స్పంద మాత్రమున, చిత్త మచిత్త మగుచున్నది. అది ప్రాణ నిరోధము వలన నిర్వికల్పత్వ మగుచున్నది. ఇదియే పరమ పదము. 'దృశ్య దర్శనముల సంబంధము నందలి, పారమార్థిక మగు సుఖము ననుసంధానము చేయుట' అను బ్రహ్మ దృష్టిచే మనస్సు లయ మగును. చిత్త మనభ్యుదితమైన దానిని ఉత్తమ సుఖ మందురు. అది వృద్ధి, క్షయములు లేనిది, తిరిగి ఉదయింపనిది, నశింపనిదియై యున్నది. జ్ఞాని చిత్తము. చిత్త మని చెప్పబడదు. అది బ్రహ్మ మనబడును. నానావిధ ప్రయోజనముల వలన వేరొకదాని నాశ్రయించునది మాత్రమే చిత్తము. తామ్రము యోగము వలన సువర్ణమైనట్లు అది బ్రహ్మజ్ఞాన సంపన్నమగుట వలన బ్రహ్మ మగును. జగత్స్థితి యందు కొంత కాలము చిత్తము చిత్తత్త్వముగ నుండి. తుర్యావస్థయం దది స్వరూపమును వీడి తుర్యాతీత మగును. బ్రహ్మ పదార్థమొక్కటియే ఈ భూరి భువ నభ్రమ విభ్రమములతో, ననేక రూపములతో భాసించుచున్నది. ఇది సర్వాత్మకము కాని, వేరు కాదు. చిత్తాదికముగాని, హృదయమందు ప్రతిఫలించు వస్తుజాలముగాని యేదియు లేదు" అని వశిష్ఠ మహర్షి ప్రబోధించి మరియు నిట్లనెను : "దీని యంతరార్థము నీకు బాగుగ నవగత మగుటకు విస్మయోల్లాసకరమగు నపూర్వమైన రమ్య కథను సంక్షేపముగ చెప్పుచున్నాను, వినుము. అనేక యోజనములు విస్తరించి నిర్మలమై, స్ఫుటమై యుగాంతములందు గూడ జీర్ణము, శీర్ణము కాని రూపముకల బిల్వఫల మొకటి కలదు. అది పురాతనమైనదైనను, బాలేందుదళ సుందర మార్దవములు కలదై, మహా కల్పాంత వాయుహతమయ్యు చలింపకుండెను. అది అనంతమై, అయుత, లక్ష కోటులు నగు యోజనముల వైశాల్యము కలిగి అపరిచ్ఛేద్యము, జగత్స్థితికి మూలము, నాద్యము నై యుండెను.

ఆ ఫలమునకు సమీపముగ సమున్నతములగు బ్రహ్మాండములు, పర్వతమున కధోభాగమున నున్న కణములుగా భాసించు నా వగింజల రీతి వెలుగు చుండెను. అది పాతాంతమగు పాతము సమానముగ నుండదు, ఎల్లపుడు పక్వస్థితియం దున్నను, శైథిల్యము నొందదు. సమస్త ఫలములకు సారభూతమైన నీ బిల్వ మహాఫలమునకు చిచ్ఛక్తిస్ఫూర్తి, అంతర్గతమగు సారరూపత్వము నొందుచున్నది ఆ చిచ్ఛక్తిచే, నా తరళ రూపత్వముతో, నిజరూపమునందు సృష్టి సంకల్పము ప్రవర్తించుచున్నది. ఈ అనంతాకాశము కాలరూపగు నంశము. స్పందరూపమగు క్రియ, జగత్తు నడచుటకు నియమించిన నియమము. ఇది బ్రహ్మాండ మంటపము. క్రమములగు నీ దిక్కులు, ఆ బిల్వ ఫల నిజచమత్కార కృత్యమని భావింపుము" అనగా, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను: 'సర్వసారజ్ఞ! నీ విపుడు బ్రహ్మస్వరూపమునే బిల్వఫలముగా నభివర్ణించితివని భావించుచున్నాను. అహంకారాది ప్రకృతిభూతములగు మహదాదుల వ్యాప్తమగు నీ జగము చిత్సారభూతమైనది. కాన, నిందు భేదాభేదవిచారరూపమగు భేదములేదు. మేర్వాదిపర్వతములు బ్రహ్మాండ సారభూత మగుచున్న విధమున నీ జగత్తు చిద్రూపమగు బిల్వఫలమగునని శ్రీరాముడు వచించెను.

## 4. మహాశిలోపాఖ్యానము

అద్వితీయమగు చైతన్యమును బిల్వఫలముగ నభివర్ణించెను. ఇపుడు అనేక విధముల భాసించు జగత్తుచే చిత్రమును, నఖండైకరసము, ఘనీభూతము నగు చిత్తు మహాశిలగ నిరూపింపబడిన నీ మహాశిలోపాఖ్యానమును వశిష్ఠుడు ప్రారంభించెను.

"శ్రీరామచంద్రా! అత్యాశ్చర్యమగు రమ్యమైన మరియొక కథను చెప్పుచున్నాను, వినుము. స్నిగ్ధము, స్పష్టము, మృదుస్పర్శము, నతివిస్తృతము, నిబిడము, నీరంధ్రము నగు నొక మహాశిల కలదు. దాని మధ్యన నేకములగు రమ్య పద్మములు వికసించియున్న

సరోవరము ప్రకాశించుచుండెను. వాటిలో కొన్ని పరస్పర సంబంధము కలవిగను, మరికొన్ని సంబంధము లేనివిగను నుండెను. కొన్ని యూర్ధ్వముఖములు కాగా, మరికొన్ని అధోముఖములై యుండెను ఇంక కొన్ని నిగూఢములు కాగా, మరికొన్ని ప్రకటితములై యుండెను. వాటికి సమీపముగ శత సహస్ర సంఖ్యలో శంఖములు కలవు వానిలో కొన్ని చక్రాకారములు, మరికొన్ని మహాకారములు కలిగి యుండెను. అవి పద్మముల రీతిగ ప్రకాశించుచుండెను" అనగా, శ్రీరామచంద్రు డిట్లనెను : "మునీంద్రా! తమ రభివర్ణించిన మహాశిలను నేను దర్శించితిని. ఇది యథార్థముగ విష్ణుమూర్తికి స్థానమగు సాలగ్రామము. దానియందు పద్మవనాది వస్తు సముదాయమంతయు భాసించుచుండును కదా!" అన. వశిష్ఠ మహర్షి, "శ్రీరామచంద్రా! అద్భుతముగ నీ జగత్తు చిద్రూప మంతర్యాతముగా ప్రకాశించుచున్నదని యభివర్ణించితిని. అది అభేద్యమై, ఘనీభవించి యుండుట వలన శిలారూపము నందినది. గాఢముగ ఘనీభవించినదై నప్పటికి, నీరంధ్రాకృతి కలిగి, ఆకాశమున విస్తారమగు వాయు వున్న విధముగ దీనియందు జగద్బృందము వర్తించుచున్నది. స్వర్గము, భూమి, వాయువు, ఆకాశము, పర్వతములు, ప్రవాహములు, దిక్కులు కూడ కలవు. ఆ శిల స్వల్పమైనదైనను, బిల మేమాత్రమును లేదు. శంఖపద్మాదిలోకము దానియందు లిఖింపబడినను 'భూతము, వర్తమానము, భవిష్యత్తు' నను కాలత్రయ సంబంధమగు వస్తుజాతముతో గూడినదై సాలభంజిక విధమున నున్నది. దానిలోపల శంఖ పద్మాది సన్నివేశములుగల పాషాణము నానారూపములు కలదైనను, ఏకరూపముగ నున్న విధమున చిత్తు విశ్వగర్భమైనను, ఏకరూపత్వమును వీడుటలేదు దానియందు నిర్మితమైన పద్మము శిలారూపము కాని, శిలకంటె భిన్నముకాదు. అట్లే చిత్తునందు కల్పిత జగత్తు చిదభిన్నము కానేరదు. శిలాంతరమందు లిఖించిన పద్మరేఖావళి, మిరియమునందున్న చమత్కారము స్వభావసిద్ధముగా నుండునట్లు అది యుదయించుటయు, నస్త

మించుటయు లేదు. అట్లే చిత్తునందు సృష్టియు నైజము. గర్భిణి యందు గర్భము, బిల్వఫలమందు మజ్జ యుండునట్లు చిత్తునందు ననంతవికారములుగల బ్రహ్మాండ మండల మున్నది. శిలోదరమున చక్రపద్మరేఖ లున్నట్లు సుషుప్తావస్థతో సమముగ. చిన్మధ్యమున జగజ్జాల మున్నది. సర్వాత్మకమైన బ్రహ్మ మెచట, ఏ ఆకారమున నుండునో, అచట నా యాకారమున చిత్తును భాసించుచుండును. సర్వమును బ్రహ్మమయమై సుషుప్తావస్థయందువలె నిర్వికారమై యున్నది" అనెను.

## 5. అర్జునోపాఖ్యానము

మహాశిలోపాఖ్యానమున 'చిత్తు మహాశిలా రూపముగ నభివర్ణింపబడినది.' ఇపు డీ అర్జునోపాఖ్యానమున 'సర్వము బ్రహ్మమయమని భావించు జ్ఞానవంతునకు, యుద్ధాది కృత్యములు బాధాకరములు కావని నిరూపింప బడుచున్నది.

మహాశిలోపాఖ్యానము నాలకించిన శ్రీరామచంద్రు డీ విధముగ ప్రశ్నించెను : "మునీంద్రా! జ్ఞాతవ్యము జ్ఞాతమైనది. ద్రష్టవ్యమును దర్శించితిని. అయినను జ్ఞానాభివృద్ధికై మరియు దెలిసుకొనవలెనను నుత్సుకత జనించుచున్నది. జగత్సహస్ర నిర్మాణ సామర్థ్యముకల దర్పణమువంటిది యగు పుల్యష్టకరూప మెట్టిదో వివరింపుము" అన వశిష్ఠ మహర్షి యిట్లు వివరించెను :

"ఆద్యంత రహితమై జగత్కారణమగు బ్రహ్మము అవిద్యతో గూడి 'జీవుడు' అని చెప్పబడుచున్నాడు, మాయా సంబంధ వర్జితమగు బ్రహ్మము అవిద్యోన్ముఖమై జీవ రూపము ధరించుచున్నది. ఆ జీవుడు దేహమున సంచరించుట వలన స్ఫుటముగ కదలుచున్నాడు. అహంభావము వలన నహంకారమును, మననము వలన మనస్సు నగుచున్నాడు. జ్ఞాన నిశ్చయము వలన బుద్ధియు నాత్మను జూచుట వలన నింద్రియములును, దేహాత్వ భావనమున దేహమును, ఘట భావన

వలన ఘటము నగుచున్నాడు. ఇట్టి స్వభావముగల 'ఆత్మ పుర్యష్టక' మనబడును.

'నేను జ్ఞానిని, కర్తను, భోక్తను, సాక్షిని' అను నభిమానము వలన సంవిత్తు 'జీవు' డనబడి, పుర్యష్టక మగుచున్నాడు. ఈ పుర్యష్టక వశమున నొక స్వప్నమునుండి మరియొక స్వప్నమునకు జేరుకొను విధముగ నసత్యమగు జగమును గాంచుచున్నాడు'' అని వశిష్ఠుడు చెప్పి మరియు నిట్లనెను : "పూర్వము పుండరీకాక్షునిచే ప్రబోధింపబడి పాండు పుత్రుడగు నర్జునుడు విరాగియై జీవన్ముక్తు డయ్యెను. అతడు జీవిత మంతయు దుఃఖ రహితముగ నున్న విధమును నీవును కాలము గడుపుము" అన శ్రీరామచంద్రు డిట్లనెను:" మహాత్మా! పాండునందనుడగు నర్జును డెపుడు జన్మించెను. అతనికి శ్రీకృష్ణుడు వైరాగ్యమును బోధించెడి విధము నెరిగింపు" మన వశిష్ఠ మహర్షి యీవిధముగ విన్పించెను :

"జీవహింస జేయుటవలన తనకు మహాపాపము సంభవించుచున్న దను సంశయముతో యమధర్మరాజు ప్రతి చతుర్యుగములకు నొకమారును, ప్రతి ఎనిమిది వత్సరముల కొకప్పుడును, మరియొకప్పుడు ప్రతి పది సంవత్సరములకు, వేరొక యప్పుడు ప్రతి సప్త వర్షములకు, మరి యొకప్పుడు ప్రతి పదునారు వత్సరములకు తప మాచరించు చుండును. ఆత డావిధముగ తపస్సమాధి మగ్నుడై యున్న సమయమున, జగజ్జాలమందలి జీవరాశులకు ప్రాణభీతి యుండదు.

ఒకమారు యముడు తన నియమానుసారము తప మాచరించు చుండెను. ఈ జగజ్జాలమునందు జీవసంతతి జన్మించుటయే గాని మరణించుటలేక వర్షాకాలమునందు మదపు టేనుగును మశకము లాక్రమించిన విధమున భూమండల మంతయు నాక్రమించెను. ఎక్కడను కాలు మోపుటకు గూడ వీలుగాని విధముగ

జీవులు సర్వత్ర వ్యాపించి యుండెను. విచిత్రములగు నీ జీవ సముదాయము ననేక విధములగు నుపాయములతో దేవతలు భూభార నివృత్తికై వధించుచుండిరి. ఇట్లు యుగ సహస్రముల నుండి యనంత భూతసంతతి మరణించుచుండెను.

ఒక పర్యాయము వైవస్వతు డను సూర్యపుత్రుడు పితృపతి యగు యము డయ్యెను. కొన్నియుగములు గతించిన తరువాత నియమ ప్రకార మాతడు తన పాప విముక్తికై, జీవ మారణ కృత్య విముఖుడై పండ్రెండు సంవత్సరములు తప మొనరించుట సంభవించెను. అందుచే జీవ సముదాయము మృత్యు ప్రమాదము తొలగి ఉద్భవించిన వార లా విధముగనే వృద్ధిపొందుచుండిరి. ఈ జీవ భారమును భరింపజాలక భూదేవి దీనురా లయ్యెను. శ్రీ మహావిష్ణువును దర్శించి తన భారము నవదయింపు మని యర్థించెను. ఆయన, 'రూప ద్వయముతో నచిరకాలముననే యవతరింతును. అందొక యవతారము వసుదేవ తనయుడై 'శ్రీకృష్ణు'డనబడును. రెండవ యవతారము పాండవ మధ్యముడై 'అర్జును'డను నామము ధరించును. కాలాంతరమున కౌరవ పాండవులకు మహాభయంకర సంగ్రామము ప్రవర్తిల్లును. బంధువులగు దుర్యోధనాదు లర్జునునితో యుద్ధమునకు సిద్ధ మగుదురు. ఈ యుద్ధ వ్యాజమున నీకు వాంఛా సిద్ధి యగును' అని శ్రీమహావిష్ణువు భూదేవి నోదార్చి పంపెను"

అన, శ్రీరామచంద్రుడు "అర్జునుడు జ్ఞానవంతుడైన విధము నెరిగింపు"మన, వశిష్ఠు డిట్లు చెప్ప నారంభించెను: "రామచంద్రా! పాండవ కౌరవులు అన్నదమ్ముల సంతానము. వీరు ద్వాపర యుగము నాల్గవ పాదమున జన్మింతురు. మదోన్మత్తులైన కౌరవులు పాండవులపై యుద్ధమును ప్రకటింతురు. మరణోన్ముఖులై, యుద్ధమునకు సిద్ధమైన ఆత్మబంధువులను గాంచి, యర్జునుడు విషాదము నంది యుద్ధ పరాఙ్ముఖు డగును. అపుడు అర్జునాభిధానమున నవతరించిన, తన స్వరూపమునకు శ్రీకృష్ణుడు, ప్రాప్త కార్యసంసిద్ధికై యుక్తి ప్రయుక్తులతో నిట్లు ప్రబోధించును:

'రాజశార్దూల! అనంతము, అవ్యయము, ఆది మధ్యాంత రహితము నగు నాత్మను నీవు దర్శింపుము. నీవు జన్మ రహితుడవు, నిత్యుడవు, సుఖ స్వరూపుడవు 'ఆత్మ' అనునది జన్మించుట గాని, మరణించుట గాని లేనిది. ఇపు డుండి, మరి యొకప్పుడు లేనిది కాదు. అది అజము, నిత్యము, శాశ్వతము, పురాతనము నైనది. శరీరము నశించినను ఆత్మ నశించునది కాదు. ధనంజయుడా! యోగ నిష్ఠుడవై సంగ రహితముగా కర్మల నాచరింపుము. ఆ కర్మలను బ్రహ్మార్పణ బుద్ధితో నాచరింతువేని క్షణకాలములో బ్రహ్మవే యగుదువు. సర్వార్థములను ఈశ్వరార్పణ మొనరించిన వాడవై, సమభావము కలిగి, శాంత చిత్తుడవై, సన్యాసయోగయుక్తాత్ముడవై కర్మాచరణమునకు గడంగుము' అన, నర్జును డిట్లు ప్రశ్నించును: మహాత్మా! 'సంగత్యాగమునకు, బ్రహ్మార్పణమునకు, ఈశ్వరార్పణమునకు, సన్యాసమునకు, జ్ఞానమునకు, యోగమునకు గల భేదమును వివరించి నా మహామోహమును నివృత్తి జేయుము' అనగా, శ్రీకృష్ణ డిట్లు ప్రబోధించెను: 'సవ్యసాచీ! సంకల్పములు శాంతింప పరిశాంత వాసనలు కలది, భావనా రూపము కానిది యగు దానిని 'పరబ్రహ్మ'మందురు. ఈ పరబ్రహ్మము నెరుగుటకు జేయు ప్రయత్నము 'జ్ఞానము', 'యోగము' నందురు. 'నేను బ్రహ్మ స్వరూపము' అని భావించుట 'బ్రహ్మార్పణ' మనబడును. కర్మఫల పరిత్యాగమును 'సన్యాస'మందురు. సంకల్ప జాలములను విడచుట 'అసంగ' మగును. సమస్త సంకల్ప జాలములు లేకుండ నీశ్వరత్వ భావనము కలిగి యుండుట, ద్వైత భావము లేకుండుట 'ఈశ్వరార్పణ' మనబడును. అర్జునా! నాయందు మనస్సు నిల్పిన వాడవు కమ్ము. నా భక్తుడవు, నన్ను బూజించు వాడవునై నాకు నమస్కరింపుము. అట్లయినచో, మత్పరాయణుడవై యుండుము. ఈవిధమగు నాత్మయుక్తుడవైన నన్నే చేరుదువు. అనఘుడా! నాకు 'సామాన్యము, పరము' అని రెండు రూపములు కలవు. శంఖ చక్ర గదా ధరమై, పాణ్యాది యుక్తమైనది

సామాన్య రూపము. ఆద్యంత రహితమై, దుఃఖ రహితమై, మమైక మైనది పరమమగు రూపము. దీనిని 'బ్రహ్మము', 'పరమాత్మ', 'ఆత్మ' మున్నగు పదములతో పిలుచుచుందురు. అజ్ఞానుడవై ఆత్మ రూపము నెరుగనంతవరకు చతుర్భుజ, హరిదేవ పూజాపరుడవు కమ్ము. తరువాత క్రమముగ జ్ఞానవంతుడవై పరమమగు నా రూపమును తెలియగలవు. నా రూపము అనాది మధ్య లయమైనది. అందుచే మరల జన్మింపదు. మోహము లేనివారు, సంగదోష విజయులు ఆత్మానుసంధానము కలవారు, కామరహితులు, సుఖదుఃఖము లను ద్వంద్వ దోష నిర్ముక్తులు నగు పండితులు శాశ్వతమగు పదమును పొందుచున్నారు. కామ సంకల్ప రహితులైనవారును, జ్ఞానాగ్నిదగ్ధ కర్ములైనవారును జ్ఞానులచే పండితులుగ నభివర్ణింపబడిరి. నిర్ద్వంద్వుడవు, నిత్యసత్వస్థుడవు, నివృత్తులందు తటస్థుడవు, ప్రాప్తానుసార వర్తనుడవు, భూతలమును ప్రకాశింపజేయు వాడవు కమ్ము. వింధ్యాద్రి బ్రద్దలగుగాక! ప్రళయ ఝంఝూ మారుతము వీచుగాక! ధీమంతుడు మాత్రము గురుశాస్త్రానుసారమగు మార్గమును మాత్రము పరిత్యజింపడు. సాధువా! ఆత్మజ్ఞానము లేనందు వలన వాసన యుద్భవించును. ఆత్మజ్ఞానమునందు పరిపూర్ణ జ్ఞానము కలిగి యుండుట వలన వాసన నశించును' అని త్రిలోకేశ్వరుడగు విష్ణుమూర్తి ఈ విధముగ ప్రబోధించును. ఆయన యొక క్షణకాలము మౌనము వహించి యుండగ సితాబ్జమునందున్న మధువ్రతము వలె నర్జును డీ విధముగ పలుకును: 'శ్రీకృష్ణా! లోక భర్తవయిన నీ వచనముల వలన సూర్యునిచే పరిచోధితమైన పద్మము రీతి నాచిత్తము సమస్త శోకములను విడచి అత్యంత వికాసము నందినది' అని అర్జునుడు వచించు"నని వశిష్ఠుడు శ్రీరామచంద్రున కెరిగించెను.

## 6. శతరుద్రోపాఖ్యానము

'చిత్త విశ్రాంతికి యుద్ధాదికములు బాధకములు కాజాల'వని అర్జునోపాఖ్యానమున నభివర్ణింప బడినది. ఇపుడు 'జన్మ పరంపర,

స్వసంకల్ప భ్రాంతి పరంపరా మాత్రమున సిద్ధించునని తెలుపుటకై దృష్టాంతముగ నీ శతరుద్రోపాఖ్యానము జెప్పబడుచున్నది.

శ్రీరామచంద్రా! మననశీలియగు నొకానొక భిక్షుకుని వృత్తాంతరూపమగు నితిహాసమును జెప్పుచున్నాను, వినుము. సమాధి నభ్యసించుటయం దాసక్తిగల మహాభిక్షుకు డొకడు కలడు. అతడు నిత్యము తన వ్యవహారములను జూచుకొనుచు పగలంతయు గడపును. రాత్రులందు సమాధి నభ్యసించును. నిత్యము సమాధ్యభ్యాసముచే పరిశుద్ధమైన అతని చిత్త మేరూపమును స్మరించిన నా రూపమును, జలము తరంగ రూపమును ధరించిన విధముగా క్షణ కాలములో ధరించుచుండును. ఒకమా రా భిక్షుకుడు సమాధి నుండి మేల్కాంచి, స్వాసనమున నేకాగ్రచిత్తముతో నొకానొక క్రియాక్రమము నాలోచించెను. 'నేను సామాన్య జన్మమును విలాసముగ ధరింతును గాక!' అని యాలోచించెను. వెంటనే జలము తరంగాది రూపమును ధరించి నటుల సంకల్ప మాత్రమున భిక్షుక రూపమును విడచి సామాన్య పురుష రూపమును ధరించెను. సంకల్పమాత్రుడగు నా పురుషుడు తన వాంఛచే 'జీవనటుడు' అను నామమును ధరించెను. ఇది యతనికి కాకతాళీయముగ లభించినది. స్వప్న పురుషుడగు నతడు చిరకాలము స్వప్న నిర్మిత నగరమున వీథులయందు విహరించెను. అచట మద్యపాన మొనరించెను. వెంటనే యొకచోట నిద్రా వివశు డయ్యెను. అపు డొక స్వప్నమున విప్రత్వమునొంది వేదపాఠానుష్ఠానమున సంతుష్టి నందెను. అంత ప్రతిభామాత్ర సంపన్నమగు దేశాంతర ప్రాప్తిని వలె నతడు చిత్తమున బ్రాహ్మణత్వము నందెను.

ఒకనా డా జీవనట ద్విజశ్రేష్ఠుడు, ఆహ్నికవ్యాపార నిష్ఠుడై నిద్రించెను. అందు, నంతర్జీవత్వము కల వృక్షము విధమున, ఆత్మయందు తాను సామంతత్వమును దర్శించెను. ఆ సామంతుడు తుష్టిగ భుజించి, గాఢముగ నిద్రించెను. ఆ నిద్రలో దిగ్వలయ

మును పాలించు మహారాజత్వము నందినట్లు స్వప్నమును గాంచెను. ఈవిధముగ రాజత్వము నంది, యొకప్పుడు నిద్రించి దేవతా స్త్రీత్వనందినట్లు స్వప్నమును గాంచెను. ఈ దేవతాస్త్రీ, రతిపరి శ్రాంతయై గాఢనిద్రా వివశత్వమున మృగీత్వమును, దాని నుండి లతాత్వమును స్వప్నమున దర్శించి ఆ యా రూపములను ధరించెను. స్వప్నమున స్వభావసిద్ధముగ తిర్యగ్జంతులను దర్శించెను. ఇట్లు తాను దర్శించిన, ఆలకించిన పదార్థ స్మరణము నక్షతమైన మనస్సు నవిలోకించుచుండెను, లతా రూపధారియగు భిక్షుకుడు పుష్ప, ఫల, పల్లవ విరాజితమై యుండెను. వనదేవతలకు క్రీడా నికుంజము విధమున, బీజస్థమగు నంకురా కారము చందమున, జ్ఞేయాధి రూఢమగు నంతర్జ్ఞానముతో జాగ్రత్తునందు, తాను లతారూపమున వృక్షములకు వ్రేలాడుచుండుటను గమనించెను. అనంతరము కొంతకాలము సుషుప్త్యవస్థను పొంది తనను భ్రమరముగ భావించెను. వెంటనే భ్రమరమై పద్మాసక్తితో కొంతకాలముండెను. ఒకప్పుడు జడమతి యగు తిర్యగ్జంతువుగ గాఁగోరెను. వెంటనే తా నాశ్రయించిన భ్రమర రూపమున యున్న పద్మలతా నిర్మూలన మొనరించు మత్తేభ రూపమును ధరించెను. మూర్ఖులు రమణీయ వస్తు వినాశమునకు, ముందడుగు వేయుదురు కదా! ఆ మదపుటేనుగు పద్మమును నాశముజేయ షట్పదము సైతమంతరించెను. ఈ గజము స్వేచ్ఛా విహారములు సల్పుచు శుష్క-సాగర గంభీరమగు నఖాతమున కూలబడెను. ఆ స్థితిలో దాని నొక మహారాజు గాంచి బంధించి, ఉచిత రీతిని శిక్షించి, తన సైన్య పరివారములో జేర్చెను. కొంతకాలమున కది యుద్ధ రంగమున నిహత మయ్యెను. అపు డా యేనుగు గండస్థలమున నున్న గండు తుమ్మెదను భావించి, మరల తుమ్మెద రూపమును ధరించెను. అది యొకమారు ప్రారబ్ధవశమున కరిఖురాక్రాంతమై చూర్ణమయ్యెను. ఆ సమయమున పార్శ్వభాగములందు సంచరించు హంసలను భావించి, కలహంస రూపమును ధరించెను. ఇట్లు అనేక

యోనుల యందు జన్మించుచు కడకు బ్రహ్మ వాహనమైన హంసగా
జన్మించి విహరించుచుండెను.

ఒకమారా బ్రహ్మ వాహనమగు మరాళరాజము రుద్ర
లోకమున కేగి రుద్ర సందర్శన మొనరించెను. వెంటనే తాను
రుద్రుడు కావలెనని భావించి రుద్రు డయ్యెను. తన ప్రమథగణ
గోష్ఠి విలాసములతో, శివమాహాత్మ్య వర్ణనాదులతో యథేచ్ఛగ
విహరించు చుండెను. సర్వోత్తమ జ్ఞాన విలాస భాసురమగు
నా రుద్రత్వ పూర్వ వృత్తాంత మంతయు, స్మరణ మాత్రమున
దర్శించెను. తన భావనా పరంపరల కమితాశ్చర్యము నందెను.

'ఆహా! విశ్వమోహనకరమగు నీ మాయ ఎంత చిత్ర,
విచిత్రమైనది! అసత్య స్వరూపమైనను, మరు మరీచిక యందలి
జలమువలె సద్రూపమై మోహపెట్టు చున్నది. అనేక చిత్ర
విచిత్రములగు ననేక సంసారములయందు, శూన్యారణ్య భూముల
యందు విహరించిన విధముగ విహరించి తుద కొక జన్మమున
జీవటునిగ జన్మించితిని. వేరొక జన్మమున బ్రాహ్మణ శ్రేష్ఠుడ
నైతిని. మరియొక జన్మమున మహారాజు నైతిని. పద్మవనమున
హంసగ, వింధ్యారణ్యమున మదేభముగ, ని ట్లనేక జన్మ పరంపరల
నంది కడ కీ రుద్ర జన్మము నందితిని. ఇట్టి జననాంతరముల వలన
వర్ష సహస్రములు, చతుర్యుగములు ననేకములు గతించినవి.
అనంత దినచర్యలు వ్యతీతములైనవి. వెనుకటి నా శరీరముల
కడకేగి వానిని దర్శించి, జ్ఞానోపదేశము గావించి, ఈ జన్మముతో
సమానమైన వానిగ జేయుదును గాక!' అని తలపోసెను.

ఆ రుద్రుడు తన ప్రథమ రూపమగు భిక్షుక శరీరము కడ
కేగెను. అతడు శవాకారముగ నొక మఠమున బడియుండెను.
అతనిని మేలుకొల్పి, చేతోవంతు నొనగించెను. అతడు తన మనో
భావనల దలంచుకొని, జీవటాది రూపవంతునిగ, రుద్రునిగ గ్రహించి,

తనకు లభించిన జ్ఞాన సంపదకు మహాదాశ్చర్య వివశుడై, బహు జన్మలకు మూలకారణమైన మాయా వైచిత్ర్యమునకు విస్మిత మనస్కుఁ డయ్యెను.

అనంతర మా రుద్రుడు, భిక్షుకుడు నిరువురును, చిదాకాశ కోణగతమైన జీవట గృహమున కరిగిరి. అతనిని మేల్కొల్పి చైతన్యవంతు నొనరించి, జ్ఞాన బోధ జేసిరి. తిరిగి యా ముప్పురును గలసి విస్మయ రహితులైనను విస్మయ మందిరి. వీరు ప్రథమమున, నేక రూపులే యైనను తరువాత మాయవలన రుద్ర, జీవట, భిక్షు లను రూపత్రయులై, విప్రాది జన్మము లందిన ప్రదేశముల కరిగిరి. వారిని చేతనవంతుల జేసి, జ్ఞానమును ప్రబోధించిరి. ఈవిధము లగు శతరుద్రాంశములును దివ్యజ్ఞానము నొందెను. అవి రుద్రు ననుమతి వడసి, తమ తమ నివాసముల కరిగెను. తమ భార్యా పుత్రులతో నా యంశములు కొంతకాలము సుఖించి, అవసానమున రుద్రత్వము నందెను" అని వశిష్ఠుడు విశదీకరించి మరియు నిట్లనెను:

శ్రీరామచంద్రా ! చిత్కోశమున సర్వమును కలదు. ఇది దేని నవలోకించిన, దాని స్వరూపమును పొందుచున్నది. స్వప్న దృష్టమగునదిగాని, సంకల్ప మాత్రమున నవలోకింపబడు వస్తువు గాని చిత్తమునందు చిద్రూపమై సర్వదా స్థిరమై యుండును. సంకల్ప గతము స్వప్న గతమునగు వస్తువు పొందు దశనుబట్టి, ఆ సిద్ధదశ ప్రాణనిరోధము లేక, మనోనిరోధము లేక లభింపదు. యోగవిజ్ఞాన దృష్టుల ఫలితములగు శంకరాదుల స్థితులు కలవారు స్వసంకల్పాను సారముగ సమస్త వస్తు జాతమును సర్వత్ర జూచు చున్నారు. స్వాభిమతమగు సమస్త కార్యము. తదేకనిష్ఠకల వారలకు మాత్రమే సిద్ధించును. దక్షిణాభిముఖుడైనవాడు,ఉత్తర దిశను జూడలేడు కదా! సంకల్పార్థ పరులైనవారు మాత్రమే, తమ సంకల్పార్థములను పొందగలరు. ఆసక్తికలవారు మాత్రమే ఎదుటనున్న వస్తువునైనను జూడగలుగు చున్నారు. అదిలేని వారు

చూడజాలరు. ఎదుటనున్న వస్తువు బుద్ధియం దున్నచో మూర్ఖుడు, సంకల్పితార్థము నందగోరినను, తదేక నిష్ఠలేక ఆ ప్రయోజనమును పొందక, రెంటికి జెడిన రేవ డగుచున్నాడు. 'నేను విద్యార్థరుడ నగుదును, విద్యాధికుడగు వైదికుడ నగుదును' అని, తదేక ధ్యాన మును జేయువాడు, సత్ఫలము నంది కార్యసిద్ధికి దృష్టాంతమగు చున్నాడు. భిక్షుకుని జీవుడు, తదేక నిష్ఠవలన తుదకు రుద్రమును గూడ నంది సంకల్పార్థ సత్యత్వము నందెను. భిక్షుకుని సంకల్ప జీవులు ప్రత్యేకము లగుట వలన. రుద్రత్వ రూపము లగుట వలన సత్య సంకల్పత్వముకలవై ప్రత్యేక జగమును దర్శించుచున్నారు. ఇట్లు భిక్షుక సంకల్పమువలన జీవట, బ్రాహ్మణాదులు, రుద్ర విజ్ఞాన వశమున స్వసంకల్ప స్థానములను పొందినవి. అనంతరము రుద్రునితోగూడి పరబ్రహ్మమునందు లీనమైనవి" అన శ్రీరామ చంద్రు డిట్లనెను: "మునీంద్రా! భిక్షు సంకల్పమువలన జీవట, బ్రాహ్మణాదులు సత్యత్వమెట్లు పొందిరి? సంకల్పార్థమునందు సత్యత్వమెల్లుండును?" అన వశిష్ఠు డిట్లు చెప్ప నారంభించెను:

## 7. భేతాళోపాఖ్యానము

"శ్రీరామచంద్రా! జనార్దను డొక్కడే వేయి రూపములు ధరించి ఆ యంశావతారములతో జగములను పాలించుచుండునటుల భిక్షు సంకల్పము వలన జీవట, బ్రాహ్మణాదులు చిదంశములై సత్యమైనవారివలె నుండిరి. 'జన్మపరంపరలు. సంకల్ప రూపము లగు భ్రాంతుల వలన నేర్పడుచున్న'వని శతరుద్రోపాఖ్యానమున వివరింపబడినది. ఇపుడు సౌషుప్తమౌన సంపత్తికై కర్కటి ప్రశ్న సముదాయము వలె భేతాళ ప్రశ్నములను నిరూపింప దలచి ఈ భేతాళోపాఖ్యానము నారంభింపబడుచున్నది.

చిత్త విలాసమును పరిత్యజించి, సుషుప్త మౌనవంతుడవై, వాసనారూపములను విడచి, బ్రహ్మభావము నవలంబించి యందుము.

అని వశిష్ఠ మహర్షి వచింప శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను. "మహాముని! వాఙ్మౌనము అక్ష మౌనము' కాష్ఠ మౌనము, అను వానిని మాత్రమే విని యున్నాను. కాని సుషుప్త మౌనము విషయము నెరుగను. కాన, దాని లక్షణ మెరిగింపుము" అని అర్థించెను. అంత నా వశిష్ఠ మహర్షి యిట్లభివర్ణించెను: "శ్రీరామా! మునులు రెండు విధములుగా చెప్పబడుచున్నారు. ఒకరు, కాష్ఠ మౌని కాగా, రెండవ వాడు జీవన్ముక్తుడు.

కాష్ఠ మౌని: భావింప బడని శుష్కక్రియ యందు దృఢ నిశ్చయుడై హఠయోగను వలన ఇంద్రియములను జయించినవాడు కాష్ఠ మౌని.

జీవన్ముక్తుడు: 'ఈ సర్వము బ్రహ్మ స్వరూపము' అని భావించుచు, తనను బ్రహ్మముగ నిశ్చయించుకొని, ఆత్మస్వరూపము ననుసంధానము జేయుచు. వ్యవహార మాత్రమునకు సాధారణ మానవమాత్రుడై బ్రహ్మానందముచే తృప్తినందువాడు జీవన్ముక్తుడు.

మౌన లక్షణము! నిర్వికారచిత్తులగు నీ యిరువురి, యేక నిష్ఠత్వరూపమగు భావమును మౌన మందురు.

వాఙ్మౌన, అక్ష మౌన, కాష్ఠ మౌన లక్షణములు: వాక్కులను నిరోధించుట వాఙ్మౌనము. హఠయోగము చే నింద్రియములను నిరోధించుట అక్ష మౌనము. శారీరక చేష్ఠలను నిరోధించుట కాష్ఠమౌనము. ఇవి చిత్తవాసనలతో గూడినవి. కాన, కాష్ఠ మౌని వీని నాశ్రయించును.

సుషుప్త మౌన లక్షణము: అంతర్ముఖుడు గాని, బహిర్ముఖుడు గాని అయిన మునికి జాగ్రదాది విభాగములు లేనిదియు, కర్మేంద్రియ నిరోధ క్లేశ రహితమైనదియు, ఉపక్రమోప

సంహారములు లేనిదియు నగు బ్రహ్మనిష్ఠను సుషుప్త మౌన మందురు. నానావిధ విభ్రమములు కల జగత్తు యథాభూతముగ నెరిగి సందేహ రహితమైన యథాస్థితిని సుషుప్తమౌన మందురు. అనేక సంవిద్రూపాత్మ, శివమైన, ద్వైతాప్తమగు బ్రహ్మమే యను ననంతమగు బ్రహ్మనిష్ఠను సుషుప్తమౌన మందురు. ఈ జగము ఆకాశమగు చున్నది కాని ఆకాశము మాత్రము కాదు. సమస్తము అస్తిత్వము కలదయ్యు లేనిది యగుచున్నది అదియు, బ్రహ్మ వ్యతిరిక్తము కాదనియు నిశ్చయించు బ్రహ్మ నిష్ఠయు సుషుప్తమౌన మనబడును. ఈ సుషుప్త మౌనము యోగీంద్రులచే ద్వివిధములుగా పొందబడుచున్నది. అందుచే కొందరు సాంఖ్య యోగులు, మరికొందరు యోగ యోగులు నగుచున్నారు.

<u>సాంఖ్య యోగులు</u> : సమ్యగ్జ్ఞానావబోధతో సిద్ధమైన సమాధి యందు నిష్ఠులగు యోగులు జ్ఞానముచే, సిద్ధిని పొంది 'సాంఖ్య యోగు' లనబడుచున్నారు.

<u>యోగ యోగులు</u> ; అష్టాంగ యోగముచే ప్రాణాది వాయువులను శాంతింపజేయు నాద్యంత రహితమగు బ్రహ్మ మును పొందినవారు 'యోగ యోగు' లనబడుదురు. అకృత్రిమ మైన శాంత పదము నందు వరకు నుపాధేయ మగును. సాంఖ్య యోగులకు లభించు స్థానమే యోగ యోగులకును లభ్య మగును. ప్రాణ మనోవృత్తులు లేని, వాసనా వాగురాక్రాంతము కాని దానిని పరమ పదమని భావింపుము. యథార్థమునకు మనస్సు అనునది లేదు. కాని, అది అనాలోచితమగుట వలన స్వప్నము నం దాత్మ మరణమువలె కలిగినది. ఆలోచనము వలన నది లేని దగుచున్నది.

మోక్షసాధన సంగ్రహము: మోక్ష మనగా ఆత్మ తత్త్వమును నిరంతరము ననుసంధానము జేయుట. 'ప్రాణాది వాయు నిరోధము, మనోనిగ్రహము' నను నీ మూడును మోక్ష పదార్థములు. వీనిలో నే యొకటి సిద్ధించినను మిగిలిన రెండును తమంతటాను సిద్ధించును. జంతువుల ప్రాణ చిత్తములు నిత్యము నవినాభావ సంబంధము కలవై యుండును. అవి పుష్ప, పరిమళముల వలె; తిల, తైలముల విధమున; ఆధార, ఆధేయముల రీతి పరస్పరాశ్రయములై యుండును. వీనిలో నే యొకటి లేకున్నను రెండవదియు నుండదు. ఈ ప్రాణ చిత్తములు నశించి 'మోక్ష' మను నుత్తమరూపము ధరించుచున్నవి. ఒకానొక తత్త్వమునందు చిత్తము దృఢమైనప్పుడు, ఆ భావమునే భావింప వలయును. భావము భావత్వమును పొంది స్వాభ్యాసము వలన విస్తరించును. అనేక విభేదములు గల చిత్త మిట్లు ఏకాగ్ర స్థితిని పొంది క్షణమాత్రము లో నా వస్తురూపము నందుచున్నది" అని వశిష్ఠుడు వచించి మరియు నిట్లనెను.

"శ్రీరామచంద్రా! ఈ సంసారము స్వప్నభ్రాంతి సదృశము. దీనికి నుదాహరణముగ నీ భేతాళ ప్రశ్నములు ప్రసంగవశమున స్మృతికి వచ్చినవి. వానిని విశదము జేయుచున్నాను, ఆకర్ణింపుము. వింధ్యారణ్యమున విస్తార కాయుడగు భేతాళుడు కలడు. అతడు ప్రాణులను వధించి భక్షింప గోరి నొక దేశమున బ్రవేశించెను. ఇది వరకా భేతాళుడు సజ్జనులు వసించు దేశమున నివసించుచు, బల్యుపహారాదులతో నిత్య సంతృప్తుడై సుఖముగ నుండెను. అతడు క్షుధావ్యథితు డయ్యెను. నిరపరాధి ఎదురైనచో నిర్నిమిత్తముగ వధింపడు. సత్పురుషులు న్యాయకోవిదులు గదా! అట్టివాడు కాలాంతరమున నగరాంతరమును జేరెను. న్యాయ యుక్తముగ నరులను వధించి తన ఆకలిని దీర్చుకొనుచుండెను. ఒకనాడు తన రాజ్యము నందలి పరిస్థితుల నెరుగదలచినవాడై, మహారాజు

ప్రచ్ఛన్న వేషము ధరించి, యర్ధరాత్రమున నొంటరిగ సంచరించు చుండెను. ఇది చూచి భేతాళుడు భయంకరశబ్ద మొనరించి యిట్లనెను: 'రాజా ! నీ విపుడు భయంకరుడగు భేతాళుని యధీనమున నుంటివి. ఇంక నెచటికిని బోజాలవు. నాకు యోగ్యమగు భోజనము నగుము' అనెను. అపు డా రాజు 'నక్తంచర ! అన్యాయముగ, బలాత్కార ముగ నీవు నన్ను భక్షించితివేని, నీ శిరము సహస్ర శకలము లగును. ఇందుకు సందియములేదు' అని ప్రత్యుత్తర మిచ్చెను. అంత నా భేతాళుడు, 'రాజా ! నిన్ను అన్యాయముగ వధింపను. నేను న్యాయముగనే ప్రవర్తింతును. నీవు రాజువు కాన, అర్థిజనుల కాంక్షి తముల నీ డేర్ప సమర్థుడవు కదా! అట్లే అర్థుడనైన నా యభిమతము నీడేర్పుము. నా ప్రశ్నములకు సమాధానముల నిచ్చి, నా సందియ ములను తొలగించి, నా ప్రార్థనమును సఫలము జేయు'మని వేడు కొనెను.

భేతాళప్రశ్నములు-రాజ సమాధానములు - బ్రహ్మాండము లేల సూర్యకిరణముల ముందు పరమాణువులుగ నగుచున్నవి ?

సమా : నీవడిగిన ప్రశ్నము చిత్త సంబంధమైనది. చిత్సూర్యోదయమై, దీని నంతటిని తపింపజేయుచున్నది. ఇది విజ్ఞా నాత్మకము. సూర్యులకు సూర్యుడు. ఈ భువనము లన్నియు నతని పరమాణువులు. విజ్ఞానపరుడగు నా చిత్సూర్యుని కాంతిచే నవి ప్రకాశవంతము లగుచున్నవి.

ప్రశ్న : మహాకాశము లను రేణువు లేవాయువు నందు ప్రకాశమానము లగుచున్నవి ?

సమా : కాలశక్తి, గగనశక్తి, వాయుశక్తి, చిచ్ఛక్తి మున్నగు స్ఫురణంబు లన్నియు పరమాత్మమయమగు వాయువు నందు, పుష్పమందలి పరిమళమువలె తద్రూపములై ప్రకాశించు చున్నవి.

ప్రశ్న : స్వప్నమునందుండియు నెవడు వేలాది స్వప్నాంతరములను పొందుచు, విడచుచు నిర్మలమగు తన రూపమును విడువకుండెను ?

సమా : ఈ 'జగత్తు' అనునది మహాస్వప్నము. అందు ఆత్మ, జననము లను స్వప్నాంతరముల ననుభవించును. ప్రశాంతము, బ్రహ్మ, శాంతము నగు తన రూపమును విడువదు.

ప్రశ్న : కదళీవృక్షాంతర్భాగమున పత్రరూపముగనే యుండు నటుల లోలోపల విమర్శింపగా నేది తానై ప్రకాశించును ?

సమా : కదళీవృక్షాంతర్భాగమున పత్ర రూపముగ నుండు నటులనే, ఈ జగత్తు నానావిధములుగ నున్నను, లోలోన విచారింపగా బ్రహ్మపదార్థమే యగుచున్నది.

ప్రశ్న : బ్రహ్మాండములు, ఆకాశము, భూతజాలము, సూర్యమండలము, మేరువు మున్నగున వన్నియు నే పరమాణువునకు పరమాణువు లగుచున్నవి ?

సమా : సూక్ష్మత్వము, అలభ్యత్వము నగుటవలన పరమాత్మ, పరమాణు తుల్యము. ఈ పరమాత్మ అనంతత్వ మగుటవలన మేర్వాదులకు మూల మగుచున్నది. ఆ మేర్వాదులు పరమాత్మ ముందు పరమాణువులుగా భాసించుచున్నవి.

ప్రశ్న : పరమాణు వను మహాపర్వతము నడుమ, శిలాంతర్నిహితుడై, కాంతరూప, మగు నీ జగత్త్రయము దేనికి సారభూతమైనది ?

సమా : ఆత్మ, అగ్రాహ్య మగుటచే పరమాణు వైనను వ్యాపకుడగుట వలన మహాపర్వత మగుచున్నాడు. సర్వావయవ రూపుడైనను, అవయవరహిత రూపము కలవాడు. విజ్ఞప్తిమాత్ర సారత్వమగుట వలన సర్వాధిష్ఠానరూపుడు, సాధువా! ఈ గత్రయము విజ్ఞాన మాత్ర మన్నముగ నెరుగుము.

అని వశిష్ఠుడు వివరించి, మరియు నిట్లనెను: " రామచంద్రా! ఆ మహారాజు చెప్పిన సమాధానములకు భేతాళుడు ఆత్మ విచారము కలవాడై వివేకముచే శాంతిని పొంది, ఆకలిని మరచి, యేకాంత ప్రదేశమున కేగి ఆత్మధ్యానపరుడయ్యెను,

## 8. భగీరథోపాఖ్యానము

భేతాళోపాఖ్యానమున సుప్త మౌనమునకు నుదాహరణ పూర్వకముగ 'భేతాళ ప్రశ్నము' లకు సమాధానములు చెప్పబడినవి. ఇపుడు 'చిత్త విశ్రాంతి దుర్లభమైనను స్వప్రయత్నమున నది లభించు' నని తెలుపుటకు భగీరథోపాఖ్యానమును వశిష్ఠుడుపదేశించెను.

"రామచంద్రా! చిత్తమును సర్వవిషయములనుండి మరలించి స్తిమితమైన అంతరాత్మతో ప్రాప్తకర్మముల నాచరించుచు, వాంఛా రహితుడవై, శాంతచిత్తముతో నుండుము. మనస్సుతో మనస్సు, నాకాశమువలె నిర్మలమైన దానిగజేసి, సర్వత్ర సమదర్శనుడవై, శాంతి యుక్తుడవై, యథాప్రాప్తాను వర్తనుడవై యుండుము. స్థిరబుద్ధియు, విజ్ఞానవంతుడు, మహారాజు నగు భగీరథునకు వలె నసాధ్యకార్యము నైనను సుసాధ్యముగ జేసి కొనగలవు" అనగా, శ్రీరామచంద్రుడు "మునిపుంగవా! చిత్తచమత్కారముతో, మహారాజగు భగీరథుడు గంగను గొనివచ్చుట ఎట్లు సుసంపన్నమైనదో వివరింపుము" అన, వశిష్ఠుడిట్లు వివరించెను:

" శ్రీరామచంద్రా! చతుస్సముద్రవలయిత భూమండల మండనాయమానుడు, పరమ ధార్మికుడు భగీరథుడను మహారాజు కలడు. చంద్రప్రసన్న వదనుడగు నా రాజేంద్రుని వలన, నర్థిజనము కోరినదే తడవుగ, చింతామణినుండి వలె, తమ తమ వాంఛలను పొందుచుండిరి. పాతాళలోకవాసులగు తన బంధువులను గంగా సోపాన పద్ధతితో బ్రహ్మలోకమున కంపెను. యౌవనావస్థ

యందు వర్తించుచున్నవాడైనను, ఆ భగీరథ మహారాజునకు దైవ యోగమున మరుభూమియందు లత యంకురించిన విధమున వైరాగ్య ముదయించి, ఆత్మ విచారేచ్ఛ జనించెను.

ఒకనాడు భగీరథ మహారాజు ఏకాంతమున నుండి, అన్యాయాక్రాంతమైన నీ జగద్యాత్రను గూర్చి విచారించెను. 'మానవుడు పౌనఃపున్యముగ రేయింబవళ్లు ననుభవించుచు, దానాదాన శతముల నొనరించుచు, సారహీనములైన ఈ శుష్కకర్మల నాచరించుచున్నాడు. ఏ వస్తువును పొందుటవలన నిక పొందవలసిన దేమియు నుండదో, అట్టి వస్తు సంపాదనమునకు జేయు కర్మ శ్రేష్ఠమైనది. కాని, తక్కిన కర్మల నాచరించుటవలన ప్రయోజనము లేదు. మూర్ఖుడు చేసిన పనిని మరల జేయుచు సిగ్గు పడడు. విజ్ఞాని బాలునివలె నట్టి పనిని జేయుట కిచ్చగింపడు' అని తలచి యుద్విగ్న మనస్కుడయ్యెను. ఇట్టి సంసార స్థితికి భీతుడై తన గురువగు 'త్రితులుడు' అను వాని కడకేగి, యిటుల ప్రార్థించెను :
'మహానుభావా! జరామరణ మోహాది రూపములగు భయంకర దుఃఖములకు నాశ మెట్లు కలుగునో వివరింపుడు' అనెను. అపుడా త్రితులుడు, 'రాజా! సర్వగతమగు నాకారము కలదియు, నిర్విభాగ విలాసమైనదియు, సంపూర్ణమగు జ్ఞానావబోధముతో సర్వ దుఃఖములు నశించుచున్నవి. బంధహేతువులగు నహంకారాదులు విడిపోవుచున్నవి. సంశయములు, సర్వకర్మలు విలయము నందుచున్నవి. సంశుద్ధ జ్ఞప్తి స్వరూపుడు, నిత్యుడు, సర్వగతుడు, వృద్ధి క్షయములు, చావుపుట్టుకలు లేనివాడగు నాత్మయే జ్ఞేయమగు పరతత్త్వమని పండితు లందురు' అన, భగీరథు డిట్లు ప్రశ్నించెను :
'మునినాథ! చిన్మాత్రము, సర్వగము, నిర్మలము. శాంతము నగు బ్రహ్మము కలదు. దేహాది పదార్థమేదియు లేదు అని యెరుగుదును కాని, ఈ విషయమున నా చిత్తము నిలుకడగ నుండుటలేదు. అందువలన చిత్త మీ విషయమునందు స్థిరముగ ననుసంధానము నొంది

యుండుటకు నుపాయమును ప్రబోధింపుము ' అని యర్థింప త్రితులు డీవిధముగ బోధించెను : 'కుమారా ! జ్ఞానముచే జ్ఞేయ నిష్ఠత్వము కలుగును. ఇది హృదయాకాశమున జరుగును. అపుడు జీవుడు సర్వాత్మకమగు బ్రహ్మస్వరూపుడై జన్మరాహిత్యము నందును.

జ్ఞాన సాధనము: దారాపుత్రాదులయందనాసక్తి, మమతా రాహిత్యము, ఇష్టానిష్ట వస్తువుల యందు హర్షామర్షములు లేకుండుట, నిత్యము సమచిత్తత్వము. అనన్య యోగముతో నిరంతరము ఆత్మభావన కలిగి యుండుట, నిర్జన ప్రదేశ నివాసము జనసంపదయందు విరక్తి, అధ్యాత్మజ్ఞాన నిష్ఠత్వము, తత్త్వార్థజ్ఞాన దర్శనము ననునవి జ్ఞాన సాధకములు. తదితరములు అజ్ఞాన హేతువులు. రాగద్వేషములను నశింపజేయునదియు, సంసార మను వ్యాధికి ఔషధమైనదియు నగు జ్ఞానము అహంకారము శాంతింపగా ఆవిర్భవించును ' అన భగీరథు డిట్లనెను : 'మహాత్మా ! పర్వతమునందు మహావృక్షము విధమున చిరకాలము నుండి యీ శరీరమునందు నెలకొని యున్న అహంభావ మెట్లు విడువబడునో వివరింపుడు ', అన, అపుడు త్రితులుడు, 'పురుష ప్రయత్నముతో భోగ సముదాయాసక్తి పరిత్యాగ మొనరించి, పరిపూర్ణ సద్రూపము నాశ్రయించినచో నహంకారము తొలగి పోవును. ' లజ్జ, దయ, శంక, ఇచ్ఛ, జుగుప్స, కులము, శీలము, జాతి' అను నీ యెనిమిది పాశములతో నిర్మితమైన యంత్ర పంజరమును, స్వస్వరూపమున కంటె వేరగున దేదియు లేదను భావము ప్రస్ఫుటమైనంతనే అహంకారము తొలగి పోవును. నీవు బుద్ధిపూర్వకముగ నీ కులాభిమానాదుల నన్నిటిని విడచితివేని అహంకారము నశించి, పరబ్రహ్మస్వరూపుడ వగుదువు విశేషణముల నన్నింటిని అనగా, ' నేను బ్రాహ్మణుడను, గృహస్థుడను, జ్ఞానవంతుడను ' అను

నీ మొదలగు పదములను ప్రయోగించుట విడచి, భయము లేని వాడవై, ఈషణములను పరిత్యాగము జేసి, సర్వసంపదలను గూడ పరిత్యజించి, అహంకార విరహితుడవు, దేహ వాసనా త్యాగివై భిక్షాటన మొనరించుచు తుదకు గురువు నగు నన్నును వీడి చరింతువేని సర్వోత్కృష్టమగు పరబ్రహ్మ స్వరూపము నందగలవు అని వచించె' నని వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రు నకు ప్రబోధించెను.

"శ్రీరామచంద్రా! భగీరథుడు గురువగు త్రితులుని ముఖతః ఈ విధములగు మహత్తర విషయముల నాలకించి, కర్తవ్యమును తన మనసున నిర్ణయించుకొని స్వవ్యాపార పరాయణుడయ్యెను. ఈవిధముగ కొన్ని దినములు గడచినంత, నాతడు సర్వసంగపరిత్యాగము సిద్ధించుటకై 'అగ్నిష్టోమము' అను యజ్ఞము నాచరించెను. గో, భూ, అశ్వ, హిరణ్యాది దానములను ద్విజ, దేవ, ఆర్త, బంధువులకు గుణాగుణ విచారణము చేసి సమర్పించెను. ఇట్టులా యజ్ఞమును త్రిరాత్ర దీక్షతో నాచరించి, ఆ సమయమున తాను ధరించిన వస్త్రములు తప్ప, మిగిలిన వస్తుసముదాయమును, రాజ్యమును, ధనమును పేద సాదలకు దానమొనరించెను. ఇట్లు, సర్వార్థ రిక్తుడై భగీరథుడు తన రాజ్యమును మాత్రము సరిహద్దు ప్రాంతమునందుగల శత్రురాజులకు సమర్పించి కట్టు పుట్టములతో నాపట్టణమును వీడి. తన నామ రూపముల పరిచయ మాత్రమైనను లేని ప్రాంతములందు, గ్రామములందు, పట్టణములందు, నరణ్యముల యందు నిర్విచారముగ సంచారము జేయుచుండెను. స్వల్పకాలములోనే ఈషణములను పరిత్యాగమొనరించి పరమ ప్రశాంత చిత్తుడై యుండెను. భూ పీఠము నందలి ద్వీపముల నన్నిటి యందును సంచరించుచు నొకమారు దైవ యోగమున శత్రుహస్తగతమై యున్న తన నగరమున కేతెంచెను. అచట భిక్షాటనము జేయుచుండ, ప్రజలా భగీరథుని గుర్తించి, విషాద వదన చేతస్కులై పూజించిరి. 'మహాప్రభూ! తమరు తిరిగి

రాజ్యపాలనా భారము వహింపవలయును' అని శత్రురాజు లభ్యర్థిం చినను వారి మాటల నంగీకరింపలేదు. ఆ రాజ భోగముల నాతడు తృణముగా భావించెను. భోజనము జేయుట తప్ప సర్వకార్య విముఖుడై యుండెను. 'ఈయన భగీరథమహీపతియా! ఆహా! ఎంతటి కష్టము దాపురించినది ?' అని ప్రజలు విచారించుచుండ, మరి కొన్ని దినములకు ఆ దేశమును వీడి, వేరొక దేశమునకు వెడలి పోయెను. అచట ప్రశాంతచిత్తుడై, ఆత్మనిష్ఠతోనుండి, యనంతరము గురువగు త్రితులుని దర్శించెను. ఆయనకు పాదాభివందనాదులను సమర్పించెను. ఆయన దేశాటనమునకు వెడలుచుండ తాను గూడ బయలువెడలి పర్వతములు, నరణ్యములు, పట్టణములు గ్రామము లందు వసించెను. సమత్వ పరిభాసితవర్యులగు నా గురుశిష్యు లిరువురు దేహమును దుఃఖభాజనముగ భావించి, 'ఈ దేహ ముండిన నేమి? యూడిన నేమి? ఇది యెట్లున్న నేమి? ఉండిన నుండ నిమ్ము, పోయిన పోనిమ్ము దీనితో ప్రయోజన మేమి? దీనిని గూర్చిన చింత యేమి?' అని నిశ్చయించి, ఒక వనము నుండి మరియొక వనమునకు ప్రయాణించుచు నానందమును గాని, దుఃఖమును గాని ఈ రెంటి నడిమి స్థితిని గాని పొందక యుండిరి. ధన, కనక, వస్తు, వాహనాది అయిశ్వర్యములు తృప్తి కలిగింప లేదు. సిద్ధులు ప్రసాదించిన అష్టైయిశ్వర్యములను తృణమునుగ భావించిరి.

ఈవిధముగ నుండ నొక్కనాడు ఒకానొక పట్టణమున సంతాన రహితుడైన మహారాజును మాంసపు ముద్దవలె మృత్యుదేవత హరించెను. అపుడు మంత్రి, సామంత గణము తమ దేశము దిక్కుమాలినదై నదని దుఃఖించిరి. గుణ యుక్తుడయిన వేరొక రాజునకై వార లన్వేషించుచుండిరి. ఆ సమయమున భిక్షాటన మొనరించుచున్న భగీరథుని గాంచి, తమ దురవస్థ నెరిగించిరి. ఆయనను గుర్తించి, వెంటనే సైన్యమును గొని వచ్చి పట్టాభిషిక్తుని జేసిరి. ప్రావృట్కాల సరోవరము క్షణకాల

ములో జలపూర్ణమైన విధమున ప్రజ లందరును జేరి భగీరథు నభినందించిరి. అతఁడును రాజ్యపాలనమున కంగీకరించి, మత్తమాతంగాధిరోహణ మొనరించెను. 'జగన్నాథుడగు భగీరథునకు జయమగుగాక!' అను ప్రజల జయజయ ధ్వానములతో పర్వతగుహాలు ప్రతిధ్వనించెను. పూర్వమంత్రుల కీ విషయము తెలిసి, ఆ దేశమున కేతెంచి యాతని కొలువులో కుదురుకొనిరి. తమ రాజు మరణించుటచే వారు నిరాశ్రయులై రి. ఇపుడు వారికి మరల యాశ్రయము లభించుటచే ముదావహులై రి. 'మహారాజా! మాకు తాము నియమించిన మహారాజును, మృత్యుదేవత మృదుమాంస ఖండమును మత్స్యము మ్రింగినట్లు భక్షించినది. నిరాశ్రయులమైన మాకు తమరు తిరిగి యాశ్రయము కల్పించి యనుగ్రహించిరి. అనాయాసముగ వచ్చు నర్థములను పరిత్యజింపరాదుగదా!" అని వశిష్ఠుడు భగీరథుని వృత్తాంతమును వివరించి మరల నిట్లనెను: "శ్రీరామచంద్రా! మంత్రు లీ విధముగ ప్రార్థింప భగీరథు డంగీకరించి, సప్తసాగరపరీత భూమండలమున కధిపతియై, శాంతచిత్తుడై వీతరాగుడు, మత్సర రహితుడునై, ప్రాప్తకార్యముల నాచరించుచు విస్మయ రహితుడై యుండెను. అనేక సంవత్సరములు సుదారుణ తప మాచరించి, తన పితృదేవతల నుద్ధరించుటకై గంగను భువి కవతరింప జేసెను."

## 9. శిఖిధ్వజోపాఖ్యానము

'చిత్తశాంతి దుర్లభమైనది. అయినను, స్వప్రయత్నముచే నది లభింపగలదు' అని విశదీకరింప దలచి భగీరథోపాఖ్యానమును వచించెను, 'పాపసంచయము క్షయించక పోయినచో ఆత్మజ్ఞానము దుర్లభము. అయినను, ఆచార్యుని ప్రయత్నాతిశయమున నది లభ్యమగును' అని తెలియబరచుటకు అనేక ఉపాఖ్యానములతో గూడిన ఈ శిఖిధ్వజోపాఖ్యానమును వశిష్ఠ మహర్షి వచింప నారంభించెను.

“శ్రీరామచంద్రా! చంచలమగు ‘మనస్సను పక్షిని’ ముందుగ స్థిరముగ నుండునట్లుచేసి, శిఖిధ్వజునివలె ఆత్మపదార్థము నందు ప్రశాంతుడవు, నిశ్చలుడవు నగుము” అన శ్రీరామచంద్రు డిట్లనెను: “మహాముని! ఆ శిఖిధ్వజు డెవరు? ఆత డెట్లు తత్త్వజ్ఞు డయ్యెను? ఈ విషయమును నా కామూలాగ్ర మెరిగింపు” మన వశిష్ఠ మహర్షి యిట్లు వచించెను: “పూర్వము (సప్తమ మన్వంతరమున) ద్వాపరయుగము నందు మాళవదేశమున శిఖిధ్వజు డను రాజేంద్రుడు గలడు. అతడు ధైర్య, ఔదర్యములు; దయా సత్యములు; క్షమ, శమ, దమములు కలవాడు, పరాక్రమ వంతుడు, మంగళప్రదమైన చరిత్ర కలవాడు, గుణాకరుడు, మాన్యుడు నై యుండెను. ఆతడు సౌరాష్ట్రాధిపతి కుమార్తె యగు ‘చూడాల’ అను నామెను వివాహ మాడెను. ఆమె యతని కన్ని విధముల తగియుండెను. అన్యోన్యార్పితచేతస్కులగు నా దంపతులకు ప్రేమ దినదినాభివృద్ధి యగుచుండెను. నిత్యము వార లొకరి నొక రెడబాయక పరస్పరాలోకనాది చేష్టలతో కాలము గడుపుచుండిరి. వారు లలితకళా విశారదులు. అవిషయికము లగు ప్రసంగ ప్రయోగాదులచే నేకరూపాభిప్రాయములు కలవారలై మిత్రత్వముతో మెలగుచుండిరి. ఇట్లు తమ ఇచ్ఛ వచ్చినరీతిగ యౌవన విలాస క్రీడలతో ననుదినము సరస సల్లాపములు చేయుచు ననేక వత్సరములు గడిపిరి.

ఒకనాడా దంపతు లిరువురు నిట్లు తలపోసిరి: ‘ఓటి కుండ లోని జలము విధముగ యౌవనము మెలమెల్లగ తొలగి పోవు చున్నది. పండిన పండు వృంతమును వీడునట్లు మరణము నిశ్చయము. కమలమును మంచు వ్యాపించు రీతి ముసలితన మావరించు చున్నది. కరతలమునుండి జలము జారిపోవు పగిది నాయువు నిరంతరము క్షయమగు చున్నది. వర్షర్తువు నందలి సొరతీగ చందమున, ఆశ నిరంతరము వృద్ధి నందుచున్నది. పర్వతాగ్రము నుండి

ప్రవహించు నది వలె యౌవనము మహా వేగముగ జారిపోవుచున్నది. ధనుర్విముక్త శరముల విధముగ సుఖములు మహావేగముతో పరుగు లిడుచున్నవి. నిస్సారములగు నీ వ్యవహారములు, కదళీతరు గర్భమువలె విరక్తిని కలిగించుచున్నవి. ఈ సంసారము నందు శాశ్వతానందప్రదమగు వస్తు వొక్కటియు కన్పించుటలేదు.' అని వితర్కించుకొని, యా దంపతులు సంసార వ్యాధిని బోగొట్టు మందుగ ప్రసిద్ధి నందిన అధ్యాత్మశాస్త్రమును గూర్చి చర్చించు కొనిరి 'ఆత్మజ్ఞాన' మను మంత్రముతో 'సంసార' మను విషూచివ్యాధి అంతరించును అని నిర్ణయించుకొని, ఆత్మ జ్ఞానార్జనాసక్తి కలవారలై తదేక చిత్తులు, తదేక ప్రాణులు, తదేక నిష్ఠులు, తద్విధాశ్రయులునై, అన్యోన్య బోధాపరాయ ణులై, దృఢాభ్యాసము కలిగి యుండిరి శ్రీరామచంద్రా! వారిలో చూడాల మిక్కిలి నియమ, నిష్ఠలు కలిగి, రమణీయ పదక్రమములను విని, అధ్యాత్మశాస్త్ర పండితుల వలన జ్ఞాన వంతురాలై, తరింపజేయగల విషయ పరిజ్ఞానము కలదియై, నిర్మల బుద్ధితో, రేయింబవళు నాత్మ విచారణ జేయుచుండెను. 'నేను' అను వస్తువేది ? ఈ మోహ మెట్లు జనించినది ? ఎపుడు కలిగినది ? ఎవనికి కలిగినది ? ఈ దేహము జడస్వరూపము కాన, 'నేను' అనునది కాదు. దేహమునకు నభిన్నములగు కర్మేంద్రి యాదిజాలములు జడములే యైనందున అవియు 'నేను' కాదు, బుద్ధీంద్రియాది గణమును జడమునుగనే తోచుచున్నది. అట్లే 'మనస్సు' అను దానిచే, లోష్టకము యష్టిచే ప్రేరేపింపబడు విధమున ప్రేరేపింపబడుచున్నది, కాన జడము. అదియు నేను కానేరదు, వడిశెలలు రాళ్ళను ప్రయోగించు విధమున బుద్ధి నిర్ణయములను మనస్సు ప్రయోగించుచున్నది. కాన, నదియు జడమే యగును. కాన నది నేను కానేరదు. బుద్ధి అనగా నిశ్చయ రూపము. నిశ్చయము జడస్వరూపమే కదా ! ఇది యహంకారము అను దానిచే రెండు కూలముల మధ్యనున్న

ఖాతము ప్రవాహమును నడుపునట్లు బుద్ధిని నడుపుచున్నది. కాన, నదియు నేను కాదు. అహంకారము నిస్సారమైన దగుట వలన నదియు, బాలుడు భ్రాంతి రూపుడగు యక్షుని కల్పించిన విధమున శవాత్మకము. జడరూపము. కాన, నదియు, నేను కాదు. జీవుడు చేతనాకాశుడై, వాతాత్ముడై హృదయమునం దుండెను. అతడు సుకుమార మగు నంతర్యామియై బింబచైతన్యము వలన జీవించుచున్నాడు. ఎంత చిత్రము! చేతోల్లేఖ కళంకియు, చిరంతనుడు, ఆత్మరూపియు, చిద్రూపుడు నగు వీనిచే నా జీవుడు జీవించుచున్నాడు. వాయువు వలన పరిమళము జీవించునట్లు, పల్లము వలన ప్రవాహము వర్ధిల్లు విధముగ, దృశ్యములందు ప్రతిబింబించుట వలన చిద్రూపముతో జీవుడు జీవించుచున్నాడు. అసత్య, జడాది రూపమగు దృశ్యమును పొంది, నిజరూపమును విడచి చిద్రూపము, మహోజలగతాగ్ని స్వస్వరూపమును విడచిన రీతిగ జడ మగుచున్నది. ఇట్లు చిద్రూపము దృశ్యాభిముఖమై తాను జడరూపము ధరించి, తనలో ప్రవేశించియున్న చైతన్యముచే ప్రబోధింప బడుచున్నది. ఇప్పు డీ చిత్తు దేనిమూలమున మనోబుద్ధ్యాది రూపమున ప్రవర్తించుచున్నదో విచారింతునుగాక! ఎంత చిత్రము! చిరకాలమునకు జ్ఞేయమును తెలిసికొన గలిగితిని, మనోబుద్ధీంద్రి యాదులు, చిద్విలాసాంతము లన్నియు, నసద్రూపములు. ఏకాగ్రత లేకపోవుట వలన నివి యన్నియు జెలరేగినవి. మహాచిత్త మనున దొక్కటియే మహాసత్తన బడును. అది నిష్కళంకము. సమధర్మము కలది. పరిశుద్ధము. నిరహంకార రూపమైనది. నిర్మలమై, నిత్యోదయమై బ్రహ్మ, పరమాత్మ మున్నగునామములతో పరిగీయమాన మగుచున్నది.' అని భావించి చూడాల చిద్రూప జ్ఞానము కలదయ్యె''నని చెప్పి, మరియు వశిష్ఠు డిట్లు ప్రబోధింప దొడగెను:

"చూడాల దిన దిన మీవిధముగ నంతర్ముఖురాలై ఆత్మయందనురక్తి కలిగి ప్రకృతిస్థితురాలుయ్యె, విరాగినియు,

ననాసక్తురాలగుట నిర్ద్వంద్వయు, సంకల్ప విరహితు రాలగుట దేనినినిగ్రహింపక, పరిత్యజింపక, పరమాత్మ మహాలాభ పరిపూర్ణాంతరాంతరయై, సర్వోత్తమమగు నతీత త్త్వము నందుటచే ననిర్దేశ్యత్వమును పొంది, జ్ఞానమును సుదృఢ ముగ నభ్యసించుట వలన, నాత్మోదయ మగుటచే పుష్పించినలత విధముగ ప్రకాశించెను. ఇదివరకెన్నడును లేని కాంతితోగూడి యున్న యా చూడాలను గాంచి యొకనాడు శిఖిధ్వజ మహారాజు ఇట్లు పలికెను: 'కాంతా! నిర్మలమైన కాంతితో నీవు తిరిగి యౌవనము నందినదానివలె నలంకరింపబడి, మిక్కిలి ప్రకాశించు చున్నావు. అమృతపాన మొనరించిన దానివలె బ్రహ్మపద మొందిన దాని విధమున, బ్రహ్మానంద పరిపూర్ణవైనదాని పగిది ప్రకాశించు చుంటివి. నీ చిత్తమున భోగవాంచ లేదు. శాంత సమత్వ పరిపూర్ణవై నిర్మల గాంభీర్యసంభరితనుగా భావించుచున్నాను' అన, చూడాల, 'నేను శరీరాత్మతత్త్వమును వీడి బ్రహ్మత్వమును పొందితిని. అందుచే కాంతిమంతురాలనైతిని, సమస్త జగత్తును విడచి, సర్వాత్మకము, అబాధ్యమునగు బ్రహ్మము నాశ్రయించితిని సృష్టిదశయందు పరిచ్ఛిన్నముగను, ప్రళయదశయందపరిచ్ఛిన్నముగను దర్శింపబడుచు కూటస్థము, పరిపూర్ణానంద స్వరూపమునైన దానిని ఆశ్రయించి అనుభవించుచున్న భోగముల వలన నానందము నందుచున్న విధముగ ననుభవింపరాక, సుదూరమందున్న భోగముల వలనకూడ నట్టి సంతోషము నందుచున్నాను. ఇప్పుడు నాకు హర్షామర్షములు లేవు. ఆకాశమువలె పరిపూర్ణమును, పరిశుద్ధము నగు కేవలబ్రహ్మము నందు నొంటరిగ క్రీడించుచున్నాను. గీత వాద్యాదులగు రాజభోగ ముల ననుభవించుటలేదు నేను సర్వభూతములకు నాధారభూతము, పరమాత్మస్వరూపము నగు దానిని గాని, తదన్యనుగాను అని భావించుచు, నాత్మసంతృప్తి నందుచున్నాను. శారీరక, విద్వేష. రాగాదులు, శాస్త్రదృష్టి వలన కలిగిన ప్రజ్ఞలు అను చెలిమి

కర్తెలతో క్రీడించుచు, కాంతిమంతురాలనైతిని. ఈ నేత్రములతో గాని, ఇంద్రియములతో గాని, చిత్తముచేగాని జూడబడుచున్న దంతయు నసత్యమే యగును. కాన, నేత్రేంద్రియ చిత్తములకు చూడరాని వస్తువును నైతము నా అంతరంగములో జూచు చున్నాను' అని చూడాల తన యాత్మానుభవమును వివరించెను. పరమాత్మ స్వరూపమునందు విశ్రమించి ఈవిధముగ పలుకుచున్న ఆమె పలుకులలోని భావము నెరుగ జాలక శిఖిధ్వజు డిట్లు పలికెను: 'ప్రేయసీ! నీవు అసంబద్ధ ప్రలాపినివి బాలికవు రాజభోగములతో నావలెనే నీవును గ్రీడించుచుంటివి కదా! ప్రత్యక్షముగనున్న నీ ప్రాపంచిక విషయములను విడచి అప్రత్యక్షము, నసద్రూపము నగు దానితో గ్రీడించుట ఎట్లు సాధ్యమగును? అనుభవించని భోగ ములతో సంతృప్తినందుచుంటినని చెప్పువారు, దరిద్రులవలె దౌర్భాగ్యవంతులు, వారు సుఖభోగానుభూతినెట్లు పొందగలరు? కనబడుచున్న దానిని జూచుచుట లేదని జెప్పుట ప్రలాపము గాక మరేమగును? కాన నీవు బాలవు, ముగ్ధురాలవు, చపలవు, విలాపినివి, వివిధ సల్లాప విలాసములతో గ్రీడించు క్రీడాసుందరివి అని శిఖిధ్వజుడు పలికె"నని చెప్పి వశిష్ఠ మహర్షి మరియు నిట్లు చెప్ప దొడగెను: "రామచంద్రా! శిఖిధ్వజు డీ విధముగ వచించి భార్యను జూచి యట్టహాసము జేయుచు మాధ్యాహ్నిక కాల్య కృత్యము లాచరించుటకై యంతఃపురము నుండి వెడలిపోయెను. చూడాలయు, భర్త యభిప్రాయము నవగత మొనరించుకొని, ఆయన కాత్మజ్ఞానము లభింపలేదుకదా యని ఖిన్నురాలై స్వవ్యాపార పరాయణ యయ్యెను, అటుతరువాత భిన్నాభిప్రాయ ములు కల ఆ దంపతులు రాజభోగములతో చాలకాలము గడపిరి.

ఒకప్పుడు చూడాల నిత్యతృప్తయు, ఇచ్ఛారహితయు నైనను, ఆకాశ గమనమున పక్షివలె సంచరించి యానందింపవలెనని తలంచెను. ఏకాంతముగ నొకచోట గూర్చుండి, ప్రాణవాయువు

నూర్ధ్వ దిశకు నడుపుటకై చిరకాల మభ్యసించెను" అని వశిష్ఠుడు పలుక, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను : "మునీంద్రా! ఆకాశగమనాది ఫల సిద్ధించుటకై, ఏవిధమగు యోగము నభ్యసింప వలయునో వివరింపుము" అన, వశిష్ఠు డిట్లు వివరించెను : "రామచంద్రా! శిఖిధ్వజకథా ప్రసంగ వశమున వచ్చిన ప్రాణాది వాయువుల నిరోధాభ్యాసక్రియా రూపమగు సిద్ధి ఫలమును చెప్పుచున్నాను, వినుము. అంతస్థములగు స్వసాధ్యేతర వాసనల నన్నిటిని విడచి, మహాముద్రాద్యుపాయములచే అనగా, స్థానకాది క్రియా క్రమములతో గుదాది స్థానసంకోచము చేతను ; భోజన, ఆసన శుద్ధుల చేతను ; శ్రేష్ఠములగు యోగశాస్త్రార్థములను భావించుట వలనను; తన ఆచారములను సక్రమముగ ననుష్ఠించుట మూలమునను ; సజ్జనసాంగత్యము, దృఢముగ ప్రాణాయామాభ్యాసము, కోపలోభాదులను, భోగములను పరిత్యజించుట, త్యాగ దాన నిగ్రహములవలన, ప్రాణాది వాయువులు భృత్యులవలె మెలగుచు ; పూరక, కుంభక, రేచక విషయములై కాలక్రమమున స్వాధీనము లగును. ఇట్లు ప్రాణాదివాయువులు స్వాధీనములైనంతనే పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్తమును స్వాధీన మగును. సకల సిద్ధులు ప్రాణాది నిరోధము వలన లభించునని చెప్పబడినది. శరీరమున 72 వేల నాడులు కలవు. వీటిలో నూరు నాడులు ప్రధానములైనవి. మూలాధారము మొదలు బ్రహ్మరంధ్రము వరకు 7 చక్రములు కలవు. మూలాధారమున కుండలినీశక్తి గలదు. దాని మీద నూరు ప్రధాన నాడుల నాశ్రయించి, 7 చక్రములలో గూడ ప్రవేశించి సుషుమ్నానాడి యుండును. అది మండలాకారముగ నాభిస్థానమునం దుండును. వీణాగ్రమున నుండు తంత్రీవేష్టనముతో సమముగ జలావర్తము విధమున, బ్రహ్మాది పిపీలికాంతము వరకుగల సకల ప్రాణులయందు నిది యుండును, చలి బాధకు చుట్టచుట్టుకొని నిద్రించుచున్న సర్పము వలె నది నిరంతరము వాయు హతమగు చుండును. అనగా నూరు

నాడులతో గూడినదియై 'అంత్రవేష్టనికము,' అను పేరుగల యొక నాడి వాయుచాలితమై యుండును. దాని మధ్య భాగమున నరటిపుష్పమువలె కోమలము, పవిత్రము, శ్రేష్ఠమైనదియు నగు సర్వశక్తులను, జవమును ప్రసాదించు శక్తి యుండును. అది నిరంతరము కోపముగల సర్పమువలె బుసలు కొట్టుచుండును. ఊర్ధ్వముఖమై స్పందనా హేతుత్వము పొంది యుండు ఈ ప్రాణ శక్తియందు హృదయకోశగతములైన సమస్త నాడులు కూడి యున్నవి. చలనము మొదలు క్రియామూలక మగు ప్రాణశక్తిని 'అంతః కుండలిని' అందురు. బంధనముచే నది 'కల' యనియు; చేతన మగుట వలన 'చిత్త' మనియు; ఉచ్ఛ్వాస, నిశ్శ్వాసల ప్రవర్తకము నగుటవలన 'జీవ' మనియు; మననశీల మగుట వలన 'మనస్స'నియు; సంకల్పములు కలదగుటవలన 'సంకల్ప' మనియు; నిశ్చయాత్మకమగుట 'బుద్ధి' యనియు; 'నేను' అను నభిమానము కలదగుట 'అహంకార'మనియు చెప్పబడును. కుండలిని మొదలు అహంకారము వరకు గల నెనిమిదింటిని 'పుర్యష్టక' మందురు. కుండలిని యను అనుత్తమమగు జీవశక్తి శరీరము నుండి ప్రాణాపాన స్వరూపమగుటవలన క్రిందికిని, మీదికిని నడచు చున్నది. ఆ ప్రాణశక్తి అంతయు నొకప్పుడు ఊర్ధ్వముగను, మరియొకప్పుడు అధోముఖముగను నడచును. ఇట్లు ప్రాణశక్తి అధ్రువ మగుటవలన జీవుడు మరణము నందుచున్నాడు. ఆ ప్రాణ శక్తి వాయునిరోధాభ్యాసమువలన, దాని చలనమును వీడి శరీరము నందే యున్నచో జరామరణములు నశించును" అని వశిష్ఠ మహర్షి అభివర్ణింప శ్రీరామచంద్రు డిట్లనెను : "మునివర్యా ! ఈ శరీరమున ఆధి, వ్యాధులు దేనివలన పుట్టుచు, దేనివలన నశించుచున్నవి, వివరింపుము" అని ప్రార్థించెను. అపుడు వశిష్ఠు డిట్లు చెప్ప నారంభించెను : "శరీరమునకు సంబంధించిన దుఃఖమును 'వ్యాధి' యనియు, నది 'వాసనామయమైన'దనియు చెప్పుదురు. మానసిక మగు దుఃఖమును 'ఆధి' అందురు. ఈ రెండును నజ్ఞానము

వలన, తత్త్వజ్ఞానము లేకుండుట వలన, మూర్ఖత్వమునకు మూలములై జనించు చున్నవి. తత్త్వ జ్ఞానము లేనిచో నింద్రియ నిగ్రహము లభింపదు. అది లభింపనిచో రాగ ద్వేషములు ప్రబలములై నిరంతరము 'ఇది ప్రాప్తించినది, అది ప్రాప్తింప లేదు' అను భావము ఉద్భవించి అధికమగు మోహమును కలుగ జేసి 'ఆధులు' అనగా మానసిక వ్యాధులు కలుగుచున్నవి. మూర్ఖత్వము ప్రబలము కాగా దుష్టాన్నము భుజించుట దుష్ట దేశము లందు చరించుట, దుష్కాలమునందు వ్యవహరించుట, దుష్కార్యముల నాచరించుట, దుస్సాంగత్యములు చేయుట, దుర్భావములను భావించుట, నాడీ రంధ్రములు క్షీణించుట, ప్రాణ వాయువు సక్రమముగ నాడీ గ్రంధులందు సంచరింపకుండుట మున్నగు దుఃఖ హేతువులగు వ్యాధులు శరీరమునకు సంక్రమించును. పూర్వజన్మ సంబంధమైనదిగాని, ఈ జన్మ సంబంధమైనది గాని యగు శుభాశుభ వాసనలలో నేది యధికముగ నుండునో దాని ననుసరించి ఫలము ప్రవర్తించు చుండును. అనగా శుభాధిక్యత వలన సౌఖ్యము. అశుభాధిక్యత వలన దుఃఖము కలుగుచున్నదని భావము.

శ్రీరామచంద్రా! నీకు ఆధి వ్యాధులు శరీరము నందు కలుగుటకు హేతువులను వివరించితిని. ఇప్పు డవి నశించు విధానము నభివర్ణించు చున్నాను, వినుము. 'ఆధి' అనగా మానసిక దుఃఖము. సామాన్య మనియు, సారభూత మనియు రెండు విధములు. ఆకలి దప్పికలకు మూలమైనది 'సామాన్య' మనబడును. పునర్జన్మాది మూలకమైనది 'సారభూత' మనబడును. వ్యావహారికము లగు సామాన్య ఆధులు, అనగా క్షుత్పిపాసాదులు వాంఛాసిద్ధి యగుట తోడనే నశించు చున్నవి. ఇవి నశింపగా, మనోవ్యాధులు నశించును. ఆత్మ జ్ఞానము లేక సారభూత మను ఆధి, సర్పభ్రాంతి తొలగనంత వరకు రజ్జువుగా తోచని విధమున

నశింపదు. మనోవ్యాధి వలన గాక, ఇతర కారణముల వలన కలిగిన వ్యాధులు ద్రవ్య, మంత్ర, శుభ క్రమములు, చికిత్సాది శాస్త్రోక్తాచారముల వలన నశించుచున్నవి" అనగా, శ్రీరామచంద్రుడు "మనోవ్యాధు లేల కలుగుచున్నవి ? అవి ఎట్లు నశించుచున్నవో వివరింపుము" అన, వశిష్ఠు డిట్లనెను : "శ్రీరామచంద్రా ! చిత్తము చలించినచో దేహము సంక్షోభము జెందును. అది ఎట్లనగా, బాణాఘాతము నందిన మృగము, ఎదుటనున్న మార్గమును చూడజాలక తప్పి నడచును. అట్లే సంక్షోభమువలన ప్రాణవాయువులు సామాన్య వస్తువును వీడి, మార్గ భ్రష్టమై వ్యవహరించుచుండును. రాజు తన వ్యాపార వ్యవహారములను సక్రమముగ నిర్వర్తింపకున్న, వర్ణాశ్రమ ధర్మములు అస్తవ్యస్తములైనట్లు, ప్రాణవాయు సంచారము సక్రమముగ నుండనిచో భుజింపబడిన ఆహారమునకు జీర్ణత్వమో, అతిజీర్ణత్వమో, అజీర్ణత్వమో పొందుచున్నది. ఇది యంతశ్శరీరమున నిలచి బాధించుచున్నది. అది పరిపక్వమై వ్యాధి రూపమును ధరించుచున్నది. ఈవిధముగ ఆధి వలన వ్యాధి కలుగుచున్నది. ఆధి నశించుట తోడనే వ్యాధియు నశించుచున్నది. రామచంద్రా ! మంత్రములతో వ్యాధులు నశించు విధానమును జెప్పుచున్నాను, వినుము. కరక్కాయలు మున్నగు ఓషధులు స్వభావముగ విరేచనమును కలిగించునట్లు య, ర, ల, వ మున్నగు మంత్రవర్ణములు భావనా వశమున, సహజముగ రోగ నివృత్తిని కలుగజేయును. సజ్జనుడా పవిత్రమగు భగవదర్చనాది పుణ్య కృత్యములచేతను, సజ్జనసేవ చేతను, నికషముచే కాంచనమువలె స్వభావను నిర్మలము నగును. దేహము పరిశుద్ధమైనచో మానసికానందము వృద్ధి యగును. పూర్ణ చంద్రోదయము వలన భూమండల మంతయు ప్రకాశించు విధముగ, చిత్తనైర్మల్యము వలన దేహము పరిశుద్ధ మగును. దానిచే ప్రాణవాయు ప్రసరణము సక్రమముగ నుండును. దానివలన భుక్త పదార్థములు సులభముగ జీర్ణము లగును. అందు మూలమున వ్యాధులు నశించును. ఈవిధముగ నాధి వ్యాధుల యుత్పత్తి,

నాశము గూర్చి వివరించితిని. ఇపుడు కుండలినీ విషయిక కథా యోగము జెప్పుచున్నాను.

ఆకాశగమనాది సిద్ధి కథనము: 'పుర్యష్టక'మను నామాంతరము కల జీవుని యంతఃకుండలిని ప్రాణభూతమైనదిగ తెలియుము. పూరకము నభ్యసించుట వలన ఆ కుండలినిని పూరించి, నిర్వికార ముగ నున్నచో మేరు పర్వతముతో సమానమగు స్థైర్యము, స్థూల త్వము నీ శరీరమునకు సిద్ధించును. పూరకముచే పరిపూర్ణమై, మూలాధారము మొదలు బ్రహ్మరంధ్రము వరకు దీర్ఘము గావించి పైకి ఆకర్షింపబడిన ప్రాణవాయువుకల కుండలిని, ప్రాణ నిరోధముచే కలిగిన యూష్మను, శరీర క్లమమును,మానసశ్రమమును అభ్యాసపాటవశము చేతను, అమృత ప్లావనము చేతను సహింప జేయుటకై ఊర్ధ్వభాగమును పొందింపబడును. ఆకర్షించుట వలన, దండ సమానమగు దీర్ఘము నొంది, సర్పమువలె త్వరితముగ దేహ బద్ధములు, లతా సన్నిభములు నగు నాడుల నన్నింటిని గ్రహించి యూర్ధ్వమునకు పోవును. అపు డా కుండలిని, నాడుల ద్వారా రిపూర్ణముగ గాలిచే నింపబడి, లఘుత్వమును పొందియున్న ఆప పాదతలమస్తకమగు నీ శరీరమును, నూతినుండి పైకి లాగబడు తోలుతిత్తి. తనలోని నీటితోగూడ నూర్ధ్వభాగమునకు వెడలునట్లు, యోగవిదు లభ్యాసము వలన నీ యాకాశగమన మను యోగమును దరిద్రుడింద్ర పదవి నందిన విధముగ పొందుచున్నాడు.

సిద్ధ దర్శనోపాయము: రేచకముతో నూర్ధ్వదేశమున కాక ర్షింపబడిన కుండలినీ శక్తి, సుషుమ్నానాడి యందలి ప్రాణ ప్రవాహముచే 'శీర్షము, కపాలము' అను రెండును సంధిగాగల కవాటమునకు, వెలుపల ద్వాదశాంగుళపరిమితమగు 'షోడశాంతము' అను స్థానమునందు ముహూర్తకాలము నిలుకడకలిగి యుండును. అపుడు సిద్ధ సందర్శన మగును. రామచంద్రా! యోగాభ్యాస

సంస్కారమున దూరమందున్న 'బుద్ధి'యను నేత్రముచే నిష్టసిద్ధి ప్రదాతలు, నాకాశచరులు నగు సిద్ధులు స్వప్నము నందు వలె చూడబడుచున్నారు.

## పరకాయ ప్రవేశము :

ముఖమునకు వెలుపల ద్వాదశాంగుళ పరిమితాకాశము నందు, 'రేచకము నభ్యసించుట' యను యోగ విశేషమువలన ప్రాణవాయువు చిరకాలము నిలచి, 'పరకాయ ప్రవేశ' మను యోగము సిద్ధించును" అని వశిష్ఠుడు చెప్ప విని, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను: "మహాత్మా! సూక్ష్మరంధ్రములు మున్నగు వానియందు ప్రవేశించుటకుగాని, విశాలమగు నాకాశాదుల యందు వ్యాపించుటకు గాని ఈ శరీరము అణుత్వమును, స్థూలత్వము నేల పొందుచున్నది ?" అన, వశిష్ఠు డీవిధముగ జెప్ప నారంభించెను : "చిన్మాత్రము అనున దొకటి పరిశుద్ధము, సామ్యము, సూక్ష్మము, నిర్లేపమునై నదిగా యుండును. కాని, దీనికంటె వేరగు జగత్తుగాని, జగద్గత పదార్థముగాని లేదు. ఆచిన్మాత్రము సంకల్పోన్ముఖమైన తనను తాను, అభ్యాస వశముచే వేరైన రూపమునుగ భావించి కాలుష్యమును పొంది) 'జీవు'డని చెప్పబడుచున్నది. మూఢాత్ముడగు నీ జీవుడు బాలుడు ఉద్ధతుడైన యక్షుని ధర్శించిన విధముగ నసత్యమగు శరీర సంబంధమగు సంకల్ప భ్రాంతి నందుచున్నాడు. ఇది జీవునకు స్థూల భావము. ఈవిధమగు నిశ్చయ భావముగల జ్ఞానవంతులు, ఒకవస్తువును భావించు విధానము ననుసరించి ఆభావ మేర్పడుచున్నది. ఈ భావ దార్ఢ్యము కల మూర్ఖులు కూడ విషము నమృతముగను, అమృతమును విషముగను భావించుచున్నారు. దృఢమగు భావముతో భావింపబడు వస్తువు తద్భావాను గుణముగనే చూడబడి, అనుభవింపబడు చున్నది. ఈ దేహము 'సత్యము' అను, భావముతో చూడబడి దేహమగుచున్నద. ఇదియే అసత్యమను భావముతో చూడబడి

చిదాకాశ మగుచున్నది. రామచంద్రా! యోగసిద్ధి నందిన వారలకు అణిమాది సిద్ధులు సులభముగ భావింపబడి సిద్ధించుచున్నవి. రాజభార్యయగు చూడాల దృఢాభ్యాస వశమున అణిమాది అష్టసిద్ధులను పొంది ఐశ్వర్యవంతురాలయ్యెను. ఆమె అమృత శీతలమగు గంగానదివలె నాకాశ మార్గమునకు, పాతాళమునకు, భూలోకమునకు తన ఇచ్ఛానుసారము విహరించుచుండును క్షణకాలములో భర్తృపరిష్వంగము గోరి ఆతనికి జ్ఞానమును బోధింతును గాక! అని యుపాయాంతర మాలోచించును. ప్రయత్నపూర్వకముగ తన భర్తకు జ్ఞానామృత మందించినను, అతడు దాని నాస్వాదింపజాలకపోయెకదా! ఇంతియే కాదు. విద్యాగంధములేని బాలుని విధమున నా శిఖిధ్వజుడు అతీతశక్తిగుణ సమన్వితయగు చూడాలను గుర్తింపజాలకపోయెను. శూద్రునకు యాజ్ఞిక క్రియలు చూపబడని విధముగ చూడాలయు రాజునకు తన యోగసిద్ధిని ప్రదర్శింపలేదు" అనగా, శ్రీరామచంద్రుడిట్లు ప్రశ్నించెను: "మహాతత్త్వముగల సిద్ధయోగినియగు చూడాల ప్రయత్నపూర్వకముగ ప్రబోధించినను శిఖిధ్వజుడు యోగమును తెలుసుకొనలేకపోయెగదా! ఇతరులు మాత్ర మీ మహావిద్య నెట్లు గ్రహింపగలరు?" అన, వశిష్ఠ మహర్షి యిట్లు వివరించెను: "రామచంద్రా! ఉపదేశక్రమము వ్యవస్థామాత్రపాలకమైనది. ఇక నాత్మ సాక్షాత్కారమునకైనచో పవిత్రమగు శిష్యుని బుద్ధి ప్రధాన కారణము," అన, రామచంద్రుడు, "అట్లయినచో గురూపదేశము ఆత్మజ్ఞానమునకు కారణమని లోకవ్యవహారము కలదు. అది ఎట్లో వచింపుడు" అన, వశిష్ఠుడిట్లు చెప్పెను:

కిరాటోపాఖ్యానము "శ్రీరామచంద్రా! వింధ్యాటవి యందు ధనధాన్యపరిపూర్ణుడు, మిక్కిలి లోభి. బహుకుటుంబీకుడునగు వర్తకుడొక డుండెను. ఆతడొక నాడెచ్చటికో పోవుచుండ

నాతని చేతినుండి, ఘనతృణాకీర్ణమైన చోట నొక గవ్వ జారిపడెను. దానియందుగల ఆసక్తితో నా వర్తకుడు ఆ ప్రదేశము నందంతట నొక మూడు దినములు శోధించెను. మూడవనాడు అతనికి పూర్ణేందు బింబ ప్రతిమమగు చింతామణి లభించినది. రేయింబవళ్లావర్తకు డలసట నెరుగక గవ్వకై యన్వేషింప, లోకమంత దత్యంత మూల్య మగు చింతామణి లభించినది. అట్లే గురూపదేశము వలన నాత్మ జ్ఞానము కూడ పొంద బడును. అనగా 'గురూపదేశ' మను, సోపాధికమును ధ్యానించుచుండ 'నిరుపాధికము' లభించును. చింతామణికి గవ్వకారణమైనట్లు, తత్త్వ జ్ఞానమునకు సాక్షాత్తు గురూపదేశము కారణము కాకున్నను, పరంపర యా కారణ మగు చున్నది. ఆ శిఖిధ్వజ మహారాజు తత్త్వజ్ఞానహీను డగుట వలన గాఢాంధకారమున మునిగిన పక్షివలె మోహ వివశు డయ్యెను. 'దుఃఖ' మను నగ్నిచే జ్వలింపబడుచున్న మనస్సు కలవాడైనను, సంపదలయందు, తన యభీప్సితములను నెరవేర్చు కొనుట యందు నగ్నిజ్వాలలవలె నెంత కాలమునకు సంతృప్తి నందజాలక పోయెను. ఒకప్పుడు శ్రేష్ఠములైన దానముల నాచరించి తీర్థయాత్రల నాచరించెను. కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతముల నొనర్చెను. దిగంతముల వరకు పరిభ్రమించెను. అయినను దుఃఖ మిసుమంతయు నుపశింప లేదు సరికదా, మరింత చింతాపరవశు డయ్యెను. రాజభోగములు విషతుల్యములుగ తోచెను. ఒకనాడు తన యంకతలమున నధిష్ఠించిన చూడాలను జూచి, మధుర స్నిగ్ధ వాక్కులతో నిట్లనెను : 'మానినీ! చాల కాలమురాజ్యపాలన మొనరించితిని. సకలైశ్వర్యము లనుభవించితిని. ఇప్పు డన్నింటియందును విరక్తి జనించినది. వైరాగ్య మవలంబించి వనవాసమున కేగెదను. ఈ సుఖములు గాని, దుఃఖములు గాని, ఆపదలు గాని, సంపదలు గాని వనవాసులగు మౌనులను బాధింపజాలవు కదా! దేశమును వీడితి నను మోహము

గాని, యుద్ధమున జనక్షయ మయ్యెనను విచారముగాని వనవాసుల కుండదు. వారలకు రాజ్య సుఖమున కంటె అధికమగు సుఖ ముండునని భావించు చుంటిని. ఏకాంత ప్రదేశమున మనస్సు నిర్మలముగ నుండును. ఆవిధమగు ప్రశాంతి చంద్రబింబము నందుగాని, బ్రహ్మేంద్రాది యుగములయందుగాని నుండ నేరదు కాన, నా యాలోచనమునకు నీవు ఆటంకము జెప్పవలదు. కుల కాంతలు భర్తృవాంఛితములకు స్వప్నమందు నైతము విరుద్ధముగ ప్రవర్తిపరు కదా !' అన చూడాల తన భర్తతో, 'నాథా ! ఈ వనవాసము యుక్తకాలమున నాచరించిన శోభించును గాని, ఇతరకాలములందు శోభింపదు. పుష్పములు వసంతర్తువునందే శోభించును గాని, అన్యకాలములందు శోభింపవు. శరదృతువునందు ఫలములు శోభ వహించును. వనవాసక్లేశము వృద్ధుల కనువైనది గాని నీవంటివారికి తగినది కాదు' అన శిఖిధ్వజుడు, 'నా యభిమతమునకు విరుద్ధముగ భాషించుట చాలును నేను బహుదూరమునగల నిర్జన కాననమున కేగుచుంటినని భావింపుము. నీవు మృదుగాత్రివి. కాన, నావెంట రావలదు. ఈ వనవాసము పురుషులకు కష్టతరమైనదన స్త్రీల విషయము జెప్పవలెనా ! నీ విచట రాజ్యపాలన మొనరించుచుం డుము. భర్త వానప్రస్థుడు కాగా భార్య కుటుంబ భారము వహించుటయు వ్రతమే కదా ! అనెను" అని వశిష్ఠుడు చెప్పి మరియు నిట్లనెను : "రామచంద్రా ! ఆ మహారాజు భార్య కీ విధముగ జెప్పి, స్నాన మాచరించి ఆహ్నిక కాల్యకృత్యముల నాచరించెను. రవి తన సంచారమును చాలించి అస్తాద్రిని విశ్రమించెను. రాత్రికాంత సరోజ ముకుళితస్తనియై యౌవనవతి యయ్యెను. శిఖిధ్వజుడు సాంధ్య కృత్యములను నిర్వర్తించి చూడాలతో గూడి, మైనాకుడు సముద్రగర్భమున నిద్రించు విధమున, శయ్యపై నిద్రించెను. అర్ధరాత్రి సమయమున దేశమంతయు నిశ్శబ్దముగ నుండెను. జనము గాఢనిద్రా వివశమై

యున్నది. శిఖిధ్వజు డాసమయమున మేల్కాంచి, చూడాలను వీడి వెలుపలికి వచ్చెను. తన సేవకుడగు యామరక్షకుని గాంచి, 'చోర నిగ్రహార్థమై పోవుచున్నాడ' నని చెప్పి వాని నచ్చటనే నియోగించి, తన దారిని తాను వెడలిపోయెను. 'జడ స్వరూపిణి వగు నో రాజ్యలక్ష్మి! నీకు నమస్కారము' అని పలికి తనదేశము నుండి వెడలి, మహానది సముద్రమున ప్రవేశించు విధముగ నా రాజు ఒంటరిగా భయంకరారణ్యమున ప్రవేశించెను.

ఆ వనమున పది రాత్రులు వసించి వేంటనే మరికొన్ని ప్రాంతములు, గిరులు, నదులు దాటి పయనించెను. మందరాద్రి తటమునగల జన దుర్గమారణ్యమున ప్రవేశించెను. అది జనావాస ములకు బహుదూరముగ నుండెను. ధ్వనించుచున్న కుల్యోదకములుగల నడబావులచే జుట్టుకొనబడిన వృక్షములు కలదై విరాజిలుచుండెను. శిథిలములైన తిన్నెలు నున్నగు వాటితోనుండి అది యొకనాటి బ్రాహ్మణాశ్రమముగ తోచుచుండెను అచట క్షుద్ర జంతు బాధలేదు. లతాగృహములు సిద్ధసేవితములై యుండెను. ఆ వన మందొక సమతల ప్రదేశమున (తపశ్చర్య కనుకూల ప్రదేశమున) శిఖిధ్వజుడు పర్ణశాలను నిర్మించుకొనెను. ఒక వేణు దండమును, ఫలహారమునకు యోగ్యమగు పాత్రను, అర్ఘ్యపుష్ప భాండములను, జపమాలికను, కమండలమును, శీతబాధా నివారణార్థమై కంథను కృష్ణాజినమును సమకూర్చుకొని ఆ మఠమునందు పదిలపరచుకొనెను. అతడు ప్రాతఃకాలమున ప్రథమ యామమున సంధ్యావందన పూర్వక జపము జేయును. ద్వితీయ యామమున ఫల పుష్ప సంగ్రహ మాచరించును. తృతీయ యామమున దేవతార్చనము జేయును. చతుర్థ యామమున కందమూలాదు లారగించును. ఈవిధమగు దిన చర్యతో కాలము గడపుచుండెను. అచట చూడాల, తన భర్త దూర దేశమున కేగెనని విని గాఢమమున నిద్రించు లేడివలె భయభీతయై మేల్కాంచెను. క్షణకాలము శయ్యపై గూర్చుండి ఖేదము

ననుభవించెను. 'ఎట్టి కష్టము దాపురించినది! రాజు రాజ్యమును, గృహమును వీడి వనమున కేగెను. ఇప్పుడు నే నేమి చేయవలయును? స్త్రీకి భర్తయే గతి యని విధి నిర్ణయించినది. కాన, నేనును భర్త ననుగమించుట కర్తవ్యము' అని ఆలోచించి చూడాల గృహ గవాక్షము నుండి బయలు వెడలి యంతరిక్షమున కేగెను. సిద్ధ సంఘ మామెను జూచి మరియొక చంద్రునిగ భావించెను. ఆమె తన భర్త కృపాణపాణియై వెడలు చుండుటను అంతరిక్షము నుండియే చూడగలిగెను. తన భర్తకు వనవాసము కర్తవ్యమని, అది యవశ్యము జరుగవలసి యున్నదని భావించి, తదనుకూలముగ ప్రవర్తించుటకై ఆకాశ గమనము నుండి మరలి స్వగృహమున కేతెంచెను.

కొంతకాలమునకు చూడాల మరల తన భర్తను దర్శింపవలయునని తలచెను. 'విధి ఇట్లున్నది కదా!' అని భావించి యంతఃపురమున ప్రవేశించి, ఆకాశ మండలి చంద్రకళ పగిది తన శయ్యపై శయనించెను. 'ఏదియో ప్రయోజనము నాశించి మహారాజు కాననమున కేగె' నని చెప్పి, పురజనుల నోదార్చుచుండెను. ఆమె రాజ్య భారము వహించి నిష్పక్షపాతముగ పరిపాలనము జేయుచుండ దినములు, పక్షములు, మాసములు, క్రమముగ సంవత్సరములు గతించెను. ఇట్లు పదునెనిమిది సంవత్సరములు గడచి పోయెను.

ఒకనా డా చూడాల తన భర్తను దర్శించుట కయ్యది తగిన సమయ మని యాలోచించి, మందర పర్వత ప్రాంతమునకు బోవ సంకల్పించెను. రాత్రి సమయమున తన యంతఃపురమును వీడి వచ్చి, ఆకాశము నధివశించి, వాయు మార్గమున మందర పర్వత ప్రాంతమును జేరుకొనెను. అచట వనములో ప్రవేశించి, తన యోగశక్తిచే నదృశ్యురాలయ్యెను. హారకేయూర, కటక కుండలాది ఆభరణ వివర్జితుడై, పరిశుష్కితగాత్రుడై, శ్యామల

వర్ణుడై, జర్జరత్వము కలవాడగు తన భర్తను దర్శించెను. అతని దయనీయ స్థితికి చూడాల కొంతసేపు దుఃఖించి ఇట్లు తలపోసెను: 'ఆహా! మూర్ఖత్వ మెంత దుఃఖప్రదము! సర్వశాస్త్రార్థవేత్త లగు విజ్ఞానవంతులు సైతము నజ్ఞాన వశమున ఈవిధమగు దుర్దశ నొందుచున్నారు. ఇప్పుడు నా భర్తకు తత్త్వజ్ఞాన ముపదేశింతును గాక! భోగ మోక్ష లక్ష్మీయుతు జేయుదును గాక! ఈ రూపమును వీడి మరియొక రూపము ధరించి, రాజాంతికమునకు ప్రవేశింతును. తన భార్యనని తెలియని రీతిగ ప్రవర్తించెదను. మునిబాలకుడనై క్షణకాలము తత్త్వోపదేశ మొనరింతును. ఇపు డీయన వనవాసాదులచే పరిపక్వస్థితి నంది యున్నాడు. ఈ సమయమున నిర్మలమగు నాత్మజ్ఞాన మీతని చిత్త మందు ప్రతిబింబింప గలదు' అని యాలోచించి క్షణమాత్రము ధ్యానమగ్నురాలయ్యెను. వెంటనే మునిపుత్రుని రూపను ప్రాప్తించినది. శిఖిధ్వజ మహారాజు ఎదురుగ బంగరు జన్నిదమును ధరించి, ముక్తాహారవిభూషణాద్యలంకార విరాజితుడై, శ్వేత వస్త్రము ధరించి, భూమిపై పాదము మోపక వచ్చుచున్న ముని కుమారుని దర్శించెను. వెంటనే లేచి దేవకుమారుడు వచ్చు చున్నాడని భావించి, పాదుకలను విడచి, ఎదురేగి, 'దేవపుత్రా! వందనము. ఇదిగో ఆసనము. ఇట గూర్చుండుడు' అని పలుకుచు, తన చేతులను జాచుచు నాహ్వానించెను. ఆ మునిపుత్రుడు, మహారాజునకు ప్రత్యభివాదన మొనరించి, అత దర్పించిన పుష్పాంజలిని గ్రహించి, ఆసనముపై నుపవిష్టుడయ్యెను. అపుడు శిఖిధ్వజుడు, 'దేవపుత్రా! తమ రెందుండి వచ్చుచున్నారు. మీ దర్శన భాగ్యము వలన నే డెంతయో సుదినమని భావించుచున్నాను' అని పలికి అర్ఘ్యపాద్యాదులతో నర్చించెను. మునికుమార రూపమున నున్న చూడాల 'ఉచిత మనోజ్ఞరూపములగు నీ ప్రశ్నలు నీ గొప్ప తనమును చాటుచున్నవి. చిరంజీవి వగుదువుగాక! అని ఆశీర్వదించు చున్నాను. దూరపరిత్యక్తకల్పనలు కలవాడవై, శాంతచిత్తముతో

మోక్షార్థమై తప మాచరించుచుంటివా? అట్లుగాక, సర్వసమృద్ధమైన నీ రాజ్యమును విడచి వానప్రస్థుడవై యాచరించు ఈ శాంతవ్రత మసిధారావ్రతసమము కదా' అన శిఖిధ్వజు డిట్లనెను: 'మహానుభావా! సర్వ శ్రేష్ఠమును, దేవతా చిహ్నభూతమునైన శాంతిచే, నీవు దేవుడవుగా భాసించుచున్నావు. కాన, నీకు తెలియని విషయ ముండదు. విమలేందు నిభాననా! నీ వెవ్వడవు? ఎవని పుత్రుడవు? నాయం దనుగ్రహమున నిటకే తెంచితివి. నా సందేహములను దీర్పుము' అన, మునికుమారుడు, 'మహారాజా! నీ వడిగిన ప్రశ్నములకు సమాధానములను వినుము. వినయవంతుడై యర్థించువాని నెవ్వడును తిరస్కరింపడు కదా! ఈ జగత్కోశమున పరిశుద్ధాత్ముడగు నారదు డను మునీశ్వరుడు కలడు. అతడు పుణ్యలక్ష్మికి ముఖమందలి కర్పూరతిలకమువంటివాడు. ఒకప్పు డాయన పర్వత గుహాయందు ధ్యాననిష్ఠుడై యుండెను. ఆ పర్వతచరియనుండి సమున్నత తరంగములతో గంగానది ప్రవహించుచున్నది. ధ్యానావసానమున నా నదీతీరమున నొక లీలాకలకలారావము నాలించెను. ఇది యేమై యుండునా యని నారద మహర్షికి మనమున కుతుహల మంకురించినది. అచటి కేగి పరిశీలింపగా రంభ, తిలోత్తమ మున్నగు నప్సరసస్త్రీలు పురుష వర్జిత మైన ఆ ప్రదేశమున వివస్త్రలై జలక్రీడ లాడుచుండిరి. సర్వావయవ సందర్శనమున విశ్వరూపములవలె నున్న ఒకరి కింకొకరు ప్రతిబింబములై ఆదర్శభావము నొందిన స్త్రీ బృందమును విలోకించెను. వెంటనే ఆ మహర్షి విలోకనమును విడచి మహదానందము నందెను. ప్రాణవాయువు చలింపగా సంతుష్టుడగు నా మునికి కామోద్రేకమున రేతస్ఖలన మయ్యెను' అన, శిఖిధ్వజుడు, 'అంతటి ప్రతిభావంతుడు, విశేషజ్ఞుడు, జీవన్ముక్తుడు నయిన ఆ మహర్షి మదన పారవశ్యము నందుటకు కారణమేమి?' అని ప్రశ్నించెను. అంత నా మునిపుత్రుడు 'నిర్మలమగు స్వరూపము, సత్యము, ప్రజ్ఞ కలవాడయినను, నిమిషమాత్రము ఆత్మస్వరూపమును మరచినచో వర్షాకాలమునందు మేఘము పుట్టునట్లు దృశ్యము

జనించును. చిన్మాత్ర స్వభావమైన ఆత్మస్వరూపమును నిరంతరము ననుసంధానము జేయుచు నొక్క నిముసమైన మరువకున్నచో నీ దృశ్య పిశాచము నశించును. జీవునకు సుఖ దుఃఖ లేశములు బంధములు. అవి స్ఫురింపకుండుటయే మోక్షము అని బంధ మోక్షముల గురించి నిర్ణయించిరి. 'స్వస్వరూప జ్ఞానము కంటె నభిన్నము, నిర్మలము నైన పరతత్త్వ జ్ఞానమువలన సుఖ దుఃఖాదులు లేవు' అని భావించెడి జ్ఞాని జీవన్ముక్తత్వమును పొందును. ఈ సమస్తమగు సృష్టి చిదాకాశరూపమగు బ్రహ్మస్వరూపము అను దృఢ నిర్ణయము స్థిరపడినచో జీవభావము చమురులేని దీపము వలె శమించును. ఆత్మ స్వభావ నశమున ఈ జగత్తంతయు జనించినది, వాసనచే స్థిరపడి ధర్మాధర్మవశమై యున్నది. కాన, వాసనాంశమును వీడి, ధర్మాధర్మములచే బాధింపబడకున్నచో కర్మబంధముండదు. కాన, జీవుడు జనన మొంద నేరడు' అన, శిఖిధ్వజు డిట్లనెను: 'దేవకుమారా! నీవు మిక్కిలి ఉదారము, ఆశ్చర్యకరము, ననుభవముతో గూడిన పరమార్థమును బలుకుచుంటివి. నీ జన్మ వృత్తాంత మేమో సంపూర్ణముగ వివరించితివి కావు' అనగా, నత డిట్లనెను: 'బ్రహ్మపుత్రుడగు నారద మునీంద్రుడు 'వివేక' మను కట్టు కొయ్యకు, 'బుద్ధి' అను రజ్జువుతో, 'మనస్సు' అను మదపుటేనుగును బంధించి ప్రక్కనున్న స్ఫటిక కలశమునందు తన వీర్యమును భద్రపరచెను. అందు సంకల్పజాతమైన క్షీరమును నింపెను. ఒక మాసము గడచినంత పరిపూర్ణములైన యవయవములు గలిగి. ఆ వీర్యమొక బాలునిగా మారి., పర్వత గర్భము నుండి చంద్రబింబమువలె బయలు వెడలెను. ఆ బాలుడు జన్మముతోనే సర్వసంస్కార సంపన్నుడయ్యెను. ఒకపాత్ర నుండి వేరొక పాత్రకు మార్చిన విధముగ నా బాలునకు నారద మునీంద్రుడు సకలవిద్యాధనమును సమర్పించెను. అతనిని వెంటనిడుకొని బ్రహ్మదేవునికడ కొక నాడు వెడలెను. ఆయన తన పౌత్రుని జ్ఞానపారగునిగ నొనరించెను. సజ్జనుడా! ఆ బాలుడే నేను. నాపేరు 'కుంభకు' డందురు. కుంభము

నుండి జన్మించుటవలన నా కీ నామ మన్వర్థమైనది. నాలుగు వేదములు నా సహచరులు. నన్ను పెంచిన దగుట సరస్వతి నా తల్లి. గాయత్రి యామెకు చెల్లె లగుట నాకు పినతల్లి యగును. నా యభి మతానుసార మీలోకము లందు సంచరింతును" అన శిఖిధ్వజుఁడు, 'మహాత్మా! నేను ధన్యులలో నేఁడు ధన్యతముఁడనైతివి. రాజ్య లాభాది సకల పదార్థములు సాధు సమాగమమువలె నంతశ్శీతలత గలింపలేవు. నీ అమృత నిష్యంది వచస్సుల నాలించి సంతృప్త మనస్కు డనైతిని. నీ వృత్తాంతమునంతయు వివరించితివి. నీవు దేవపుత్రుడవు. సర్వము నెరుగుదువు. అయినను, అడిగితివి కావున నా వృత్తాంత మును వివరించుచుంటిని, వినుము. నేను 'శిఖిధ్వజు'డను పేరు గల మహీపాలకుడను. సంసారభయ భీతుడనై, రాజ్యమును విడచి ఈ వనాంతరమున కేతెంచితిని. పునర్జన్మకు వెరచితిని కాన, ఈవన వాసక్రియ నాచరించుచుంటిని. అతిదుఃఖము నందుచుంటిని. అమృ తముగూడ నాకు విషతుల్య మగుచున్నది' అన, మునిపుత్రుఁడు, 'రాజా! జ్ఞానము పరమ శ్రేయస్కరమైనది దానిచే కైవల్యము సిద్ధించును. తపస్స్వాధ్యాయాది రూపములగు కర్మలు, కాలహరణ రూపములగు వినోదములకు సాధనము లగుచున్నవి. ఆత్మవేత్తలు కానివారి కివి పరమాశ్రయము లగుచున్నవి. ఇవి సంకల్ప మూల ములు కాన, సంకల్పవంతుడగు నజ్ఞానికి మాత్రము సఫలక్రియ లగును. సంకల్ప రహితుడగు జ్ఞాని కెంతమాత్రము నుపయో గింపవు. ఒక ఋతువునం దావిర్భవించిన పుష్పాదికములు మరి యొక ఋతువునందు నశించు విధమున, వాసనలు నశింపగా కర్మ ఫలములు నశించును రెల్లు పువ్వులు సహజముగ ఫలింపని పగిది, వాసనా రహితములగు క్రియలును సహజముగ జన్మాంతరమందు ఫలవంతములు కాజాలవు. 'సర్వము బ్రహ్మమయము' అని భావించుట వలన అజ్ఞానము నశించును. మరుభూమి యని యెరిగిన వానికి మరీచికా భావము కలుగదుకదా! వాసనా మాత్రమును (అనగా సంకల్ప మాత్రమును) పరిత్యజించుట వలన జరామరణ

వేణువు విధమున విషణ్ణ వాక్కులతో, 'మహారాజా! శరీర మున్నంత వరకు సుఖ దుఃఖాది అవస్థలు ప్రాప్తించుచునే యుండును. అట్టి యెడ కర్మేంద్రియ వ్యాపారములచే నిర్వికార చిత్తులై యుండువారలే సర్వజ్ఞులు. తదితరులు వంచకు లగుదురు. తత్త్వజ్ఞానములేని మూఢులు. అవివేకము వలన స్వభావ సిద్ధము లగు సుఖదుఃఖాది అవస్థల వికారమును పొందుచున్నారు. తిల బీజముండు నంతవరకు తైలమును, శరీర ముండునంతవరకు సుఖ దుఃఖము లుండునుకదా! దేహ దశను పొందనివాడు. ఖడ్గముచే నంబరమును ఖండించు చున్నాడు. దేహ దశా దుఃఖ పరిత్యాగము శ్రేష్ఠము కాదు. సమాధి నిష్ఠతో నిర్వికార చిత్తము కలిగి యుండుట శ్రేష్ఠము. జ్ఞానవంతుడు శరీర ముండునంత వరకు కర్మేంద్రియములతో పాటు సర్వావస్థల యందును సదాచారము ననుసరించి యుండవలయును. కాని, సదాచారము నుల్లంఘింప రాదు. బుద్ధీంద్రియముల నెప్పుడును, నిర్వికారతతో నుంచ వలయును. కాని, వాటిని వికారములకు లోను కానీయరాదు. బ్రహ్మాదులు సైతము శరీరావస్థలయం దనువర్తించు చున్నారు. ఇది ప్రారబ్ధ మగు కర్మ నియమ నిర్ణయము. ప్రవాహములు సముద్రము నరయుచు పరువులు తీయునట్లు అజ్ఞులు, తత్త్వజ్ఞులు మున్నగు సర్వ భూతములును, సమస్త దృశ్య పదార్థము నీ నియమ నిర్ణయము ననుసరించు చున్నది. ఈ విషయమున అజ్ఞ, తత్త్వజ్ఞ తారతామ్యము లేదు అని అందువేని జ్ఞానులు బుద్ధ్యాదుల యందు నిర్వికారత నొంది, ప్రాణ్యాది ఇంద్రియ చలన మాత్రమున దేహావసానము వరకు ప్రారబ్ధ కర్మము ననుభవించు చున్నారు. ఇక అజ్ఞానులు సర్వేంద్రియ సంక్షోభము నందినవారై, సవికార చిత్తులై సుఖ దుఃఖ దశోపహతులై మెలగుచున్నారు' అనెను. ఆ పలుకుల నాలించిన శిఖిధ్వజుడు, 'మహానుభావా! నీవు దేవుడవుకదా! ఈ విధమగు నుద్వేగము నందుచుంటివేమి?' అన కుంభు డిట్లనెను: 'రాజా! స్వర్గమున జరిగిన విషయము నంతయు నీ కిప్పుడు వివరింతును.

వర్జితు డగును. పునర్జన్మ రహితమగు మోక్షమును పొందును. జ్ఞాన మనగా వాసనా రహితమగు మనస్సు. తద్వ్యతిరిక్తమైనది అజ్ఞాన యుతము. జీవుడు జ్ఞానము చేత జ్ఞేయమును పొంది మరల జన్మింపడు. 'జ్ఞానము శ్రేష్ఠమైనది' అని బ్రహ్మవిదులు వక్కాణించిరి. సంసార తారణమునకు జ్ఞానము ప్రధానము కాన, నీ వేల అజ్ఞానవంతుడవై దుఃఖముల నేల ననుభవింతువు? 'నేనెవడను? ఈ సృష్టి ఎట్లు జరిగినది? ఇది ఎటుల నశించుచున్నది?' అని విచారణము జేయక అజ్ఞానివలె చరించెదవేని,' ఈ బంధమేమి?' 'ఈ మోక్షమేమి'? అని వితర్కించుకొనకుంటివేని, బ్రహ్మవేత్తల పాదారవిందములను సేవింపకుంటివేని నీ మోహము నశింపదు. సమదృష్టిగల సాధువులను ప్రశ్నించుట వలనను, సేవించుట చేతను, సాంగత్యము మూలముననుమోక్షోపాయము కరతలామలక మగును' అని మునికుమారుని రూపమున నున్న చూడాల వివరించె" నని వశిష్ఠుడు చెప్పి మరియు నిట్లనెను: "శ్రీరామచంద్రా! ఆ శిఖిధ్వజ మహారాజు దేవ స్వరూపిణియు మనోహరాకారిణియు నగు చూడాలచే బోధితుడై, అశ్రుపూర్ణాక్షుడై 'మునికుమారా! చిరకాలమునకు నిపు డీ విధముగ నీచే బోధింపబడితిని. సజ్జన సాంగత్యమును మూర్ఖత్వము వలన వీడి, ఈ వనవాసక్లేశ మనుభవించు చుంటిని. ఈ స్థితిలో నీవు జ్ఞాన ప్రబోధ మొనరించుట వలన నా పాపము నిశ్శేషముగ నంతరించిన దని భావించు చున్నాను. నీవు గురుడవు, నేను శిష్యుడను, స్నేహితుడవు, తండ్రివి. నీకు పాదాభివందన మాచరించు చున్నాను. నన్ను దయతో ననుగ్రహింపుము. శ్రేష్ఠుడ వగు నీవు శ్రేష్ఠ మని తలచిన దానిని, సర్వదుఃఖములను నశింపజేసి సుఖములను ప్రసాదించు బ్రహ్మ పదార్థమును గూర్చి యుపదేశింపుము. అందుచే నే నుద్ధరింపబడుదును' అనెను. అపు డా మునికుమారుడు, 'రాజర్షీ! నా మాటలు నీ కాదరపాత్రము లయ్యెనేని చెప్పుచున్నాను, వినుము. అట్లుగాక, అనాదరింతువేని,

విఫలము లగును. విలాసముగ నడిగి యాదరింపని వాక్యము, అంధకారము నందు నేత్రమువలె నిష్ప్రయోజనము' అన, శిఖిధ్వజ మహారాజు, 'దేవపుత్రా! నీ వాక్యమును వేద వాక్యమువలె నాదరింతును. ఇది యథార్థ మని విశ్వసింపుము' అనెను. అంత నా కుమారా మునికుమారుడు, 'బాలుడు పితృ వాక్యము ననాలోచితముగ నాదరించు విధముగ నీవు కూడ నా వాక్యమును గూర్చి హేతువాద మొనరింపక సమాదరింపుము. ముందుగ మహదాశ్చర్య సంభరితమగు నొక వృత్తాంతమును చెప్పుచున్నాను, వినుము. అనంతరము ప్రస్తుతాంశమును నిరూపింతును.

<u>చింతామణ్యుపాఖ్యానము</u>: పూర్వ మొక దేశమున సర్వ సద్గుణసంపన్నుడు, శ్రీమంతుడు. సర్వశాస్త్రార్థకోవిదుడు నైన మహానుభావు డొకడు కలడు. అతడు బ్రహ్మపదమును మాత్ర మెరుగడు. సముద్రమును శోషింప జేయుటకు సర్వవిధముల బడ బాగ్నికై యత్నించు విధమున, నాతడు సర్వార్థ సాధకమగు చింతామణిని సాధించుటకు యత్నించెను. కొంతకాలమున కాతని యత్నము సఫల మయ్యెను. యత్నవంతులకు సాధింపరానిది యుండదు కదా! మేరుశిఖరమునం దుదయించు చంద్ర సమాన ముగ ప్రకాశించుచున్న చింతామణిని పొందియు, అది చింతామణి అను నిశ్చయ బుద్ధిలేక అప్రయత్నముగ లభించిన రాజ్యమును గూర్చి విచారించెడి దరిద్రుని విధమున నాత డిట్లు తలపోసెను: 'ఇది మణియగునా! కాదు. మణియే యగుచో నావంటి వానికి లభింపదు. దీనిని పరీక్షార్థమై స్పృశింతుగాక! వలదు అట్లు స్పృశింపరాదు. నిర్భా గ్యుడనగు నా కరస్పర్శచే నది మాయ మగును. ఇది చింతామణియే యగుచో నింత యనాయాసముగ, స్వల్పకాలముననే లభించునా! జీవితాంతము యత్నించినగాని ఇది సిద్ధింపదని శాస్త్రములు ఘోషించుచున్నవికదా! దీనుడనైన నేను దృష్టి దోషముచే

నిరుపురు చంద్రు లను భ్రాంతివశుడై దర్శించు రీతి నీ రత్నమును గాంచుచున్నాను కాని, యథార్థమున కిది చింతామణి కాదు, ఆ మహోత్తర మణిని పొందగల యదృష్టము నాకు లేదు. అట్టి యదృష్టము కొలదిమందికి మాత్రమే యుండును. నేను సాధారణ మనుష్యమాత్రుడను. నిర్భాగ్యుడను. నా కిట్టి సిద్ధు లేల సమకూరును ' అని సంకల్ప వికల్పాత్మక బుద్ధితో వితర్కించి యా మూఢుడు, అవివేక మోహితుడై ఆ మణిని గ్రహింపలేదు. అత డిట్లు ఆలోచనాతరంగిత మనస్కుడై యుండగా నా మణి యంబరతలమున కెగసి పోయెను. లక్ష్యములేని విలుకానిని బాణములు, నల్లెతాడు విడచునట్లు, సిద్ధులు సైత మా లక్ష్యము లేనివానిని పరిత్యజింతురు కదా !

ఆ పురుషుడు మరల చింతామణి సంపాదనార్థము యత్నించు చుండెను. దృఢనిశ్చయులు తమ కార్యములను సాధించుకొను పర్యంతము నిరుత్సాహము నందురుకదా ! కొంత కాలమునకు సిద్ధు లాతనిని మోసగింప దలచి, ఎదురుగ నొక గాజుమణి కనుపడు నట్లు జేసిరి. దాని నా పురుషుడు చూచి చింతామణియని భ్రాంతి జెందెను. ఆహా ! మూఢుడు మోహావశమున మృత్తును సువర్ణ ముగ భావించుచున్నాడుకదా ! ఆత డా మణిని గ్రహించి, తన వాంఛితముల నన్నిటిని పొందగలనని యాశించెను. పూర్వసంపదల నన్నిటిని విడచిపెట్టెను. తాను వసించు దేశము సౌఖ్యావహమైనది కాదనియు, పాపాత్ములచే నావరింపబడిన దనియు తలచి దానిని గూడ పరిత్యజించెను. దూరదేశమునకు బోయి సౌఖ్యము లనుభ వింప దలచెను. మణి ప్రభావమున ననంత సంపదలు పడయ నెంచి యొక యరణ్యమున కేగెను. అచట గాజుమణి వలన తన వాంఛి తము లీడేరక మహాదాపదల ననుభవించెను' అని మునికుమారుడు వచించెను.

<u>గజోపాఖ్యానము</u>: అనంతర మా మునికుమారుడు, శిఖిధ్వజునితో నీ విధముగ జెప్పెను: 'మహారాజా! మనోహరమైన మరియొక కథ చెప్పుచున్నాను, వినుము. వింధ్యాటవియం దొక గజరాజు కలదు. అది ఎముకల కంటెను, వజ్రము కంటెను మిగుల కఠినమైనవియు, దీర్ఘములు నైన రెండు దంతములు కలిగియుండెను. మావటివా డొకడు దానిని పట్టుకొని లోహశృంఖలాబద్ధ మొనరించెను. తనను బంధించి నందున 'పరాధీనత నొందితినికదా!' అని దుఃఖించి, కడకు తన దంతములను ప్రయోగించి యొక్క క్షణములో బంధనములను త్రెంచుకొనెను. బంధనముల నుండి విడువడి పలాయన మొనరించుచున్న మహాగజమును పట్టుకొని మరల బంధింప దలచి ఆ మావటీడు దాని వెంట నంటెను. మార్గమధ్యమున నొక తాళవృక్షము నధిరోహించి, గజేంద్రుని కుంభస్థలమున దుముక దలచెను, కాని లక్ష్యము తప్పి, దాని కెదురుగ, పాదముల కడ పడెను. అతని దయనీయ స్థితిని జూచి యా గజరాజు కరుణించి తన దారిని పోయెను. తిర్యగ్జంతువులకు సైత ముదార గుణము లుండుట సహజము. క్రిందపడి తన పాదముల చెంతబడియున్న సామాన్యమానవుని మర్దించుటయు పౌరుషమేనా అని భావించి. గజేంద్రము వానిని విడచి కరుణార్ద్ర హృదయముతో మరియొక వనమున కేగెను. మావటివాడు తన యత్నము విఫలమైనందున, మరియొక యుపాయాంతరమున నా గజమును బట్ట దలచెను. ఒకనాడు వేరొక వనమున దాని జాడ నెరిగి, యొక పెద్ద గొయ్యి త్రవ్వించి, దానిపై నాకు లలములు కప్పించి మాటు పెట్టి యుంచెను. కొన్నిదినముల తరువాత, నా మదపుటేనుగు స్వేచ్ఛా విహారములు సల్పుచు, విధివశమున శుష్క సాగరమున పర్వతము కూలిన విధమున నా గోతిలో బడెను. వెంటనే మావటివాడు మరల దానిని బంధించెను. పాతాళమున కణగద్రొక్కబడిన బలిచక్రవర్తివలె నా గజరాజు మహాదుఃఖము ననుభవించెను. ఆనాడు తన పాదముల క్రింద బడినప్పుడు నిర్దయ భావముతో

నా మావటివానిని మర్దించి యున్నచో, నీనాడు ఈ గజరాజున కిట్టి నుహాపద సంభవించి యుండెడిది కాదుకదా! మానవుడు మూర్ఖత్వము వలన రాబోవు దుఃఖమును, వర్తమాన కార్య కలాపములతో నివారించుకొనక పోయినచో వింధ్య మహాగజము వలె ఆపదలపాలు గావలసి యుండును' అని చెప్పెను.

<u>చింతామణ్యుపాఖ్యాన వివరణము</u> : 'దేవపుత్రా! ఈ చింతామణ్యుపాఖ్యానమును, వింధ్యగజోపాఖ్యానమును వింటిని. కాని, వాని అంతరార్థములు నాకు వివరింపుము' అని శిఖిధ్వజు డర్థింప, మునిపుత్రు డిట్లు వివరించెను: 'మహారాజా! వెనుక చింతామణి వృత్తాంతమున వర్ణింపబడిన శాస్త్రార్థ కుశలుడు, తత్త్వ జ్ఞానాభిజ్ఞుడు, చింతామణి సాధకుడు నీవే యగుదువు. నీవు శాస్త్ర ముల నన్నిటిని నధ్యయన మొనరించితివి. కాని, తత్త్వజ్ఞానమును మాత్ర మెరుగవైతివి. స్వరదుఃఖ వినాశకరమగు సర్వసంగపరిత్యా గమే చింతామణి. దానిని నీవు సాధింప యత్నించి దారా, ధన, బాంధవ యుక్తమగు రాజ్యమును పరిత్యజించి స్వస్థలమున కతి దూరమున గల నాశ్రమమున కరుదెంచితివి. సర్వసంగ పరిత్యాగ విషయమున నీ కహంకారము కలదు, అందువలన ఆ త్యాగము పరిపూర్ణము కాలేదు. ఆకాశమున మేఘము లావరించినట్లు, త్యాగముగూర్చి నీ హృదయమున వికల్పము లావరించినవి, అది పరిత్యాగము కాదు. ఇది చిరకాల సాధ్యమైనది. చిత్త మున వికల్పములు వృద్ధిజెందుటచే, వనవృక్షము నుండి పక్షి ఎగిరి పోయినట్లు, త్యాగము నిన్ను పరిత్యజించినది. 'సర్వసంగ పరి త్యాగ'మను చింతామణి యదృశ్యము కాగా, ప్రస్తుతము సంకల్ప దృష్టికలవాడవై 'తపస్సు' అను గాజుమణిని ఆశ్రయించితివి. సులభ సాధ్యము, అమితానందప్రదమునైన వస్తువునువిడచి, దుస్సాధ్యము, స్వల్పానందప్రదమగు దానిని గ్రహించి పరిహాసాస్పదుడవైతివి. చింతామణిని పొందితినని తలంచుచుంటివి. కాని, స్ఫటికమణి

శకలమును గూడ పొందజాలవైతివి. ఈ విషయమును నీవు భావించుట లేదు.

గజరాజ వృత్తాంత వివరణము : అనంతర మా ముని కుమారుడు శిఖిధ్వజునితో నిట్లు చెప్ప నారంభించెను: 'మహారాజా! మనోహరమగు మరియొక వివరణమును జెప్పుచున్నాను, వినుము. వింధ్యాటవియందు విహరించుచున్న గజరాజు కూడ నీవే యగుదువు. 'వైరాగ్యము', 'వివేకము' ననునవి ఆ యేనుగునకు గల ధవళ దంతములు. దుఃఖప్రదమగు నీలోని యజ్ఞానము, ఆ గజమును పట్టనుద్యుక్తుడయిన మావటివాడగును. మిక్కిలి శక్తివంతమైన మహాగజము, శక్తిహీనుడైన మావటివాని వలన భయ దుఃఖము లను అనుభవించిన విధముగ శక్తిమంతుడవయ్యు, శక్తిలేని యజ్ఞానమునకు వశ్యుడవై, అధిక దుఃఖమును, భయము నందుచున్నావు లోహ శృంఖలచే గజమును బంధించుట యనగా, 'ఆశ'యను పాశముచే నీవు బంధితుడవైతి వని భావము. ఈ ఆశ లోహ రజ్జువు కంటె దృఢమైనది. లోహము కాలక్రమమున బలహీన మగును. కాని యాశ వృద్ధి యగును. ఏనుగు తనను బంధించిన గొలుసును భంజించుట యన నీవు భోగములను, భూమిని, నిష్కంటకమగు రాజ్యమును విడచుట యని తలంపుము. మావటివాడు తాళవృక్షము నుండి క్రిందికి దుముకుట యన రాజ్యపరిత్యాగముచే నీ యజ్ఞానము పతన మయ్యెను. విరక్తుడైన పురుషుడు భోగవాంఛను విడువగా, వృక్షము నాశ్రయించిన పిశాచము, ఆ వృక్ష చ్ఛేదన సమయమున కంపించు విధముగ నజ్ఞానము వణకుచున్నది. నిశ్చయముగ భోగములను పరిత్యజించినచో నజ్ఞానము నశించును. వివేకవంతుడగు పురుషుడు భోగములను విడచిన యెడల వాని నాశ్రయించిన అజ్ఞాన పిశాచము పలాయనమగు నని చెప్పితిని కదా! అట్లే నీ వీ వనమున కేతెంచుట తోడనే అజ్ఞానము తొలగి పోవును. దానిని 'సర్వపరిత్యాగ' మను ఖడ్గముతో ఖండింపవైతివి. అందువలన

నా యజ్ఞానము మరల లేచి 'తపస్సు' అను నీ గర్తమున పడద్రోసి నది. రాజ్య పరిత్యాగము నొనర్చి నపుడే అజ్ఞానమును రూపుమాపి యున్నచో నది నిన్ను బాధింప కుండెడిది. కాని. అట్లు చేయవైతివి. ఏనుగునకై మావటివాడు గోయితీయుట యన, నజ్ఞానము నీకు దుఃఖమును కలిగించెనని భావింపుము. మావటివాడు గర్తమును త్రవ్వుట కుపయోగించిన సామగ్రి విచారము, అనాదరము, చింత, అంతరంగైశ్వర్యము లగుచున్నవి, ఆ గర్తముపై కప్పబడిన ఆకు లలములు తపో దుఃఖము లని భావింపుము. దుఃఖప్రదమగు తప మను గర్తమున, పాతాళమున బద్ధుడైన బలిచక్రవర్తివలె నుంటివి.

కుంభోపాఖ్యానము : 'మహారాజా ! శ్లాఘనీయ, పరిపూర్ణ తత్త్వజ్ఞానసంపన్నయు నగు చూడాల నీకు ప్రబోధించిన జ్ఞానము నేల యంగీకరింపనైతివి ? ఆమె తత్త్వజ్ఞులలో ముఖ్యురాలు. ఆమె వచించునది, ఆలోచించునది, ఆచరించునదియు శాస్త్రసమ్మతము కాన అచరణీయము. ఆమె చెప్పినట్లు లాచరింపకున్నను, నీవు సర్వత్యాగమును పరిపూర్ణముగ నేల చేయజాలవైతివి ?' అని ప్రశ్నించెను. అపుడు శిఖధ్వజుడు, 'మునిపుత్రా ! రాజ్యమును విడచితిని. గృహము వీడితిని. దేశమును త్యాగ మొనరించితిని, భార్యను పరిత్యజించితిని. పుత్రులను త్యజించితిని. ఇంక సర్వ త్యాగము జేయకుండుట యేమి ?' అన కుంభు డిట్లనెను : 'రాజా ! ధనము, భార్య, గృహము, రాజ్యము, భూమి, ఛత్రము, బాంధవులు మున్నగువాటికిని, నీకును సంబంధ మేమియు లేదు. వీటిని పరిత్యజించుట సర్వత్యాగమెట్లగును ? వీటి కన్నిటికంటె శ్రేష్ఠమగు రాగము పరిత్యజింప బడలేదు. అది నీలో నిండి యున్నది. దానిని వీడినచో నిశ్శేషముగ శోకరాహిత్యము నందగలవు' అన, శిఖధ్వజుడు, 'దేవపుత్రా ! రాజ్యము నాది కాకపోయినచో నీ వన మైన నాదియగును కదా! అపుడు శైల వృక్షాదులను, వనమును వీడు చున్నాను' అని నిమేష మాత్రమున భూమిని వర్షజల మడగించిన

విధమున నా వనము నందలి యాసక్తిని విడచెను. తదనంతరము, 'మునికుమారా! వృక్షములు, పర్వతములు గల నీ మహారణ్యము నందలి వాసనను పరిత్యజించితిని. ఇపుడు నాకు సర్వత్యాగము సిద్ధించెనా?' అనెను. కుంభుడు, 'మహారాజా! ఈ పర్వతములు, వనములు, జలములు, వృక్షములు మున్నగునవి యేవియు నీవి కావు. వీని నన్నిటిని మించిన రాగము నీలో కలదు. దానిని వీడుము. ఈ వనమును విడుచుట వలన సర్వత్యాగము సిద్ధింపదు' అనెను. అపుడు శిఖిధ్వజుడు 'ఇవి యేవియు నావి కాకున్నచో, నీ యాశ్రమమైనను నాది యగునుకదా! దీనిని విడచుచున్నాను' అనెను. కుంభుడు, 'మహారాజా! ఈ ఆశ్రమము కూడ నీది కాదు. దీనిని విడచి నందువ సర్వత్యాగ మెట్లగును? నీలో నున్న రాగమును వీడుము. అపుడు దుఃఖరాహిత్యము నంద గలవు' అనెను. అంత శిఖిధ్వజుడు, 'మునివర్యా! ఇవి యేవియు నావి కానిచో నీ భోజన పాత్ర, కృష్ణాజనము, కుడ్య కుటీరాదులు నావియే కదా! వాటిని వీడు చున్నాను' అని పలికి జపమాలిక, కృష్ణాజనము మున్నగు వాటిని త్యాగోద్దేశముతో నొకచోట జేర్చి దహించెను. అవి దగ్ధ మగు చుండ సంతుష్టాంతరంగు డయ్యెను. 'దేవపుత్రా! చాలకాలము నుండి నీచే ప్రబోధితుడనై, వాసనా రహితుడనై, సర్వత్యాగము నంది, కేవలుడనై శుద్ధుడను, సుఖవంతుడను, జ్ఞానవంతుడనై యుంటిని. చిత్తము గృహ భాండాది వస్తు సంకల్పము కలిగి బంధ యుక్తమై దుఃఖము నందుచుండును. వాటిని విడచుట వలన పరమానందము కలుగును. నేను శాంతిని, సుఖమును, జయము నందితిని. నా బంధము లన్నియు తొలగి పోయినవి. నాకు సర్వ త్యాగము లభించినది. కట్టిన పుట్టమును సైతము విసర్జించి, దిగంబరుడనై, దేహాభిమానము కూడ విడచి యున్నాను' అనగా కుంభుడు, 'రాజా! నీవు ఇన్నింటిని వీడినను, సర్వత్యాగము జేసినవాడవు కావు. సర్వత్యాగము వలన లభించు పరమానందము నందు మిథ్యాభిమానము నటింపకుము' అని పలుక శిఖిధ్వజుడు

కొంచె మాలోచించి యిట్లనెను : ' దేవకుమారా ! నేను సర్వమును విడచితిని. కాని ఇంద్రియ సర్పములతో గూడినదియు, రక్త మాంస వికారరూపమైనదియు నగు నీ దేహము తప్ప మరేదియు విడువదగినది కన్పించుట లేదు. కాన, నే నిప్పుడు లేచి ఈ శరీరమును భృగు పతనాది కృత్యములచే నశింప జేసి సర్వ త్యాగ ఫలము నందుదును గాక !' అని పలికి, ఎదురుగనున్న బిలమున తన శరీరమును పరిత్యజించుటకు వేగముగ లేవ బోవ కుంభు డిట్లనెను : 'మహారాజా ! జ్ఞానము లేని పశువు రోషమును జెంది తన బిడ్డను హింసించును. అట్లే నిరాపధి యగు నీ దేహము నేల నీ మహావట బిలమున పాతము జేయ జూతువు ? ఈ శరీర త్యాగ మొనరించినను సర్వత్యాగము నీకు లభింపదు. జన్మ కర్మల మూలమున నీ దేహము క్షోభ నందుటకు కారణమైన వస్తువును పరిత్యజింపుము. అపుడు నీకు సర్వత్యాగము సిద్ధించును ' అన శిఖిధ్వజు డిట్లనెను : 'మునినందనా ! ఈ దేహము దేనిచే చలించు చున్నది ? జన్మ కర్మలకు మూలమగున దేది ? సర్వత్యాగము కలుగుటకు దేనిని పరిత్యజింప వలయును ? ఈ విషయములను వివర ముగ ప్రబోధింపుము' అన, కుంభు డిట్లు వివరించెను : 'సజ్జ వర్యా! సర్వగతమగు నాకారము, 'జీవుడు, ప్రాణము' నను నామములు కలిగి; జడము కాని, చిత్తు కాని కానిది యగు చిత్తమే ఈ జగము. ఆ చిత్తమే బంధ హేతువు. దానిని పరిత్యజించుటచే సర్వత్యాగము సిద్ధించును. జన్మ కర్మలకు బీజము చిత్త మగుచున్నది. వాయువు వృక్షమును కదలించునట్లు దేహమును చిత్తము చలింప జేయు చున్నది. ఈ చిత్త త్యాగమున సర్వ త్యాగము సిద్ధించును. చిత్త పరిత్యాగము వలన ద్వైతభావము లయ మగును. నిరతిశయమును, శాంతము, పరిశుద్ధము, నేకము నగు నాత్మ వస్తువు మాత్ర మప్పుడు మిగులును. సర్వత్యాగము పరమానంద స్వరూపము. తద్వ్యతిరిక్త మైనది దుఃఖ స్వరూపము. ఈ విషయము నెరిగి నీ యిచ్ఛ వచ్చిన

రీతి నాచరింపుము. సర్వత్యాగ మొనరించి ప్రశాంతుడ వగుము. స్వస్థుడ వగుము. ఆకాశ తుల్యుడ వగుము. సౌమ్యుడవు నగుము. ఏ రూపమున నుందువో ఆ రూపము నందుము' అని వివరింప శిఖిధ్వజు డిట్లనెను : 'మునికుమారా! ముందుగ నాకు చిత్త స్వరూపమును వివరింపుము. అనంతరము దానిని పరిత్యజించుటకు ఉపాయమును బోధింపుము' అని అర్థించెను. అప్పు డా కుంభుడు, 'రాజా! చిత్త స్వరూపమును వాసనగా నెరుంగుము. చిత్తశబ్దము, వాసన యను నది పర్యాయ పదములు. అహంకారము సమస్తమగు సంసార రూపమగు ననర్థమునకు మూల కారణము. 'అహంకారము' అను బీజము వలన అనుభవాత్మకము, నిశ్చయ రూపము, నిరాకారము నగు నొక యంకురము 'చిత్త'మను వృక్షమునకు ప్రథమ స్వరూపము. అది 'బుద్ధి' యనబడును. ఈ బుద్ధి యను నంకురమునకు సంకల్ప రూపమగు స్థూల స్వరూపము 'చిత్త' మగును. ఇది చేతస్సు, మనస్సు నని కూడ ననబడును. ఈ చిత్త మను విషవృక్షమునకు 'కామ, సంకల్ప, విచికిత్సాది రూప, వాసనలు' అను శాఖలు కలవు. వానిని నిరంతరము ఛేదించుచు, నా వృక్షమునకు మూలమగు నహంకారమును ఛేదించు విషయమున నతిశ్రద్ధ వహించ వలయును.

వాసనా రూపములగు చిత్తశాఖలు నానావిధములగు సుఖ దుఃఖాది ఫలముల నొసగును. ఆత్మానుసంధాన బలముతో వానిని నుపేక్షించినచో నా శాఖలు ఛేదింపబడును. అనాసక్తమనస్కుడు, మౌని, శాంతవాద విచక్షణుడు, సంప్రాప్తకారియు నగు పురుషుడు చిత్తశాఖలను ఛేదింప సమర్థు డగును. చిత్తవృక్ష శాఖలను ఛేదించుట కంటె మూలమగు నహంకారమును ఛేదించుట ఆవశ్యకము. కాన, చిత్తమూలమును ఛేదించుట కాసక్తుడవు కమ్ము. బుద్ధిమంతుడా! చిత్తమూలమును సమూలముగ ఛేదించుట వలన చిత్తరాహిత్యము అగును' అన, శిఖిధ్వజు డిట్లు ప్రశ్నించెను : 'చిత్తవృక్ష బీజమగు

నహంకారమును నాశము జేయుటకు అవలంబింప వలసిన యుపాయ మేమి ?' యన, కుంభు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను: 'మహారాజా! చిత్తవృక్షబీజ రూపమగు నహంకారమును నాశము జేయుటకు 'నే నెవ్వడను' అను నాత్మ విచారము ముఖ్యమగు నుపాయము' అనెను. మరియు నీవిధముగ నా యిద్దరువురకు సంభాషణము జరిగెను!

శిఖిధ్వజుడు: మునిపుత్రా! ఈ జగము రక్తమాంసాస్థి రూపమగు నీ శరీరముగాని, కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములుగాని, మనస్సుగాని, బుద్ధిగాని, యహంకారముగాని, జడము లగుట వలన 'నేను కాజాలను' అని స్వబుద్ధిచే ననేకపర్యాయములు తలపోసితిని. బంగారమునందు కటకత్వము విధమున, చిదాత్మయం దహంకారము భాసించుచున్నదికదా!

మునిపుత్రుడు: రాజా! ఇవి యన్నియు నీవు కానేరవు కదా! ఇక నీవెవరవో చెప్పుము?

శిఖి: ఈ పదార్థ సముదాయ మంతయు నాశయించి ప్రకాశించుచున్నదై నిర్మలము, నుత్పత్తిరహితము, చిన్మాత్రము నగు జ్ఞానస్వరూపమును నే నగుచున్నాను. చిత్తవృక్షమునకు బీజమగు అహంకారాత్మక మలము విశుద్ధ జ్ఞానరూపుడనైన నా హృదయమును నిర్హేతుకముగ నావరించినది. దీని నెన్ని మారులు విడచినను, మరల వచ్చి యావరించుచున్నది. దీనిని సంపూర్ణముగ పరిత్యజించుటకు తగిన శక్తియుక్తులు లేక మిక్కిలి పరితపించుచుంటిని.

ముని: రాజా! కారణము ననుసరించి కార్యము ఘటిల్లును. ఈ అహంభావాత్మక కార్యమునకు కారణము నాలోచించి వెంటనే చెప్పుము.

శిఖి: మునికుమారా! దోషమునకు వేదనమును కారణముగా భావించుచున్నాను. అది యుపశమించు మార్గము నుపదేశింపుము. చిత్తు చైత్యోన్ముఖత్వ మగుట వలన అహంకారము దుఃఖ

ప్రద మగుచున్నది. ఈ దుఃఖ శాంతికై చైత్యోపశమనము నను గ్రహింపుము.

ముని : రాజా ! నీవు కారణము నెరిగితివి. కాన, వేదనము నకు కారణము నెరిగింపుము. అనంతరము నేను కారణా కారణ క్రమము నెరిగింతును.

శిఖి : వస్తు సత్తాక మగుట చేత దేహాది రూపమువలన వేదన జనించుచున్నది. ఈ దేహాది రూపము మిథ్యాభాసము. వాయువు వలన కంపనము సంభవించునట్లు ఇది కలుగుచున్నది. వస్తు సత్తాక మైన యసత్తు నెరుగను, వేదనా రహితమగు చిత్త బీజము నుప దేశింపుము.

ముని : దేహ సత్తాది యున్నచో దాని యభావము వలన ఈ వేదన దేనికి నిష్ఠమగు చున్నది?

శిఖి : హస్త పాదాది సంయుక్తము, క్రియాఫల విలాసము, ఎల్లపుడు ననుభవించునది యగు నీ దేహము లేకుండుటెట్లు ?

ముని : రాజా ! ఒక కార్యమునకు కారణము లేక పోయినచో నా కార్యముగూడ లేనిదియే యగును. అది యున్నట్లు తోచుట 'భ్రాంతి' అనబడును. ఇది యంతయు భ్రమ జనితము కాని వేరుకాదు. లేనిదానిని ఉన్నదానినిగా భావించుట భ్రమ యని యెరుంగుము. రజ్జువునందు సర్పము భాసించుట భ్రాంతియే యగును కదా !

శిఖి : ఆద్యుడగు బ్రహ్మ ఈ జగత్తును సృజించెను కదా ! ఆయన ఈ సృష్టికి కారణ మేల కాకూడదు ?

ముని : సృష్ట్యాదియందు శాంతమైన బ్రహ్మము కలదు. అది నిర్వికారము, నద్వితీయము నగుటవలన దానికి కారణము కాదు.

శిఖి : అట్లయిన బ్రహ్మకు పరబ్రహ్మము కారణము కదా ! మహానుభావా ! బ్రహ్మకు కారణము లేదను విషయము నాకు బోధ పడుటలేదు.

ముని : అనంతము, అజము, అవ్యక్తము, అక్షయము, అక్షరము నగు బ్రహ్మము అద్వితీయము, అనాది, శివము, అవ్యయము నైనది. అది దేనికిని కర్తగాని, భోక్తగాని కానేరదు. కర్త లేనిది కాన నీ జగత్తు ఒకనిచే సృజింప బడలేదు. అందుచే వాస్తవమున కీ జగము శూన్యము. బ్రహ్మ చిన్మాత్రము కల్పితుడు. అతడే చిత్స్వరూపమైన వాడు. ఆ చిన్మాత్రమునుండి సృష్టి జనించినది. కాన, నిదియు చిన్మాత్రమే యగును. కర్తయు, భోక్తయు నెవ్వడును లేడు. సమస్తము శాంతము, నజము, శివము నను నిశ్చయము కలవాడు. హృదంతరమందున్న అజ్ఞానమును తొలగించుకొనుచున్నాడు. ఇది అజ్ఞానమును నశింపజేయుట కుపాయము అని పండితులు వచించిరి. అజ్ఞానము నశింపక పోయినచో జగద్భ్రాంతి తొలగిపోదు. కృశత్వమునందు వస్తువు క్రమముగ పూర్వస్థితిని వీడి నాశము పొందును. కాన, పరమాత్మ తన సంకల్పము వలన జగద్రూపుడై భాసించుచున్నాడు. ఆ పరమాత్మచేతనే తన రూపము బ్రహ్మదేవునిగ చెప్పబడుచున్నది. కాన. నీ సర్వము పరమాత్మ స్వరూపము.

శిఖి : 'భగవానుడా ! నీవు యుక్తియుక్తముగ ప్రవచించిన విషయ మంతయు నవగతమైనది. కర్త లేకుండుటచే జగమును లేదు. జగము లేనందువలన దృశ్య పదార్థమును లేదు. ఇది యిట్లుండగా, 'నేను సర్వాత్ముడ'నని, 'చిన్మాత్రుడ'నని తెలుసు కొంటిని. పరమాత్మ స్వరూపుడనైన నాకు నమస్కారము. 'చిత్తు' అనునది వేరుకాదని తెలిసినది. వేరగు పదార్థము కలదని భావించుట వలన నసత్పదార్థమే భాసించుచున్నది. ఇపుడు దృశ్యాను సంధానమును వీడి, ఆకాశగర్భమునువలె నేను ప్రశాంతి నందితిని. దేశము, దిక్కు, కాలము, క్రియ మున్నగు వాటితో గూడిన జగత్సంబంధమగు పదార్థ విభాగ దృష్టి చిరకాలమునకు గాని శాంతింప లేదు. అవ్యయమగు ప్రశాంతమైన బ్రహ్మమే కలదు'

అని శిఖిధ్వజుడు తన యనుభవమును వచించె" నని వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రున కెరిగించి మరియు నిట్లనెను : "శ్రీరామ చంద్రా! ఆ శిఖిధ్వజ మహారాజు, కుహనా మునికుమారినిచే నీవిధముగ ప్రబోధింపబడి. జ్ఞానవంతు డయ్యెను. మహామోహ సంపుటము నుండి వినిర్గతుడై ప్రకాశించెను. అనుభవ సిద్ధము లయిన కుంభ వచనములను హృదయమున సంస్మరించు కొనుచు క్షణకాలము పరిణతి నందెను. ఈవిధముగ నాత్మ పరిణతి నంది నిమీలిత నేత్రుడై, మనోవృత్తిని నిరోధించి, మౌనము నవలంబించి, శిలా తలముచే నిర్మింపబడినవాని విధమున నిశ్చలాకృతుడై యుండెను. ఇట్లొక ముహూర్త మాత్రము సమాధి నిష్ఠుడై యుండి అనంత రము నేత్రములను దెరచిన రాజును గాంచి, కుంభుని రూపమున నున్న చూడాల యిట్లనెను : 'ప్రకాశమానము, పరిశుద్ధను, నిర్వి కల్పులకు విశ్రాంతి స్థానము నగు నాత్మతత్త్వమునందు సుఖముగ విశ్రాంతి నందితివా? జ్ఞేయమును జ్ఞాత మొనరించు కొంటివా? ద్రష్టవ్యమును దర్శించితివా?' యన, శిఖిధ్వజుడు, 'మహామతీ! నీ యనుగ్రహమున మహా విభవ విభూషిత మై, అత్యున్నతమగు జీవన్ముక్త పదవిని దర్శించితిని. తత్త్వవేత్తలగు మహాత్ముల సాంగత్యము సారభూతమైన ఫలమును ప్రసాదించును. అది అపూర్వమగు నానందము వంటిది. ఎన్నిజన్మములకైనను, నాబోంట్ల కిట్టి మహామృతము లభింపదు. అట్టిది నీ సాంగత్యఫలము వలన, నీ జన్మముననే లభించినది. ఆద్యము, ననంతము నగు నీ అమృత రసాస్వాదన మింతవరకు జేయజాలనైతిని. ధన్యుడను. పోయె దను, సెలవిమ్ము' అన, కుంభుడు, 'మానసిక ప్రశాంతి లభించిన వెంటనే భోగైషణలు పరిత్యక్తము లగును. సర్వేంద్రియ గణమునకు కషాయ పాకము తొలగిపోవును. అపుడు పరిశుద్ధనుగు శ్వేతవస్త్రము నకు కుసుంభాది రసములు చక్కగా పట్టుబట్టినట్లు నిర్మములగు గురు వచనములు చిత్తమున సుస్థిరముగ కుదురు కొనును. కాల పరిపక్వమున వృక్షములనుండి ఫలములు వృన్తమును వదలి క్రింద

పడుచున్నవి కదా! అభేద, భేద దృష్టులు రెండును కలసి జ్ఞానము, చిత్తము లని చెప్పబడును. ఈ దృష్టులు లయించుట పరమాత్మ జ్ఞాన మనబడును. ఇదియే కైవల్యము.

'మహారాజా! నీ విపుడు ప్రబుద్ధుడ వైతివి. ముక్తుడవు, చిత్తవిశ్రాంతుడ వైతివి. ఇది నీకు మహోదయము. కాన, మౌనము నవలంబించి ఆత్మ నిష్ఠుడవై యుండుము' అనగా, శిఖిధ్వజు డిట్లనెను: 'దేవపుత్రా! జ్ఞానవంతునకు చిత్త విశ్రాంతి లేకున్నచో జీవన్ముక్తుడై యెట్లు విహరించు చున్నాడు?' అన, కుంభు డిట్లనెను: 'చిత్త మనగా పునర్జన్మ హేతుభూతమగు, దృఢమగు వాసన. ఇది జ్ఞానవంతున కుండదు. ఆత్మజ్ఞులగువారు కృత్యముల యందు ప్రవర్తించుటకు హేతుభూత మగు, పునర్జన్మ రాహిత్య మగు వాసన 'సత్త్వ' మనబడును. అనగా, జ్ఞాన రహితమైనది 'చిత్త' మనియు, జ్ఞాన సహితమైనది 'శుద్ధ వాసన' లేక 'సత్త్వ' మనియు చెప్పబడును. కాన, అజ్ఞానులు చిత్త నిష్ఠులు కాగా, జ్ఞానులు సత్త్వ నిష్ఠు లగుదురు, స్వర్గ, మోక్షాది ఫల ప్రదములైన సర్వమును పరిత్యజింపగా మిగిలిన వస్తువు నీవు అగుచున్నావు. పదార్థ జాతమును పరిగ్రహింపక నిశ్చల చిత్తము కలవాడవై యుండుము. అట్లగుచో సంసారము బాధింపదు. చిత్త చాంచల్యము వలన త్రిజగములకు సర్వదుఃఖములు సంభవించు చున్నవి. కనుక, నీవు సర్వదా, సర్వథా స్వరూపాను సంధానముచే చిత్త సంబంధ మగు 'బహిః ప్రచారము', 'సమాధి' అను రెండిటిని ఏకోన్ముఖము గావించి, శాశ్వతమగు బ్రహ్మైక్యమును పొంది యథేచ్ఛముగా నుండుము' అన, శిఖిధ్వజుడు, 'మునికుమారా! చిత్త సంబంధములగు స్పందా స్పందములు రెండు నెట్లు సమైక్య మగునో వివరించి నా సందేహమును దూరము జేయుము' అనెను. అంత కుంభుడు, 'రాజా! జలము మాత్రము సముద్ర మగునట్లు చిత్తము మాత్రము జగ మగుచున్నది. తరంగముల వలన శుద్ధ

జలము చలించు విధమున చిత్తవృత్తులచే చిత్తు చలించుచున్నది. చిన్మాత్రము, నిర్మలము, సత్యము నగు బ్రహ్మపదార్థమును మూర్ఖులు 'జగత్తు' అని భావించుచున్నారు. చిత్త విక్షేప మాత్రమగు నీ సృష్టి, అధిష్ఠానరూప మని భావించినంతనే లయ మగుచున్నది. ఆ విధమగు భావన లేనందువలన రజ్జువునందు సర్పము వలె భ్రాంతికలుగుచున్నది. శాస్త్రజ్ఞానము, సజ్జన సాంగత్యము, సంతతాభ్యాస యోగముల వలన క్రమముగ నుదయించు చంద్రుని పగిది చిత్తము నిర్మలమై స్వప్రకాశకమగు కైవల్యము మహాత్మలకు సహజముగ సిద్ధించును. మహారాజా! ఈ జగత్తు ఎట్లు ప్రభవించుచున్నదో, ఎట్లు లయించుచున్నదో వివరించితిని. ఈ భావమును హృదయమున పదిలపరచుకొని, అనేక యుక్తుల ననుసంధాన మొనరించుకొని, యథార్థమును నిర్ణయించుకొని, విస్వష రూపమగు జీవన్ముక్తి పదమునందు యథేచ్ఛగా సంచరింపుము. ఇపుడు నేను స్వర్గమున కేగుచున్నాను. పర్వదినములందు నారద మునీంద్రుడు బ్రహ్మలోకము నుండి అటకు రాగలడు. ఆ సమయమున, నే నచట లేకున్నచో నాగ్రహించును. శ్రేయస్కాము డెన్నడును గురువుల కాగ్రహము కలిగింపరాదు. నీవు త్యక్త సంకల్పుడవై, వాంఛా విరహితుడవై, సర్వదా వసింతువుగాక! ఈ స్థితి మిగుల పవిత్రమైనది' అనెను. వెంటనే, యత డంతర్ధానము నంద, శిఖిధ్వజుడు పరమాశ్చర్య సంభరితుడై ఇట్లు తలపోసెను: 'అహా! ఈ స్థితి మిక్కిలి శీతలమై, పరిశుద్ధమై, ప్రశాంతమై, రసాయనోద్భవ ఆకారమగు నాత్మస్వరూప సాక్షాత్కారకరమై నిర్వాసన మగుచున్నది' అని యథార్థముగ వాసనా రహితుడై, శిలాప్రతిమవలె మౌనముద్రాలంకృతుడై యుండెను. నిస్సంకల్పము, నిరాశ్రయము నగు నా మౌనమున నిశ్చల సమాధి నంది గిరిశిఖరము భాతి ప్రకాశించెను. రామచంద్రా! ఇట్లా శిఖిధ్వజుడు, నిర్వికల్ప సమాధియందు కాష్ఠకుడ్యోపమ స్థితి కలవాడై యుండెను. ఇక నా చూడాల విషయమును వివరించుచున్నాను, సావధానుడవై వినుము. తన భర్తకు

దేవపుత్రుఁడగు కుంభుని రూపమున తత్త్వజ్ఞానము నుపదేశించి, అతడు జ్ఞానవంతు డగుట తోడనే, ఆకాశ మార్గమున కేగి, విలాసముగ స్వస్వరూపము ధరించి త్రుటికాలములో నిజ నగరమున, తన యంతఃపురమున ప్రవేశించెను.

చూడాల మూడు సంవత్సరములు రాజకార్య నిర్వహణ మొనరించి, అనంతరము యోగ మవలంబించి, ఆకాశ మార్గమున పయనించి, కుంభుని రూపము ధరించి, శిఖిధ్వజ మహారాజును దర్శించెను. అతఁ డా సమయమున నిర్వికల్ప సమాధి నిష్ఠుడై యుండెను. 'ఇపు డీతనిని ప్రబోధింతు గాక !' అని తలచి వనేచరులకు సైతము భయప్రదమగు సింహనాద మొనరించెను. దానికి, శిలామౌనము వహించిన శిఖిధ్వజుడు చలింపలేదు. ఎంత ప్రయత్నించినను విచలితుడు కాలేదు. అతనిని కదలించినది, పడద్రోసినది. అయినను కనులు విప్పలేదు. అపు డిట్లు తలపోసెను : 'ఆహా ! ఈ సజ్జనుడు ఆత్మ పదమందు విశ్రాంతి నందినాడు. ఈతని శరీరమును గూడ పరీక్షించి, సత్త్వశేషమున్నచో, దాంపత్యసిద్ధికై యత్నింతుగాక ! అట్లు గానిచో నేనును స్త్రీ రూప పరిత్యాగ మొనరించి, పునర్జన్మ రాహిత్యమునకై పరమ పదము నందుదును గాక ! ఇచట నాకు మాత్ర మేమి పని యున్నది ! ' అని చూడాల తన భర్తను, సర్వ మర్మస్థాన సంస్పర్శచే పరీక్షించెను. ఆతని హృదయమున సత్త్వశేషము కలదని తెలుసుకొనెను" అని వశిష్ఠుడు చెప్ప, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను : " మునిచంద్రమా ! ప్రశాంతచిత్తుడై కాష్ఠ, లోష్ఠ సమాన స్థితియగు ధ్యాననిష్ఠ యందున్న వానికి సత్త్వ శేషము అనగా జీవిత శేషము కలదని ఎట్లు తెలియును ? " అన, వశిష్ఠుడు, " రామచంద్రా ! బీజము నందు పుష్పఫలము లుండు విధమున, జ్ఞాని హృదయమున ప్రబోధ కారణమగు దుర్లక్ష్యాను వపువు కల జీవితశేష ముండును. చిత్త చాంచల రహితుడై, పర్వతము పగిది, నిశ్చల స్థితికల వాని శరీరము

భోగా భోగములందు సమభావము కలిగి, హర్షామర్షములకు లోను కాదు. ఇపుడు నీ వడిగిన దానికి సమాధానము చెప్పితిని. ఇక ప్రకృతము ననుసరింతము. చూడాల తన భర్తృకాయమున సత్త్వ శేషము కలదని నిర్ణయించుకొని, తన దేహమును విడచెను. వెంటనే ఆద్యంత వర్జితమైన ఆ రాజన్యుని చిత్తత్వమునందు ప్రవేశించెను. నిర్వికల్ప సమాధిచే నీర క్షీర న్యాయమున నేకమై చిత్తమును పృథగ్భావ మొందించి, పక్షి ఆకసము నుండి గూటిని జేరునట్లు ఆమె తిరిగి తన శరీరమున కుంభాకృతి ధరించి, భ్రమర బృంద నిస్వనమున సామగాన మాలాపించుచు నిజపీఠము నధిష్ఠించెను. ఆ గానము నాలించిన సత్త్వగుణ సముపేతమైన రాజ దేహమున వసంతర్తువు నందలి పద్మినివలె చైతన్యము వికసించెను. అంత సూర్యుడు కమల ములను వికసింపజేయు విధమున రాజ నేత్రములు తెరచుకొనెను. ఎదురుగనున్న కుంభుని జూచి, ఆశ్చర్యచకితుడై, 'ఆహా! నేనెంతటి యదృష్టవంతుడను! మరల నీ నాడు నాకీ మునికుమార సందర్శన మైనది' అని ముదమందుచు పుష్పాంజలిని సమర్పించెను. 'మునిపుత్రా! దైవయోగమున తమ దర్శనభాగ్యము లభించినది. ఇది నన్ను పవిత్రుని జేయుటకేకదా!' అన కుంభు డిట్లనెను: 'నీ సాన్నిధ్యమును వీడినను, నా చిత్త మిచటనే నిలచుచున్నది. నాకు స్వర్గవిలాస ములు రుచించుటలేదు. కాన, నీతోడనే కలసి యుందును. నీ వంటి బంధువు ఆప్తుడు, స్నేహితుడు, విశ్వాస్యుడు, శిష్యుడు నీ జగమున నాకు లభింపడు' అన శిఖిధ్వజుడు 'ఆహా! నా చిరకాలార్జితములైన పుణ్యతరువులు ఫలించినవి. నీ వసంగుడ వయ్యును మా సాంగత్య మభిలషించుచుంటివి. తాము బోధించిన యోగ నిష్ఠ మూలమున లభించు సౌఖ్యము స్వర్గమందు గూడ లభింపదు. పరిశాశమాన మగు నీ నిష్ఠతో స్వర్గమునందుగాని, భూమియందుగాని యథేచ్ఛగా విహరింతును' అనెను. అపుడు కుంభుడు, మహారాజా! 'పరమానంద స్వరూపమగు పరమపదమున విశ్రమించుచుంటివా? ఖేద మయమగు దుఃఖమును విడచివైచితివా? ఆపాతరమ్యములగు సంకల్పములపట్ల

'నాసక్తిని వీడితివా? హేయాదేయ దశాతీతమగు నీ చిత్తము ప్రాప్తములపట్ల ఉపేక్షా భావము కలిగియున్నదా?' అన, శిఖిధ్వజుడు నీయనుగ్రహమున దృశ్యాతీత స్థితిని పొందితిని. సంసారమునకు ఆవలి యొడ్డును జేరితిని. ప్రాప్యమును పొందితిని. ఇంక నుపదేశింపవలసిన దేదియును లేదు. అన్ని విధముల సంతృప్తినందితిని. దుఃఖములన్నియు తొలగినవి. నేనిపుడు సంసార విరహితుడను. మోహభయ విరాగములుతొలగినవి. శమసమాశయ సర్వసౌమ్యత్వము సిద్ధించినది. ఇపుడు సర్వాత్మకుడను. సకల సంకల్ప విముక్తుడను. ఆకాశకోశమువలె నిర్మలుడను' అని తత్త్వజ్ఞాన సంపన్నులగు నాయిరువురు నాధ్యాత్మ కథలతో నా వనమున వసించుచు; ననేకములగు వనములను, నదులను, సరోవరములను, నికుంజములను, మృగములను దర్శించుచు; సహజీవనులు, సమస్నేహులు, సమబలులు, సమ సంతోషులునై సంచరించుచుండిరి. దేవతలను, పితృదేవతలను అర్చించిగాని భుజింపరు. గార్హ్యగార్హ్య వికల్ప వాసనలు వారి హృదయములలో లేవు. ఒకప్పుడు ధూళి దూసరిత గాత్రులై చరింతురు. మరొకప్పుడు చందనచర్చితాంగులై శోభింతురు. ఇంకొకప్పుడు భస్మాంగరాగ లిప్తులై విహరింతురు. ఈవిధముగ కొన్నిదినములు గడచినవి. సమచిత్తత్వము, సర్వోదారతలచే శిఖిధ్వజుడు కూడ కుంభుని విధముగనే ప్రకాశించుచుండెను. ఒకనాడు చూడాల శిఖిధ్వజుని యందు దేవతాకాంతి ప్రకాశించుచుండుట చూచి ఇట్లు తలపోసెను: 'ఇపుడు తన భర్త ఉదారాత్ముడు, రోగవర్జితుడు, నవయౌవనుడు. గృహములు, పుష్ప సంతతి ఇటువంటి భర్త కలిగి, వాని ననుభవింప లేని కాంత జన్మము వ్యర్థము. భర్తృకామ కాని కాంత జీవన్ముక్తురాలు కాకపోయినచో భర్తృభోగ వాంఛను భంగ మొనరించిన పాపమున కామె పతితురాలగును. ఇక జీవన్ముక్తురాలగుచో లోక సంగ్రహమును భంగ మొనరించినందుకు నిందాదులు ప్రాప్తించును. సంప్రాప్తము, ననింద్యమునగు సౌఖ్యమును విడిచిన బ్రహ్మవిదుడు ఆర్జించునది మాత్రమేమి కలదు? కాన, నాభర్త నాయందను

రాగబద్ధుడగుటకు, నా ప్రజ్ఞతో, నూతన ప్రపంచమును సృష్టింతును' అని తలచి, కుంభ వేషమును ధరించిన చూడాల, ఆడుకోయిల పుంస్కోకిలకు స్వాగత వాక్యములు పలుకు విధమున నిట్లనెను: 'రాజా! ఇది చైత్ర వసంతము. శుక్లపక్షము. ప్రతిపత్తిథి నేడు స్వర్గమున మహేంద్రుని యాస్థానమున నొక మహాసంరంభము జరుగును. అచట నేను నా పితృదేవుని కెదురుగ నుండ వలయును. నియమముల నెన్నడు జవదాటరాదుకదా ! కాన, నేను వెడలి, మరల వచ్చు వరకు నీ విచట, నూతన పుష్పసంభరితమైన వనమున విహరించుచు సుఖముగ నుండుము. దినాంత సమయమునకు నిశ్చయముగ నేను మరలి వత్తును. నీ సాంగత్య సౌఖ్యము, స్వర్గ వాసమున కంటె మిక్కిలి తుష్టికరమైనది' అని వచించి కుంభుడు, సుమనోహరమగు నందన వృక్ష సంజాత నవకుసుమ మంజరిని మిత్రునకు బహూకరించెను. 'మునికుమారా! నీవు శీఘ్రముగా రావలయును సుమా!' అని శిఖిధ్వజుడు పలుకుచుండగా శరదృతువు నందలి మేఘము విధమున చూడాల అతివేగముగా నంబరతలమున కెగసెను.

శిఖిధ్వజుడు కను మరుగగుట తోడనే సుడులులేని ప్రవాహమువలె చూడాల కుంభ రూపమును పరిహరించి నిజ రూపమును ధరించి, నిజనగరమున ప్రవేశించెను. తాను లేకుండుటవలన వ్యాకులు పాటు నందుచున్న అంతఃపుర కాంతల కానందమును జేకూర్చెను. రాజకార్యములను సత్వరముగ ముగించుకొని, మరల కుంభ రూపమును ధరించి, శిఖిధ్వజుని సమీపించెను. చిత్తమున దుఃఖము లేకపోయినను, మంచుగ్రమ్మిన చంద్రుని చందమున దుఃఖము నభినయించుచుండెను. విషాదచ్ఛాయ లలమిన ముఖచంద్రుడగు కుంభుని జూచి, శిఖిధ్వజుడు ఖిన్నచేతస్కుడై 'దేవపుత్రా! వందనములు. నీ ముఖము వివర్ణమైనది. విచారగ్రస్తుడవలె నుంటివేల? ఈ సింహాసనము నధిష్ఠింపుము. బ్రహ్మవేత్తలగు సత్పురుషులకు పద్మపత్రములకు జలము లంటని రీతి విషాద ప్రమోదము లంటవుగదా!' అనెను. అపుడు కుంభు డాసీనుడై శీర్ణ

వేణువు విధమున విషణ్ణ వాక్కులతో, 'మహారాజా! శరీర మున్నంత వరకు సుఖ దుఃఖాది అవస్థలు ప్రాప్తించుచునే యుండును. అట్టి యెడ కర్మేంద్రియ వ్యాపారములచే నిర్వికార చిత్తులై యుండువారలే సర్వజ్ఞులు. తదితరులు వంచకు లగుదురు. తత్త్వజ్ఞానములేని మూఢులు, అవివేకము వలన స్వభావ సిద్ధము లగు సుఖదుఃఖాది అవస్థల వికారమును పొందుచున్నారు. తిల బీజముండు నంతవరకు తైలమును, శరీర ముండునంతవరకు సుఖ దుఃఖము లుండునుకదా! దేహ దశను పొందనివాడు, ఖడ్గముచే నంబరమును ఖండించు చున్నాడు. దేహ దశా దుఃఖ పరిత్యాగము శ్రేష్ఠము కాదు. సమాధి నిష్ఠతో నిర్వికార చిత్తము కలిగి యుండుట శ్రేష్ఠము. జ్ఞానవంతుడు శరీర ముండునంత వరకు కర్మేంద్రియములతో పాటు సర్వావస్థల యందును సదాచారము ననుసరించి యుండవలయును. కాని, సదాచారము నుల్లంఘింప రాదు. బుద్ధీంద్రియముల నెప్పుడును, నిర్వికారతతో నుంచ వలయును. కాని, వాటిని వికారములకు లోను కానీయరాదు. బ్రహ్మాదులు సైతము శరీరావస్థలయం దనువర్తించు చున్నారు. ఇది ప్రారబ్ధ మగు కర్మ నియమ నిర్ణయము. ప్రవాహములు సముద్రము నరయుచు పరువులు తీయునట్లు అజ్ఞులు, తత్త్వజ్ఞులు మున్నగు సర్వ భూతములును, సమస్త దృశ్య పదార్థము నీ నియమ నిర్ణయము ననుసరించు చున్నది. ఈ విషయమున అజ్ఞ, తత్త్వజ్ఞ తారతామ్యము లేదు అని అందువేని జ్ఞానులు బుద్ధ్యాదుల యందు నిర్వికారత నొంది, ప్రాణ్యాది ఇంద్రియ చలన మాత్రమున దేహావసానము వరకు ప్రారబ్ధ కర్మము ననుభవించు చున్నారు. ఇక అజ్ఞానులు సర్వేంద్రియ సంక్షోభము నందినవారై, సవికార చిత్తులై సుఖ దుఃఖ దశోపహతులై తెలగుచున్నారు' అనెను. ఆ పలుకుల నాలించిన శిఖిధ్వజుడు, 'మహానుభావా! నీవు దేవుడవుకదా! ఈ విధముగ నుద్వేగము నందుచుంటివేమి?' అన కుంభు డిట్లనెను: 'రాజా! స్వర్గమున జరిగిన విషయము నంతయు నీ కిపుడు వివరింతును.

అప్పుడుగాని నీ సందియము తీరదు. స్నేహితునకు తన దుఃఖము నెరిగించు కొన్నచో హృదయభారము తీరును. నేను వెడలు నపుడు నీ కొక పుష్పమంజరి నిచ్చితిని. ఆకాశవీధిని దాటి, స్వర్గమును ప్రవేశించి, దేవేంద్ర సభయందున్న నా పితృదేవుని గూడి యుంటిని. అందరును వెడలుచుండ, నేనును పితృ నానతి గొని ఇటకు బయలు వెడలితిని. అంబరతలమున సూర్యరథాశ్వ సమాన వేగమున వాయు పథమున వచ్చుచుండ సూర్యరథ మింకొక దెసగా చనెను. ఆకాశ సాగరమున బడి వచ్చుచుండ జలపూర్ణములగు జీమూతముల మాటు నుండి ఎదురుగ వచ్చుచున్న దూర్వాసముని నిని గారవించితిని. అయనకు ప్రణతు లర్పించి, 'మహాముని! నీలాభ్ర వస్త్రధారివై నీవు అభిసారికవలె నుంటివి' అంటిని. ఈ పలుకుల నాలించిన ఆ మునివర్యుడు నన్ను రూక్ష వీక్షణములతో విలోకించి, 'నీవు స్తన కేశములు కలిగి హావ భావ వికారాత్మవగు కాంతవై రాత్రులందు విహరింతువు గాక!' అని నా పరిహాసమునకు ప్రతీకారముగ శాపమును ప్రసాదించెను. ఆ వృద్ధ బ్రాహ్మణుని వాక్యములను నాలో నేను విమర్శించుకొను నంతలో నత డంతర్హితు డయ్యెను. అందుచే చింతాక్రాంత చిత్తుడనై, చేయునదిలేక ఇచటి కదుదెంచి తిని. రాత్రి సమయములందు స్త్రీత్వమును ధరించిన నేను నిరుప ద్రవముగ నుండుటెట్లు సంభవించును? కాంతారూపము ధరించి లజ్జాపరవశనై గురుదేవాదుల సమక్షమున నెట్లు సంచరింతును?' అనెను. శిఖిధ్వజు డపుడు, 'దేవకుమారా! నీవు దుఃఖింపకుము. ఈ దేహమున కెప్పు డేది ప్రాప్తించినను ప్రాప్తింపనిమ్ము. అది ఆత్మకు సంబంధించినది మాత్రము కాదు. నీవు సమస్త విషయముల నెరిగిన వాడవు. ఇంతగా నావేదన మందెదవేల? నీవే ఇట్లయిన నిక నితరుల విషయము జెప్పనేల?' అని ఆ కుంభ శిఖిధ్వజు లన్యోన్యము నోదార్చు కొనుచుండ, కుంభునకు స్త్రీత్వమును ప్రసాదించువాని విధముగ జగద్దేవుడగు సూర్యభగవానుడు, తైల క్షయ మొందినంత క్షీణించు దీపాంకురమువలె నస్తమించెను.

కుంభ శిఖిధ్వజులు సాంధ్య కృత్యములు నిర్వర్తించుకొనిరి. ఉదయించుచున్న శశాంకునకు వందన మాచరించిరి. పొదరింటిలోచేరి యుండ కుంభుడు మెల్ల మెల్లగ స్త్రీత్వమునొందుచు మాటలు తడబడ శిఖిధ్వజునితో నిట్లనెను : 'మహారాజా! ఇపు డీ వనమధ్యమున నేను లజ్జచే పతనమగుచున్న దానివలె, చలించుచున్న దానివలె, ద్రవించుచున్న దానివలె స్త్రీత్వము నొందుచుంటిని. కేశములు వృద్ధి పొందుచున్నవి. వక్షస్థలమును ఛేదన మొనరించుకొని స్తనములు అంకురించుచున్నవి. గుల్ఫముల వరకు చీరలు నేలాడుచున్నవి. జఘన. నితంబముల భార మనుభవించుచున్నాను, ఇట్లు చూడుము' అని పలుకుచున్న కుంభుని వాలకమును గాంచి శిఖిధ్వజుడు ఖిన్న చేతస్కుడై 'సజ్జనుడా! నీవు విదిత వేద్యుడవు. నియతి గమన మెరిగిన వాడవు. అవశ్యంభావియగు నీ విషయమై ఖిన్నహృదయుడ వగుదు వేమి?' అన కుంభు డాతని కిట్లనెను: ' రాజా! నేను అను భావ్యము ననుభవింతునుగాక! స్త్రీత్వము ప్రాప్తించినందున దుఃఖించిటలేదు. నియతి నెవడు నధిగమింపలేడు కదా!' అని నిర్ణయించుకొని, వారిరువురును ఖేదమును వీడి, ఏకశయ్యాగతులై ఎట్టి మనోవికారము నొందక ఆ రాత్రి నిదురించిరి. ప్రాతఃకాలమైనంతనే యువతీత్వమును విడచి,యథాపూర్వముగ కుంభుని యాకృతి ధరించెను. ఈ విధముగ రాజపత్నియగు చూడాల పవలు కుంభుని యాకృతిగను, రాత్రి సమయమున మదవతిగను రూపము ధరించి కన్యాధర్మ మవలంబించి వనాంతము లందు విహరించుచుండెను. ఇట్లు కొన్నిదినములు గతించెను. కుంభుని రూపమున నున్న చూడాల యొకనాడు తన భర్తను గాంచి, 'రాజా! నా మాట నొకటి యాలింపుము. నేను ప్రతిదినము రాత్రివేళ నంగనా రూపము నొందు చుంటిని కదా! ఈ స్త్రీ ధర్మమును సఫల మొనర్చుటకై ఎవ్వనికైన నొక భర్తకు వివాహ సంస్కారముతో నీ శరీరమును సమర్పింప వలయును కదా! ఈ ముల్లోకములందు వెదకి జూడగా నీవే నాకు త[illegible]గా తోచుచున్నావు. కాన, నన్ను వివాహమాడి

రాత్రులందు భార్యగ గ్రహించి యనుగ్రహింపుము' అనెను. అంత శిఖిధ్వజుడు, 'మిత్రమా! ఈ కార్యాచరణమున శుభముగాని, అశుభముగాని లభింపదు. కాన, నీ యిచ్ఛ వచ్చినట్లు చేయుము' అనెను. అపుడు కుంభుడు, 'మహీపాలా! నేడు శుభదినము. శ్రావణ పూర్ణిమ. ఈనాడు చంద్రోదయ సమయమున నేను స్త్రీత్వము నందిన తోడనే వివాహ మొనరించు కొందము. అందుకు రత్నసంయుతములైన చందన చూర్ణాది సంభారములను సమకూర్పుము' అనెను. రామచంద్రా! ఆ కుంభ, శిఖిధ్వజు లిరువురు తమ వివాహమునకై కుసుమ, రత్నసంగ్రహ మొనరించుకొని, యొక కాంచన కందరమున నుండిరి. కర్మఫలము నందును. త్యాగము నందును ఇచ్ఛారహితు లగు వార లిరువురు మందాకిని కేగి స్నాన మాచరించి పరిశుద్ధులై, దేవ, పితృర్చనము లాచరించి, శుభ్రవస్త్రములు ధరించి, ఫలము లారగించి క్రమముగ వివాహ మంటపమునకు జేరుకొనిరి. ఇంతలో సూర్యభగవాను డస్తాద్రి మాటున కేగెను. వా రిరువురు సాంధ్య కృత్యములను నిర్వర్తించు కొనిరి. చంద్రోపరాగము పొడచూపి నంతనే కుంభునకు స్త్రీత్వము యథాప్రకారముగ లభించినది. ఆమె శిఖిధ్వజుని జూచి, 'నాథా! అభరణాదులతో నన్ను అలంకరింపుము. క్రమముగ నగ్నిని ప్రజ్వలింప జేయుము. నా పాణిని గ్రహింపుము. నా పేరిపుడు 'మదనిక' అని చెప్ప, నా రాజా విధముగ నాచరించెను. ఆ కుంభ, శిఖిధ్వజు లిరువురు నీ విధముగ నా మహేంద్రగిరి కందరమున వివాహ మొనరించుకొని చిత్ర విచిత్ర వనములందు సంచరించుచు, వివిధ ఫలములను భక్షించుచు, పుష్ప పల్లవములను ధరించుచు, స్వేచ్ఛా విహారములు సలుపు చుండిరి. శిఖిధ్వజుడు గాఢనిద్రాపరవశుడై యున్న సమయమున మూడు దినముల కొకమారు చూడాల నిజ నగరమున కేగి రాజ కార్యములను నిర్వహించుకొని వచ్చుచుండెను. ఈవిధముగ కొంత కాలము గతించెను.

చూడాల యొకనాడు తన మనమున నిట్లు తలపోసెను : 'ఈ మహారాజునకు భోగాసక్తి కలదో లేదో పరీక్షింతును గాక !' అని ఆ వనమున అప్సరస్త్రీ పరివృతుడైన దేవేంద్రుడు సాక్షాత్కరించునట్లు చేసెను. పరివారసమేతుడై అభ్యాగతుడైన యాతనిని మహారాజు పూజించి, 'అమరేంద్రా ! ఎంతో దూరము నుండి ప్రయాసమును గణింపక తమ రిట కరుదెంచిన కారణమును దయతో సెలవిండు' అనెను. అపు డా ఇంద్రుడు, 'మహారాజా ! నీ సద్గుణాతిశయముచే నే నాకర్షింపబడితిని. మెడకు త్రాడుగట్టి లాగబడిన పక్షులవలె మే మిచట కరుదెంచితిమి. వెంటనే నీవు మాతో స్వర్గమునకు రావలెను. అచటి వార లందరు నిన్ను దర్శింప కాంక్షించుచున్నారు. దేవతా గణము త్వద్గుణ శ్రవణాసక్తులై యుండిరి. స్వర్గమున కల్పాంత పర్యంతము జీవన్ముక్తుడవై వివిధ భోగముల ననుభవింప గలవు' అన శిఖిధ్వజుడు, 'మహేంద్రా! నీ స్వర్గము, ఆ స్వర్గ సమాచారములు నే నెరుగనివి కావు. ప్రతి స్థానమునను నాకు స్వర్గమే లభించు చున్నది. అది ఎక్కడనో లేదు. సర్వత్ర సంతుష్టి నందు చుంటిని. స్వేచ్ఛగ విహరించు చుంటిని. వాంఛా రాహిత్యము వలన సర్వత్ర నా కానందము లభించుచున్నది. కాన, ఏకత్రావస్థితిగల నీ స్వర్గమునకు వచ్చుటకు నే నంగీకరింపను. నీ ఆజ్ఞను పాటింప జాలను' అని పలుక దేవేంద్రాది దేవత లందరు 'నీకు శుభములు కలుగుగాక!' అని ఆశీర్వదించి యంతర్హితులైరి. చూడాల ఆ మాయాంశను తొలగించి ఇట్లు తలంచెను: 'దైవయోగమున నీ మహారాజు భోగాసక్తుడు కాలేదు. మహేంద్రు డంతటివాడు వచ్చి స్వర్గభోగముల ననుభవింపుము అన సమభావముతో, భ్రాంతి రహితుడై వాటిని తిరస్కరించెను. ఇపుడు రాగద్వేష ప్రధానమైన భ్రాంతి జనకమగు మరియొక దృశ్యమును సృజించి పరీక్షింతును గాక !'

<u>చూడాల జారునితో గూడుట :</u> కుంభుడు రాత్రి యగు సరికి యథాప్రకారము వనితా రూపమును ధరించెను. శిఖిధ్వజుడు నదీతీరమున సాంధ్యజప తత్పరుడై యుండెను. పుష్పమంజరీ నిబిడమై, వనదేవతాంతఃపురముగ భాసించుచున్న ఒక కల్పలతా నికుంజమున చూడాల స్వసంకల్పముతో నొక పూసెజ్జను కల్పించెను. అందొక విటునితో గూడి చూడాల గాఢాలింగన తత్పరయై భాసించుచుండెను. ఆసమయమున శిఖిధ్వజుడు సాంధ్యకృత్యములను నిర్వర్తించుకొని, భార్య నన్వేషించుచు నా పొదరింటిలో పూసెజ్జపై విటుని పరిష్వంగ సుఖమనుభవించుటను జూచెను. ఆ దృశ్య దర్శనమున నాతని మనసులో నెట్టి వికారము జనింపలేదు సరికదా, పరమానందభరితు డయ్యెను. 'మిథునమా ! మనసార స్వేచ్ఛగా, నిర్భయముగా సుఖ మనుభవింతురుగాక ! భయమున కార్యభంగ మాచరింపకుడు' అని పలికి అచటి నుండి వెడలి పోయెను. ఒక ముహూర్త కాలమునకు చూడాల కామ ప్రపంచము నుండి సురతలీలా పులికితమైన తన రూపమును నిజ భర్తకు చూపింప దలచి, ఒక హేమ శిలా తలమున నుపవిష్టుడైయున్న రాజాంతికమున కేతెంచెను. ఆమె లజ్జావనత వదన ఖిన్న, మ్లాన యగు నా మదనిక రాజును దర్శించెను. అతనిలో నేవిధమగు సంక్షోభము లేకుండుటను గమనించెను. అంతియగాక, అతడు, 'కాంతా ! విటుని యానందమున కాటంకమును కలుగజేసి ఇటు లేతెంచితివేమి ? పరస్పరానుకూలమగు స్నేహము దుర్లభము. కాన, నీ మనోహరానందప్రదానమునకై పొమ్మ్మ' అన, మదనిక, 'రాజా! అట్లేయగుగాక ! స్త్రీ స్వభావ మతి చంచలము. వీరికి కామ మష్ట గుణము లధికమని యందురుకదా! తమరు కోపింపవలదు. నే నబలను బాలను. మూఢురాలను. అపరాధినిని. క్షమింపుము సజ్జనులు క్షమాలంకారులుకదా ! ' అనెను. అంత శిఖిధ్వజుడు, 'బాలా ! ఆకాశమున వృక్షసంపద లేని విధమున నా అంతరంగమున కోపము లేదు. నీవు సాధుజన వంద్యవు. కాన, నీమాటల నంగీకరింపను' అన

చూడాల, 'ఆహా! ఎంత చిత్రము! ఈయన సమత్వమును సాధించి నాడు. భోగాశలు ఈయనను వారింప జాలవు. ఇపుడిక నా విషయము నంతయు నీయన కెఱుక పరతును' అని తలచి, తన మదనికా కృతిని పరిత్యజించి నిజ స్వరూపమున, చూడాలగ ప్రత్యక్ష మయ్యెను. శిఖిధ్వజు డామెను ఆశ్చర్య దృక్కులతో విలోకించి, 'నీవెవరవు? ఎచటి నుండి వచ్చితివి? ఎప్పటి నుండి ఇచట వసించు చుంటివి? ఇపు డిచటకు వచ్చుటకు కారణమేమి? నీ శరీరము, వ్యవహారము, స్మితానునయ విలాసాదుల చేతను నా భార్యయగు చూడాలనుగా తలచుచుంటిని' అనెను. అపు డా చూడాల, 'రాజా! నీవు భాషించినట్లు నేను చూడాలనే యగుదును. సందియము లేదు. ఇపుడు నా నిజ రూపముతో ప్రత్యక్షమైతిని. కుంభాది రూపములను ధరించి, అనేక సృష్టులను సృజించి నీకు జ్ఞాన ప్రబోధార్థమై ఈ వనాంతరమున నుంటిని. నీవు తత్త్వజ్ఞుడవైతివి ధ్యానము నవ లంబించితివేని సర్వవిషయములు మనఃఫలకమున ప్రతిబింబింవ గలవు' అని చూడాల పలికెను. శిఖిధ్వజుడు చిత్తాదులను నియమించి ధ్యాన దృష్టితో నాత్మో దంతము నంతయు నవలోకించెను. అతడు తన రాజ్యమును వీడినది మొదలు, ఇపుడు చూడాలా సందర్శన పర్యంతము జరిగిన విషయము నంతయు తిలకించి పులకితగాత్రు డయ్యెను. వెంటనే తన భార్యను, చూడాలను గాఢాలింగన మొన రించుకొని, పరమానంద సంభరితు డయ్యెను. ఆమెను తన యంక పీఠమున నధిష్ఠింపజేసి యిట్లనెను: 'చంద్రవదనా! దుస్తరమైన ఈ సంసార సాగరమును యోగ సాధనమున తరింపజేసి నన్ను ధన్యు నొనరించితివి. ఈరేడు జగములందు నీకు సాటియగు వార లెవ్వరును లేరు. అనంతము, ననాది సిద్ధము నైన నజ్ఞాన కూపము నుండి కులాంగన లుద్ధరింతురు. ఇచ్ఛారహితురాలవై సంసార సాగర పారమును జేరుకొన్న నీవు చేసిన యుపకారమునకు నే నెట్లు ప్రత్యుపకారము జేయగలుగుదును' అన, చూడాల, 'దేవా! నీవు జ్ఞానరహితమైన శుష్కక్రియా జాలమునం దాసక్తుడవై

యుంటివి. నీ స్థితిని జూచి మిగుల దుఃఖించితిని. నీవు తత్త్వజ్ఞాన సంపన్నుడ వగుటచే నా కార్యము సఫలీకృత మయ్యెను. ఇంత మాత్రమునకే నన్నభినందింపనేల? అంబరతలమున పర్వత పంక్తులు లేని విధముగ, ఇపుడు నీలో తుచ్ఛ వాంఛలు, సంకల్ప వికల్పములు లేవు' అన శిఖిధ్వజుడు, 'కాంతా! యథార్థము వచించితివి. నే నిపుడు వాంఛారహితుడను. నిరంశుడను, ఆకాశమువలె నిర్మలుడను. నిస్పృహుడను. శాంతుడను, చిన్మాత్ర నిష్ఠుడను. హర్షామర్షములు నశించినవి. 'నేను' అనువాడను గాని, 'ఇతరు' డను గాని కాను. తేజో బింబాదుల వలన కుడ్యాదుల యందు ప్రసరింపని, వృద్ధి క్షయములు లేని ఆకాశముతో సమానుడను. 'ఉన్నది' అను పదార్థమును నేనే యగుదును. నామ జాత్యాది విరహితుడను. కాన, నే నిది యని చెప్పుటకు శక్తి లేనివాడను. నీ అనుగ్రహమున సంసార సాగరమును తరించిన సర్వాతీతుడను సర్వగతుడను ఆకాశతుల్యుడను. గురువవైన నీకు నమస్కారము' అని స్తుతింప చూడాల, 'ప్రాణేశ్వరా! ఇప్పుడు అనగా, ఈ స్థితి యందు నీవు దేనిని వాంఛించు చుంటివో చెప్పుము' అనెను. 'సుందరీ! అన్నియు నాకు ఒకటిగానే యున్నవి. ఇది నా యభివాంఛితమని, ఇది ప్రతిషేధమని యెరుగను. నీకు తోచిన విధముగ నాచరింపుము స్ఫటికమణి యందలి ప్రతిబింబమువలె నీ వొనరించిన దానిని నేను నాచరింతును' అని శిఖిధ్వజుడు వచింప, చూడాల ఇట్లనెను: 'జీవన్ముక్తా! అట్లయిన నా యభిమతము నాలింపుము. అభేద జ్ఞానము వలన అజ్ఞానము నశించి, నిష్కాములమై, ఆకాశమువలె నిర్మలులమై యుంటిమి. ఆది, మధ్య, అంతముల యందు రాజులమై మెలగితిమి కాన, అజ్ఞానమును వీడి, తిరిగి రాజ్యపాలనా భారము వహించి కాలమంతయు గడపి, కాలక్రమమున విదేహకైవల్యము నొందెదము గాక! నీవు నగరమునకు రాజువై సింహాసన మధిష్ఠింపుము. నేను

నీకు పట్టమహిషినై యుండెదను. 'ఇది సుఖము, ఇది దుఃఖము' అను ద్వంద్వ భావము నశింపగా వాంఛా రహితుడవై పరమ పదము నందు సమభావ సమన్వితుడవై యుండుము' అనెను. అంత శిఖిధ్వజుడు, 'విశాలాక్షీ! నీవు సమబుద్ధితో యుక్తియుక్తముగా వచించితివి, రాజ్యపరిగ్రహణము వలనగాని, పరిత్యాగము వలనగాని కలుగు ప్రయోజనమేమి? సుఖదుఃఖ విచారములను వీడి, విగత మత్సరుడవై స్వచ్ఛస్వభావమున యథాస్థితితో నుండుము' అన చూడాల వెంటనే లేచి సప్తసాగరజల పూర్ణమై ఎదుటనున్న రత్నకలశము నందు కొని పూర్వాభిముఖుడై యున్న తన భర్తను స్వరాజ్యమునం దభిషిక్తు నొనరించెను. మహారాజు సింహాసనాధిష్ఠితుడై, తన భార్యను పట్టమహిషీ పదమున దేవీ వరముచే నభిషిక్తురాలను జేసెను. 'ప్రియురాలా! క్షణకాలమున సంకల్ప సంభవమగు మహావిభవ యుక్తమైన సైన్యమును సృజింపుము' అనెను. చూడాల భర్తృవాక్యాను సారము సమస్త భూ పరివ్యాప్తమైన సైన్యమును సృజించెను. హృష్ట, సంతుష్ట చిత్తులైన సామంతులచే పరిరక్షితంబగు మత్తేభము నధిరోహించిన ఆ చూడాలా శిఖిధ్వజులు చతురంగబల సమవేతులై మహేంద్రగిరినుండి స్వర్గ సదృశమగు నిజ నగరమునకు క్షణకాలములో విచ్చేసిరి. సామంతరాజులు సంతసించిరి ప్రజ లానంద సంభరితులైరి. చూడాలా ద్వితీయుడై శిఖిధ్వజ మహారాజు దశసహస్ర వర్షములు రాజ్యపరిపాలన మొనరించెను. అనంతరము అస్నేహ దీపము పగిది. పునర్జన్మ రాహిత్యమైన కైవల్యమును పొందెను. రామచంద్రా? శిఖిధ్వజుడు సకల భూపాల చూడామణి. ఆత డపరిమిత భోగములననుభవించి యనంతమగు బ్రహ్మపదమును సాధించెను. అటులనే నీవును ప్రకృత కార్యక్రమముల నాచరించి, భోగ మోక్షముల ననుభవించుచు దుఃఖ రహితుడవై సుఖముగ నుండు" మని వశిష్ఠుడు వచించెను.

## 10. కచోపాఖ్యానము

'పూర్వజన్మకృతమగు పాపము నశింప నందున ఆత్మజ్ఞానము దుర్లభము. అయినను ఆచార్యుని ప్రయత్నాతిశయము వలన ఆ జ్ఞానము సులభసాధ్యమగు' నని నిరూపించుటకు అనేకోపాఖ్యాన సంభరితమైన శిఖిధ్వజోపాఖ్యానము వెనుక అభివర్ణింప బడినది. ప్రస్తుతము వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు 'కచోపాఖ్యానము' నీ విధముగ జెప్ప నారంభించెను: "రామచంద్రా! శిఖిధ్వజుని చరిత్రము నభివర్ణించితిని. ఈ మార్గావలంబివై చరింతువేని, నీ ఖేద మంత రించును. శిఖిధ్వజుడు తత్త్వజ్ఞాన సంపన్నుడు అయినట్లే, ఒకప్పుడు బృహస్పతి పుత్రుడగు కచుడు జ్ఞానవంతు డయ్యెను" అన, శ్రీరామ చంద్రుడు, "కచుడు జ్ఞానము నార్జించిన విధమును వివరింపుము" అని అభ్యర్థించెను. అంత వశిష్ఠ మహర్షి ఈవిధముగ వివరించెను :

"బాల్యావస్థ నతిక్రమించి సంసారోత్తరణోన్ముఖుడైన కచుడు పద, పదార్థజ్ఞాన సంపన్నుడైన బృహస్పతి నిట్లు ప్రశ్నించెను: 'ధర్మజ్ఞుడవైన మహానుభావా! ఈ సృష్టి పంజరము నుండి జీవతంతువు గల జంతువు అనగా, జీవి ఎట్లు తప్పించుకొనగలదో వివరింపుము' అన, బృహస్పతి, యిట్లు వివరించెను: 'కుమారా! ఈ సంసారము 'అనర్థము'లను మకరములకు నిలయము. సర్వత్యాగముచే ననాయాస ముగ నీ మహాసముద్రమును తరింప వచ్చును' అని చెప్పెను. అపుడు కచుడు పరమపావనమైన గురుదేవుని వాక్యము నాలించి, సర్వమును పరిత్యజించి ఏకాంత కాననమున కేగెను. అది బృహస్పతికి విచార కరము కాలేదు. సంయోగ, వియోగముల యందు మహాత్ములు సంక్షోభము నందరుకదా! ఇట్లు పదునైదు సంవత్సరములు గడువగా నొకనాడు ఆ కాననమున దర్శన మిచ్చిన పితృదేవుని గాంచి కచుడు దండప్రణామము లాచరించెను. తన నాలింగన మొనరించుకొనుచున్న తండ్రితో, 'జనకా! నేను సర్వత్యాగ మొనరించి పదునైదు సంవత్స రములు గతించినను, ఇంతవరకేలనో విశ్రాంతిని పొందనైతిని' అనెను.

ఆరూఢుడై ఈవిధముగ పలుకుచున్న కుమారుని జూచి, 'సర్వత్యాగ మొనరింపుము' అని పలికి ఆయన స్వర్గమున కేగెను. తండ్రి వెడలి పోయిన తరువాత కచుడు తన శరీరమునందున్న వల్కలములను, మిగిలిన యాచ్ఛాదనములను పరిత్యజించి సూర్య, చంద్ర, నక్షత్ర, మేఘ విరహితమైన శరత్కాలాకాశ సము డయ్యెను. తరువాత నొక వర్షత్రయమునకు తన పితృదేవుని సందర్శించెను. సంతృప్త చిత్తుడై పూజార్చనాదు లాచరించెను. తనను జూచి గర్వించుకొనుచున్న తండ్రితో ఖేద గద్గద వాక్యములతో, 'నా వల్కలములు, వేణుదండము మున్నగు వాటి నన్నిటిని విసర్జించితిని. అయినను, ఆత్మపదమున విశ్రాంతి లభించుట లేదు. కాన, నాకు కర్తవ్యము నుపదేశింపుము' అని అర్థించెను. అపుడు బృహస్పతి, 'బిడ్డా! పండితులు చిత్తమును సర్వము అని నిర్వచించిరి. కాన చిత్త త్యాగము జేసితివేని, సర్వ త్యాగము చేసినట్లు సుఖింప గలవు' అని విశదీకరించెను. కచుడు చిత్తమును విడచుటకై దాని నరయ సాగెను. కాని, ఆ చిత్తమును తెలుసు కొనజాలక ఇట్లు తలపోసెను : 'ఈ దేహాది పదార్థము చిత్త మనబడదు. అది ఎట్లుండునో, ఎక్కడ నుండునో తెలియలేకున్నాను. నిరపరాధియగు నీ దేహాది పదార్థ జాతమును వ్యర్థముగ నెట్లు విసర్జింతును? కాన, ఈ 'చిత్తము' అను శత్రువు నెరుగుటకై తండ్రి సమీపమున కేగెదను గాక! దాని నెరిగి పరిత్యజింతును. అపుడు గాని ప్రశాంతి లభింపదు' అని దలచి తండ్రి యంతికమున కేగి, 'చిత్తమనగా నేమి?' అని ప్రశ్నించెను. అపుడు దేవగురుడు, 'కుమారా! తన అహంకారమును చిత్త విదులు 'చిత్త' మందురు. ప్రాణికి అంతరంగమున నుండు చిత్తమే 'యహంకార' మనబడును. కాన, నీ చిత్తమును విడదీయుట శక్యము కాదు. ఇది అసాధ్యము' అన, కచుడు, 'దీని నెట్లు విడువ వలయునో ఎరిగింపుము' అనెను. అపుడా బృహస్పతి, 'పుత్రా! పుష్పమును గోయుట, కన్నులను మూయుటకంటెను సుకరమైన దీ యహంకార త్యాగము. ఇందు ఆవంతయు క్లేశము లేదు. ఏకము, నాద్యంత

రహితము, చిన్మాత్రము, ఆకాశమున కంటె స్వచ్ఛము నగు 'ఆత్మ' అనువస్తువు కలదు. దానిని భావించుచు శాంతచిత్తుడ వగుదువు. అపుడు నిశ్చింతుడవు నగుదువు. ఈవిధముగ తత్త్వానుసంధానము జేయుట వలన మిథ్యారూపమగు నహంకారము లయించును. 'దృక్కు', 'దృశ్యము' అను వానిలో నహంకారి మేది? ఎందువలన, ఎట్లు వచ్చినది? ఉభయ విలక్షణ స్వభావమునకు ఉత్పత్తియే అసంభవము. జలము నుండి రజోరాసి జనించునా? అగ్నినుండి జలము జన్మించునా? కాన, 'ఇది, ఆ నేను' (అయంసోఽహం) అను వ్యర్థమగు భావమును వీడుము. తుచ్ఛము, పరిమితాకారము, దిక్కాల, విదశాకృతము నగునది ఈ యహంకారము. నీవు దిక్కాలాద్యనవచ్ఛిన్నమగు నిర్మలమైన, సర్వార్థ రూపమగు చిన్మాత్రరూప మగుచున్నావు' అని చెప్పెను. ఆ పరమోపదేశము వలన కచుడు జీవన్ముక్తుడు, నిర్మలుడు, నిరహంకారుడు, ఛిన్నగ్రంథి, ప్రశాంత మనస్కుడు నై యహంకార పరిత్యాగ మొనరించి యుండెను. అహంకారము అసద్రూపము. కాన, రామచంద్రా! దానిని గ్రహింప వలదు. పరిత్యజింప వలదు. అసద్రూపమగు శశి విషాణమును పరిగ్రహించుటయు, పరిత్యజించుటయు సంభవింపనేరదుకదా!" అని వశిష్ఠ మహర్షి ప్రబోధించెను.

## 11. మిథ్యాపురుషోపాఖ్యానము :

'చిత్త త్యాగమే సర్వ త్యాగ'మని కచోపాఖ్యానమున వశిష్ఠ మహర్షి వివరించెను. ఇపుడు 'ఆలోచింపకుండుట వలన కలుగు అహంకారము, వ్యర్థముగా సంసారమున దుఃఖదాయక మగును' అని నిరూపింప దలచి మిథ్యాపురుషోపాఖ్యానమును జెప్పుచున్నాడు.

"శ్రీరామచంద్రా! ద్విదాభావమును పరిత్యాగము చేసి, చిన్మాత్ర రూపుడవై సుఖించుము. మిథ్యాపురుషునివలె వ్యర్థముగా దుఃఖింపకుము" అని వశిష్ఠుడు పలుక, శ్రీరామచంద్రు డిట్లు కోరెను: "మహామునీ! నీ యుపదేశ జ్ఞానామృతము నాస్వాదించి పరమానదం సంభరితుడనై తిని. అయినను సంతృప్తి జెందనివాడనై మరియొక ప్రశ్నము నడుగుచుంటిని. సత్యము నసత్యముగను, అసత్యమును

సత్యముగను జేసిన జగద్వస్తుజాతస్సృజనకర్తయగు నా మిథ్యాపురుషుని గూర్చి వివరింపుము" అన వశిష్ఠుడిట్లు చెప్పనారంభించెను. "శ్రీరామ చంద్రా! శుభప్రదమును, హాస్యజనకమైనదియు నగు నీ 'మిథ్యా పురుషోపాఖ్యానము' నాకర్ణింపుము. మాయా యంత్రమయుడగు నొక పురుషుడు కలడు. అతడు బాలుని పగిది అల్పబుద్ధుడు, మూర్ఖుడు. మూర్ఖుడగుట వలన నభిమానము కలవాడు. శూన్యమునం (ఏకాంత) దాతడు జన్మించెను. అచ్చటనే వసించును. అండమునకు కేశముల విధమున, ఆకాశమున మృగతృష్ణ చందమున నాతడుండెను. ఆ శూన్యస్థలమున, ఇతర వస్తువేదియు లేదు. అతడు మూఢుడు కాన, ప్రపంచాతీతమగు బ్రహ్మపదార్థము నెరుగడు. కాలక్రమమున ప్రవర్ధమానుడగుచున్న నాతని కొక సంకల్పము జనించినది. 'ఈ ఆకాశము నంతటిని ఒక్కచోటునకు జేర్చి రక్షింతును గాక!' అని యాలోచించి వ్యోమ సంరక్షణార్థము ఒక గృహమును నిర్మించెను. అందు ఆకాశమును జేర్చినట్లు దానిని రక్షించుచున్నట్లు భావించుచుండెను. కాలాంతరమునం దాగృహము, శరత్కాల మేఘము విధమున కూలిపోయెను. అది గాంచి ఆ మూర్ఖుడు 'గృహాకాశమా! నీవు కూలిపోయితివా! క్షణకాలములో నెచటకు పోయితివి?' అని ఆ గృహాకాశమును గూర్చి విలపించెను. కొంతకాల మావిధముగ శోకించి, ఆ దుర్మతి ఆకాశ సంరక్షణార్థమొక కూపమును త్రవ్వించి, అం దాకాశమును రక్షించుచున్నానని భావించెను. కొంత కాలమునకు ఆ కూపము కూడ కూలిపోయెను. మరల కూపాకాశమునకై దుఃఖించి, యొక కుంభమును నిర్మించి అందు ఆకాశమును కాపాడుచుంటినని భావించెను. కొంత కాలము గడచినంత నదియు వ్రయ్యలయ్యెను. దురదృష్టవంతుడగు నాతడు నిర్మించిన దెల్ల నశించుచుండెను. కుంభాకాశమునకై దురపిల్లి తుదకాతడొక కుండమును నిర్మించెను. అందాకాశమును రక్షించుచున్నట్లు తలపోసెను. కొంతకాలమున కదియు నశించెను. దానికై మిక్కిలి దుఃఖించి, కడకొక చతుశ్శాలను నిర్మించెను. అందాకాశమును భద్రముగ రక్షించుచుంటిని కదా! యని తలంచెను. ఇంతలో సర్వ క్రియా భక్షణ నిపుణమగు కాలము, వాయువు పండుటాకును రాల్చినట్లు ఆ చతుశ్శాలను గూడ నాశనము జేసెను. ఆ మిథ్యాపురుషుడు దానికై విలపించి, ఒక కుసూలములను నిర్మించెను. అదియు నశించెను.

ఇట్లు గృహము, కూపము, కుంభము, కుండము, చతుశ్శాల, కుసూలములు నశించుట వలన చాల కాలము దుఃఖమయ జీవితమును గడపెను. కొంత కాలమున కా బుద్ధిహీనుడు పర్వత గుహాయం దొక భాగమును గ్రహించి, అం దాకాశ పరిరక్షణ మొన రించు చుంటినని భావించెను. ఒక యుపాధి నాశనము వలన దుఃఖమును, దాని రాకడ వలన నానందము నందుచుండెను" అన శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను: మునిపుంగవా! మిథ్యా పురుషోపాఖ్యానమున నభివర్ణించిన మాయాయంత్ర పురుషు డెవరు? వా డాకాశమును రక్షించుట అననేమి? వివరింపుము." అంత వశిష మహర్షి, "శ్రీరామచంద్రా! మాయాయంత్ర పురుషుడగు మిథ్యా పురుషు డనగా 'అహంకారము.' ఇక నాకాశ మనగా, సృష్ట్యాది యందుగల చిదాకాశమగు శూన్య స్థలము. ఆ చిదాకాశము నుండి అహంకారము వాయువు వలన ప్రథమ చాలనము పొందినట్లు కన్పించును. కాని, యథార్థమునకు ఆత్మకు వ్యతిరేక మగు నహంకారము ఆత్మస్వరూపమగు చిదాకాశమును రక్షించు టకు అనేక విధములగు దేహములు (ఉపాధులు) నశించుచున్నను, తిరిగి ఆ దేహములను సృష్టించుచున్నది. ఇంతియగాక, వాటి యందు ఆత్మను రక్షించుచున్నానని భావించుచున్నది. ఆ మిథ్యా పురుషుడు ఆత్మ భావముచే ఘటాకాశాది విషయములందు కష్టము నొందినట్లు నీవు క్లేశము నొంద వలదు. ఆత్మవస్తువు ఆకాశమున కంటె విస్తృతము, అణువున కంటె సూక్ష్మము నైనది. అది పరి శుద్ధమైనది, శివము శుభము నైనది. అది దేనిచేతను గ్రహింపబడదు (రక్షింప బడదు). హృదయాకాశామాత్రమగు శరీరము నశింపగా భూతములు, ఆత్మయే నశించిన దను మిథ్యా భావము కలిగి వ్యర్థ ముగ దుఃఖించును. ఘటాదులు నశింపగా ఆకాశ మఖండితమై యున్నట్లు దేహములు నశించినను దేహి నిత్యుడై, శుద్ధ చిన్మాత్ర రూపుడై యుండును. అత డాకాశమున కంటె నధికుడు. అణువు కంటె పరమాణువు. ఇతడు స్వానుభవరూపు డగుట వలనఆకాశము

వలెనశింపక యుండును. ఒకప్పుడు పుట్టుటయును. మరి యొకప్పుడు మరణించుటయును పొందదు. జగద్రూపముతో వివర్త మొందు చుండును. ఇది యంతయు నొక్కటియే. అది ఆది మధ్యాంత రహితము, భావాభావ వినిర్ముక్తము నగు బ్రహ్మమని భావించి సుఖింపుము. సర్వాపదలకు నిలయము, ననిత్యము, నస్వతంత్రము, వివేకరహితము. సప్రామాణికము, జడము నగు నహంకారమును జ్ఞానోదయముతో విడచిన వాడవై బ్రహ్మ పదమున జీవన్ముక్తత్వమును పొంది యుండుము" అని యుపదేశించెను.

## 12. భృంగీశోపాఖ్యానము

మిథ్యాపురుషోపాఖ్యానమున 'మిథ్యా శోకమునకు అహంకారమే కారణ' మని వివరింపబడినది. ఇపుడు 'సమాధి నిష్ఠ లేకున్నను, మహాకర్తృత్వాదులచే చిత్త విశ్రాంతి లభించు' నని తెలుపుటకై భృంగీశోపాఖ్యానము చెప్పబడు చున్నది.

" శ్రీరామచంద్రా! రజ్జు సర్పభ్రాంతికి అధిష్ఠాన మగు రజ్జువు నెరుగనందు వలన సర్పభ్రాంతి కలుగును. అట్లే జగమున కధిష్ఠాన మగు ఆత్మ తత్త్వము నెరుగక పోవుట వలన 'జగము' అను భ్రాంతి జనించు చున్నది. కిరణములు ఆదిత్య వ్యతిరేకము లనుగ భావించుటవలన అవి వేరుగ భాసించు చున్నవి. కడియమును సువర్ణ వ్యతిరిక్తముగ భావించుటచే కేయూరముగనే తోచును గాని, కనక మను భావము కలుగదు. అట్లే సూర్యుడు, కిరణములు వేరు కాదని భావించుట వలన ఈ రెండు నభిన్నములని తోచును. ఇట్టి భావము కలవాడు 'వికల్పరహితుడు' అని చెప్పబడును. కడియము, కనకము వితరము కాదని తలచువాడును నిర్వికల్పుడే యగును. అఖిల మగు నానాత్వమును వీడి, శుద్ధ చిన్మాత్రకోటరము నందున్న ద్రష్ట్రస్వరూప మగు దృక్త్వమున స్థిరుడవై యుండుము. వాయువు చలనశక్తిని కలిగించు విధమున, ఆత్మ తనంతతాను

సంకల్ప శక్తిని కలుగజేసి, కార్యోన్ముఖమైనదిగ జేయునపుడు ఇతరమైనదిగ ప్రకాశించును. సంకల్ప కల్పనా రూపమును, సర్వ ప్రపంచ కారణము నగు స్వాకారమును భావించుచు మనస్సగుచున్నది. కాన, ఈ జగత్తు సంకల్ప మాత్ర మనియు, సత్యము గాని అసత్యము కాదనియు, స్వప్నజాలమువలె ననిర్వచనీయమైన దనియు భావింపవలయును. చూచుచు, వినుచు, స్పృశించుచు నాగ్రహించుచు, మాట్లాడుచు, వ్యవహరించుచు, నిద్రించుచు, సర్వము సత్యముగనే భావించుచు తాను చేయుచున్నదియు చిన్మాత్రమని, నిర్మలము, విస్తృతమునగు బ్రహ్మపదార్థమనియు, తదితరము కాదనియు నెరుంగును. సమస్తమగు పదార్థ జాతము సంవిత్తు చేతనే ప్రకాశించుచున్నది. కాన, నీ జగత్తంతయు నదియే (సంవిత్తు) గాని, తదితరము కాదు. సంవిత్తు ఒకటియే సమస్త వస్తు రూపమగుట వలన దృశ్యమే లేదు అపుడు బంధ మోక్షముల ప్రసక్తి యేముండును? 'ఇది బంధము, ఇది మోక్షము' అను ఆలోచనమును పరిత్యజించి, అభిమానము లేనివాడవై మౌనివి, జితేంద్రియుడవు, నిరహంకారుడవునై స్వకార్యాచరణ మొనరింపుము. మహాకర్తవు, మహాభోక్తవు, మహాత్యాగివి కమ్ము. సంశయముల నన్నింటిని పరిత్యజింపుము. శాశ్వతమగు ధైర్యము నవలంబించుము" అన, శ్రీరామచంద్రు డిట్లనెను: "మునిసత్తమా! మహాకర్త, మహాత్యాగి, మహాభోక్త యననేమో వివరింపుము" అన, వశిష్ఠు డిట్లు వివరించెను: "పూర్వము పరమేశ్వరుడు ఈ మూడు వ్రతములను గూర్చి భృంగీశునకు వివరించెను. అందుచే నాతడు శోకరహితుడై వర్ధిల్లెను. ఆ విషయముల నిపుడు నీ కెరిగించుచున్నాను, వినుము. పూర్వము సుమేరు పర్వతమున, (ఉత్తర శిఖరమున) సమస్త పరివార సముపేతుడై పరమేశ్వరు డుండెను. అపుడు భృంగీశు డను మహాతేజస్వి తత్త్వజ్ఞానము బడయగోరి పరమేశ్వరు నంతికమున కరుదెంచి ప్రాంజలియై ప్రణతు లర్పించి నిలచి ఇట్లనెను: 'మహాదేవా! తరంగతరళమైన ఈ సంసార

రచనను జూచి, తత్త్వమునందు నిలుకడలేక, మోహము నందు చుంటిని. జీర్ణగృహమగు నీ జగమున నేవిధమగు నంతర్నిశ్చయముచే దుఃఖ రహితుడనై యుండగలను, వివరింపుడు' అని అర్థించెను. అంత నా ఈశ్వరుడు, 'భృంగి! నీవు సర్వ సంకల్పములను పరిత్యజించి, శాశ్వత ధైర్య మవలంబించి, మహా కర్తవు, మహా భోక్తవు, మహాత్యాగివి నయి సుఖ మనుభవింపుము' అన, భృంగీశుడు. 'మహేశా! మహా కర్త, మహా భోక్త, మహా త్యాగి లక్షణములను విశదీకరించి నన్ను ధన్యుని జేయుడు' అని ప్రార్థించెను. అపు డీశ్వరు డిట్లు వివరించెను:

మహా కర్త లక్షణము: రాగ ద్వేషములు లేక, సుఖ దుఃఖములను వీడి, ధర్మా ధర్మముల పట్ల సముడై. ఫలాఫల ముల నపేక్షింపక కార్యములు చేయువాడు 'మహా కర్త' అనబడును. మరియు మౌనవ్రతుడు, నిరహంకారుడు, నిర్మా న్యుడు, ముక్తమత్సరుడు, అనురాగరహితుడునై సాక్షిభూతుడుగ నుండి, నిష్కామ కర్మలు చేయువాడు, సుఖ, దుఃములయందు సమవర్తనుడై హర్ష విషాదముల నొందనివాడు, సృష్టి స్థితి లయ ములయందు, వృద్ధి క్షయములయందు సమచిత్తుడైన వాడు 'మహా కర్త' అనబడును.

మహా భోక్త లక్షణము: దేనిని ద్వేషింపక, దేనిని వాంఛింపక, ప్రాప్తించిన దాని ననుభవించువాడు 'మహాభోక్త' అనబడును. సుఖ దుఃఖములచే గాని, భ్రమ జనకములగు భావా భావములతోగాని సంక్షోభము నొందనివాడును, జరా మరణ ములపట్లను, ఆపదలు, రాజ్యము, దారిద్ర్యము మున్నగున వన్నియు రమ్యములే యని యనుభవించు వాడును; కటు, ఆమ్ల, లవణ, తిక్తముల పట్లను, మధుర పదార్థముల పట్లను, సమభావము కలవాడును; రస వస్తువుల పట్లను, నీరస వస్తువుల

పట్లను, అనురాగ, విరాగముల యందును. సమబుద్ధి కలవాడును, భోజ్యాభోజ్యములను, సంకల్ప వికల్ప విభేదమును విడచిన వాడును; సంపదాపదలయందు నానంద మోహములు, ఉత్కృష్ట నికృష్టములు లేక సమబుద్ధికలవాడు 'మహాభోక్త' అనబడును.

మహాత్యాగి లక్షణము : ధర్మాధర్మములు, సుఖ దుఃఖములు, జనన మరణముల పట్ల భేద భావము విడనాడినవాడును; సర్వేచ్ఛలు, సర్వ సంకల్పములు, సర్వేహలు, సర్వ నిశ్చయములు బుద్ధిపూర్వకముగ విడచినవాడును; ధర్మాధర్మములు, సంకల్ప వికల్పములను అన్నిటిని మనఃపూర్వకముగ పరిత్యజించినవాడును ; సకల దృశ్య వాసనలు లేనివాడును 'మహాత్యాగి' అనబడును అని దేవదేవుడు, భృంగీశునకు జెప్పెను. నీవు కూడ ఈవిధమగు దృష్టి కలిగి శోక రహితుడవై యుండుము. ఎల్లపుడు ప్రకాశించు నిర్మల రూపమై, అనంతమై, అద్వయమగు బ్రహ్మ మొకటియే కలదు. ఇంతకు మించిన దృశ్య ప్రపంచ మేదియు లేదు అని భావించి నిస్సంగుడవై, సకలచిత్తవృత్తులను నిరోధించుకొని మోక్షము నందుము. సుఖస్వరూపము, బ్రహ్మము, సర్వమునకు నాదికారణము, పరమాత్మ రూపము, సకల పదార్థములను వృద్ధి పొందించునది యగు చిదాకాశము మాత్రమే కలదు. 'బ్రహ్మమున కంటె వేరగు సత్తు గాని, అసత్తుగాని లేదు' అను దృఢమగు నంతఃకరణ నిశ్చయము కలవాడవై యుండుము. అంతర్ముఖుడవై సమస్త బాహ్యాకార్యము లాచరించుచున్నను కష్టము నొంద నేరవు. అపు డహంకార రహితుడ వగుచున్నావు.

## 13. ఇక్ష్వాకూపాఖ్యానము

భృగీశోపాఖ్యానమున 'సమాధి నిష్ఠ లేకున్నను. మహాకర్తృత్వాదులచే చిత్త విశ్రాంతి సిద్ధించు' నని విశదీకరింపబడినది. ప్రస్తుతము 'ఆత్మ విచారముచే తత్త్వమును తెలిసికొన శక్యము

గాకపోయినను, గురూపదేశమున తెలిసికొన శక్యమగు' నని నిరూపింప బడుచున్నది.

"మహిమునీ! 'అహంకార' మనబడు చిత్తము లయించి నను, లయింపక పోయినను సత్త్వమున కెట్టి చిహ్నముండునో తెల్పు" మని శ్రీరామచంద్రుడు వశిష్ఠ మహర్షిని అభ్యర్థించెను. అపు డాయన యిట్లభివర్ణించెను:

"తామర పత్రమునకు జలమంటని రీతిగ, లోభ మోహాది దోషములు బలాత్కారముగ సంభవించినవైనను, సత్త్వ స్వభావుని స్పృశింపజాలవు. అహంకారమయమగు చిత్తమున పాపము లుపశ మింపనిచో మోద ప్రమోదాది సంపదలు ఎన్నటికిని వీడ జాలవు. వాసనా రూపములగు గ్రంథులు మాత్రము ఛేదింపబడిన వానిపలె వీడిపోవును. కోపము కృశించును. మోహము మాంద్య మగును. కామము సడలి పోవును. లోభము పలాయనము చిత్తగించును, ఇంద్రియము లంతర్ముఖము లగును, దైన్యము దూర మగును, దుఃఖము లంతరించును. సుఖములు పరవశత్వము నొందింపవు. హృదయ శీతల మగు సమత్వము లభించును. సుఖ దుఃఖాదుల వలన, సంతోషము, ముఖమందు ద్యోతక మగుచున్నను, అది తుచ్ఛమైన దగుట వలన మనస్సునన కంట జాలదు. అట్టివానిని దేవతలు ప్రశంసింతురు. అతడు సమత్వ కౌముది యందు ఆహ్లాదముతో విహరించును. అతని శరీరము శాంతియుక్తమై ప్రకాశించును, కాంతిమయమై శోభిల్లును. ఇది సమాధిక ప్రతిబంధకమై యుండును. నిర్వికారము, దైన్య రహితము, నిర్మలమునై సేవింప బడును. సంసార విలాసము ఉత్పత్తి, వినాశము అనువానితో కూడినదైనను, చిత్ర విచిత్రములతో భాసించునదై నను సత్పురుషుల కానందమును గాని, దుఃఖమును గాని కలిగింపదు. బుద్ధితో నాలోచింప సాధ్యమైనదియు, సమస్తా పదలను నశింప జేయునదియు నగు మోక్షమునబడు మోహావిష్టుడు కానివాడు

'నరాధము' డనబడును. ఉచిత మగు తత్త్వ నిష్ఠ పొందుటకు, చిరకాల సాంగత్యముకల దుఃఖము లను రత్నముల కాటపట్టగు, ఈ సంసార సాగరమును తరింప దలచుచున్న నే నెవ్వడను? ఈ జగ మిట్లేల ఆవిర్భవించినది? పరమాత్మ ఎవరు? భోగముల వలన ప్రయోజన మేమి? అను విచారము మోక్షోపాయ మగును. ఇక్ష్వాకు వంశోద్భవుడ వగు రామచంద్రా! నీ కాది పురుషు డగు ఇక్ష్వాకున కే విధముగ ముక్తి లభించునో వివరించు చున్నాను, వినుము.

మీ మూలపురుషుడగు ఇక్ష్వాకుడు రాజ్యపాలనము జేయు చుండగా నొకనాడు జనన, మరణ సంక్షోభముబు కలిగి; సుఖ, దుఃఖ దాయకమగు నీ దృశ్య ప్రపంచమునకు కారణ మేదియై యుండునా అని ఆలోచింప సాగెను. ఎంతగా చింతించినను కారణము నరయ జాలక, కారణాంతరమున నొకమారు బ్రహ్మలోకము నుండి తన సభ కరుదెంచిన మను వను ప్రజాపతి నిట్లు ప్రశ్నించెను: 'మహాను భావా! నా కొక సందేహము జనియించినది. దానిని తాము అనుగ్రహ దృష్టితో నాలింప వేడుచున్నాను. అది, ఈ జగమెట్టు లావిర్భవించినది? దీని స్వరూప మేమి? పరిమాణమెంత? ఎపుడు జనించినది? జనించుటకు కారణమేమి?—ఈ విధములగు విషమ విషయ జాలము నుండి విడువడ లేకున్నాను. నా సందియములను దీర్చి నన్నుద్ధరింపుడు అన, మను విట్లనెను:' మహారాజా! ఎంత విచిత్రము! చాలా కాలమునకు వివేకోదయము కలుగగా, ప్రకాశింపదగు వేదాంతార్థములు కల సారవంతములగు ప్రశ్నముల నడిగితివి. ఈ జగము గంధర్వ నగరము వంటిది. మరుస్థల మందలి మరీచిక వంటిది. సత్యమైనది కాదు. ఇక మనస్సు గూడిన షడింద్రియములకతీతమై, ఎచటను కనుబడక, నాశరహితమైన సత్పదార్థము అనగా, 'ఆత్మ' అనునది శాశ్వతమైనది. సర్వదృశ్యాదృశ్యమగు నీ సృష్టిపరంపర అద్దమునందు కన్పించు ప్రతిబింబమువలె భాసించ

చున్నది. తేజస్స్వభావము కల బ్రహ్మ సంబంధమగు కొన్ని శక్తులు బ్రహ్మాండ రూపమును, మరికొన్ని శక్తులు ప్రాణి రూపమును ధరించుచున్నవి. బంధమోక్షములుగాని, బాధాబాధలుగాని, భేదాభేదములుగాని ఏవియు నుండవు. జ్ఞానసారమగు బ్రహ్మ మొకటియే యుండును జలమంతయు నొకటియే యైనను, తరంగ రూపముతో భిన్నముగ భాసించునట్లు, చిత్త మొక్కటియే యయ్యు నానా రూపములుగ భాసించు చున్నది. అంతియకాని వేరు కాదు. కాన, 'బంధము, మోక్షము' అను కల్పనలను దూరముగ విడచి, సంసార భయ విరహితుడవు కమ్ము. బ్రహ్మ సారాంశము కలవాడవై స్వస్థుడవు కమ్ము. చిత్పదార్థ సంబంధమగు చిన్మాత్ర రూపములునగు సంవిత్తులు, సంకల్పాభిముఖములై జలము తరంగత్వమును పొందినట్లు జీవత్వము నొందుచున్నవి. ఆ జీవులు పూర్వము జనించిన సంసారమునందు తిరుగుచున్నారు. సుఖ దుఃఖములకు హేతుభూతమగు మోహము మనస్సునందు కలదు గాని ఆత్మయందు లేదు. కంటికి కనుపింపని రాహువు గ్రహణ సమయమున చంద్రునితో గూడి కనుపించునట్లు అనుభవమాత్ర రూపుడగు ఆత్మ దేహాద్యుపాధులతో గూడి కనుబడుచున్నాడు. పరమేశ్వరుడు శాస్త్రముచేగాని, గురువుమూలమునగాని కన్పింపడు. తన ప్రయత్నపూర్వకమగు సత్త్వగుణ నిష్ఠితమగు బుద్ధిచే చూడబడుచున్నాడు. ప్రయాణించు బాటసారులు తమలోతాము రాగ ద్వేష విముక్త చిత్తులైసి ప్రవర్తించునట్లు, దేహి ఇంద్రియాదులపట్ల నట్లే ప్రవర్తింపవలయును. పండితులు వీటియందు ఆదర బుద్ధిగాని, ఆజ్ఞా బుద్ధిగాని చూపరు. కాన, ఇది ఇతర పదార్థములవలె యాథార్థ్యతిని యుండుగాక! నీవు దేహాది పదార్థ జాతమును దూరముగ విడచి సర్వతః శీతలాంతఃకరణుడవై, ఆత్మమయుడవై యుండుము. 'ఈ దేహమును నేనే' అను బుద్ధి సంసార బంధమును కలిగించును. మోక్షార్థియగువాడు ఇట్టి భావము కలిగి యుండరాదు. 'విశ్వాత్మకమగు చిన్మాత్రుడను నేను, ఆకాశమున కంటె విస్తృతుడను.

అణువుకంటె పరమాణువును' అను భావము వలన సంసార బంధము ఛేదింపబడును. సూర్యకాంతి స్వచ్ఛమగు జలముల లోపలను, వెలుపలను ప్రకాశించు విధముగ ఆత్మ సర్వత్ర వ్యాపించి యుండును. బంగారము అనేక విధములగు అభరణముల రూపములను ధరించునట్లు ఆత్మ యొకటియే జగదాది రూపములతో ప్రకాశించు చున్నది. 'ప్రాణులు' అను తరంగములు కల జగజ్జాలములను మహానదులు 'విలాపము' అను బడబాగ్నితో గూడిన కల్పకాల మహార్ణవ మును పొందుచున్నవి. ఇట్టి కల్పకాల మహార్ణవ పాన మొనరించు 'ఆత్మ' అను అగస్త్యుని భావించుచుండుము. ఆత్మ కానిది యగు దేహాది దృశ్య పదార్థమునందు ఆత్మభావమును పరిత్యజించి, సత్త్వగుణము నవలంబించి గూఢముగ, సుఖముగ నుండుము. శరీరవక్షస్థలమున నిద్రించుచున్న కుమారుని మరచి పోయిన తల్లి, అతనికై విలపించునట్లు జనులు ఆత్మకై విలపించు చున్నారు. జరా మరణ వర్జితుడగు ఆత్మ నెరుగలేక 'నేను హతుడనైతిని, అనాథుడనైతిని' అని శరీరము నాశనమైనంతనే శోకించు చున్నాడు. జలము పరిస్పందనము వలన నానాకారములను ధరించు నట్లు సంకల్పవశమున బ్రహ్మము ఆకాశాది నానారూపములను ధరించుచున్నది. కాన, సంకల్ప రహితుడవై చిత్తమును ఆత్మయందు నిలిపి సందేహములను విడచి చలించువాడ వైనను, ఆ చలనమును వీడినవాని విధముగ నుంటివి. ఆత్మనిష్ఠుడవై, ఈశ్వర స్వరూపుడవై రాజ్యమును పరిపాలింపుము. ఆత్మస్వరూపము సృష్టిశక్తితో బాలుని వలె క్రీడించుచున్నది. సంహారాత్మక శక్తితో నా సృష్టిని లయింప జేసి తన యందే వసించుచున్నది. ఈ ఆత్మకి బంధశక్తి, మోక్షశక్తి తనంత తానే కలుగుచున్నవి. చంద్రుడు, సూర్యుడు, అగ్ని, తప్తలోహము, రత్నము మున్నగు వాని కాంతులును వృక్షముల పత్రములును, ప్రవాహముల తుషారములును, ఆ చంద్ర సూర్యాదుల కంటె నభిన్నములైనను భిన్నములుగ కన్పించునట్లు ప్రకాశమానమగు బ్రహ్మపదార్థమునందు జగద్బుద్ధి మున్నగునవి

అవిద్యావశమున కల్పితములై అజ్ఞులకు దుఃఖప్రదము లగుచున్నవి. ఈ మాయ విశ్వమునే మోహ వివశ మొనరించు చున్నది. ఎంత చిత్రము! సర్వాంగ పరిపూర్ణ మైన ఈ ఆత్మను జనుడు ఎరుగజాల కున్నాడు. ఈ జగత్తును చిదాకాశమని భావించువాడు, పరిపూర్ణ బ్రహ్మమే రక్షకమని భావించువాడు, జీవన్ముక్తు డగుచున్నాడు. అహంకార రహితను, నిరుపాధికత్వ వ్యపదేశ భావము చే జగత్త్రంతయు నిరాడంబరము, చిద్రూపము నని భావింపవలయును. రమ్యారమ్యత్వాను భావము దుఃఖజాలమునకు మూలము. ఆ భేద భావమును 'సమత్వ'మను నగ్నితో దగ్ధ మొనరించినచో దుఃఖ మేల కలుగును? రాజా! రమ్యారమ్య విభేదములేని, అభావ నాస్త్రముతో ప్రయత్నపూర్వకముగ, అంతరంగమునందే భేద భావమును ఛేదింపవలెను. భేద భావనము తన్నిత్తమగు కర్మకాననమును; 'అభావ'మను నస్త్రముచే ఛేదించి, వాసనా క్షయమును పొంది శోకరహితుడ వగుము. పరిపూర్ణమగు నాత్మ భావనముచే భువనము లన్నిటి యందును నిండి యుందువు. భేద బుద్ధి రహితుడవు. వాసనా విరహితుడవు. వివేక విలసితుడవు. నిరతిశ యానంద సంభరితుడవు. రోగ విరహితుడవు. నిర్మలుడవు, పరి పూర్ణుడవు, చిద్రూపుడవు నగు' మని మను వుపదేశించెను. మఱియు నిట్లనెను

జ్ఞాన భూమికలు: 'రాజతిలకా! శాస్త్రాధ్యయనము, సజ్జన సాంగత్యాదులచే బుద్ధిని వృద్ధిపొందింప వలెను. ఇది యోగమునకు ప్రథమ భూమిక. వెనుక శుభేచ్ఛ ప్రథమ భూమికయని అభివర్ణింప బడినది. ఆత్మవిచారము రెండవ భూమిక. అసంగత్వ భావన మూడవ భూమిక. ఇది మనస్సును స్పృశింప జేయును. కాన, ఇదివరకిది తను మానస మని చెప్పబడినది. వాసన లయమందుట వలన వాసనాలయ మనునది నాల్గవ భూమిక. ఇది వెనుక సత్త్వాపత్తిగ పేర్కొనబడినది. శుద్ధసంవిన్మయానంద రూపము అయిదవ భూమిక. మానవుడు దీని

యందు సగము నిద్రించినవాని విధముగను, సగము మేల్కొనినవాని విధముగను అనగా, అర్ధ నిద్రితునివలె నుండి జీవన్ముక్తుడై యుండును. అసంవేదనా రూపము ఆరవ భూమిక. ఇది ఘనీభూతానందాకారము. సుషుప్త స్వరూపమై యుండును. తుర్యావస్థ ముక్తి. దీనిని పదార్థభావనిగా వెలిక పేర్కొనిరి. సమత్వము, స్వచ్ఛత్వము, సౌమ్యత్వము, తుర్యాతీతత్వము, కైవల్య రూపత్వము నైనది సప్తమ భూమిక. ఇది జీవించియుండు వారికి గోచరింపదు. ఈ విధములగు సప్త జ్ఞాన భూమికలలో మొదటి మూడును జాగ్రదవస్థయం దుండును. నాల్గవది స్వప్నతుల్యము. ఘనీభూతానంద స్వరూపమైనది పంచమ భూమిక. ఇది సుషుప్తావస్థయం దుండును. అసంవేదనారూప మగు షష్ఠ భూమిక తుర్యావస్థ. ఇది వాఙ్మనసాతీతమైనది. స్వప్రకాశమైనది యగు సప్తమ భూమిక తుర్యాతీతావస్థ. చిత్తమును నిరోధించి, దృశ్యమును భావింప కున్నచో సమత్వము వలన నిస్సందేహముగ ముక్తుడ వగుదువు. సుఖ దుఃఖాది భోగ విషయములను స్పృశింపని చిత్తము గలవాడు ఆత్మారాముడై యుండుటయే ముక్తత్వ మనబడును. వ్యవహారస్థుడు గాని, అట్టివాడు కానివాడు గాని, గృహస్థుడు గాని, యతి గాని, సశరీరుడు గాని, అశరీరుడు గాని ఆత్మారాముడైనచో ముక్తుడే యగును. 'నేను మరణించుటలేదు, జీవించుటయు లేదు. సద్రూపుడను, అసద్రూపుడను కాను; నేనేదియు గాను, విశ్వవిలక్షణుడనగు చిద్రూపుడను' అని భావించు జీవన్ముక్తుడు జీవించియు దుఃఖము ననుభవింపడు.' నేను నిర్లేపుడను, అజరుడను, విరాగిని, వాసనాముక్తుడను, నిరంకుశుడను, చిదాకాశుడను, అహంకార రహితుడను, సిద్ధుడను, బుద్ధుడను, శాంతుడను, సమ సమాభాసుడను, తృణమందును, ఆకాశమునందును, నరుని యందును, నాగామరుల యందును, సూర్యునియందును భాసించు పదార్థమును నేను' అని భావించువాడు దుఃఖము ననుభవింపడు. 'చిద్రూపుడను, అనంత విలాసుడ నగు నా మహిమ, తిర్యగూర్ధ్వములుగను, అధస్స్థానమునను వ్యాపించి

యున్నది' అని భావించువాడు తయ మొందును. వాసనాబద్ధమై అను భవింపబడు వస్తువు సుఖప్రదమైనను, అదివేంటనే నశించి దుఃఖహేతు వగును. కాన, సుఖ దుఃఖములు అవినాభావ నిమ్మత్వములై యుండును. సూక్ష్మ వాసనా విలసితములై గాని, వాసనా రహితములై గాని యనుభవింపబడు వస్తువులు అనుభవ కాలమునందు సుఖమును, వినాశకాల మందు దుఃఖమును కలిగించును. వాసనా రహితమగు బుద్ధితో చేయబడు కర్మము బీజనాశము నందిన విత్తనము వంటిది. అది నాటబడియు నంకురింప జాలదు. సర్వపదార్థ భావనను విసర్జించి కైవల్యమున కుద్యమించు పురుషుడు, శీతమయూఖుని చందమున శీతలుడు, పూర్ణుడునై, కాంతియందు భాస్కరుడై ప్రకాశించును. ఈ దేహము బూరుగచెట్టు వంటిది. గతములో చేయబడినది గాని, ఇపుడు చేయబడుచున్నది గాని యగు కర్మ దాని దూది వంటిది. అది జ్ఞానము అను వాయువుచే నెగురగొట్టబడి ఎచటికో పోవు చున్నది. మానవుడు సంతతాభ్యాసము జేయకపోవుట వలన విద్య అంతరించుచున్నది. అది జ్ఞాన విద్య యగుచో సారవంతమగు భూమిలో నాటిన విత్తువలె, నంతరంగమున నొక్కమారు ప్రవేశిం చినచో నశింపక, దినదినాభివృద్ధి యగుచుండును. సరస్సులన్నిటి యందలి జల మొకేవిధముగ నుండునట్లు అఖిల వస్తువుల యందు విశ్వరూపమగు నాత్మ ఒకేవిధముగ నుండును. సమస్తమగు జగత్తు శాంతించిన సంకల్పములు కలదై, ఒక్కటి యగు సత్తాంశ మాత్రమని తెలియుము. విషయ భోగవాంఛ యుండునంత వరకు నాత్మకు జీవు డను పేరుండును. ఆవాంఛ అవివేక వశమున జనిం చును. వివేక వశమున నది నశించును. అపుడు ఆత్మ, జీవత్వ మును త్యజించి, బ్రహ్మత్వమును పొందును. ఊర్ధ్వలోకము నుండి, అధోలోకమునకును, అధోలోకము నుండి యూర్ధ్వలోకము నకును చిరకాలము సంచరించు చుండెడి సంసార మను ఘటీ యంత్రము పతము నకు చింతా రజ్జు బంధ ఘటము కాబోకుము 'ఈ పుత్ర మిత్రాదులు, నావారు, నే నీ పిత్రాదులకు సంబంధించిన వాడను' అను ప్రగాఢ మోహ వ్యవహారమున జిక్కుకొన్నవారు

అధోలోకమున కంటె నధోలోకమునకు పతన మగుచున్నారు. ఈ పితృ మాతృ కళత్ర సంబంధమును త్యజించినవారు ఊర్ధ్వమున కంటె నూర్ధ్వమునదగు లోకమున కేగుచున్నారు. స్వప్రకాశమగు నాత్మను శీఘ్రముగ గుర్తించి సుఖముగ నుండుము. అఖిల లోకముల యందును, ఆకాశము నందును నిండియున్న ఆత్మను దర్శింపుము. చిద్రూప మఖండాకారమైనదని తెలియుము. అపుడు గాని తీర్ణ సంసారుడవై, పరమేశ్వరత్వము నొంద జాలవు. 'బ్రహ్మేంద్ర, విష్ణు, వరుణాదులు చేయుచున్న కార్యములను, చిద్రూపుడ నగు నేను జేయుచున్నా' నని భావింపుము. శాస్త్రములందు పేరొకొనబడిన విషయమంతయు సత్యమే యగును. చిద్విలాసము నిరర్గళమైనది కదా! చిన్మాత్రత్వము నొందిన వాడను కనుకనే, తీర్ణ మృత్యుడను. చిత్త రహితుడైన వానికి కలుగు పరమానందము దీనితో పోల్చబడుచున్నది. 'ఈ జగత్తు శూన్యము, అశూన్యము, చిద్రూపము, అచిద్రూపము. ఆత్మ రూపము తదితరము కాజాలదు' అని భావించుచున్నచో భువన భావనాది రూపమగు అవిద్య నశించును. మోక్ష శబ్దము దేశమునకు గాని, కాలమునకు గాని, అవస్థకు గాని చెందదు అహంకార రూపమగు మోహము నశింపగా, వాసనా రూపమగు నవిద్య లయించును. ఈ అవిద్యలయించుటయే 'మోక్ష' మనబడును. శాస్త్రార్థ విచార చాపల్య విహీనుడు, నానారసమయ కావ్యపఠనా కౌతుక నివృత్తుడు, నిరస్త నిశ్శేష వికల్ప విప్లవుడు సమ భావము కలిగి శాశ్వత సుఖమందుచున్నాడు. ఒకానొక వస్త్రము గాని, నారచీర గాని ధరించినవాడును, ఏదియో భుజించిన వాడును, ఎచటనో శయనించిన వాడును బాహ్యావస్తు విముఖుడై బ్రహ్మవిదు డగుచున్నాడు. అతడు సమ్రాట్టువలె విరాజిలు చున్నాడు. వర్ణ, ధర్మాశ్రమాదులు, శాస్త్ర నియమాదులు లేని వాడు 'జగజ్జాల' మను పంజరమునుండి సింహమువలె నిర్గ మించుచున్నాడు. విరక్తుడగు పురుషుడు వాగ్విషయముల

నతిక్రమించినవాడై, శరత్కాల నిర్మలాకాశమువలె అనిర్వచనీయ శోభ నొందుచున్నాడు. గంభీరుడు ప్రసన్నుడునై, పర్వతము నందలి సరస్సువలె పరమానందాస్వాద నిశ్చలుడై స్వాత్మతో నాత్మ యందు క్రీడించుచున్నాడు. సర్వకర్మ ఫల త్యాగి, నిత్యతృప్తుడు, నిరాశ్రయుడు నగువాడు పుణ్య పాపము లతో గాని, వాని ప్రమోద, విషాదములతో గాని సంబంధము కలిగియుండడు స్ఫటికమణి యందు ప్రతిబింబించు నీల, పీతాది వర్ణములు సాంకర్యము నొందని విధముగ ఆత్మజ్ఞుడు కర్మఫలముతో సంబంధము కలిగి యుండడు తత్త్వజ్ఞుడు జన సమూహమున విహరించుచు దేహచ్ఛేదనములచే గాని, పూజనములచే గాని తన దేహమున ప్రతిబింబించినవానిచే వలె శోక సంతోషముల నందడు. ఆత్మస్తుతి, పరనింద లేనివాడై, నిర్వికారుడై, పూజ్యాపూజ్య విరహితుడై, సమస్తాచారక్రమ సముపేతుడై, ఒకప్పుడు వాటిని విడచినవాడై తత్త్వజ్ఞుడు ప్రవర్తించుచుండును ఇతనికి లోకభీతి యుండదు. రాగ, ద్వేష, భయానందములను గూడియు, గూడకయు నుండును. ఇతడు మహాశయుడు గాన, ఎంతటి ప్రభువునకైనను, దుర్లభుడై యుండును. విమలాశయుడు గాన, బాలునకు సైతము సులభుడై యుండును. జ్ఞాన సంపత్తి సమయమున ముక్తుడై, విగతాశయుడై, అహంభావభ్రాంతి విరహితుడై వర్తించు చుండెను. ఈ భ్రాంతియే బంధహేతువు. జ్ఞానముచే నిది నశించును. ఇందువలన శ్రేయస్సు లభించును. అప్పుడు పూజనీయుడై, సంస్తవనీయుడై, నిరీక్షుడై, అభివాద్యుడై మెలగుచున్నాడు. సంసార రోగమును నివర్తించినవాడు నగు నాత్మజ్ఞుడు, సత్పురుష సేవ్యమగు బ్రహ్మపదమును పొందును. అది తీర్థ, యజ్ఞ, తప, దానాదులచే నలభ్యము' అని మనువు ఇక్ష్వాకు మహారాజునకు ప్రబోధించెను " అని వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు వివరించెను,

# 13. మునివ్యాధోపాఖ్యానము

ఇక్ష్వాకూపాఖ్యానమున 'తత్త్వజ్ఞానము తనంతతాను ఆలోచించి తెలిసికొనదగినదై నను, గురూపదేశ మావశ్యక' మని వివరింపబడినది. ఇప్పుడు 'తత్త్వము నెరిగినవానికి లౌకిక వ్యవహారములతో పనిలే'దని నిరూపించుటకై ఈ మునివ్యాధోపాఖ్యానము విశదీకరింపబడు చున్నది.

శ్రీరామచంద్రుడు వశిష్ఠ మహర్షితో నిట్లు వచించెను: "మునీంద్రా! జీవన్ముక్తునకు ఆకాశగమనాది అపూర్వాతిశయములులేవని నిరూపించితిని. ఇక నతనికి గల అతిశయ మేమో వివరింపుడు" అన, వశిష్ఠమహర్షి ఇట్లు వివరించెను: "రఘుకులతిలకా! జ్ఞాని చిత్త మే యతిశయమునందును వర్తింపదు. అతడు నిత్య తృప్తుడు, ప్రశాంతాత్ముడునై ఆత్మయందే నిలచి యుండును. మంత్ర తంత్ర తప స్సిద్ధులచే ఆకాశగమనాదులు లభించుచున్నవి. వాటియం దపూర్వత్వమేమి కలదు? అణిమాది సిద్ధులను, మంత్రాది సిద్ధులను యత్నపూర్వకముగ సాధించుచున్నారు. కాని, ఆత్మజ్ఞాని అట్టివాని కంగీకరింపడు. జ్ఞాని మనస్సుయందు సర్వవిషయములయెడ ననాసక్తి ప్రకాశించుచుండ, మూఢచిత్తులయం దాసక్తి ప్రబలముగ ప్రకాశించు చుండును. వర్ణాశ్రమాది చిహ్నములులేక, సంసార రూపమగు చిరకాలాగత భ్రాంతి నశించుటచే జ్ఞాని నిశ్చింతుడై, కామ క్రోధాది నిమిత్తములగు ఆపదల నధిగమించుచున్నాడు. విప్రుడు తన గొప్పతనమును తలంపక, దుస్సంకల్పముచే (అనగా శూద్ర స్త్రీ సంబంధమైన సుఖ భోగాదుల కాశించి) శూద్రత్వము నంగీకరించుచున్నాడు. శూద్రాంశ యన 'మారోప్య, బ్రాహ్మణో యాతి అధోగతిం! జనయిత్వా సుతం తస్యాం బ్రాహ్మణ్యాదేవ హీయతే' (మనుస్మృతి) అనగా 'బ్రాహ్మణుడు శూద్రస్త్రీసాంగత్య వశమున అధోగతి పొందుచున్నాడు. ఆమె వలన సంతానవంతుడైనచో బ్రాహ్మణత్వము నుండి భ్రష్టు డగుచున్నాడు. అట్లే

ఈశ్వరుడును స్వసంకల్ప వశమున జీవత్వము నొందుచున్నాడు. ప్రతి సృష్టియందును 'జంగమములు, స్థావరములు' నని రెండువిధముల సృష్టి జరుగుచున్నది. వీటిలో మొదటిది సంకల్ప వశమున సృజింపబడి కారణ రహిత మగుచున్నది. అది తన కర్మానుసారముగ ఈశ్వరుని వలన జన్మాంతరముల ననుభవించుచున్నది. సుకృత, దుష్కృత రూపమగు కర్మమునకు జన్మము మూలము. అనంతరము దీనికి కలుగు నామరూపములకు కర్మ హేతుభూత మగును. ఈ జన్మ కర్మల చేత కార్యకారణ భావ మిట్టి దని తెలియవలెను. పరమాత్మ నుండి సమస్త జీవులును నిష్కారణముగనే వెలువడుచున్నవి. అటు తరువాత, వాటి వాటి కర్మలు సుఖములకు కారణము లగుచున్నవి, ఆత్మస్వరూపము నెరుగక పోవుటచే కలుగు సంకల్పము కర్మకు కారణము. సంకల్పము కలిగి యుండుట బంధమునకు కారణము. కాన, ముందుగ సంకల్పమును త్యజింపవలెను సంకల్ప రాహిత్యము మోక్షమునకు కారణము. కాన. దాని నభ్యసింపుము. ఈ సంకల్ప దశలను అభ్యాస క్రమమున విసర్జించి, దృశ్య, దర్శన సంబంధము నందు నిరంతరము సావధానుడవై యుండుము. అది యెట్లనగా, దృశ్య భావమునందు గాని, ద్రష్టృ భావమునందు గాని ఆత్మాభిమానము లేనివాడవై, అఖిల భావమును విడచిన వస్తురూపమై యుండును. ఇంద్రియ గణము ప్రవర్తించు రాగము నకు అనుకూలుడై యుండెనేని బద్ధు డగును. విరాగము కలిగి యుండెనేని విముక్తు డగును. ఈ జగత్తునకు సంబంధించిన వస్తు వే దేని నిన్నాకర్షించినచో బద్ధుడ వగుచున్నావు. ఆకర్షితుడవు కాకున్నచో ముక్తుడ వగుచున్నావు. కాన. ఈ సృష్టి సంబంధ మగు తృణాది దేవతా పర్యంత పదార్థములచే నీవు ఆకర్షితుడవు కాకుందువుగాక! అనాసక్తుడవై భుజించుచు, త్యజించుచు, ననుభవించుచు నున్నచో దానినుండి నీవు ముక్తుడవై శాంతి నంద గలవు. అతీతమును గూర్చి సత్పురుషులు శోకింపరు. భవిష్యత్తును

గూర్చి విచారింపరు. క్రమ ప్రాప్తమగు వర్తమానమును మాత్రమే స్వీకరించుచున్నారు. ఆశ, మోహ మదాదులు పాశములుగ మనస్సునందు గ్రథింపబడి యున్నవి. కాన, పండితుడు ముందుగ మనస్సును ఛేదింపవలయును. లోహమును లోహముతోడనే ఛేదించు విధమున సంసార భ్రాంతి శాంతికై వివేక తీక్ష్ణమగు మనస్సును ఛేదింపవలెను. క్షాళనకోవిదులు మలమును మలముచే క్షాళన మొనరించుచున్నారు. అటులనే అస్త్రము వస్త్రము చేతను, విషమును విషము చేతను వారించుచున్నారు. 'స్థూలము, సూక్ష్మము, పరము' నని జీవునకు మూడు రూపములు గలవు. స్థూల, సూక్ష్మములను రెంటిని పరిత్యజించి, మూడవది యగు పరమును సేవింపుము. పాణి పదాది మయమై, భోగానుభవమున కుపయోగించు శరీరము స్థూల మనబడును. స్వసంకల్ప మయాకారమై, సంసార మందునంత వరకు నుండెడి చిత్తము జీవుని సూక్ష్మ రూపము. ఆద్యంత రహితమై, నిర్వికల్పమై, చిన్మాత్రమై, సత్యమగు రూపము పరరూపము. మొదటిది, రెండవది యగు స్థూల, సూక్ష్మ రూపములను త్యజించి, పరరూపమునందు దాశక్తిగలవాడ వగుము. మొదటి రెంటి యందును అహంభావము కలవాడవు కావలదు" అన రామచంద్రుడిట్లనెను: "మునిచంద్రమా! జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థల యందు నుండి, ఏ యవస్థయందు నలక్షితమగు తురీయ మను రూపమును గూర్చి వివరింపుము" అన, వశిష్ఠ మహర్షి ఈవిధముగ నభివర్ణించెను:

<u>తురీయావస్థా లక్షణము</u>: "అహంభావము, అనహంభావము, సద సత్తులను వీడి అనాసక్తమై, స్వచ్ఛమై, సమభావము కలిగి యుండునది 'తుర్యరూప' మని చెప్పబడును. ఇది నిష్కళంకమైనది. సమత్వ, శాంతత్వములు కల జీవన్ముక్తుని వ్యవహారమునందు ఇది ద్యోతక మగును. సంకల్పములు లేకపోవుటచే నిది జాగ్రదవస్థగాని, స్వప్నావస్థగాని కాదు. జడత్వము లేకపోవుట

వలన సుషుప్తియును గాదు. సమ్యగ్జ్ఞానము, శాంతి కలవా రుండు నటుల బ్రహ్మము నందు జగము విలీనమై 'తురీయ' మనబడును. మూఢుల కిది స్థిరమగు జగద్రూపముగనే భాసించును. అహంకారాంశను విడువగా, సమత్వము కలిగి చిత్తము క్షయము నంది తుర్యావస్థ కలుగును. ఇందుకు దృష్టాంత మొక దానిని చెప్పుచున్నాను, వినుము. దీనివలన నీకు సులభముగ తురీయావస్థ అవగతము కాగలదు.

ఒక మహారణ్యమున మహా మౌన నిష్ఠ యందున్న యొక మహాపురుషుడు కలడు. ఒకనా డొక వ్యాధు డాతనిని గాంచి, ఆశ్చర్యముతో నిట్లనెను: 'మునినాయకా! బాణా ఘాతము నందిన ఒక మృగ మిటు పరుగిడి వచ్చినది. అది ఏదిశగ పోయినదో చెప్పుడు' అన నా మౌని, 'సజ్జనుడా! మేము వనవాసులము. మునులము. సామ్యనిష్ఠులము. వ్యవహారములయందు మాకు నహంకారము లేదు. మిత్రుడా! సర్వేంద్రియ కర్మలను మనస్సు చేయుచున్నది. అది నా నుండి జారిపోయి చాలకాలమైనది. నాకు 'జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి' అను అవస్థలు లేవు. సర్వదా తుర్యావస్థ యందే యుండుదును. అందు దృశ్య ముండదు' అని పలుక, ఆ కిరాతునకు ముని వాక్యములలోని అంతరార్థము అవగతము కాలేదు. అందుచే నాతడు తన దారిని తాను పోయెను. కనుక, తుర్యావస్థ కంటె నుత్తమ మగు మరియొక యవస్థ లేదు. నిర్వికల్పమగు చిత్తు తుర్య మని చెప్పబడును. దానిని మించి మరియొకటి లేదు. చిత్తమునకు జాగ్రత్తు. స్వప్నము, సుషుప్తి అను రూపాంతరములు కలవు. ఈ చిత్తము 'శాంతము, ఘోరము, మూఢము' నని త్రివిధములుగ నుండును. జాగ్రద్రూప మగు చిత్తము ఘోరము; స్వప్నరూపము శాంతము; సుషుప్తి స్వరూపము మూఢము. ఈ మూ డవస్థలు లేని చిత్తము 'మృత' మనబడును. ఈ మృత చిత్తము సత్త్వగుణ రూపమైనది. యోగులు ప్రయత్న

పూర్వకముగ దీనిని సంపాదించు చున్నారు. సమస్త సంకల్ప విలాసయుక్తమగు తురీయావస్థ యందు నిరామయాత్ముడవై యుండుము. దీనియందు భేద వాసనలు నశించిన మహామునులు ముక్తులై నిరంతరము వసింతురు '' అని వశిష్ఠు డనెను.

## 15. సప్తభూమికోపాఖ్యానము

మునివ్యాధోపాఖ్యానమున 'ప్రశాంత మనస్కుడైనవానికి బాహ్య వ్యవహారములతో ప్రయోజనములేదు' దని చెప్పబడినది. ప్రస్తుతము 'జ్ఞానశాస్త్ర మంతయు జ్ఞాన భూమిసార' మని నిరూపించుటకై సప్తజ్ఞాన భూమికల స్వరూపమును విస్తర రూపమున వివరించుచు వశిష్ఠు డిట్లు చెప్ప నారంభించెను :

"శ్రీరామచంద్రా! ఆద్యమగు బ్రహ్మము శాంతమై యున్నది. ఇక అవిద్య,మాయ, వాని కార్యములు లేవనియు, నీ జగత్తంతయు మిథ్య యని భావించుటయు వేదాంత శాస్త్ర సిద్ధాంతము. శాంతమును, స్వస్థము, సమస్వరూపము, సమగ్రశక్తి యుక్తము, బ్రహ్మ అను నామములు గల చిదాకాశమునందు కొందరు శూన్యత్వమును, మరికొందరు ఈశ్వరత్వమును, వేరు కొందరు విజ్ఞానమాత్రత్వమును నిశ్చయించుకొని వివాదపడు చున్నారు, శ్రీరామచంద్రా! నీవుమాత్ర మా వివాదముల జోలికి పోవలదు మహామౌనివై సర్వమును పరిత్యజించి, నిర్మనను డవు, జీవన్ముక్తుడవు నై యుండుము. అంతర్ముఖుడవై, ఆత్మ యందు విశ్రమించిన చిత్తము గలవాడవై, మూకాంధ బధిరోపము డవై, అంతరంగ పరిపూర్ణుడవై యుండుము. జాగ్రదవస్థయందు సుషుప్తావస్థా నిష్ఠుడవై కర్మల నాచరింపుము. అనగా, అంతరంగ మున సర్వపరిత్యాగమొనర్చి, బాహ్యమున దు ప్రాప్తకర్మల నాచరింపుము. ఈ చిత్తముండుటయే దుఃఖహేతువు. ఇది లేకుండుట పరమ సుఖము. కాన, చిన్మాత్రుడవై, బాహ్యవస్తు సంబంధ

విరహితుడవై, చిత్తక్షయమును జేయుము. రమ్యారమ్య వస్తువుల యందు పాషాణమువలె నిర్వికారవృత్తుడవై యుండుము. ఇంత మాత్రముననే సంసారము జయింప శక్యమగుచున్నది. ఇది సుఖము, ఇది దుఃఖము, అది మధ్యమ మని తలప వలదు. ఇందువలన దుఃఖ నివృత్తి యగును. తత్త్వజ్ఞుడు పూర్ణచంద్రునిలోని అమృత స్వరూపుడై సుఖ మనుభవించుచున్నాడు. జగత్త్రయ సారభూత మగు బ్రహ్మపదార్థము నెరిగినవాడై కర్మల నాచరించు చున్నను అసంగత్వము వలన చేయనివాడుగ నగుచున్నాడు" అన, శ్రీరామచంద్రుడు, "యోగ భూముల నేడిటిని ఎట్లు అభ్యసింప వీలగునో, వాటి లక్షణము లేవియో చెప్పుము" అని ప్రార్థింప, వశిష్ఠు డిట్లు చెప్ప నారంభించెను: "శ్రీరామచంద్రా! మానవులు ప్రవృత్తులని, నివృత్తులని రెండు విధములుగ నుందురు. కామ్య కర్మల ననుష్ఠించుచు స్వర్గోన్ముఖులైనవారు ప్రవృత్తులు. నిష్కామ కర్మల నాచరించుచు మోక్షోన్ముఖులైనవారు నివృత్తులు. సంసారమును శ్రేష్ఠమని భావించి, మోక్షమును తృణీకరించి కర్మా చరణశీలుడైనవాడు ప్రవృత్తుడు. రెండు సముద్రముల నడుమనున్న తీరమును తన మెడతో ప్రవేశించిన కమఠమునకు ముందునకు బోయినను, వెనుకకు వెడలినను, అచటనే యున్నను లవలేశమైన సుఖము లేనట్లు, వెనుక జన్మమునగాని, ముందు జన్మమునగాని, ఈ జన్మమునగాని సుఖములేదని భావించు జనుడు, దుఃఖానుభవము వలన వివేకవంతు డగుచున్నాడు. 'ఈ సంసార వ్యవస్థ నిస్సారమైనది. దీనితో నాకు ప్రయోజనములేదు. నిస్సారములగు కర్మలతో నేమి ఫలము కలదు అని క్రియాతిశయ నిర్ముక్తుడై, విశ్రాంతి స్థాన మెచట కలదు?' అను నిశ్చయముగల ముముక్షువు నివృత్తు డనబడును" అని, వశిష్ఠుడు మరియు నిట్లు ప్రబోధించెను:

శుభేచ్ఛ: 'శుభేచ్ఛ' అనునది ప్రథమ భూమిక. ఇది కలవాడు వైరాగ్యవంతుడై సంసార సాగరము నెట్లు దరింతు నను విచారము

కలవాడగును. అపుడాతనిలో వాసనలు నశించి విరక్తుడగును. సత్కర్మాచరణశీలుడగును. గ్రామ్యములగు దుష్టకార్యములను విమర్శించును. ఇతర మర్మముల నుదహరింపడు. పుణ్యకర్మల నాచరించును. అనన్యోద్వేగ కారణములగు మృదుకార్యముల నాచరించును. పాపములకు భయపడును. భోగముల నపేక్షింపడు. దేశకాలానుగుణ్యములగు వచనములను పలుకును. మనోవాక్కాయ కర్మలచే సజ్జనులను సేవించును.

విచారణ : శ్రీరామచంద్రా! 'విచారణ' అనునది రెండవ భూమిక. దీని ననుభవించువాడు, సర్వవిధయత్నములతో జ్ఞాన శాస్త్రములను సంపాదించి అధ్యయన మొనర్చును. శ్రౌత,స్మార్త ధర్మాచరణము, ధ్యాన, ధారణా ద్యభ్యాసములు కలిగి ప్రశస్తమగు వేదాంత శాస్త్రప్రచారకులగు ప్రసిద్ధ పండితుల నాశ్రయించును పదార్థ ప్రవిభాగజ్ఞుడై, కార్యాకార్యవినిర్ణయ మొనరించును. గృహపతి తన గృహము నెరిగిన విధముగ, అధ్యాత్మశాస్త్ర శ్రవణ జ్ఞానముతో సర్వము నెరుగును. 'మదమాత్సర్యాదు' లను, సర్పము కుబుసమును విడచునట్లు విడచి వేయును. నిర్మల చిత్తము కలవాడై, గురు సజ్జన సేవచే శాస్త్ర రహస్యముల నాకళింపు చేసుకొనును.

అసంసర్గము : విచారణ మను రెండవ భూమికను పొందినవాడు, 'అసంసర్గ' మను నీ మూడవ భూమికను పొందుచున్నాడు. శాస్త్ర వాక్యార్థము లందు నిశ్చలమగు బుద్ధి కలిగి, తాపసాశ్రమ విశ్రాంతులగు నాధ్యాత్మిక కథన క్రమములతో శిలాశయ్యాసనాసీనుడై దీర్ఘాయువును అనుభవించుచున్నాడు. వన విహారములతో, చిత్తోపశాంతితో ప్రకాశించు అసంగ సౌఖ్యముతో నీతిమంతుడై కాలమును గడపుచున్నాడు. జ్ఞాన శాస్త్రాభ్యాసము చేతను, పుణ్య కర్మాచరణము చేతను ఈ మూడవ భూమిక లభించుచున్నది.

అసంసర్గ మను నీ భూమిక 'సామాన్యము, శ్రేష్ఠము' నని రెండు విధములుగ నుండును. జ్ఞానవంతుడు 'నేను కర్తను గాని భోక్తను గాని, బాధ్యుడను గాని, బాధకుడను గాని కాజాలను' అని అసంగుడై యుండుట 'సామాన్యము' అను అసంసర్గము.

సుఖము, దుఃఖము అనునవి ప్రాక్తన కర్మ నిర్మితము గాని, ఈశ్వరాధీనము గాని యగును. వీనికిని, నాకును సంబంధము లేదు. ఈ భోగా భోగములు రోగ హేతువులు, సంపదలు ఆపదలకు మూలములు. సంయోగము వియోగమునకు హేతువు. ఆధులు బుద్ధికి వ్యాధులు కాలము కబళనోద్యుక్తమై సర్వమును గ్రసించు చున్నది అను భావము కూడ సామాన్య అసంసర్గమే యగును. అభ్యాస యోగము చేతను, మహాత్ముల సాంగత్యము వలనను, దుర్జన వియోగము మూలమునను, ఆత్మవిచార హేతువునను, పురుష ప్రయత్నమున సంతతాభ్యాస యోగమున నాత్మ వస్తువు కరతలామలక మగును. అపుడు కర్తృత్వమును ప్రాక్తన కర్మ భావమును దూరముగ విడచి, సంసార సాగరమున కావలి యొడ్డున నున్న పరబ్రహ్మము నందు మౌనముగ, ప్రశాంతముగ నుండునది శ్రేష్ఠ మను రెండవ అసంసర్గము.

'లోపల, వెలుపల, ఊర్ధ్వభాగమున, అధోభాగమున, దిక్కుల యందు, ఆకసమున, పదార్థమున, అపదార్థమున, ప్రతి దాని యందును, తనకంటె వేరగు ప్రకాశము లేదు' అనియు ఆద్యంత రహితము, శాశ్వతమునై ఇది ప్రకాశించును. సంతోషామోద మధురములగు సత్కార్యములను, నిర్మలములగు పల్లవములుగల, చిత్తమను నాళాగ్రసంలీనమై, విఘ్నకంటక సంకటమై యుండును. వివేకపద్మారూఢమై అంతర్విచార మను సూర్యవికసితమై ఈ భూమిక ఫలప్రద మగును. సజ్జన సాంగత్యమువలన, పుణ్య కర్మాచరణమువలన, కాకతాళీయముగ ప్రథమ భూమిక యుదయించును. ఇది యుదయించుట నెరిగి, అమృతాంకురమునువలె వివేక జలసేచన

మొనరించి, దీనిని జాగరూకతతో రక్షింపవలెను. ఇది ప్రకాశించు టకు తగిన యంశమును, కృషీవలుడు అంకురమును వృద్ధి బొందించు విధమున, పోషించి పెంపొందింప జేయవలెను. ఇట్లు వృద్ధి బొందిన ఈ భూమిక, ఇతర భూమికలను ఉత్పన్నము జేయ గలుగును. దీనివలెనే విచారణ, అసంసర్గములను భూమికలను గూడ బొందుచున్నాడు.

మూడవ భూమికను పొందినవాడు సకల సంకల్ప విరహితుడై విరాజిలు చుండును" అన, "శ్రీరామచంద్రుడు, మునీంద్రా! మూర్ఖుడు అసత్కులసంజాతుడు, కామ్యకర్మనిష్ఠుడు, అధముడు, అప్రాప్తయోగసంగుడు నగువాడు తరించు నుపాయమేది? ఒకటి రెండు, మూడు, నాలుగు భూమికలలో దేనినైన పొంది, మృతుడైన వాని గతి యేమి? వివరింపుము" అన, వశిష్ఠు డిట్లు చెప్ప నారంభించెను: "రామచంద్రా! మూఢుడు, దోషి యగువానికి ఎన్ని జన్మాంతరములకైనను శుభేచ్ఛ యను ప్రథమ భూమిక ఉదయింప నేరదు. ఇది యుదయింప నంతవరకు సంసారము వ్యాప్తమై యుండును. లేదా, సజ్జన సాంగత్యముచే కాకతాళీయముగ సంసార పరామర్శవలన వైరాగ్యము కలుగును. వైరాగ్యము కలిగినంతనే యోగభూమిక యుదయించును. దీనివలన సంసారము నశించును అని శాస్త్రము చెప్పుచున్నది.

యోగ భూమిక నందినవాడు మరణించినచో వానికి ఆ భూమి కాంశమున బుట్టిన దుష్కృతము నశించును. అట్టివాడు దేవతా విమానములందు, దేవ భూములయందు మేరుపర్వత నికుంజములయందు కామినులతో యథాసుఖముగ విహరించును. పురాకృత పుణ్య సంచయమును, పాప ఫలమును భోగముచే క్షయము నొందగ, వారు యోగవిదులై తిరిగి భూమియందు జన్మించు చున్నారు. వీరు పవిత్రులు, శ్రీమంతులు, గుణవంతులు, సత్పురుషులు నగు వారి గృహములయందు ప్రభవించి పూర్వ యోగభూమి

వాసనచే, యోగమును సేవించుచున్నారు. ఇటు లా పండితులు ప్రాగ్భావనాభ్యస్తమగు యోగభూమిని సులభముగ పొంది, అనంతర భూమికాక్రమమును పొందుచున్నారు రామచంద్రా! ఈ భూమికా త్రయమునందు జాగ్రదవస్థ యందువలె, భేద బుద్ధి యనువర్తించుటచే నార్యత్వ ముదయించుచున్నది. దీనిని జూచి మూఢ చిత్తులు కూడ ముముక్షువు లగుచున్నారు అని వక్కాణించెను.

ఆర్య లక్షణము : కర్తవ్యము నాచరించుచు, అకర్తవ్యమును పరిహరించుచు, ప్రాకృతాచారపరుడైనవాడు ఆర్యుడు. ఆచారమును, చిత్తమును, శాస్త్రమును, స్థితిని అనుసరించి అతడు లోకవ్యవహారము నాచరించుచుండును.

ఇది ప్రథమ భూమికయం దంకురించి, ద్వితీయ భూమికలో పుష్పించి, మూడవ భూమికలో ఫలించును. ఈ యోగము ననుభవించుచు మరణించినవాడు శుద్ధ సంకల్పము వలన సంపాదింపబడిన భోగములను చిరకాల మనుభవించి, తిరిగి యోగవంతుడై జన్మించును.

స్వప్నము : వెనుకటి మూడు భూమికల నిరంతరాభ్యాసము వలన అజ్ఞానము క్షయ మంది, పూర్ణచంద్రోదయోపముగ నీ సమ్యగ్జ్ఞానము చిత్తమున నుదయించును. ఇది నాల్గవ భూమిక. ఈ జ్ఞానమును పొందినవారు అద్వితీయులై, భావస్థైర్యము నొంది, ద్వైతభావము నశింప, జగమును స్వప్నతుల్యముగ భావింతురు. కాన, నీ చతుర్థ భూమికను స్వప్న మందురు. దీని యందు శరత్కాలమందు మేఘమువలె చిత్తము లయ మందును.

సుషుప్తి : ఇది అయిదవ భూమిక. దీనిని పొందినవాడు సత్తామాత్రముగ మిగులును. ఇందు చిత్తము విలయ మగుట

వలన జగద్రూపమగు వికల్పము ఉదయింపదు. ఇది సుషుప్త పద మనబడును. భేదాంశము లన్నియు నిందు ప్రశాంతి నందును. దీనిని పొందినవాడు అద్వైత మాత్రమున నిలచి, ద్వైత స్థితిని పరిత్యజించును. అపు డంతరంగమున జ్ఞానానందము కలవాడై సుషుప్తమందు వలె ఘనీభావము నొంది యుండును. అంతర్ముఖుడుగా నుండి, బాహ్యావృత్తి పరుడై, పరిశాంతు డగుటచే నిద్రాళువువలె నుండును.

<u>తుర్యము</u> : ఇది ఆరవ భూమిక· ఈ భూమికయందున్న వాడు వాసనా రహితుడై, సద్రూపుడై, అహం శబ్ద వాచ్యుడు గాక అహంకార రహితుడై, భేదాభేదములచే నిర్దేశ్యుడై మెలగు చున్నాడు. సర్వ సందేహ రహితుడై, జీవన్ముక్తుడై, బ్రహ్మ భావనచే నంతరంగమున పరిపూర్ణుడు, బహిరంగమున బ్రహ్మమునే భావించుచు పూర్ణసాగర మందున్న పూర్ణ కుంభము విధమున వెలుగొందు చుండును.

<u>విదేహ కైవల్య ముక్తి</u> : ఇది సప్తమ భూమిక. షష్ఠ భూమిక నందినవాడు ప్రపంచమునం దపూర్వుడు. బ్రహ్మవస్తు సంపాదితుడు. నూతనముగ దేనిని పొందవలసినవాడై యుండడు. ఈ భూమిక వాగతీతమైన జ్ఞానభూమి కాగలదు. కైవల్య స్వరూపము. నిరుపాధికము. కొందరు దీనిని 'శివుడు' అని, 'బ్రహ్మము' అని, 'విష్ణువు' అని, 'వస్తువు' అని, 'కాలము' అని, 'ప్రకృతి పురుష విభాగము' అని, ఇంక నా యా మతస్థులచే నా యా విధములుగ నిర్దేశింపబడుచున్నది.

శ్రీరామచంద్రా! ఇప్పుడు నీకు సప్త భూమికలను వివరించితిని. వీటి నభ్యసించినవాడు దుఃఖము ననుభవింపడు. మదోన్మత్తమై, యుద్ధాసక్తిగల మహోదశన శంశిని యగు పను గొకటి కలదు. మానవు డా యనంతానర్థకారిణి యగు కరిణిని వధింపకున్నచో నీ జ్ఞాన భూమికలను సాధింప జాలడు. దానిని

జయించు వరకు రణభూమి యందు 'సుభటు' డని చెప్పబడును" అన, శ్రీరామచంద్రు డిట్లు ప్రశ్నించెను: "మునిపుంగవా! ఆ మదపుటేనుగు అన నేది? ఆ యుద్ధ భూమి యెయ్యది? ఈ ఏనుగు నెట్లు వధింప వలయును? ఇది చిరకాల మెచట విహరించి నది?" అన, వశిష్ఠ మహర్షి ఇట్లు ప్రత్యుత్తరము నిచ్చెను: "రామచంద్రా! ఇచ్ఛ అనునదియే ఆ మత్తేభము. ఇంద్రియములు దీని సంతానము. మనస్సు అను మహారణ్యమున నిది సంచరించును. ధర్మాధర్మములు దీని 'దంతములు'. శరీరము కూడ దీనికి విహార భూమియే యగును. వాసనా జాలము దీనికి మదము. ఇది దీనులగు జీవ సముదాయమును వధించుచున్నది. జయాపజయములను పలుమారు లనుభవించు సంసారదృష్టు లీ మదేభమునకు రణరంగ భూములు. వాసన, ఈహ, మనస్సు, చిత్తము, సంకల్పము, భావనము, స్పృహ మొదలగు నామములను ధరించి విరాజిలు చుండును. అన్ని అస్త్రముల నిది తృణీకరించు చున్నది. సర్వవిషయాత్మకమగునది యగు దీనిని 'ధైర్యము' లను వస్త్రముచే ఛేదింప వలయును. 'ఈ వస్తువు నాకు గావలయును' అను ఇచ్ఛ అంతరంగమున నున్నంత వరకు, 'సంసార'మను మహావిష విషూచిక యుండును. ఈ యిచ్ఛయే సంసారము. ఇది క్షయించుట మోక్షము అని జ్ఞాన శాస్త్రమునకు సంక్షేపార్థము. తాను నిర్మలమై, ఇతరుల చిత్తములను నిర్మలము చేయు గురూపదేశ వాక్యము ఇచ్ఛా రహితుడు, నిర్మలుడు నగు శిష్యునియందు దర్పణము మీది తైల బిందువువలె సర్వత్ర వ్యాపించును. అనర్థకారిణియగు నిచ్ఛ, స్వల్పముగ నుదయించినను, విషవృక్షాంకురమును పెరకివైచిన విధముగ నంత మొందింప వలయును. జీవు డీ యిచ్ఛవలన శైథిల్యము నొందుచున్నాడు. కాన, దీనిని నశింపజేసినచో దీనుడు కాజాలడు. విషయములను తలంపకుండుటచే 'సంసారాంకుర'మను ఇచ్ఛ జనింపదు. చిత్తము పనిలేకుండ నుండుట వలన అసంవేదన శస్త్ర మగును. అదియే 'ప్రత్యాహార'మను యోగాంగ మగును. దానిచే ఇచ్ఛా

నివారణ మగును. 'ఇది నాకు కావలయును' అనెడి కోరిక 'వాసన' యనియు, దానిని విడచుట 'వాసనాత్యాగ'మనియు నందురు.

స్మరణము సంకల్ప మనబడును. స్మరింపకుండుట బ్రహ్మము. ఈ స్మరణమునందు పూర్వ మనుభవించినదియు, ఇదివర కనుభవింపనిదియు గూడ భాసించుచుండును. ఈ రెండు విధముల వస్తు సంబంధములగు స్మరణములను విడచి, కాష్ఠమువలె దేనిని స్మరింపక బుద్ధిమంతుడవై మూర్ఖుని విధముగ నుండుము. నేను చేతులను పైకెత్తి చాటుచున్నాను. నా మాటల నెవ్వరును వినుటలేదు. సంకల్పరాహిత్యమే పరమ శ్రేయము. దాని నేల ముముక్షువులు భావింపరు? బ్రహ్మపదము లభింపగా, సామ్రాజ్యపదవి తృణప్రాయము. దేనిని తలంపక యూరక యున్నచో బ్రహ్మపదము లభించును. గ్రామాంతరమునకు పోయిన వాని పాద చిహ్నములను గుర్తింప జాలని విధమున, బ్రహ్మనిష్ఠుని వ్యవహారమును సంకల్ప రహితమై ప్రవర్తించును. ఎంత చెప్పినను ప్రయోజన మేమి యున్నది? విషయము నంతను సంక్షేపించి చెప్పుచున్నాను, వినుము. సంకల్పమే బంధము. అది లేకుండుట ముక్తి. ఈ జగత్తంతయు శాంతము, అనంతము, సత్యము, అనశ్వరము నగు భూతార్థ చిద్రూపముగ భావించి, శాంతుడవై సుఖముగ నుండుము. నిర్వికారముగ నుండుటను 'నిర్వికల్ప సమాధి' యందురు. కాన 'సిద్ధి, అసిద్ధి' అనువానియందు సముడవై కర్మాచరణము జేయుచు, విరుద్ధ కర్మల విసర్జింపుము. నిర్వికల్ప సమాధి సునాయాసముగ సిద్ధించినచో నది చిత్తక్షయమని భావింపుము. తన్మయుడవై యుండునట్లు మెలగు చుండుము. 'నేను, నాది' అను అభిమానము కలదియు, దుఃఖమయము నగు సంసారము నుండి విముక్తిని పొందుము. అట్లు కానిచో నట్టి యభిమానము కలవాడవై దుఃఖితుడ వగుదువు. ఈ రెండు విషయములలో నీ యిచ్ఛ వచ్చిన దానిని గ్రహించి యాచరింపుము. బ్రహ్మను పరిపూర్ణమై, నిర్వికారమై, జననాది రహితమై, సంసార నివర్తకమై, విశుద్ధ జ్ఞాన

రూపమై యుండును. దానిని భావించుటను కర్మ త్యాగమందురు”
అని వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు ప్రబోధించెను.

శ్రీరామ జ్ఞానోదయము : అనంతరము భరద్వాజుడు తన గురువును జూచి యిట్లనెను : “వాల్మీకి మునిపుంగవా ! వశిష్ఠ మహర్షి విశదీకరించిన జ్ఞాన సారము నంతయు విని, శ్రీరామ చంద్రుడు నిర్మలచిత్తుడు, శాంతి సుఖ పరిపూర్ణుడునై పూర్ణ జ్ఞానముతో నింక దేనిని గూర్చి ప్రశ్నించెను ?” అపుడు వాల్మీకి మహర్షి “శ్రీరామచంద్రుడు జనన మరణ రహితుడు, శుద్ధ బోధ స్వరూపుడు, లక్ష్మీదేవీ సన్నిధుడు, సకలగుణ నిధానుడు, ముల్లోకముల సృష్టి స్థితి లయములకు కారణభూతుడు, విశ్వవంద్యుడుకదా ! వశిష్ఠ ప్రబోధమును విని, అనగా వేదాంత జ్ఞాన పరిపూర్ణ వాక్యముల నాకర్ణించి కమలలోచనుడగు శ్రీరామచంద్రుడు జ్ఞానానందసాగర నిమగ్నుడై ముహూర్త కాలము మౌనము వహించి యుండెను. ఇక ప్రశ్నోత్తరాది పరిపాటీ వివర్జితుడై, ఆనందామృత పరిపూర్ణాశుడై పులకితగాత్రుడై, చిద్రూపపరిపూర్ణుడై అష్టైశ్వర్యములను తృణ సమానముగ భావించి, శివపదమునందు విశ్రమించి ఏమియు ప్రశ్నింపలేదు” అని చెప్ప, భరద్వాజుడుమరలనిట్లనెను : “ఎంత ఆశ్చర్యము! శ్రీరామచంద్రుడు బ్రహ్మప్రాప్తి నందెను. అట్టిది మావంటివారి కెట్లు లభ్యమగును ? మేము కించిజ్ఞులము, మూర్ఖులము. మే మెక్కడ, బ్రహ్మాదులకు ప్రార్థనీయుడైన శ్రీరామచంద్రు డెక్కడ ? మహామునీ! నాకు శాంతి నందు ఉపాయము నుపదేశించి సంసార సాగరమునుండి తరింప జేయుము” అన, వాల్మీకి “భరద్వాజా! శ్రీరామచంద్రుని వృత్తాంత మంతయు వశిష్ఠ వాక్యానుగతముగ వివరించితిని. దీనిని నీవు బుద్ధితో విచారించి మననము జేసికొనుము. ఇంతకు మించి నేను ఉపదేశింపవలసిన దేదియు లేదు. ఈ ప్రపంచము అవిద్యా విలసితము. సత్యమెంతమాత్రమును కానేరదు అని పండితులు నిశ్చయించి,

అవివేకులమగు మాకు నుపదేశించిరి. చిత్పదార్థేతరమైన దేదియు లేదు. మిథ్యాభూతమగు ద్వైతము సత్యమగు నద్వైతమును బాధింపదు. మిత్రమా ! రహస్యముల నభ్యసించుటచేత శుద్ధ చిత్తుడవు కాగలవు. ప్రపంచ విషయమగు చిత్తవృత్తి కల జాగ్రదవస్థయే నిద్ర. నిరంజనమగు 'చిత్తు' అను దీపము వెలుగుచున్న చిత్తము కలవాడు 'ప్రబుద్ధుడు' అనబడును. ఈ ప్రపంచము శూన్య మూలముకదా! ఆశూన్యమే శిఖరముగా కలది. నడుమ సత్తామాత్ర రహితమై ప్రాతిభాసికముగ తోచుచున్నది. దీని విషయమున పండితు లాసక్తిని జూపింపరు. ఈ జగత్తు లేనిదియే యగును. వాసనా వశమున ననేకములగు సంసార విభ్రాంతులు కలదియై గంధర్వనగరాకారమై యున్నది. నీవు శుభప్రదమగు చైతన్యాంకురమును పోషించు కొనుము. వాసనా విలసితములగు విష లతల నాశ్రయించి మోహమున మునుగుచున్నావు. తత్త్వ సాక్షాత్కారమున నిరాడంబరమగు జ్ఞానమును పరిగ్రహించుటచే జాగ్రదవస్థ తొలగును. జాగ్రత్స్వప్న సుషుప్తులు లేని నిరాడంబర జ్ఞానులకు జగన్మిథ్యాతత్త్వము అనుభవైక సిద్ధము, విచక్షణులు ఆత్మరూపముతో అమృత రసాత్మకమగు 'జ్ఞాన' మను మహానది యందు స్నానము జేయకున్నచో 'చిత్తము' అనునది 'జగత్తు' అను దుస్తరంగ జాలమును సృజించు చున్నది. మిత్రుడా! సమస్తమగు నీ వస్తుజాతము తూర్పునగాని, పడమరగాని, నడుమగాని లేదు. ఈ జగత్తు స్వప్న వృత్తాంతము. అజ్ఞాన వశమున భేద భావములు బుద్బుదములవలె క్షణములో నుత్పన్నములై, మరుక్షణములో జ్ఞాన జలధిలో లయ మగు చున్నవి. బాహ్య విభ్రాంతు లనెడి గ్రీష్మములు, సుశీతలోదక నది యందు స్నానమాడి దుఃఖముతో వెడలిపోవు చున్నవి. ఏకామాత్రమగు నజ్ఞాన సాగరము, జగత్తును ముంచి వర్తించు చున్నది. ఆ అజ్ఞాన సాగరము నందలి అహంకార తరంగ సంతతి, అనాదిభ్రాంతి వాసనా వాయువు వలన సంభవించినది. చిత్తస్థలన భేదము లగు రాగాదులు

అజ్ఞాన సాగర తరంగములు. మమత్వాదులు అందలి సుడిగుండములు" అని వాల్మీకి వివరించెను. అపుడు భరద్వాజుడు సర్వ సాధనల రహస్యముల నెరిగినవాడై, దృశ్య ప్రపంచమును విడచి ఈశ్వరానుగ్రహమును సాధించు నుపాయమును తెలిసికొన దలచి యిట్లనెను: "మునీంద్రా ! మీ యనుగ్రహమున సర్వము నెరిగితిని. వైరాగ్యమున కంటె మిత్రుడు, సంసారమున కంటె శత్రువు లేడు. ఇపుడు వశిష్ఠుడు తన గ్రంథమునందు ప్రబోధించిన జ్ఞాన సారమును వినగోరుచున్నాను" అన, వాల్మీకి ఈవిధముగ ప్రబోధింప నారంభించెను:

వాల్మీకి ప్రబోధము: "భరద్వాజా ! ఇది మోక్షప్రదమగు జ్ఞాన సారము. దీనిని వినిన మాత్రమున సంసార సాగరమున మునిగిపోవు సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్మ తా నొక్కడయ్యును. సృష్టి స్థితి సంహార భేదములచే ననేక విధములుగ భాసించు చున్నాడు. అతనికి నమస్కారము. ప్రపంచము విలయమైనంతనే, తత్త్వ స్వరూపమై ప్రకాశించు ఉపాయమును, శ్రుతి శాసనముల వలన నెరిగిన దానిని సంక్షేపముగ చెప్పుచున్నాను, వినుము.

శాంతుడు, దాంతుడు నిషిద్ధ పాపకర్మల నుండి, విషయేంద్రియ సంయోగ జన్య సుఖముల నుండి ప్రశాంతి నందినవాడును, శ్రద్ధాయుక్తుడు నగువాడు, మృద్వాసనమున నాసీనుడై, చిత్తేంద్రియ శ్రమమును జయించి, మనస్సు నిర్మల మగు పర్యంతము ప్రణవమును జపింప వలెను. అనంతరము అంతః కరణ శుద్ధికై ప్రాణాయామము జేయ వలెను. మెల్ల మెల్లగ విషయముల మీద నుండి ఇంద్రియముల నాకర్షింపవలెను. దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, జీవాత్మ అనునవి దేనినుండి జనించుచున్నవో తెలుసుకొని అనంతరము ఆ యా భూతముల యందు, దేవతల యందు లీనము కావలెను. ఆధ్యాత్మిక మగు దేహేంద్రియాది భావమును త్యజించి, వానికి కారణమగు దేవతల

సమష్టిరూపుడై, ఆత్మయందు ప్రకాశించును, భూమియందు మాంసాది పార్థివ భాగమును, జలమందు రక్తాది భావమును, తేజస్సు నందు తైజస భావమును లయ మొందింపవలెను. వాయువునందు వాయు స్వరూపమును, ఆకాశమునందు ఆకాశ తత్త్వమును, పృథివ్యాదులయందా యా తత్త్వములను, ఘ్రాణేంద్రియాదులను, వానికి కారణములను లీనము జేసి, శ్రోత్రాది లక్షణములతో కూడిన దిగాది దేవతలను ఆ దేవతలయందావాహింపవలెను. అనగా శ్రోత్రమును దిక్కుల యందు, చర్మమును విద్యుత్తునందు, నేత్రములను సూర్యబింబమునందు, జిహ్వను వరుణునియందు, ప్రాణమును వాయువునందు, వాక్కు నగ్నియందు, పాణి నింద్రు నందు, పాదములను విష్ణువునందు, పాయువును మిత్రునియందు, ఉపస్థను కశ్యపునియందు, మనస్సును చంద్రునియందు, బుద్ధిని బ్రహ్మయందు నధిష్ఠింప జేయవలెను. వీరు ఇంద్రియ దేవతలు. ఈ విభాగము వేదమున ప్రతిపాదింపబడినదాని ననుసరించి చేయబడినది గాని, తదన్యము మాత్రము కాదు. ఇట్లు దేహేంద్రియాదులను వాని కారణముల యందు లయ మొనర్చి, విరాట్పురుషుడ నని భావింపవలెను. అర్ధనారీశ్వర రూపమున బహ్మాండమున వశించు పురుషుడే ప్రభువు. అతడు సర్వ భూతముల కాధారుడు, కారణుడు నని చెప్పబడుచున్నాడు. అతడు తండ్రి కాన, తాను సృజించు దేవ మనుష్యాది కోటికి అన్నపానాది జీవనోపాయములను కల్పింపదలచినవాడై హవిస్సు, వర్షము మున్నగు రూపములతో సర్వపోషకమగు శ్రౌత, స్మార్త, యజ్ఞ, సృష్టి రూపుడై యున్నాడు. బ్రహ్మాండమున కంటె రెట్టింపు భూమియు, భూమికి రెట్టింపు జలమును, జలమునకు రెట్టింపు అగ్నియు, దానికి రెట్టింపు వాయువు, దానికి రెట్టింపు ఆకాశము, నిట్లు ఒకదాని కంటె నింకొకటి పంచీ కృతమై, అపంచీ కృతమై ఈ భూతములు జగత్తును వ్యాపించి యున్నవి. కాన, భూమిని జలమందు, జలము నగ్ని యందు, అగ్నిని వాయువు నందు, వాయువు నాకాశము

నందు నీ యాకాశమును సమస్త స్థూల ప్రపంచోత్పత్తికి హేతు భూతమగు మహాకాశము నందు లయ మొనరించి, హిరణ్య గర్భాకాశము నుండి, వాసనలు సూక్ష్మభూతములు, కర్మములు, అవిద్య మున్నగు వాటితో గూడిన లింగశరీరమును మాత్రము ధరించి బ్రహ్మాండ రూపుడను, అను అభిమానమును విడచుటచే బ్రహ్మాండము కంటె వేరయి, సూక్ష్మ భూతరూప మగు లింగ సమష్టి దేహము నందు, హిరణ్యగర్భుడను, ఆత్మ స్వరూపుడను నేను అని భావింపవలెను. ఇట్లు భావించిన పిదప లింగ శరీరమును అపంచీకృత భూతముల కంటె సూక్ష్మమును, ఉపాధి రూపముచే మాయాంశమును ఉపహిత చిద్రూపముచేత అవ్యక్తమును, మాయా శబల బ్రహ్మమునందు లయ మొనర్చి నామరూప రహితమును నగు జగత్తును సాంఖ్యులు ప్రకృతి యందురు. వేదాంతులు మాయ యనియు, తార్కికులు అణువు లనియు, బౌద్ధులు అవిద్య యనియు నందురు. ప్రళయకాలమున సర్వ పదార్థములును, అవ్యాకృతుని యందు అనభివ్యక్త రూపములై పరస్పర సంసర్గ రహితములై, చిదాభోగ్యత్వ లక్షణ మగు నాస్వాదములు లేనివియునై, సృష్టి కాలమున ప్రకృతి భూతుడగు నా యవ్యాకృతుని నుండి ఆవిర్భావము నొందుచు, వానియందు లింగ రూపముననే లయము చేయవలెను. ఆకాశాది క్రమమున సృష్టియు, భూమ్యాది క్రమమున నుపసంహారమును జరుగును. కాన విరాట్టు 'హిరణ్యగర్భుడు, అవ్యాకృతుడు' అను నామములు గల స్థూల, సూక్ష్మ కారణ రూపమగు జాగ్రదాది అవస్థాత్రయమును విడచి 'శివ మద్వైతం చతుర్థం మన్యంతే' అను శ్రుతిచే నాత్మ తత్త్వమును ధ్యానింప వలయును. ధ్యానముచే ప్రకాశించిన చరమ సాక్షాత్కార రూపమున లింగ శరీరము ఘట భంగమై ఘటాకాశము, మహాకాశమును పొందినట్లు, నిరతిశయానందమగు పరబ్రహ్మను పొందుచున్నది. ఇప్పుడు

జ్ఞానము నశించుట వలన లింగ శరీరము అను బంధము నుండి విముక్తుడనై తిని. చిదానంద సముద్రము నందు ప్రవేశించితిని. నేను పరమాత్మను. నేను కూటస్థుడను. కేవలుడను. వ్యాపకుడను. చిత్తునుగాని, చిచ్ఛక్తిమంతుడను గాను. నాయందు జీవేశ్వరాది భేద కల్పనలు లేవు. తృణాదులు ఉప్పుకొఠారులయం దుంచబడినవై లవణమే యగు నటుల అచేతనమగు జగత్తు చేతనమునందు లయ మొనర్పబడి చేతనమే యగుచున్నది. జలమునం దుంచబడిన జలమును, క్షీరమునందుంచబడిన క్షీరమును, ఘృతమునం దుంచబడిన ఘృతమునునై, నాశము నొందనిదై అభిన్నముగ గ్రహింపబడినట్లు, నిత్యానందము, పరమ కారణము నగు చేతనమునందు ప్రవేశించిన నేను నైక్యము నొందియున్నాను. ఈ నేను నిత్యము, సర్వగతము, శాంతము, అనింద్యము, నిష్కళంకము, నిష్క్రియము, శుద్ధమునగు బ్రహ్మము నగుదును. ఇంతియకాదు. పుణ్య పాప వినిర్ముక్తము, జగత్కారణము, నద్వితీయమగు బ్రహ్మమని, ముముక్షువు గురు శుశ్రూషాపరుడై, సత్వాది గుణ రహితమగు బ్రహ్మమును ధ్యానింప వలయును. ఇట్లభ్యాసము చేసిన పురుషునకు మనస్సు క్షయించు చున్నది. అపుడు ఆత్మ తనంతట తాను ప్రకాశించును. ఆత్మ ప్రకాశింపగా, సర్వ దుఃఖములును దూరము లగును" అని వశిష్ఠుడు శ్రీరామచంద్రున కుపదేశించెనని వాల్మీకి మహర్షి భరద్వాజునకు ప్రబోధించెను.

"భరద్వాజా! నీ వీ జ్ఞాన మార్గము చేతను, యోగ మార్గము చేతను సర్వము నెరుగగలవు. శాస్త్రవిచారణ చేత, గురూపదేశముచేత, ఆత్మానుసంధానాభ్యాసము చేత సర్వము సిద్ధించు నని వేదాను శాసనము. కాన, నీవు సర్వత్యాగము జేసి, ఆత్మాను సంధానాభ్యాసమునందు స్థిర మనస్కుడవై యుండుము" అన, భరద్వాజుడు, "మహాత్మా! శ్రీరామచంద్రుడు ఆత్మజ్ఞానమును

పొంది మరల లోకవ్యవహారమునందు ప్రవేశించిన విధమును వివరింపుము" అనగా, వాల్మీకి మహర్షి ఇట్లు వివరించెను :

"భరద్వాజా ! బుద్ధిమంతుడగు శ్రీరామచంద్రుడు ఆత్మ జ్ఞానమును పొందినంతనే విశ్వామిత్ర మహర్షి వశిష్ఠుని జూచి, 'మహాత్మా ! శక్తిపాతము చేతను, లక్షణము చేతను గురుత్వమును ప్రకటించు కొంటివి (శక్తి పాత మనగా కుండలిని యొక్క షట్చక్ర భేదముచే బ్రహ్మరంధ్రమున నున్న పరమశివుని సమావేశము గాని, జీవునకు నుపాధి పరిత్యాగముచే శుద్ధబ్రహ్మరూపత్వము గాని శక్తి పాత మనబడును). దర్శన, స్పర్శన, ఉపదేశములను అనుగ్రహముచే శిష్యుని శరీరమునందు పరమశివుని సమావేశము కలిగించువాడు గురువని చెప్పబడును. శ్రీరామచంద్రుడు సహజముగ విశుద్ధాత్ముడు విరక్తుడు, ఆత్మ విశ్రాంతిని గోరుచున్న వాడు కాన సంవాద మాత్రమున బ్రహ్మత్వమును పొందగల్గెను. గురువాక్యము వలన శిష్యునకు జ్ఞానము కలుగుటకు అతని బుద్ధియే కారణ మగుచున్నది. అతడు మలత్రయ పరిపక్వము కాకుండ ఎట్లు తెలిసికొనగలడు ? (మలత్రయ మనగా ఆణవ మాయిక కార్మికము గాని, కామ కర్మ వాసనా రూపములు గాని యగును.) ఉత్తమ శిష్యులకు శాస్త్ర దృష్టి ప్రయోజన వంత మగును. గురు శిష్యు లిద్దరును యోగ్యు లయినచో సమస్త పురుషార్థములకు పాత్రు లగుచున్నారు. మునీంద్రా ! నీ వనుగ్రహించి రామచంద్రుని సమాధి నుండి మేల్కొల్పుము. నీవు బ్రహ్మపదార్థమునందు లీనమై యుండ మేము లోక కార్యముల యందు ప్రవేశించి యుంటిమి. నే నిచటకు వచ్చిన కార్యమును మనసునం దుంచుకొనుము. అతికష్టమున దశరథ మహారాజును ప్రార్థించితిని. రామావతార ప్రయోజనకరమగు నీ దేవ కార్యమును వ్యర్థము గావింపకుము. శ్రీరామచంద్రుడు రాక్షస మర్దన సమర్థుడు. నా చే సిద్ధాశ్రమమునకు గొనిపోబడి, అహల్యా శాప విమోచన మొనరింపగలడు. శివ ధనుర్భంగము జేసి,

సీతామహాలక్ష్మిని పరిణయ మాడగలడు. భార్గవరామునకు పరలోక మార్గమును నిర్ణయింపగలడు. పితృ సైతామహాక్రమ ప్రాప్త మగు రాజ్యమును పరిత్యజించి నిర్భయుడు, నిస్పృహుడు నై వనవాస వ్యాజముతో దండకారణ్యమున కేగును. అచట రాక్షస సంహారము నొనర్చి మునుల నుద్ధరించును. నానావిధ తీర్థములను, జీవములను పవిత్ర మొనరించును. ఇంతియకాక, సీతాపహరణ దౌర్గత్య వ్యాజమున శోకము ననుభవించుచు, రావణాది భీకరాసుర వర్గమును దునుమాడును. స్త్రీ సంగము కలవారి అస్వాస్థ్యమును, వానరాదుల పరోపకార బుద్ధిని ప్రకటిత మొనరించును. అగ్ని ప్రవేశమున సీతామహాలక్ష్మి పరిశుద్ధత నెరుగగోరి, తన శిష్టజన మాననీయ చరిత్రను ప్రదర్శన మొనర్చును. అనంతరము రాజ్యాభిషిక్తుడై, జీవన్ముక్తుడుగావున నిస్పృహుడై, కర్మాధికారము కల జనులకు కర్మానుష్ఠానము చేతనే మార్గమును జూపుచు, కర్మాచరణ పరాయణు డగును. జ్ఞానకర్మ సముచ్చయాధికారము గల వారికి బ్రహ్మలోకాది గతులను కలిగించును. అందుకై జ్ఞానకర్మ సముదాయము నాచరించును. తనను దర్శించినవారికి, స్మరించిన వారికి, నిజ భక్తులకు జీవన్ముక్తి, సుఖములు ప్రసాదించును. మహాత్ముడగు శ్రీరామచంద్రుడు ముల్లోకములకు, నీకు శుభము లనుగ్రహించును. జనులారా! మీర లీ శ్రీరామచంద్రునకు ప్రణతుల నర్పింపుడు. అందుచే మీకు విజయము సమకూరును. శ్రీరామ చంద్రుని విధముగ నెవ్వరైనను జీవన్ముక్తులై, చిరకాలము నిర్వికల్ప సమాధిని పొంది సుఖముగ అభివృద్ధిని పొందుదురుగాక!" అని విశ్వామిత్రు డభిభాషించెను" అని చెప్పి వాల్మీకి మరియు నిట్లనెను:

"విశ్వామిత్రుని వచనముల నాలకించి మహాతేజస్వియగు వశిష్ఠ మహర్షి రామచంద్రునితో నిట్లనెను: 'మహాబాహుడవగు రామచంద్రా! నీవు మహాపురుషుడవు. నీ కిది విశ్రాంతి సమయము కాదు. లోకానందకరుడవు కమ్ము. యోగనిష్ఠునకు లోకవ్యవహార

పరామర్శ మంకురింప నంతవరకు సమాధి స్థిరపడదు. కాన, నశ్వరమగు రాజ్యాది విషయములను, దేవకార్యాది భారములను నిర్వహించి, వాటి యస్థిరత నెరిగిన వాడవై, సమాధి నిష్ఠుడవై, సుఖ మనుభవింపుము' అని ప్రబోధించెను" అని చెప్పి వాల్మీకి మరియు నిట్లనెను: "ఈవిధముగ వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రుని జాగరితు నొనరించినను, అతడు బ్రహ్మమునందు లయమంది యుండియే భాసించు చుండెను. అపుడు వశిష్ఠ మహర్షి సుషుమ్నా మార్గమున శ్రీరామచంద్రుని హృదయమున ప్రవేశించి, మెల్లగ మేల్కొలిపెను. శ్రీరామచంద్రుడు ప్రప్రథమమున ప్రాణాది బీజమగు ఆధారశక్తి యందును, ప్రాణావిర్భావము నందును. మనోవిరావ్భము నందును ప్రకాశరూపుడై సర్వనాడీ రంధ్రములందు ప్రవేశించి, ప్రకటీకరించిన జ్ఞానేంద్రియ. కర్మేంద్రియములు కలవాడై మెల మెల్లగ నయన కమలములను వికసింపజేసి, పూజ్యులగు వశిష్ఠాది మునులను అవలోకించి, సర్వేషణా రహితుడై, కృత్యాకృత్యాది విచారణా విరహితుడై అందరను దర్శించెను. వశిష్ఠ మహర్షి ఇదివరకు ప్రబోధించిన వాక్యమును విని 'ఇది గురు వాక్యము. దీని ననుసరించి యాచరించుము' అని ఆదేశించిన తండ్రి వాక్యములను ఆలకించి, యిట్లు పలికెను: 'మునీంద్రా! మీ అనుగ్రహ విశేషమున నేను విధి నిషేధములకు బద్ధుడను కాను. అయినను మీ ఆజ్ఞను సర్వదా శిరసావహింతును. వేదములు, ఆగమములు, పురాణములు, శ్రుతులు స్మృతులు, గురువాక్యము లవశ్యానుష్ఠేయములు లని. వీని నతిక్రమించుట మహాపాపమని పండితులు ప్రవచించిరి' అని పలికి విద్వద్వరిష్ఠుడగు వశిష్ఠ మహర్షికి సాష్టాంగ దండ ప్రణామము లాచరించెను. అనంతరము కరుణా సాగరుడగు నా శ్రీరామచంద్రుడు సభాసదులను జూచి, 'సదస్యులారా! సునిశ్చితమైన నా నిర్ణయము నాలకింపుడు. ఆత్మజ్ఞానమున కంటె, జ్ఞానియగు గురువు కంటె అధికమగు వస్తువీ లోకమున లభింపదు' అన సిద్ధు లిట్లు పలికిరి 'శ్రీరామచంద్రా! నీవు ప్రకటించిన నిర్ణయము

మీ గురు, శిష్యుల సంవాదమున దృఢప్రకటితమై, నీ అనుగ్రహమున నందరి హృదయము లందును కుదురుకొన్నది. నీవు సుఖముగ నుందువుగాక ! నమస్కారములు సందికొనుము. వశిష్ఠ మహర్షిచే ననుజ్ఞాతులమై మే మిపుడు మా మా నెలవుల కేగు చున్నాము" అని చెప్పి వాల్మీకి మహర్షి మరియు నిట్లు వచించెను: "భరద్వాజా! రామసంస్తవరతులగు సిద్ధు లందరు తమ తమ నివాసముల కరిగిరి. శ్రీరామచంద్రుని శిరమున దేవతలు పుష్పవర్షమును గురియించిరి. 'వశిష్ఠ—శ్రీరామ సంవాద, రూపమగు నీ జీవన్ముక్తి, విశ్రాంతి పర్యంత మగు సుధాసదృశవిషయము నెరిగించితిని, నీవు సుఖముగ నుందువుగాక ! వశిష్ఠ మహాముని వచనరూపమగు రత్నమాలికా లంకృతుడైన శ్రీరాముని జీవన్ముక్తి సిద్ధిని నీకు జెప్పితిని. సకలయోగులకు, కవులకు సేవ్యమగు దీనిని పరమ గురుకటాక్ష మున శ్రవణాదులచే సేవించినచో నీ గ్రంథము మోక్ష మార్గ సందర్శక మగును. ఈ సంవాద రూప 'జ్ఞానవాశిష్ఠము' ను పఠించువారు, వినువారు మోహ మాలిన్యము, రాగము, ద్వేషము మున్నగు సర్వ దోషములతో గూడినవారైనను, క్షణ మాత్రములో వాటి నన్నిటి నుండియు విముక్తులై బ్రహ్మాను పొందుచున్నారు" అనెను.

" స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః "

ఇది తర్క-వాదీశ్వర, సాహిత్యాచార్య, గౌడమండ
లాలంకార, శ్రీమదభినందన పండిత
సంగ్రహీకృత 'వాశిష్ఠ రామాయణ'
మను మోక్షోపాయమున సారో
ద్ధార భరద్వాజోపాఖ్యానమున
నిర్వాణ ప్రకరణమున
శ్రీరామ వశిష్ఠ సంవాదము
సర్వము

సమాప్తము

## ఈ గ్రంథ ప్రచురణకు చేయూత నిచ్చిన వదాన్యులు

1. శ్రీ కొండపల్లి కాంతారావు (రోశారావు) ఘంటశాల
2. శ్రీమతి కొండపల్లి యశోదమ్మ ,,
3. శ్రీ వేమూరి దశరథరామయ్య (వేంకట కుటుంబరావు)
4. శ్రీ ,, నాంచారయ్య, గ్రామ సర్పంచ్ ,,
5. శ్రీ గొర్రెపాటి వేంకటరావు మరియు సోదరులు ,,
6. శ్రీమతి ,, మహాలక్ష్మమ్మ ,,
7. డా. ఎ. వాసుదేవరావు ,,
8. శ్రీ వేముల హనుమంతరావు ,,
9. శ్రీ గెల్లి రామయ్య తండ్రి పిచ్చయ్య ,,
10. శ్రీ సంకా సాంబశివరావు ,,
11. శ్రీ ,, బసవేశ్వరరావు ,,
12. శ్రీ ,, రాజారావు ,,
13. శ్రీ ,, వేంకటాచలపతిరావు ,,
14. శ్రీ వేమూరి బాబూరావు ,,
15. శ్రీ కోదాటి సుబ్బారావు ,,
16. శ్రీ బోయపాటి వేంకటానంద ప్రసాదరావు ఘంటశాలపాలెము
17. శ్రీ మన్నే వేంకటరత్నం ,,
18. శ్రీ తుమ్మల వేంకటరత్నం చౌదరి (మాజీ గ్రామ సర్పంచ్)
19. శ్రీ తుమ్మల వేంకటేశ్వర్లు ,,
20. శ్రీమతి తుమ్మల శేషమాంబ ,,
21. శ్రీ వేమూరి రమణమ్మ ,,
22. శ్రీ ,, విమలమ్మ ,,
23. శ్రీ చింతల రామచంద్రరావు ,
24. శ్రీ తుమ్మల వేంకటరత్నం ఘంటశాల
25. శ్రీ తుమ్మలచర్ల సీతారామస్వామి ,,
26. శ్రీమతి తుమ్మల బసవపూర్ణమ్మ క్రొత్తపల్లి
27. శ్రీ మండలి వేంకటకృష్ణారావు అవనిగడ్డ

28. శ్రీ అన్నం దానారావు కోడూరు
29. శ్రీ యుగంధరరావు ,,
30. 'కవిశేఖర' శ్రీ గురుజాడ రాఘవశర్మ మచిలీపట్టణము
31. శ్రీ గుడ్లవల్లేటి వేంకటాచలపతిరావు ,,
32. శ్రీ మోచర్ల పూర్ణచంద్రరావు ,,
33. డా. కుప్పా వేంకట రామశాస్త్రి ,,
34. డా. టి. వేంకటేశ్వరరావు ,,
35. శ్రీ వేమూరి శ్రీ కృష్ణమూర్తి ,,
36. శ్రీ చింతలపాటి సూర్యనారాయణరాజు ,,
37. శ్రీ పినిశెట్టి లక్ష్మయ్య ,,
38. శ్రీ గవీంద్ర గోల్డు కవరింగ్ కంపెనీ వారు ,,
39. శ్రీ కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు ,,
40. శ్రీ తూనుగుంట్ల మాణిక్యాలరావు ,,
41. శ్రీ సంకా వేంకటాచలం విజయవాడ
42. శ్రీ పి. కమలేశ్వరరావు హైదరాబాదు
43. శ్రీ ఎమ్. సురేంద్రశాస్త్రి ,,
44. శ్రీ హరి లక్ష్మీనరసింహశాస్త్రి ,,
45. శ్రీ దేసు వేంకట సుబ్బారావు మచిలీపట్టణము
46. శ్రీ పి. మధుసూదనరావు ,,
47. శ్రీ పరుచూరి శ్రీరామమోహనరావు కోసూరు
48. శ్రీ రావి వేంకటేశ్వరరావు ,,
49. శ్రీ సుంకర సత్యనారాయణ మచిలీపట్టణము
50. శ్రీ కోనేరు గోపాల కృష్ణయ్య బార్లపూడి
51. శ్రీ దివి లక్ష్మీపతిరావు మంతెన
52. శ్రీ దండమూడి పాపయ్య చౌదరి పెనుముత్స
53. శ్రీ వేమూరి కొండలరాయడు ఘంటశాలపాలెం

వీరికి భగవంతుడు ఆయురారోగ్య భోగ భాగ్యములను ప్రసాదించును గాక!